శ్రీ రస్తు.

శ్రీమత్పర్వతరాజకుమార వేంకటనాథరాజకవివరవిరచిత

# పంచతంత్రము

పద్యకావ్యము.



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్సువారిచేఁ

ప్రకటితము.

1924

# పీఠిక.

## వేంకటనాథకవి.

ఇమ్మహాకవి పంచతంత్రమును బద్యకావ్యమునుగా రచించి మిగులఁ గీర్తిని జేకొన్న మహనీయుఁడు. ఇతనియింటిపేరు బైచరాజు వారు. ఇతనితాతతాత బైచభూపాలుఁడు. ఇందుచేతనే యీతని కీయింటిపేరు గల్గెనని తోఁచుచున్నది. ఇవ్విషయమునే పంచతంత్రమున,

"ధీరత రాజవంశజలధిం బ్రభవించె మహావిరోధిసం
హారవిహారి సాళ్వబిరుదాంకుఁడు బైచనృపాలుఁ డద్ధరి
త్రీరమణీమనోహరుని తీవ్రయశస్స్ఫురితీక్ష హారాద్రిని
హారవసుంధరాధరము లయ్యె సమగ్రవిహారశైలముల్."

ఈబైచరాజుకుమారుఁడు తిరుమలధరణీనాథుఁడు. ఇతనికుమారుఁడు వీరభద్రరాజు. ఇతనికిఁ బుత్రు లిరువురు. లింగభూపాలుఁడు, పర్వతరాజు. ఈపర్వతరాజునకుఁ బుట్టిన మువ్వురుకుమారులలో నగ్రజుఁడే యీ వేంకటనాథమహాకవి. ఇక్కారణముననే యీతనిఁ బర్వతరాజకుమారవేంకటనాథుఁ డనియు నందురు. పైపద్యమునుబట్టియే యీతఁడు క్షత్రియకులావతంసుఁడని తెల్లమగుచున్నది. ఈకవిశ్వరుఁడు తన్నుగుఱించి,

"అసహాయసరసకవితా, రసికుఁడ వేంకటనరాధిప్రభుఁడ గుణ
ప్రసవప్రకాండమదన, ద్బిసలాయితవిద్వదఖిలబంధువ్రజుఁడన్."

అని తనపాండిత్యగరిమంబును జేసుకొనియున్నాఁడు.

కవికాలము, దేశము నిర్ణయించుటలో గొప్ప చిక్కుగలదు. పూర్వపుఁగవులు తమగ్రంథములలోఁ దమకాలమును దేశమును జక్కఁగాఁ జెప్పుకొనుచున్నారు కారు. అట్లు చెప్పియుండినచోఁ బీఠికాలేఖకులయూహలకును జర్చలకును నెడము లేకుండెడిది. ఐనను నీతని కాలమును గుఱించి 'బ్రౌఁణదొరవారు' తమనిఘంటువునందు క్రీ॥ శ॥ 1500 సంవత్సరప్రాంతమువాఁడని వ్రాసి యున్నారు. కాఁబట్టి యీకాలమునకుఁ బ్రమాణేతరము లగుపడునంత కియ్యదియే యని నిర్ధారణ

చేయక తప్పదు. ఇదియునుగ్గాక వేంకటనాథుఁడు దాను బూర్వకవులను స్తుతించుచు,

"హృదయబ్రహ్మరథం బతిప్రియతమం బెక్కొంతు జేతోమరు
త్సదనాస్థానికిఁ దెత్తు మానసనభస్సంచారిఁ గావింతు హృ
ద్విదితక్షీరసముద్రఖేలనమునం దేలింతు సత్కృష్టివ
స్తుగులం బ్రాజ్ఞుల దిక్కయజ్వ నమరేశు న్సోము శ్రీనాథునిన్."

అని శ్రీనాథుని బేర్కొనియుండుటచే నీతఁడు 1450-వ సంవత్సరమునకుఁ బూర్వపువాఁడు కాఁడని స్పష్టమగుచున్నది. మఱియును నీతఁడు తన జ్యేష్ఠపితృవ్యుని గూర్చి చెప్పుచు, 'కుమారలింగక్షోణిపాలుండు యవనసైంధవకాననానలుండు.' అనిచెప్పియున్నందునఁ గవి హిందువులకును మహమ్మదీయులకును యుద్ధములు జరగుచున్న సమయంబున నుండు నని యేర్పడుచున్నది.

ఇతఁడు కవులందఱివలెనే దనకుఁ బ్రబంధరచనాకాలంబున భగవంతుఁడు స్వప్నంబున సాక్షాత్కరించినట్లు చెప్పియున్నాఁడు. ఇయ్యది పూర్వకాలంబునుండి యాచారముగ వచ్చుచున్నది. ఇందలి సత్యాసత్యంబు లప్పరమేశ్వరుఁడే యెఱుంగు.

ఈతఁడు తనకృతియగు నీపంచతంత్రంబును స్వప్నంబున సాక్షాత్కరించిన హరిహరదేవున కంకిత మిచ్చినాఁడు. తద్విషయంబును, నాహరిహరనాథునియందలి భక్తిపారవశ్యంబును,

"ఏ చనవు గలుగు హరిహర, సాచివ్యము నొంద నన్యజనులకు మది నా
లోచింపఁ దిక్కయజ్వకు, నాచనసోమునకు మఱియు నాకుం దప్పన్."

అని చక్కఁగ వక్కాణించెను. ఇక్కారణంబుననే యీతఁడు నెల్లూరిమండలనివాసిగానుండ నోపునని యూహింపవలసి యున్నది. కవితానేమండలమువాఁడైన నేమి యెందుఁ బుట్టిన నేమి యెందుఁ గిట్టిన నేమి యెందు జీవనంబు గడపిన నేమి తనపాండిత్యముచేఁ గీర్తిని గడించినఁ జాలును

కవితామాధుర్యంబుచే శిరంబు లూపించినఁ జాలు. అతఁడు భారతభూమి నలంకరించినవాఁడే యగు. ఈవిషయ మింతటితో విరమించి యితనికవిత్వముయొక్క ఫక్కినిగుఱించి కొంచెమాలోచింపవలయును.

ఇతనికవిత్వములో లక్షణవిరుద్ధములగు ప్రయోగము లున్నవనియు, నందుచేతనే లక్షణకర్త లుదాహరణముగా నీతనికృతిఁ గొనకపోయి రనియు నందురు. ఈలక్షణవిరుద్ధప్రయోగము లెల్లగ్రంథంబులయందును గన్పడుచున్నవి కాని యవి కొందఱియదృష్టంబుఁబట్టి సాధువులుగను గొందఱిదౌర్భాగ్యముంబట్టి యసాధువులుగను సాధింపఁబడుచున్నవి. ఇతఁడీపంచతంత్రంబును సంస్కృతమునకు భాషాంతరీకరణమువలెఁ గాక ప్రబంధశైలిలో వ్రాసినాఁడు. కవిత్వ మెట్లుండవలయునో యీతఁడే యీపంచతంత్రమున,

"ఘనతరఘూర్జరీకుచయుగక్రియ గూఢము గాక ద్రావిడ
స్తనగతిఁ దేట గాక యరచాటగు నాంధ్రవధూటిచొక్కపుం
జనుఁగవఁ బోలి తేటయును జాటుతనంబును లేకయుండఁ జె
ప్పిన యదె పో కవిత్వ మనిపించు నగిం చటుగాక యుండినన్"

అనుపద్యముచేఁ జెప్పి యున్నాఁడు. తిలకింపుఁడీ!.

కావ్యంబున నొక్కొక్కఁ డొక్క యిక్క నరయుచుండును. 'భిన్నరుచి ర్హి లోకః' అనునట్లు లోకంబునఁ బలువురు పలువిధంబులగు రుచులు గలిగియుందురు. దీనినే యీ వేంకటనాథుఁడు,

సీ. "ఒకఁ డలంకారంబునకు వేడుకపడించు నొకఁడు వార్తాసమృద్ధికిఁ జెలంగు
నొకఁడు శబ్దస్ఫూర్తులకు మాయురే యను నొకఁ డర్థసృష్టికి నుత్సహించు
నొకఁడు రసాభోగతకు మస్తముఁ గదల్చు నొకఁ డుపమానచర్చకకు నలరు
నొకఁడు పదప్రౌఢిమకు నిచ్చలో మెచ్చు నొకఁడు జాతిశ్లాఘ కుబ్బుచుండుఁ
తే. గామి చందానఁ దలపరి కరణి బధిరు, పలె దరిద్రునిగతి వాది పగిదిఁ గనక
కారు చాడ్పునఁ బంగు వైఖరిఁ గుజాతి, జాడ నిందఱి ముదలింపఁ జాలు టెట్లు."

అని చాటియున్నాఁడు. 'అవిదితగుణాపి సత్కవిభణితిః కర్ణేషు వమతి మధుధారామ్' అన్నట్లు చవిఁ గొనుఁ డీపద్యమునందలి మాధుర్యము!

ఎట్టివానికృతియందును దప్పులుండక పోవు. ఉండినంతనే వాని కృతికిఁగాని యాతనికిఁ గాని కళంక మాపాదింపరాదు. గుణపరీక్షణము చేయవలయుఁ గదా? రసపుష్టిఁ గనుగొనవలయుఁ గదా? దీనినే యీతఁడు,

"ఒప్పులు గలకృతిలో నొక, తప్పున్నను గడపు గాదు దానికిఁ గళంకం
జొప్పడు శశికిఁ గళంకము, కప్పేర్పడి యేమి నిందఁ గావించె నొకో."

అని వక్కాణించె.

ఇతఁడు కృతిని రాజుల కిచ్చునభిప్రాయమందు విముఖుఁడు. ఒంటిమిట్ట శ్రీకోదండరామమూర్తి కంకితమిచ్చి కీర్తిఁగాంచిన బమ్మెర పోతనామాత్యునియనువునను, బీరికాపురీకుక్కుటేశ్వరున కర్పించి తన కృతుల వాసి నొందిన కూచిమంచి తిమ్మకవివడువునను, మఱియు భగవదర్పణ మొనరించిన మహాకవులజాడ ననుసరించియే యీతఁడును రాజాంకితమునుగు జించి,

"అతికుటుంబరక్షణాపేక్షఁ బ్రాల్మాలి, కృతులు మూఢభూమిపతుల కిచ్చి
చచ్చి నిరయమునకుఁ జనుకంటె హరిహరార్పణముఁజేసి సుగతిఁ బడయరాదె."

అని ఘోషించి యున్నాఁడు, చూచితిరే యాతనిదైవభక్తి!!!

ఈపంచతంత్రమునే దూబగుంట నారాయణామాత్యుండును దెనిఁగించె. పద్యములలో భావసామ్యముండకమానదు. కథ యొకటియే కదా? నారాయణామాత్యుఁడు సులభశైలిని వ్రాసినాఁడు. కాని యందుసైతము లక్షణవిరుద్ధములగు ప్రయోగములు లేకపోలేదు. వేంకటనాథుఁడుమాత్రము తాను గవిత్వమెట్లుండవలయునని యొప్పఁజెప్పెనో యా చొప్పుఁ దప్పింపక తగినచోటులం దనువయిన వర్ణనములను జేర్చి రచించినాఁడు. ప్రబంధమునం దుండఁ దగిన వర్ణనములన్నియు నెట్టకేలకుఁ గల్పించి రసపోషణముఁ జేసి వాసిఁ గాంచినాఁడు. ఐనను లక్షణవిరుద్ధములగు ప్రయోగము లందందుఁ జూపట్టుచున్నవి. వానినెల్ల నిట వ్రాయఁ బూనలేదు. 'ఓటి కొక్కుపాట' నోటి కొక్క మాట'యనుసామెత యనకుఁ జిరపరిచితంబు కాదే. అట్లె సామాన్యముగఁ బాఠభేదములచే లక్షణవిరుద్ధములగు ప్రయోగములును గలిగియుండునని యూహింప వచ్చును. ఈదోషములను గృతికర్తనెత్తిపై వైచుట ధర్మమార్గమని యెవ్వరైన నెన్నఁ బూనుకొనరని నానమ్మకము.

హంసవింశతికర్తయగు అయ్యలరాజు నారాయణామాత్యుని వలెనీతఁడును స్వభావవర్ణనముం గడుఁ నేర్పున నలవరించి యున్నాఁడు. కొన్నింటి నీక్రిందనుదాహరించెద. గ్రంథమునందే తిలకింపనగు నని పాఠకమహాశయుల వేఁడెద.

స్వభావవర్ణనములు.

| పుట. | | పద్యము. |
|---|---|---|
| వేసఁగి | 58 | 517 |
| గొల్లచాన | 59 | 586 |
| హేమంతము | 69 | 677 |
| వేఁట | 99 | 196 |
| చోరుఁడు | 122 | 199 |
| సిద్ధుఁడు | 151 | 101 |
| వనము | 196 | 522 |

ఇట్టి వెన్నియేని కాననగు. ఉదాహరింపఁ బూనిన గ్రంథమంతయు నెన్నవలసి యుండును.

ఈతఁడు శబ్దాలంకారంబులఁ గూర్చుటయందు మిక్కిలి ప్రియుఁడు. అందం దనేకపద్యములఁ గాననగు. అయినను గొన్నింటిని దెలిపెద.

శబ్దాలంకారములు.

| పుట. | పద్యము. |
|---|---|
| 6 | 100 |
| 17 | 123 |
| 87 | 70 |
| 69 | 676 |
| 114 | 119 |
| 140 | 380 |

ఈగ్రంథము నీతులకుఁ బుట్టినిల్లని వేఱ చెప్పనేల? నీతులను బొందుపఱచి వ్రాసిన పద్యములఁ గొన్నింటి నుదాహరింప మన స్సువ్విళ్లూరు చున్నది. కాంచుఁడీ కవిమహిమము!

"పురుషవిశేషలీల విరిబోఁడియు వాలు విపంచి శాస్త్రముల్
దురగము వాణియు న్నరుఁడు దొడ్డతనంబు వహింతు రట్ల కా
పురుషవిశేషలీల విరిబోఁడియు వాలు విపంచి శాస్త్రముం
దురగము వాణియు న్నరుఁడు దొడ్డతనంబువహింప రుర్వరన్." ప్రథమాశ్వాసము.

"గజ మంటినట్లు యుండదు, సృజగము మూర్కొనినట్లు పొరిగొను ధరణీ
భుజుండు నగినట్లు చంపుం, దుర్జనుండు మన్నించినట్లు కొను బ్రాణంబుల్."

మనుజుం డెన్నండును స్వతంత్రుండు కాండు. భగవంతుం డేయే కాలమున నెట్టి త్రిప్పునో యట్లు తప్పక యనుభవింపవలయు ననుట కీ మహాకవి యెట్లు కథాంశములను వాక్రుచ్చెనో కనుంగొనుండు.

సీ. "ఘనరూపనిధి యనంగునకా యనంగత్వ? మచిరమే బలికహివ్యూహవసతి?
పాండునందనులకా బహుకాలవనవాస? మిభపురాధిపులకా యేటిచోరవ?
యదుకులాన్వయులకా శాపమరణంబు? జాహ్నవీసుతునకా శస్త్రశయ్య?
నలరాజుకా మహానసపాకభజనంబు? నహుషునకా ఘోరనాగమూర్తి?
తే. మటి త్రిశంకునకా పచ్చిమాలతనము?, ద్రుపదనందనకా రాచతొత్తుపాటు?
మనుజుం డెవ్వండు కర్మస్వతంత్రుండరయ?, నీశ్వరుండు గాక సమర్థుం డిట్టిపనులు."

ఇందుంగల యైతిహ్యముల నెట్లు జతకూర్చెనో.

ఇట్లే నీతులుగలపద్యములును, గంఠపాఠము జేసి పలుమారులు ప్రస్తావనావశంబునం జదువుకొనందగిన పద్యము లనేకము లున్నవి. అక్కడక్కడం బద్యములలో సామెతలనుగూడ నిమిడించి యున్నాండు. భాషయందుం బాండిత్యము లోకమునం గలిగింపవలెనన్న సామాన్యమునం బ్రచారములో నున్నమాటలనే యుపయోగించుచు గ్రంథములను వ్రాయుట యుచిత మనువారికెల్లరకు వందనసహస్రంబులు. క్రొత్తపదంబులును సమాసచాతుర్యంబులును, నలంకారవిశేషంబులును భాషకలంకారప్రాయంబు లని యెన్ని గ్రంథజాలంబులను రచించి మహాకవిపండితులు లోకంబున భాషను బోషింతురుగాక యని నాయూహ.

ఇం దెందైన లోపంబు లుండకమానవు. 'ప్రమాదో ధీమతామపి' యనువాక్యంబును దమమనంబున నిడి పరిశీలించి దోషంబులం బోంద్రోచి గుణగణంబుల గ్రహింతురని భాషాభిమానుల నెల్లరను వేండుచున్నాండను.

ఇట్లు విన్నవించు,
పండితాఖండలమండల పాదసేవకుండు,

కావ్యతీర్థ. కవిభూషణ జనమంచి. వేంకటసుబ్రహ్మణ్యశర్మ,
సహాయాంధ్రపండితుండు, మునిసిపల్ హైస్కూలు, కడప.

శ్రీ ర స్తు.

# పంచతంత్రము.

## ప్రథమాశ్వాసము

### అవతారిక.



శ్రీవృత్తస్తననిస్తులైణమదసంసిక్తం బురోవీథి బా
గైవిన్నాణపుఁబుట్టుమచ్చ రవిక న్యాసన్నవిశ్వంభరా
దేవీవిభ్రమలక్ష్మిఁ దేటపఱుపం దీపించుత్రైలోక్యర
క్షావర్ధిష్ణుఁడు కృష్ణుఁ డూర్జితమనీష న్మాకుదిక్కయ్యెడిన్. 1

మ. సరసీజాతము లాటపట్టులు నిశాచారారి చంచద్భుజాం
తరమావాసము పుట్టినిల్లు సలిలస్థానంబు దారిద్ర్యభూ
ధరవజ్రాయుధకోటిచూపు నిగమాంతప్రోక్త లాశంసినీ
పరిషద్భాగముగాఁ జెలగుజగదంబం బద్మఁ గీర్తించెదన్. 2

చ. తరల కహో యుపాంశుజపదంభమున న్వనజాతపీఠి క
న్నరమొగిడించి సృష్టికరుణాయతి మూలకుఁ ద్రోఁచి భారతీ
చరణశిఖాంతవిభ్రమరసంబులఁ బ్రస్తుతిసేయుధాత మ
న్నిరుపమదివ్యకావ్యపదనిర్మితిఁ బ్రోఁదియొనర్చుఁ గావుతన్. 3

మ. నవమేఘాళిఘటించు మచ్చికురబంధశ్రీ నిరీక్షించి గో
త్రవరేణ్యంబులఁ జేయువృత్తకుచముల్ దర్శించి భావించి నా
యవలగ్నాంగముఁ జూచి సింహసృజనం బర్థింపుమంచు న్మనోధవు
మేలంబునఁ దేల్చువాణి నను నంతర్వాణిఁగాఁ జేయుతన్. 4

ఉ. చేకొని బ్రహ్మమంత్రములఁ జెప్పనహో ప్రతిసీర జాఱ మై
నాకుఁడు దేవతాళిగళనాదమున న్జదివించువోట భూ
షీకృత భోగిదర్శనముచే ధృతిదూలి చలించుగౌరి నా
లోకముఁ జేసి నవ్వు ప్రబలు న్బరమేశ్వరునాశ్రయించెదన్. 5

ఉ. ఆసవనారిమోవిరుచు లానఁగఁ దద్ఘనకంధరావల
ద్వాసుకి భూరిభూత్కరణ వాతకనన్నిటలాంబకాగ్నిగం
గాసలిలాప్తినార్చుటకుఁగా వడిదోయిలిసాఁచుచండముం
డాసురహంత్రి నన్ను సకలార్థవిధిజ్ఞునిఁ జేయుఁగావుతన్. 6

చ. నఱుఁగక బాల్యచాపలమున న్దనపిమ్మటి వ్రేలఁ జొక్కపున్
గడియపుట ట్టటంచుఁ ద్రిజగజ్జను లచ్చెరువందిచూడ న
క్కడపటికొండ సొంపులెఱుఁగం దవిలించినటించుశూలిపె
న్గొడుకు మదీయకావ్యమునకుం గలిగించు నిరంతరాయముల్. 7

ఉ. భూరి విరాడ్వికారగతిఁ బూర్వకుభృచ్ఛరమాద్రులం బదాం
భోరుహముల్ఘటించుకొని పోకలరాకల మే న్నలంచి వి
ద్యారుచిఁ జొక్కుచోఁ జెవిపడ న్రవిపోగున కెంపువోలెఁ జె
న్నారమహోన్నత స్మెఱయు నక్షర నక్షరిపు న్భజించెదన్. 8

మ. భవమూర్ధేందుపయోధిపర్వశశిచెప్పం జొక్కి పెక్కండ్రకై
దవఖండంబసమగ్రముగ్రనగమంథక్షుభ్యమాణంబు సిం
ధువసారంబు తనుస్వమొప్పఁగలచంద్రుండంచు దివ్యామృతం
బవలంబించు భుజంగకోటియగు నాగారిం బ్రశంసించెదన్. 9

చ. అతినిశితాశుధారకు మహామహనీయ విచిత్రవర్ణసం
గతికి నిరూఢగూఢసుముఖత్వదసత్యపదార్థసంగ్రహ
స్థితికిఁబహుప్రయత్ననియతిం జనతాశ్రుతిరత్నకుండలా
యితహితసూక్తియుక్తి నుతియించెద బాణమయూరచోరులన్. 10

మ. హృదయబ్రహ్మరథం బతిప్రియతమం బెక్కింతుఁ జేతోమరు
త్పదనాస్థానికిఁదెత్తు మానసనభస్సంచారిఁగావింతు హృ
ద్విదితక్షీరసముద్రఖేలనమున న్దేలింతు నుత్కృష్టప
స్తుదులం బ్రాజ్ఞులదిక్కయజ్వనమరేశు న్సోము శ్రీనాథునిన్. 11

క. వాచావీచీధిక్కృత, లోచనకర్ణాగ్రయాయి లోకసుధాంధో
నైచికిఁ దలఁతు న్మద్వం,శాచార్యుం దిరుమలశ్రీయతిపతి గురునిన్. 12

మ. రసవిస్ఫూర్తిగొఱంత దీనికిదిపూర్వచ్ఛాయ యిచ్చోటఁద
ప్పస దిప్పట్టున నర్థసృష్టిపసతే దచ్చోట నశ్లీల మ
ద్దెస నాదిక్కునదుస్సమాస మిది సందేహాస్పదంబీడ నం
చుసుమాళింబునఁ బొండితుల్మెరపునీచు స్రోఁతవాక్రుప్వఁగన్. 13

సీ. ఒకఁడలంకారంబునకు వేడుకపడిం డొకఁడువార్తాసమృద్ధికిఁ జెలంగు
నొకఁడుశబ్దస్ఫూర్తులకు మాయురేయును నొకఁడర్థసృష్టికి నుత్సహించు
నొకఁడు రసాభోగతకు మస్తముఁగదల్చు నొకఁ డుపమానచర్చికకు నగు
నొకఁడుపదప్రౌఢిమకు నిచ్చలో మెచ్చు నొకఁడు జాతిశ్లాఘ కుబ్బుచుండుఁ
తే. గామిచందానఁ దఱవరికరణిఁ బధిను, బలె దరిద్రునిగతి వాదెపగిదిఁ గనక
కారుచాడ్పునఁ బంగువైఖరిఁ గుజాతి, జాడ నిందఱుమదలింపఁజాలు రెట్లు. 14

క. ఒప్పులు గలకృతిలో నొక, తప్పున్నను గడమగాదు దానికిఁ గళలం
జొప్పడుశశికిఁ గళంకము, కప్పేర్పడి యేమినిందఁ గావించెనొకో. 15

ఉ. ఆనుటకీరసంబున నహంకృతిదంశితు లల్పకాకవు
లీనుల నీనిమిత్త్యవిత విద్యదుపాసితగాకయున్నె యా
హీనరభుక్తశేషకబళాహరణత్వమకుర్కురాళికిం
గాని నవాజ్యధార క్రతుకార్యసమాచరణీయగాదొకో. 16

*చ. మృదుగతి మంచితావులకు మెచ్చుసదావనిఁ బావనాళి దా
నదిగొనిరోయుపంకలను నంచకసంచయు మట్టిదేకదా
చదురుఘటిల్లఁజూచు సరసప్రసవంబులఁ జంచరీకపుం
గదుపులు నిచ్చలు న్వెదకుఁ గాకుణపంబుల నక్క తేర్పడన్. 17

చ. ఘనతరఘూర్జరీకుచయుగక్రియ గూఢముగాక ద్రావిడీ
స్తనగతిఁ దేటగాక యరహాటసుచాంధ్రవధూటిచొక్కపుం
జనుఁగవఁబోలి గూఢమును జాటుదనంబును గాకయుండఁ జె
ప్పినయది పో కవిత్వ మనిపించు నగించ చటుగాకయుండినన్. 18

చ. ఎడపక తాళదారె లిఖియించి పఠించి కృతుల్ ప్రతుల్ జగం
బడిగిన నిచ్చి హెచ్చి సకలావసథంబుల దారయై దిశల్
గడచి నటించుకావ్యములు కావ్యములా హరణాఘశాంతికై
విడువక కూలిఁబెట్టి చదివించుకృతుల్ క్రతులే వసుంధరన్. 19

వ. అని యిష్టదేవతానుతియును బురాతనకవిస్తుతియు నాచార్యపురస్కృతియును గుక
వితిరస్కృతియుం గావించి, యే నొక్కనాఁడు పంచతంత్రం బాంధ్రభాషం జంపూ

---

*చ. మృదుగతి మంచితావులకు మెచ్చుసదావనిఁ బావనాళి దా
నడిగొనిరోయుపంకలను నంచకుఁడేత్తినట్టిదేకదా
వెదకుమహారసప్రసవవిభ్రమసంపదలన్నరోజ్ఝ ష
ట్పదములు పూతిగంధికుణపంబుల రోయవె నక్కలెక్కడన్.

ప్రబంధంబుఁ జేయం బ్రారంభించి యేతత్కావ్యకన్యకారత్నంబున కనుకూలవల్ల
భుం డేదేవుండొకో యని విచారించి శయ్యాతలంబున శయనించిన. 20

శ్లో. హృన్నిత్యయాచ్ఛర మయా ప్యమయా ప్రభుత్వం
మాళీతుషార ఘృణినా జగతాం గురుత్వం
సందీపయ న్నభసి కోపి మహాన్సమా స్తే
స్వప్నే శుభే సితసితద్యుతి రావిరాసీత్.

క. కలలో నలుపుం దెలుపుం, గలవేలుపు దోర యగణ్యకారుణ్యరసం
బొలయ ననుఁ జూచి ద్రాక్షా, ఫలమధురప్రణయపూర్వభాషలఁ బలికెన్. 22

క. నను హరిహరనాథునిఁ గా, మనమునఁ దలపోయు నృపకుమారక విద్వ
జ్జనసేవ్యము నీ కావ్యముఁ, దనకి మ్మభిమతవరప్రదాతను భక్తిన్. 23

వ. అని యానతిచ్చి యా వేల్పు విచ్చేసిన నానందకందళితపులకదంశితుండనై మేలు
కని. 24

క. ఏచనువు గలదు హరిహర, సాచివ్యము నొంద నన్యజనులకు మది నా
లోచింపఁ దిక్కయజ్వకు, నాచనసోమునకు మఱియు నాకుం దక్కన్. 25

ఉ. సన్నుతిశబ్దగుంఫనరసస్ఫురితంబుఁ బురాణభారతో
త్పన్నము నైన సాధుచరితం బయి యొప్పదు మర్త్యసేవ్యమై
యున్న ప్రబంధ మెప్పటి కహో జగదేకపవిత్రభూమి దే
వాన్నము సారమేయచరణాంకితమైన భుజక్రియార్హమే. 26

గీ. అతికుటుంబరక్షణాపేక్షఁ బ్రాల్మాలి, కృతులు మూఢభూమిపతుల కిచ్చి
చచ్చి నిరయమునకుఁ జనుకంటె హరిహరా, ర్పణముఁ జేసి సుగతిఁ బడయరాదె.

ఉ. అంగధృతాబ్జు నిశ్చలతరాతను సర్వగు సర్వమంగళా
లింగితు భీషణాశరకులీనజయోన్ముఖపౌరుషక్రియా
సంగతు భీషణాంబకకృశాను నిరూపిత వైరిసద్మ యో
గాంగయుతాద్భుతిన్ హరిహరాకృతి మత్కృతికర్తఁ జేసెదన్. 28

వ. అని నిశ్చయించి యత్త్రిలోకీకర్త మత్కృతిభర్తఁ గా నొనర్చితి మదీయ వంశా
వతారం బభివర్ణించెద. 29

ఉ. ధీరత రాజవంశజలధిం బ్రభవించె మహావిరోధి సం
హారవిహారి సాళ్వబిరుదాంకుఁడు బైచనృపాలుఁ డద్దరి
త్రీరమణీమనోహరుని తీవ్రయశస్స్ఫూర్తికిన్ హరాద్రినీ
హారవసుంధరాధరములయ్యె సమగ్రవిహారశైలముల్. 30

క. అల భైచక్షితిపతికి, న్బలభిత్ప్రతిమానభోగపరతంత్రునకున్
గలిగె న్నిరుపమధరణీ, తలనాథుఁడు నిర్భరప్రతాపోజ్జ్వలుఁడై. 31

ఉ. అంబుజనేత్రఁ దిమ్మవసుధాధిపరత్నము గూర్మిఁ జేర్మిఁ ది
ప్పాంబికఁ బెండ్లియై కనియె నప్రతిమానగుణాఢ్యు వీరరు
ద్రుం బరిపంథిరాజకులతోయధిమందరు ఘోరసంగరా
డంబరచుంబిభీషణకటప్రకటద్విప సైన్యసంకులున్. 32

సీ. అతఁడు తుంకుట్ల శ్రీపతిరాజవరపుత్త్రి శృంగారములయిక్క లింగమక్కఁ
బరిణయంబై లింగనరనాయకవతంసుఁ బ్రాభవనిస్తంద్రుఁ బర్వతేంద్రుఁ
గనియెఁ గుమారలింగక్షోణిపాలుండు యవనసైంధవకాననానలుండు
పోరులఁ బెక్కండ్రఁ బొరివుచ్చె నమ్మహాధవునితమ్ముఁడు పర్వతప్రభుండు

తే. వైరికాంతాళిదవవారివాహమూర్తి, పోలె ఫలితిమ్మవసుమతీపాలపుత్త్రిఁ
బుణ్యచారిత్ర వికసితాంభోజనేత్ర, నన్నమాంబికఁ బరిణయంబయి ముదమున.

క. నను వేంకటజనవల్లభు, వినుతపరాక్రముని రంగవిభుధైర్యకళా
కనకాద్రిని శేషాద్రినిఁ, గనియె నిహాముష్మసౌఖ్యఘటనాయతికిన్. 34

క. అసహాయసరసకవితా, రసికుఁడ వేంకటధరావరప్రభుఁడ గుణ
ప్రసవప్రకాండమదవ, ద్భసలాయిత *విద్వదఖిలబంధువ్రజుఁడన్. 35

షష్ఠ్యంతములు.

క. భువనచయస్వాకృతికిన్, బవిపాణిప్రముఖలోకపాలకమకుటీ
దివసమణికి రణవికసిత, నవకరుణాచరణచరణజలజాతునకున్. 3౬

క. పౌలస్త్యవరదునకు నా, ర్యాలోకచకోరతాపహరణక్రీడా
గ్లౌలాలితాస్యునకు నం, హోలుంఠకహృదయమునిజనోపాస్యునకున్. 37

క. వినతానందనగతికిన్, ఘనవరకత్రాసకరణ కరవాలభుజా
భినవాదృతసురతతికిన్, జనితప్రహ్లాదవినుతజటిసంతతికిన్. 38

క బహుభువనవిహారునకు, న్సహజబ్రహ్మాండభాండజటిలఫలాళీ
సహనమహనీయవిగ్రహ, మహితోదుంబరగతశ్రమశ్రీకునకున్. 39

క. తరణిశశిలోచనునకుం, బరమాణువిలోకి యోగమార్గఖురాళీ
పరివిహృతిసనాథునకున్, హరిహరనాథునకు సద్గృహసనాథునకున్. 40

కథాప్రారంభము.

వ. సభక్తిసమర్పితంబుగా నాయొనర్పం బూనిన పంచతంత్రంబునకుం గథాక్రమం
బెట్టిదనిన 41

---

* సకలబంధు పరిషత్కులుఁడన్.

సీ. వనజగర్భకటాహవర్ధిష్ణుశరణంబు బలిబహూకృతపుణ్యసలిలఖేయ
మరుణాంశుకలశభాసుర రత్నసౌధంబు సుధరబిద్గృహచుంబిగోపురంబు
ధనధవాక్రీడసద్ధాత్రనిష్కుటకంబు బ్రహ్మనిష్ఠద్విజప్రాంజలంబు
ప్రబలభార్గవశౌర్యబంధురక్షత్త్రంబు పౌలస్త్యనిభవణిగ్భాసురంబు
తే. పద్మనాయకశుభవిభాభర్త్స్యమాన, విద్యాదావాసమండలీవిహారమాణ
భూరిసంతాపతిమిరంబు పొగడ నెగడుఁ, బూర్ణగరిమంబు పాటలీపురవరంబు. 42

సీ. హాలహాలం బిదిగాదె యభ్యమిత్రీయజీ వానిలగ్రాహివప్రాహిపతికి
బలుమదం బిదిగాదె పరుషారివారిజోన్మూలకృత్సాలశుండాలపతికిఁ
జిరతమం బిదిగాదె పరరాజసంరోధి వరణమండలచక్రవాలమునకుఁ
గ్రొమ్మెఱుం గిదిగాదె కుటిలశాత్రవతను క్షతజయుక్ప్రాకారచక్రమునకు
తే. క్షౌద్ర మిదిగాదె ప్రతిపక్షజాతిఁ జెడని, కొమ్మరేకుల గనుపట్టుకోటతమ్మి
కనఁగ జన లోచనోత్సవం బావహిల్లఁ, బరిఘవిల్లుఁ బొగడ్త నప్పురియగడ్త. 43

గీ. మొదలు వప్పాలలోఁ గొంత మునిఁగి పిదప, రాసికెక్కిన పెనుమచ్చరాలఁ బెరిగి
పరఁగుతనపెంపుఁ గొమ్మలపాలుఁ జేసి, కోట యవ్వీట మర్వెఁబుపాటఁ దనరు. 44

చ. పురనిధిరక్షణక్షమతఁ బూనిన శుద్ధసుధాసముజ్జ్వలా
వరణ ముకుందభృత్ఫణికి వాలికకొమ్మ లతిస్ఫుటస్ఫటో
త్కరము తదగ్రశీతకరకాంత శిఖామణులం బురుడ్బిసా
హారణచరన్మరాళపరిఘాంబువుకంచుక మెంచి చూడఁగన్. 45

మ. దివిషద్వాహిని యప్పురంబు బొరసి యుద్వృత్తి న్విజృంభింపఁగా
నవరోధించినవీటికోట యధమర్ణాచార మేపార వాం
బరకచ్ఛంబునఁ బాఁగుకొన్న యడుగొప్పం బ్రస్తరస్వీకృతి
న్నిజాసద్రత్నతదాతపోచ్ఛలనపహ్నాం గ్రాఁగునశ్రాంతమున్ 46

మ. గళబద్ధానిలభుగ్విభాస్ఫురిత భూతాకారంబునం గాలుఁగొం
దలునీ తేరిగురాల నెల్లు చెడకుంపంబ్రోతు పన్వప్రర
క్షులగారుత్మతశోభఁ బూనిగరియించుల జూసుఁడా యంచు వి
స్తులదత్తోత్తరభాషఁ దెల్పి చను ఖద్యోతుం డుదాత్తోచితిన్. 47

చ. కులుకుకుచంబులానకలు గుప్పపఁ గొమ్మలఁ దొంగిచూచు కొ
మ్మలముఖచంద్రచంద్రికలమన్నపుఁ దేటగవాక్షచంద్రము
శ్శిలలస్రవించునిటఁ బడి శీస్రగతిం బఱతెంచు మీనకం
దళములయత్నపద్మదళదామకశోభఘటించుఁ గోటకున్. 48

ఉ. బంభరడింభఝుంకృతినిబద్ధకటప్రకటప్రదానవి
త్కుంభిరదప్రహారముల గూకల వ్రక్కలునైనమిన్నువి
శ్వంభరఁ గూలునక్కలఁక సాగసగర్భుఁ డొనర్చు సంభృతి
స్తంభములో యనంగ నకె సౌధము లుల్లసిలుం బురంబునన్. 49

చ. పవనజవంబునం బురముపై గరుడాగ్రజు గాఢహూంకృతిం
బవలుగ్రమించిరాఁగఘృణిమాలి హయాళి పయాళిక్రమో
త్సవముఘటించు నౌర దివిషద్వనితాజనతాముఖేందుజ
చ్ఛవినికషంబునం బొడము సౌధనిశాపదృషత్ప్రవాహముల్. 50

చ. మరకతకుంభము ల్దలల మానసమానవిహీనకేతువుల్
కరములు మధ్యవర్తిరవికాస్తశిరత్నముతారకాసము
త్కరము సరోజదామకముగాఁ బొగడొందినసౌధరాడ్విరా
ట్పురుషుఁడు ప్రత్యహం బమరపూజితుఁడై కొమరొప్పునప్పురిన్. 51

ఉ. వన్నియమీఱ నన్నగరివాడల మేడలఁ గ్రీడలం గుసు
ర్కొన్న మెఱుంగుమిన్నలతకూనలకుం జెలులై నిలింపవి
ద్యున్నిభదేహలిత్తు రళితుండవిముక్తవితీర్ణభూరుహో
త్పన్నసమగ్రసౌరభనితాంతలతాంతగుళుచ్ఛకచ్ఛటల్. 52

*చ. గురుపురగోపురాగ్రములఁ గూడినభూపసతుల్సతుల్మనో
హరవరదత్తమత్తవిషమాయుధజన్యవిహారఖిన్నలై
చ్చరికఘటిల్ల వేసవులసోరునఁ దీరున మేడమారుతాం
కురములఁబ్రోతు రచ్ఛకుచకుంభజవిశ్రమపుష్కరస్థలిన్. 53

*చ. అలఘుసరోజభీమశిశిరాగమకాలకరాళజాతర
జ్వలనశిఖోష్మజీర్ణవిధివాహకులాంబుజకోటి కిచ్చు ను
త్కలిక నిలింపధామతిమిధామసధూప్రతిబింబితామిళ
త్కలిత సుగంధచంద్రఘటికాపురగోపురయానతాస్యముల్. 54

ఉ. ఆపురిఁ జంద్రికా నిశల హాటకహర్మ్యనమ్యగేంద్రముఖ్యల
భ్రాపగనీట మజ్జనములాడి యలంకృతిమచ్ఛకీయలై
డాఁపుననున్కఁజేకొనఁ గడంగుదురిందు నిలింపపుష్పలా
వీపటలార్పితాపహితవృక్షులతోఁ ఘుగళుచ్ఛకస్మృతిన్. 55

చ. అలతొలివేల్పురాఁ బగరయాకటిపింటలు వేదబీజముల్
మొలచినచే లుదారగుణముల్జనియించినయిండ్లు సత్క్రియా

---

* ఈరెండుపద్యములు ప్రక్షిప్తములని తోఁచెడు.

ఫలతరువుల్ వివిక్తశుకపంజరము ల్గళికల్మి ధాతతా
తథమన నేర్తు రౌపరతత్త్వవిధిజ్ఞులు వీటిభూసురుల్. 56

శా. దూరారాతు లుదారధర్మగురుమూర్తు ల్బద్మినీహృద్వికా
సారంభు ల్వసుభూషితుల్ హృదయపద్యాబంధవిశ్వంభరుల్
ధారాసారవిధాయకు ల్ఘనపదాలంకారు లత్యర్ధతే
జోరమ్యు ల్రుచిరోదయు ల్భుచివతంసు ల్వాల్తు రచ్చో నినుల్. 57

ఉ. ఉన్నతవైభవు ల్వరివిదూరుభవుల్ భవనాంగణంబులం
దెన్నఁగఁ గోటికొక్కటిగ నెత్తినటెక్కియము ల్లతౌద్వగు
త్తిస్ఫురయంఘటించు మణిదీప్తములై గగనస్రవంతికా
సన్నఫలాభిరామదివిషత్కుటనిష్కుటవాటి కెంతయున్. 58

ఉ. క్రూరతరత్వరాప్తి ప్రతికూలధరాధిపనిశ్చలత్వగం
భీరముమాన్ప వాహినులు పెక్కులుగొల్వఁగ లచ్చిఁ గాంచి యా
పూరితసత్వశేఖపాలుపుం గని సద్ఘనులాశ్రయింప ని
ర్వారణమంద్రు భూరిగుణ రత్నసముద్రులు పౌద్రు లప్పురిన్. 59

శా. చూడం జూడ్కులరాగలక్ష్మి గలిగించు న్మిందఁ దోఁప్తోన నా
క్రీడక్రీడనకాంత్ను కర్ణకుహరార్తిం బాపు పాదంబునం
దోడై తీర్పు రమాకుమారుపను లెందు న్వొందులంబోలి యొం
తే డాకం బలిరె పురంబుకలకంఠీజాతి యశ్రాంతమున్. 60

ఉ. రాగములం బరాగములరాగములంగరఁగింతు రంగే
ఖాగతి మెచ్చ రచ్చరలఁగాంచినశుద్ధము కల్మి దేశసం
ధాగరిమంబునం దడసినం గడకాళ్ల నదల్చి రంభ నే
లాగునసైనగెల్తురు కరాంతు లాప్రుటభేదనంబునన్. 61

సీ. పదనాబ్జములెచాలు వలపులఁ బ్రేరేఁప వెలిదమ్ముతేటికి విక్రయింప
సోగకన్నులెచాలు సొంపుసంపాదింపఁ గలువలేఖిటికి సంగళ్లఁబెట్ట
మొలకనవ్వులెచాలు ముదముఁ బ్రోఁదియొనర్ప వెచ్చపున్నియ లేటి కమ్మఁజూప
గురుకుచంబులెచాలుఁ బరితోషగమోదింపఁ బాగుత్తులేటికి బుటములెత్తఁ
తే గాయదీధితిచాలు రాగిముసుటింప, బేరమెఱఁగింప నేల చాంపేయములకు
ననుచుఁ బథికులు నర్మోక్తు లాడనాడ, వేడ్కవిహరింతుఁ బుష్పలావీజనంబు 6

సీ ఆలాన దామబద్ధాంఘ్రవల్ దెగఁ బిఱుందికిఁగి చుకుచాయ నిగిడెనిగిడి
పక్షభాగములవెంబడిపుచ్ఛంబులుజాఱిపోవ రజల్ స్రయ్యఁ బొంగిపొంగి

నిర్యాణకోణము ల్నిండి యుప్పరమెక్క శిఖవీచికలపైఁ జిమ్మి చిమ్మి
సృణిఘాతముల లెక్కసేయక చేయిచ్చు కృత్తిరుద్భటసంభ్రమంబు గిట్టి కిట్టి
తే. హస్తిపకముఖ్యసంహతు లతులగతుల, మెలుపుఁ దని చూళికలకోజఁ గఱపి కఱపి
వజ్రులునడ్పొట గర్వమువ్వారవైరి, మారణారంభబలములు మదకరులు. 63

చ. సురసరణిం బడల్పడఁగఁ జూచి కరాహతిఁ దత్పరోత్కరి
న్నిరవధికత్వరం జనఁగ నెట్టిన మావులఁ దూలవైచు కో
యరదముఁ బట్టునో యనుభయంబున నేగు నదృశ్యులై విభా
కరుఁడన వీటిదంతులకు గల్గిన యున్నతు లెన్న నేటికిన్. 64

ఉ. రాజిలు పోతుమానికపురాల జిరాగురాల సారథా
రాజవగౌరవరి బడపరా కతిపుష్కరవాహకోటి గా
ఘాజడవీధిఁ దోలు విరియం బడధారలకక్ష్మ మత్సరో
త్తేజితమై హయాంకభృతి దీప్తసమీరణ మార్జితత్వరన్. 65

శా. వైరూఘారఘటీరటన్ముఖధనుర్బాణప్రచండాసి భృ
చ్ఛూరుల్ గ్రాలఁ బరోపతాప మొనరింపు ర్ద్విప్రసంచారరే
ఖారంహంబున సంఘటించుమహికి న్గంపంబుఁ గల్యాణము
జ్జేర న్నాఅు మొగంబు తోరణముఁ దేజిబ్రుష్పరిభుక్తక్రియన్. 66

మ. పరికింప న్మకుళప్రవాళగతి నక్రంబంబు మావుల్ సమీ
పరసంగన్మలవిందుఁ జేయు భువనప్రఖ్యాతచక్రభ్రమిం
బరమోత్కృష్టతఁ గాంచి ఖడ్గరసంపత్తిన్ బ్రకాశించి యు
ప్పరితేరు ల్మహనీయజంగమనగస్ఫూర్తి న్నడు న్రాజిలున్. 67

వ. మఱియుఁ గమలాలంకృతంబులై మురవైరియురంబుం బురుడించు సరోవరంబులును బ్రతిపర్వరసోదయంబులై యనారతంబు భారతంబుం బోలు నిక్షువనంబులును వెండియుం బేరుగల వస్తువులుం గలిగి జగత్ప్రసిద్ధిం బొందిన యారాజధానిం బాలించు రాజేంద్రుండు. 68

సీ. తనప్రతాపము దీపప్రభూత గుణసూతి మున్నుగ్రాతి విభుజాతి ముద్దు గాఁగఁ
దనదానమిన జానఘునగారిపనవారి ధరవాహావరి దేహతాపి గాఁగఁ
దనశౌర్య మనివార్యతరతో భూమి ఘనసైన్యజనశైత్యకారి గాఁగఁ
దననీతి వినయాతిఘనరజ్యవనరేజ్య శతపత్రహితపుత్రిసహజ గాఁగఁ
తే. దనమహాసత్య మంత్రికోద్యత్ప్రశంస, తనయసత్యతిపవిత్రచరిత్రంబు గాఁగఁ
మనుచు నసూర్తి నిత్యధర్మప్రవృత్తి, తిత్వవిఖ్యాతుండు సుదర్శనుండు 69

సీ. తనదానగౌరవంబునఁ బుణ్యజనపరంపర చిరస్వాస్థ్యసంపద వహింపఁ
దనమహాహవము పెంపునఁ జక్రవాళాచలోత్తరతిమిరంబు లుడ్డుకుడువఁ
దనఘనావనబలోద్యమమున నతిమిత్రగోత్రకుంజరజాతికుతుకమందఁ
దనముఖుంగున దురంతప్రతాపస్ఫూర్తి హవణించునినుఁడునునణఁగియుండ
తే. సమధికాద్భుతిఁ బూని విశ్వంభరుండు, తప్ప కెప్పుడుఁ గన్నులఁగప్పుకొనఁగ
వాలుమగఁడయి యత్యంతవసుసమృద్ధి, దనరుఁ బ్రియదర్శనుండు సుదర్శనుండు.
సీ. తనయశోనటికి గోత్రావళిచ్చతురబ్ధి ఘనతరంగములు రంగములుగాఁగఁ
దనమహాస్త్రప్రజిహ్వనకుఁ బ్రాజ్యారిరాజ్యములు నిస్తులతరాజ్యములుగాఁగఁ
దనహేతిశతధార ధారకాశాపకృత్కుమతిగోత్రములు గోత్రములుగాఁగఁ
దనగూఢకలహంసమునకు భామామానసములు నిర్మలమానసములుగాఁగఁ
తే. దనమహాగుణరత్నసంపతికి శాస్త్ర, చతురభాషణకృతు లలంకృతులుగాఁగఁ
మనుసుదర్శనుఁ డభినవామ్నాయపతిత, ధర్మతోషితహస్తసుదర్శనుండు. 71
సీ. పరధరాధిపచిత్రపత్రఖండనకేళి దశదిశావిదితప్రతాపరేఖ
యసదనుశాసనవ్యాపారత మహాశరావళిదత్తచిత్తాద్భుతగతి
భువనసంచారయోగ్యవినీతగతిమత్తసారంగరంగదాస్థానగరిమ
నిరుపమాన నిధాన పరిపూర్ణతమనోజ్ఞగుణసమేతార్యానుకూలవృత్తి
తే. బహువితానోన్ముఖుఁడు సమిద్ధగ్రహణశాలి, సత్యనిధి పుణ్యజనుఁ డతిచండరశ్మి
గంధవాహుండు హృత్ప్రష్ఠారిగాఢభూతి, యతఁడు దిక్పాలకాంశజుం డగుటఁ దెలిపె.
సీ. అతిశీధుమదవికారత మేనులెఱుఁగని కరటులసఖ్య మగ్రాహ్య మనియుఁ
గుత్తుకవిసము వాఁడనఁ దీపుఁ గలపాపజాతితో నెయ్యంబు జరుగదనియు
గఱుపాటమున ద్రవ్యి కడుపుఁబోసికొనెడి పందితోఁ బొందు నిర్బంధమనియు
నఖిలకంటకసహాయతఁ బెచ్చుపెరిగిన కరినమూర్తులచెల్మి కష్టమనియు
తే. ధరణి కరి ఫణి కిటి ధరేశ్వరులరోసి, యప్రమత్తు మహావిశుద్ధాంతరంగు
నాదిగర్భేశ్వరునిఁ గరుణార్ద్రహృదయ, విష్ణుసన్నిభు నస్మత్పృథ్వివిభుఁ జేరె. 73
శా. సత్యఖ్యాతి నిధానదానజనితస్వాస్థ్యప్రతిష్ఠీకృత
ప్రత్యర్థిం బహువేదశాస్త్రపరిత ప్రస్థానప[illegible]ం ప్రజా
ప్రత్యక్షాదియుగప్రభ మీక్షకృత కవిప్రారంభుఁ గారుణ్యసం
పత్యాత్యాద్భుతమిత్రుఁ బోలె సుబంధుం దక్షు[illegible]. 74
మ. బుధసంభావితమూర్తి నిస్తులకళాపూర్ణుండు నిష్పూర్వభూ
ర్వ్యధరాధీశపదప్రవృత్తి హితసద్రక్షాచరిత్రుండు దా

నధురాధురుయ్యెడు గర్వభాగరివధానంబుండు శోభాసుధా
నిధి యారాజీభవైరిపీఠిఁ గొలువుండెం గొల్వుకూటంబునన్. 75

క. ఇనుఁ డుదయాద్రింబలెన య్యినుఁ డమ్మణిపీఠి మెఱసి యేమునిచెప్పం
దనయుల ననయుల జేంతం, గనుఁగొని నిశ్వాసవీచికలు గడలెత్తన్. 76

క. చిత్తమునఁ బొగిలి యిట్లను, విత్తము ప్రాభవము సద్వివేకము నయసా
పత్తిదము లోకఁడొకండో, క్కత్తున నన్నియును గలుగ నేమని చెప్పన్. 77

క. లేదఁట పాండిత్యము చవి, గాదఁట శాస్త్రం బదేటికా నుపుడాఁ జాల్
గాదఁట యేనాఁడును బా, లీదఁట యాధేను వేరి కేలా యేలన్. 78

క. సుకృతంబున గాంచు నొకా, నొకఁడు క్షయవిభూతి కాంతు నుత్తము నతిపా
తకునకు లేఁడైన గులాం, తకుఁడు దేవులు విషయు నెంటితనయుఁడు వుట్టున్. 79

మ. పరమైకాంతికవాస మిష్టము ప్రియాబంధ్యాత్వి మామోదసం
భరలాభంబు బుతూచితాభిగమనప్రారంభవైముఖ్యమా
పరితోషం బబలాసుతాప్తి దగు గర్భస్రావమో ప్వా న్వపుః
పురుషత్వ న్యతిపుత్రుడు త్తమగుణాంభోరాశి లేకుండినన్. 80

ఉ. కావున దుస్స్వభావమదగర్వవికారుల మ్మత్తుమారకం
గేవలనీతిబోధమునఁ గీర్తితమార్తులఁ జేయువాఁడు లేఁ
డేవిమలాత్ముఁ డొక్కఁడని డెందమునందలపోయ నద్ధరి
త్రీవిభుఁ జూచి యొక్కజగతీసురపుంగవుఁ డాసభాస్థలిన్. 81

వ. అధీతనీతిశాస్త్రమర్ముం డగు విష్ణుశర్ముం డనునతండు బృహస్పతియునుంబోలెఁ దేజరిల్లుచు దక్షిణహస్తంబెత్తి యిలాప్రియుడయ్యకుం డగునుదర్శనన కుదారస్వరంబున నిట్లనియె. 82

క. పరిసము చేతను లోహమో, త్కరములఁ గాంచనముఁ జేయుగతి మహోబ్ధా
చరణమున మీకుమారుల, గురుకీర్తి నీతిపారగులఁ గావింతున్. 83

చ. ఇది నిజ మిందు కాలు నెల లిమ్మెడమి ల్లొనరింపనున్న నీ
పదఁ బదమాన కేను వనవాసమొనర్చెద నన్న రాజు స
మ్మదము వహించి యోవిమలమానస యంతటివానిఁ గానెఱుం
గుదు నిను వీరి ముగ్ధులకు ల్ల్యయ వేదులఁ జేయు మెప్పుడున్. 84

వ. అని సమర్పించినం గైకొని విష్ణుశర్ముం డక్కుమారులకొఱకుఁ దంత్రంబు లయిదు
కల్పించి కథాద్వారంబున నీతి గ్రహింపంజేయువాఁ డయ్యె న త్తంత్రనామంబు

లెయ్యవి యనిన మిత్రభేదంబును సుహృల్లాభంబును సంధివిగ్రహంబును లబ్ధనా
శంబును నసంప్రేక్ష్యకారిత్వంబును నాఁ బొగడనెగడు నందు మిత్రభేదం బారం
భించి రాజకుమారుల కతం డిట్లని చెప్పందొడంగె. 85

క. సాహంకృతి బహుమృగకో, లాహలహలహలిక వనతలంబున నొకనాఁ
డాహాకేసరివృషభ, స్నేహం బొకజంబుకంబుచే చీల్పడియెన్ 86.

క. నావిని రాజకుమారకు, లావిప్రునిఁ జూచి పలికి రనఘా వృషభం
తావళశాత్రవసఖ్యం, బేవిధమున నక్క చెఱిచె నెఱిఁగింపఁగదే. 87

క. అన నతఁ డిట్లను దక్షిణ, మున మహిళా నామనగరమున సీతికళా
వనరాశివర్ధమానుం, డన వర్తకుఁ డొకఁడు మెఱయు నతఁడు నిజాత్మన్. 88

వ. ఇట్లని విచారించె. 89

ఉ. కొంచక లేనివోఁ బసిడిఁ గూర్చుట కూర్చిన కాంచనంబుర
క్షించుట రక్షితత్వ మడఁగింపక సొంపెసగం బ్రవృద్ధినొం
దించుట దాని నేమరక తీర్థముఖప్రతిపాదితంబుగా
వించుట లెస్సనీతి రసవేదులకుం బలుమాటలేటికిన్. 90

క. పాలింపనిసిరి చోరుల, పాలగుఁ జెడుఁ గూర్పకూడఁబడిన నిజస్వం
బీలేమి నిష్ప్రయోజన, మీ లేమియు కలిగియున్న నతిలోభులకున్. 91

క. పరికల్పితసస్యపరం, పరకుఁ దటాకోదకంబువలె గూర్పం జే
కుఱినసిరి బుద్ధులకునిడు, కొఱతుఁ గాదా యనుచుఁ దలఁచుకొని యత్నమునన్.

క. ఆవణిజుఁడు నందక సం, జీవకనామములు గల్గు నిలువృషభముల నా
నావిధవస్తుధురంధర, మై వెలసినబండిఁ బూన్చి యనుజీవులతోన్. 93

క. ఘనధర్మకర్మసాధన, ధనసంగ్రహబుద్ధిఁ దావు దరిపురంబుల్
జనపదములుఁ గడచియశో, ధన ధనదాశాభిముఖతఁ దనయుక యేగెన్. 94

ఉ. ఆవిధి నేగి యొక్క భయదాటవిలో వివిధస్వనంబునం
బోవఁగ వస్తుభృచ్ఛకట భూరిభరంబునఁ బోవ నందు సం
జీవకనాము నేల మునిసం బవిసండితమై లల్లంగి మా
నావఁడిఁ గ్రమ్మఱిక్తముదనప్రోదపో నట్టు నేలఁ గూలినన్. 95

క. కొదపడిమొఁ గాని పోయెడు, నెదిగాలింపుడీ వర్ధమానుఁడు దానిన్
వదనుండి మనచునంబుల, మదయాపరతంత్రుఁ డగుచుఁ గొంపఱ నిలిపెన్. 96

క. నిలిపి శకటమున నొండొక, బలదవృషభమునఁ బూన్చి పథమున నవ్యా
కులమానసుఁడై చనియె. న్గలవారలు పనికి నేగి గడచే ఫలమున్. 97

క. నావిని కరటకునకు నయ, కోవిదుఁ డిట్లనియె దమనకుఁడు నీతికళా
శేవధి యాకథ యెటు చెపు మా వినియెద ననిన నతని కతఁ డిట్లనియెన్. 108

చ. మితరహితారిమండలసమిజ్జయయుజ్జయినీపురంబున
న్వితతవిలాససంభ్రమణవిశ్రుతవిశ్రుతనామిటారి యా
యతనుకటారి కర్కశకుచాంగజితప్రకటారి నృత్తనం
దితశకటారి వారసుదతీమణి యొర్తు నటించు సున్నతిన్. 109

క. రాగరుచిగలుగుదెస నల, భోగినిమయిమఱుపుఁ దిగిచి పొడితెమ్మర త్రా
ష్ణాగతిదరలింపఁగ సం, భోగంబొసఁగుం భుజంగపుంగవతతికిన్. 110

చ. దినము దినంబు నిద్ర కరుదెంచిన వేడుక కానిగుండె ఝ
ల్లన జననిప్రయత్నమున నచ్చెలి వేఁకువ మేలుకాంచి మ
జ్జనవిధిఁ దీర్చి సొమ్ములిడి చందనపుం దళుకొంద జాళువా
పని నునుగాసెయు న్మెఱయఁ బార్వతిసేవకు బోవుకీవితోన్. 111

ఉ. ఆసఖిచూపుఁ దూఁపుగసు లంగములం జెరలింప నాసనో
పాసనచాసన ల్గుదిసి పావనభావనధానంబుల
నోసరిలంగరాఁబడినయోగముఁ ద్యాగము సేసి దీర్ఘని
శ్వాసము నించు శీధుసరసాగరజాతహ నించుఁ జూచుచున్. 112

చ. చెలి నెఱికివి జేవిగుడి సేవకువచ్చినవేళ వీటిలో
గలిగిన కోడెకాండ్రు సిరిగందము కప్పుర మంబరంబు కుం
చెలు ఘృతము ల్సితంబు విరిజెండులు పండులు కానుకిత్తు ర
చ్చలిమలపట్టి కొక్క దివసంబును రాకదిరాక తక్కినన్. 113

చ. నిలివెడు విత్తమిత్తునని నీతికిఁ బాసినఁ గాని పూనియ
చ్చెలి కలనేనియు న్పిలుపుఁ జెప్పద నీతికిఁ దుచ్ఛజాతికిన్
బలితునకున్ విచారపరిపాకవిమూఢునకుం దురుక్తికిం
బలువకు రోగికిం దురభిమానికి దాసికి మద్యపానికిన్. 114

మ. ప్రనసీభూతభుజంగజీవ యలయూపాజీం దక్షాయణీ
భవనక్షోణినటించు షోడశఘుటీపర్యంత మంతంత మూఁ
డవయామంబున నొక్కనాఁడు మునుచాయుం దిన్యోటీ గ్లొల్చిరా
నవధానంబున నింటి త్రోవఁ గలహంసానూనయానంబునన్. 115

క. నడతెంచుమఁ ద్రోవ బడ, ల్పడఁ ద్రొక్కి న నెగసి యొరబాగ యిఘణవే
ర్పడ నచ్చెరువుగ నచ్చెలి, కడకాంగొక త్రాఁచు బాము గడఁకం గఱిచెన్. 116

క. తాలువులన్నాలాకీ, లాలంబులు చెమ్మగింప లగ్నక్ష్వేళా
జ్వాలం దూలి శతక్రతు, నీలతమో నీలవాల వేలంగూలెన్. 117

వ. అట్లు విషధరవిషంబునం గ్రాఁగి కూలినకూతుం గని శోకించి నిమిషంబునందొక.

చ. ధనికులుగాన దానితలిదండ్రులు జాలెలుచించి యర్థకాం
చనము లవారిగాఁగ వెదచల్లి వసుంధర పేరుకీర్తియుం
గని మనువారలం బరమగారుడమంత్రకులం బొరింబొరిం
గొనిచనుదేర వార లలికుంతలచెంతలఁ జేరి నేర్పునన్. 119

సీ. కాటుపట్టున గత్తివాటులువైచి నిర్విషమూఁది మనకున్న విసివె నొకఁడు
ఘటపూర్ణమంత్రపుష్కరధార లెత్తించి గుణముగానకరోసి గునిసెనొకఁడు
కలితంబుఁగన్ను దోయిఁగడియించి బ్రదికించుద్రోన దుర్ఘటమైనఁ దొలఁగెనొకఁడు
పసరునెన్నడునెత్తిఁ బ్రామి బెత్తమున నిట్టటుమోఁది పనికిరా కరిగెనొకఁడు

తే. కదియఁబడియున్నదొడలఁ గాఅుజొనిపి, పాయఁబడఁజేసి తగుపాటి పలుచనైన
యౌషధీసారములఁ బోసియు వియులావు, సేయుకుండిన నొకఁడు లజ్జించి చనియె.

క. అప్పాట విషచికిత్సకు, లొప్పనిపదనములతోడ నొండెవ్వరికిం
జెప్పక వచ్చినచొప్పునఁ, దప్పక పోవుటయు నాసుదతితలిదండ్రుల్. 121

ఉ. కాంచనపుత్రినెత్తుకొని క్రమ్మఱిపోయి శివానివాసముం
దుంచి నమస్కరించి యడలూఁదఁగ నిట్లనివిన్నవించి రో
పంచముఖప్రియా పడుచు ప్రాణమువచ్చిన మంటపంబుఁగ
ట్టించెదమమ్మ నిన్నుఁ బురుడింపగలేరుగదమ్మ వేలుపుల్. 122

చ. తరువుగదమ్మ మామనవి తానకపాదయుగంబు దేవతా
తరువుగదమ్మ యీపడుచు దక్కకపోయినఁ గన్నమాకు ను
త్తరువుగదమ్మ నీవరువుదానికి నిట్టియవస్థవచ్చు ట
చ్చెరువుగదమ్మ మమ్ము దరిఁ జేరుపుమమ్మ త్రిలోకమాతృకా. 123

చ. అని తనువేఁడి పాడి నెగులొందక వారకయేడ్చువారలం
గని గిరిజాతజాత సుముఖత్వమున న్గడకంటిచూడ్కిఁ జూ
చిన నపు డేమి చెప్ప నటఁ జేడియ నిర్విషయౌచు నిద్రమే
ల్కానినవిధంబున న్దెలిసి కౌతుకసంపదఁ దేల్చె నాప్తులన్. 124

క. దేవీవరమహిమంబున, జీవితయగుపుత్రిఁ గొనుచు గృహమున కానం
దావిలలీలం జని రా, జీవేక్షణ కిడినమ్రొక్కు చెల్లించుటకున్. 125

గీ. అల్లనత్తరకదంపతు లతులనుతులఁ, బవనభుగ్భూషగృహిగృహప్రాంతమునకు

నవనిజంబుల దెప్పించి రందులోన, స్థూలతరుకీలమగు నొక్కదూల మమరు. 126

ఉ. అనగ గోపకంఠవనికోపనజాతలతాచరన్మహో
వానరయూథ ముద్దవడి వచ్చి యొకానొకవేళ దారుణో
చ్ఛానటనంబొనర్ప రభసంబున నందొకక్రోఁతి యంత నా
హా నవలాఘవంబునఁ గృతాంతవశంబున దూల మెక్కుచున్. 127

క. వాలం బల్లార్చుచు నిరు, గేలం బిగియారఁబట్టి కీలము వడి ను
న్మూలింప నిఱికికొనియె, న్వ్రీలినయద్దారు వుద్దవిడి ముష్కములున్. 128

క. ఇఱికిన వివృతాస్యంబై, యొఱలుచుఁ బొరలు న్వడంకు నులుకుఁదలంకున్
మరలుం బడు లేమం గపి, యురిఁ దవిలినపులుఁగువోలె నుడుగనియంతన్. 129

క. ప్లవగం బట్లమఱి మే, నవశంబగుటయుఁ ద్యజించె నసువుల నుచిత
వ్యవహారక్రియఁదెలియని, యవివేకికిఁ జేటువొందదా యొండైనన్. 130

క. హరిభుక్తశేషతరసం, బిరువురకుం గలదు చాలు నీపాటివృథా
పరచింతలేటి కన విని, గురుమాయాశాలి దమనకుం డిట్లనియెన్. 131

క. తనవారిఁ బ్రోచుటకు నొం, టనివారి వధించి వైచుటకుఁగా నృపులం
బనివడికొలుచుట లే కెవ్వని కెద్దడి వుట్టె నన్నవస్త్రంబులకున్. 132

చ. అతివిరసత్వసత్వకుణపాదికపారణసారమేయ మూ
ర్జితజఠరాగ్ని శాంతియొనరించు సముచ్ఛ్రియ కృఛ్ర సంకుల
స్థితివెగడందియు న్వెదకి సింహము మత్తకరింభుజించు నే
గతులబలానురూపఫల కాంక్షులుగా ధర నెట్టివారలున్. 133

చ అనుగతియుం గటీచలనముగ్రపదభ్రమణంబు వాలచా
లనమును భుక్తశేష కబళప్రదుఁగూర్చి యొనర్చు వేఁపి చ
య్యన బుధసాంత్వనోక్తి శతకాయుతసంఖ్యలఁగానిభుక్తికిం
దనకరమీఁదు కుంజరవతంసము నెట్టన నెట్టకేలకున్. 134

క. తను లోను లభినుతింపఁగ, మనఁగలిగినమునికి నిమిషమాత్రమె చాలుం
దనివిసనం బ్రేతాన్నముఁ, దిని యూరం గాకి బ్రతుకదే వేయేఁడుల్. 135

క. ఘనవిద్యావిక్రమజం, బనఘుండై కుడుచు నెవ్వఁ డతనిదివో భో
జనము పశుశిశు ఖురంబు, ల్దిను గౌలేయకము దానిదియుఁ గుడుపగునే. 136

క. అల్పముననిండు శశపద, మల్పంబుననిండు మూషకాంజలియు పెం
చల్పముననిండుగుపురుషుఁ, డల్పమునం బూర్ణుఁడగు మహాత్ముఁడు గామిన్. 137

క. శ్రుతిశాస్త్రప్రకరబహి, ష్కృతము నయానయవివేకరిక్తము కుక్షి

స్థితిఁజాగరూక మేయున్నతిఁ జెపుమా మనుజపశువునకుఁ బశువునకున్. 138

క. కసవుదినుఁ గూడుదెమ్మని, కసరదు బరువిడినమోయుఁ గర్శనమునకున్
విసువదు మార్గోడ్డాడదు, పసరమునకుసరియె మనుజపశు వెప్పటికిన్. 139

క అన విని కరటకుఁ డతని, న్గనుఁగొని యిట్లనియె దమనకా విభునకుఁగ
ల్గినదండనాథులము దగ, మన కీవ్యాపార మనభిమత ముడుగఁదగున్. 140

వ. అనిన దమనకుండు. 141

క. పరమస్వతంత్రులయిభూ, వరుసన్నిధి మంత్రులుండవలె నమ్మంత్రుల్
పరతంత్రులయినఁగలవే, పురుషార్థము గౌరవము ప్రభుత్వము యశమున్. 142

క. గ్రావాగ్రమునకు భూరి, గ్రావం బెక్కింప భరముగా దది ధరకున్
ద్రోపఁ బ్రయాసమె యున్నతి, కయివలెబా టధమవృత్తి కది యేమిటికిన్. 143

క. తనకున్ హృదయము వశమై, యనుచరుచందమున నుండు నది యేమియొకో
మనుజుఁడు గౌరవమొల్లక, ఘనలాఘవదంశితుండుగా నీక్షించున్. 144

క. అనిచెప్పి మఱియు గరటకుఁ, గనుఁగొని దమనకుఁడు పలికెఁ గంటే పంచా
ననసార్వభౌమునకు నా, ననమొప్ప దిదేమికారణము నేఁ డనుచున్. 145

క. అదివిని కరటకుఁడు మదిం, గదిరిన యచ్చెరువున న్మొగము జూచి యహో
యిది నీ వేతెఱఁగున నెఱుఁగుదు పన నాయనకు దమనకుం డిట్లనియెన్. 146

మ. మతి నేనిచ్చినఁగానిలేదు చన దాత్మశ్లాఘనామానసం
బితరాకారవిచేష్టితార్థముల నూహించు న్ధరిత్రిం బశు
ప్రతతుల్నేర్చు నుదీరితార్థముల దిక్ప్రఖ్యాతమేధాసమ
న్వితుఁడై పర్తిలు పండితుం డకట వానిం బోలఁడే చెప్పుమా. 147

క. చతురుఁడుగనుఁ బతిచేష్టా, గతిఁ దెలిసితిననిన నతఁడు కాఁగా నోస
మ్మతిగాదునాకు సేవా, స్థితినీకెఱుకపడుఁ గుశలచిత్తములేమిన్. 148

వ. అని కరటకుండు పలికిన దమనకుం డతని కిట్లనియె. 149

క. భూషింప మెచ్చు లోకము, దూషింపం జంపఁజూచుఁ దుది నదె విద్య
ద్భాషితుని నన్ను నేలా, దూషించితి వైన నేరుతుం బతిఁగొల్వన్. 150

క. నృపసంశ్రయమున నా కతి, నిపుణతయేవలనలేదు నీవయనియెదో
యిపు డెవ్వరేని శత్రుం, తప యోరిమిలేక యనియెదరో నను జెపుమా. 151

క. అను దమనకునాననము, న్గనుఁగొని కరటకుఁడు పలికెఁ గాదా మును నీ
వనవసరంబునఁజనవో, కినుక న్నిను విభుఁడు గోపగింపఁడొ నెరయన్ 152

సీ. ఆఁకొని భుజియింప నరుగువేళ నొకింత యొడలికి నుపఘాత మొదవినపుడు

భూరినిద్రాభరంబున సోలునెడఁ గులస్త్రీలతో నలిగి విచ్చేసినతఱి
రతికి నువ్విళ్ళూరుగతి శరత్తుఁడైన యవసరంబున వేఁట లాడి యలసి
ధరణీరుహచ్ఛాయ లరయుచోటఁ బిపాస సలిలమన్వేషించుసమయమునను
తే. మజ్జనంబాడుపట్టున మౌననియతి, నర్ధమీలితలోచనుండై పురాణ
పురుషు ధ్యానించునకాలమున నృపాలుఁ, జేరరాదండ్రు తద్జ్ఞులు సేవకులకు.
క. మఱచితివే యన దమనకుఁ, డెఱుఁగుదునను జీవధర్మ మిట్టిద భటుఁ డే
తెఱఁగున నేనియు నరవరు, కుఱఁగట రేపగలుగాచి కొలువఁగవలయున్. 154
క. అతి కంటకుఁడైన విసం, గతుఁడైన గుజాతుఁడైనఁగానీ లతలున్
సతులు ధరిత్రీపతులం, జితవైరీ యల్లికొండ్రు చేరువనున్నన్. 155
క. కోపప్రసాదచిత్త, వ్యాపారము లెఱిఁగి కొలిచి వర్తిల్లుభటుల్
భూపాలబాహుశాఖా, రోపితులై యుండ్రు చనవు రొక్కం బగుటన్. 156
క. అన విని కరటకుఁడు దదా, ననము నిరీక్షించి పలికె నయ తత్త్వనిధీ
వినవలతు నాదరంబునఁ, దన కిఁక నీవేమిచెప్పెదవు తరువాతన్. 157
క. విత్తునవిత్తుంబలెఁ బ్రత్యుత్తర ముత్తరమువలన నుదయించు భవ
చ్చిత్తమునీతికళాసం, పత్తికిఁ బుట్టిల్లుగాదె పరికింపఁగాన్. 158
వ. అను కరటకు పలుకు లాకర్ణించి యతం డిట్లను నీతిపోషణంబులు దుఃఖశోషణం
బులుగావె భవద్భాషణంబులు నప్రాప్తకాలవచనం బెవ్వరికి నశుభంబుఁజేయుదు.
క చతురలవలె నృపసేవా, ప్రతులకు నప్రాప్తకాలవచనంబు బృహ
స్పతియంతవాఁడుబలికినఁ, బ్రతిపీరధ్వంసి హాస్యపదనిరతుఁ డగున్. 160
వ కావున దేశకాలేంద్రియ పరిపక్వంబులెఱింగి యుచితజ్ఞుఁ డగునతండు విన్నపంబు
చేసికొని నిజప్రయోజనం బీడేర్చుకొనుచు. 161
క. తనకేవిద్యాభ్యాసం, బునముఖ్యఖ్యాతిలాభములు సిద్ధించున్
ఘనతరముగఁ గులపురుషుం, డనఘుండయి నేరవలయు నాసద్విద్యన్. 162
క. కలగుణరూపప్రజ్ఞా, బలములచే నేమి వానిఁ బ్రకటింపరు భూ
తలపతులు సములు విషములు, దలపోయ నఖర్వపర్వతంబులభంగిన్. 163
క. కావున నవనీవల్లభు, లేవిధమున నుండి రేమిహితబుద్ధిన్నే
వావృత్తినూది వర్తిలఁ, గానవలయు నృభటులు కనినఁ గరటకుఁ డంతన్. 164
క. అగు నగుఁ బోపొమ్మన్నని, మొగిమునమున్నాఁడు రాజునెగ్గులమఁ దేర్పం
దగుతఱి మేలయ్యెడునో, సుగుణీ నీకనిన నతఁడు సొం పెసలారన్. 165
చ. మెలపునఁ జేరనేగి ప్రణమిల్లి వినీతతి నిల్వఁజూచి పిం

గళకుండువల్కె నోదమనకా చనుదెంచితివేమి నావుడు
జ్వలమతి నాతఁ డిట్లను భవచ్చరణంబులఁ గొల్వవచ్చితి
న్గెలసముదీనికంటెఁ బరికింపఁగ నెయ్యది నాకుఁ జెప్పుమా. 166

క. సచివకుమారుఁడ నగు నా, కుచితములగుపనులు గలిగియుండుఁగదా నా
వచనమువిన దేవరకును, రుచియగుఁగద కార్యతత్త్వరుఁడఁగద మొదలన్. 167

మ. శ్రుతికండూయన రుక్ప్రశాంతియొనరించుం దంతనిర్ఘర్షణ
స్థితికిం జాలునఖాగ్రభిన్నయవసచ్ఛేదంబు విశ్వంభరా
పతికార్యంబుల నప్రయోజకుఁడె ప్రాప్తజ్ఞానచాతుర్యశౌ
ర్యతతోపాయన యాప్రియాలపనమేధాకారశీలుండిలన్. 168

చ. పరమశుచి న్సమిద్ధుబు నపారమహామహు నుత్సవక్రియా
స్థిరు నిరసించి క్రిందుపడఁజేసినఁ గ్రిందుపడంగనేర్చునే
కరలి యొకప్డు దీని దలక్రిందుగఁబట్టిన నూర్ధ్వకీలుఁడై
దరికొన కంబుసంభవుఁ డఘశ్శిఖుఁడై నశియింపనేర్చునే. 169

చ. హాలికుఁడు విత్తు చేసఁబడునప్డు డెలుంగఁడు చాలు చక్కనై
తలకొనఁజూచి మంచిదిగదాయనుఁ బిమ్మట నట్లు రాజు సొం
పలరఁగఁ గూర్చునప్డు భటాలినెఱుంగఁడు ప్రస్తుతంబున
న్గెలసముఁబూని నిల్వఁబరికించుఁ బ్రయోజకుఁ డంచు నెంతయున్. 170

తే. గీ. అతిశయస్థానయోగ్య సింహాసనమున, ననుమవిశ్వంభరావల్లభునమనింద
మస్తకోచితకోటీరమండనములఁ, గాళ్ళఁదొడిగిన యమ్మర్త్యుఁగఁ జటియనరె. 171

ఆ. వె. అధమువృత్తి కధికు నమరించుపతి దిట్టుఁ, గుడుచుఁగాదె యారకూటకటక
కలితమణికి నిందగాద పొనర్చిన, పత్సితుండు నిందఁగుడుచుఁగాని. 172

క. శిరమున మకుటము రశనా, భరణము కటి నూపురంబు పదమునఁ బోలెన్
గురుబంధుభటులనిల్ప న, మరమ మత్తమ మధ్య మాధమస్థానములన్. 173

చ. పురుషవిశేషలీల విరిబోఁడియు వాలువిపంచిశాస్త్రముల్
దురగము వాణియు న్నరుఁడు దొడ్డతనంబువహింతు రట్ల కా
పురుషవిశేషలీల విరిబోఁడియు వాలువిపంచి శాస్త్రముం
దురగము వాణియు న్నరుఁడు దొడ్డతనంబువహింప రుర్వరన్. 174

వ. ఇది సృగాలమాత్రంబు దీనిచేత నేమి యని నన్నవజ్ఞసేయకుము. 175

క. హరిసూకరరూపంబున, హరిణాదిమృగాకృతుల మహర్షులజంబయి
హరిసుతుఁడు పూజ్యుఁడై యుం, పరువారలగౌరవంబు గరిమవడియొనే 176

వ. అశక్తుండయిన భక్తుండును భక్తిలేనిశక్తుండును నప్రయోజకులు ద్యాజ్యులు నేను బరమభక్తుండ శక్తుండ నత్యాజ్యుండ నన్ను గౌరవము సేయుము. 177

చ. పతినయదూరుఁడైనభటపంక్తియు నీతికిఁబాయుఁ దత్ప్రధా
నతఁ బుధులుండరా బుధజనంబులులేమి నధర్మమూర్జిత
స్థితిఁగను నయ్యధర్మమునఁ జేసి యఘంబులుపుట్టు వానిచే
నతులవిపద్దశల్వొడము నవ్విపదాయతిరాజ్యము చెడుఁ. 178

వ అని దమనకుండు పలికినఁ బింగళకుండు నతనిం బ్రసాదపురస్సరాలోకంబుల నాలోకించి. 179

ఉ. వానికి పన్నెకుం దగినవాఁడవు రాజ్యమునీనయంబునం
చేసెదఁగాదె ని న్నడప సేవకులెవ్వరునాకుఁ బెద్దవి
శ్వాసము నీయెడంగలదు శక్తుఁడు భక్తుఁడు నిన్నుఁబోలఁ డో
హో సఖ విన్ననై వదనమొప్పక వచ్చితి వేమిచెప్పుమా. 180

క. నావిని దమనకుఁ డను దే, వా విన్నపమొకటి వారివాంఛ న్వడిగాఁ
బోవుచునిలిచితి విదియే, లా విన్ననిమోముతోఁ గలంగినమతితోఁ. 181

వ అనివిన్నవించిన దమనకునకుఁ బింగళకుం డిట్లనియె మచ్చరణ్యం బగునియ్యరణ్యం బపూర్వసత్త్వాధిష్ఠితంబయి యున్నయది యట్లగుట చిత్తచాంచల్యంబుఁ బుట్టించు టయు దానంజేసి యంగవైకల్య మావిర్భవించె నెట్లనిన విలయసమయసముజ్జృంభమాణ పుష్కలావర్తకవిధంబున శబ్దగ్రాహకంబులకు నధికతాపం బొనర్చుచున్నయది యద్దిక్కున నొక్క యపూర్వదుర్వారఘోషంబు వీనేర నాకర్ణించితి మంత్రప్రతిబద్ధశక్తి యగుఫణాధరంబువిధంబున స్రుక్కితి నీవాకర్ణింప వొకో శబ్దానురూపబలమహత్త్వం బగుసత్త్వం బచ్చోటఁ గలిగియున్నది మదీయరాజ్యంబునకు హాని వాటిల్లకుండునే యని నిట్టూర్పునించు నప్పంచాననునకు దమనకుం డిట్లనియె. 182

క. జలముల సేతువుబెడిదపుఁ, బలుకుల భీతుండు చెనటిపాడిం జాతిఁ
జెలిమిరహస్యమొనర్పం, దలఁపనిపని చెడు నిగూఢతరమంత్రంబుఁ. 183

క. నీతెరు వనిలచరన్మహి, జాత లతాఘాతభగ్న సంగరభేరీ
జాతరవశ్రవణమహో, జాతరహ్యజ్జీర్ణజంబుకము కథ యయ్యెఁ. 184

క. నావిని పింగళకుఁడు నయ, కోవిదు దమనకునిఁజూచి గుణరత్నసము
ద్రా వినియెద నీకథఁజెప్పు, మా వాచాపాటవం బమర నా కనుడుఁ. 185

క. దమనకుఁ డిట్లను పరవి, క్రమవిక్రమసింహపురనికటవటకాంతా

రమున నొకనాఁడు గాఢ, క్రమమున నే నరిగి తిరుగఁ గాఁ గన్పైమరన్. 186

ఉ. జన్యము కాంతకుంతపరుషత్త్రిపాతి బృహద్వ్యపాళిరా
జన్యము హస్తిమస్తకరసక్షతజద్రవలుబ్ధదైర్ఘ్యరా
ట్జన్యము భానుభేది ఘనసాహసపూజనరాజమానప
ర్జన్యముఁ జూపెఁ బర్యుషితసామజవిస్రసమేతవాతముల్. 187

చ. కదన మొకింతచేర వరుగ న్వెఱుగంబడి యున్న కేసులం
బ్రిదిలుటలేనియేనుఁగులు బెంటలు గొన్న జిరాల్గురాలు పె
న్గదురుడివోని నెత్తురులు గాఢపుబెంపులఁ గ్రాఁగి చిక్కనై
పొదలు మెదళ్లు నాంత్రములు క్రోవులుఁ జూచి ప్రహృష్టమూర్తినై. 188

వ. మఱియు నక్కాలను సమున్మాళిపుండరీక వ్యాకీర్ణం బగుటఁ గాసారంబును నఖండఫలకాండమండితంబగుట నారామంబును నమోఘప్రాసవిలాసం బగుటఁ గర్ణాటక ప్రబంధంబును ననంగవిహారయోగ్యం బగుట మధుమాసంబును దష్టకబంధవాహినీబంధురంబగుటం గ్రీష్మసమయంబును నవ్యక్తతారకవ్యూహం బగుట నహర్ముఖంబును బహుద్విజవిరాజమానంబగుట యాగంబును ననాత్మజ్ఞపాదంపరీసంపూర్ణం బగుట గంజానిలయంబును విభాగీకృతచరణంబుగావున శ్లోకపఠనంబును గర్ణశల్యసైంధవభీష్మమర్శిరీత్ష్యం బగుట సుయోధనాయోధనంబును బ్రయుక్తశక్తిపాతనిర్ఘాతధరాధిపప్రాగల్భ్యంబగుటఁ గుమారసమారంభంబును నవఖండమనోహరం బయి యోషాభాషావిశేషంబును రసాభిసు ప్తపురుషోత్తమంబై శరత్కాలంబును ననుకరించె నప్పుడు. 189

క. దూరప్రాణధురీణము, హోరణమున నేమిచెప్ప నాశ్చర్యకరం
బయిరోదసితోఁ వినుమొక, భేరీనినదంబు కర్ణపిశిత మగల్చెన్. 190

తే. భయము దోఁత్తోఁప ముక్కునబంటి యయ్యెఁ
గొరలు జఠరాగ్ని గుములుచుఁ "గింకరోమి
యాగతోఽస్మి క్వయాస్యామి" యని యడలితిఁ
బలలహానికపగంగఁ బొఱలు గామి. 191

ఉ. ఎంచినభీతి మే న్వణఁక నేనొక యించుకసేపు బుద్ధిశం
కించి యిదేమి యొక్కొ పరికించెదఁ గాక ని చేరి ముందర
న్గాంచితి వాతపోత పరికంపితభూజలతాహతి న్దిశ
ల్పించుఱవంబునీను నొకజీర్ణసమిద్గతభేరిఁ జేరువన్. 192

సీ. కనుఁగొని చర్మసంగతవాయువుగ నిశ్చయించి మెల్లన నంఘ్రిలిడుచు నరిగి

కదిసి తద్వైరిముఖము వ్రచ్చి లోపల నరయ నిర్మాంసమగుట మేను
పొదలఁ జేసి కెలమహాభోజనం బని చని పడి మేనుమలఁచి నల్లడలునూచి
కరట గృధ్రోళిలూకకంకాదుల శవామిషాదులఁదోలి నేనాథ్యలీల
తే. దంతిపలల మశ్వతరసంబు శాక్వర, క్రవ్యముష్టి మాంస ఖండ కాండ
మొలసి యున్న నరులపాలయును దిని గాఢ, కౌతుకమున నుంటిఁగాఁదె తొలుత.

వ. రవశ్రవణమాత్రంబున నేమి తెలిసికొని నిర్భయుండవు అగుము శబ్దం బేదిక్కున
నాకర్ణింపంబడియె నద్దిక్కునకు నన్నుంబనుపు మంతయుం దెలిసి వచ్చెద ననుట
యుఁ బింగళకుం డట్లచేయుమనియె నట్లు నియుక్తుండై దమనకుండు సకలమృగ
సంచారఘోరం బగు యమునాప్రాంత కాంతారంబున కరిగి పురోభాగంబున. 194

ఉ. చేవఁజిగుర్చుశృంగములు శృంగములం బ్రకటింప భూరిశో
భావహనైకపాదములు పాదముల న్దలఁపింప జంగమ
గ్రావముభంగి భానుభవకచ్ఛమున న్విహరించువాని సం
జీవకుఁ గాంచి మ్రొక్కి నిలిచె న్మృగధూర్తకుమారుఁ డయ్యెడన్. 195

వ. అట్లు వినీతత్వంబునెరపి కైవారంబుసేసి యతనిచేత నాగమనకార్యం బడుగం
బడినవాఁడై. 196

చ. హృదయముపల్లవింప నతఁ డిట్లను నెంతయు సమ్మదంబునం
బొదలుచు నీసమాగమము పూర్వము నీ కెనయైనవానితోఁ
గదిసి యఖండసఖ్యమునఁ గాలమతీతముగా నొనర్ప కి
న్నదిదరి నొంటి నుండఁదగునా మృగనాథులులేరె మైత్రికిన్. 197

చ. అనఘచరిత్ర పింగళకుఁడ న్మృగరాజటనుండు నమ్మహా
ఘనుని ప్రధాననందనునిఁగా నను బుద్ధినెఱుంగు నీవు నా
యనకు ఘటింతు మైత్రిసమయం బిదె నన్ననిఁగొమ్ము మానితం
బనలము గూడినట్లయగు నాతఁడు నీవును జెల్మి సేసినన్. 198

క. అన విని దమనకునిఁ గనుం, గొని సంజీవకుఁడు పలికె గొబ్బున నురలం
జని చెలిమిసేయుమా మా, కనుకూలతె మెఱయ మిమ్మృగాధిపుతోడన్. 199

క. పొమ్మన నెమ్మనమలరం, గ్రమ్మఱ మృగధూర్తకులశిఖామణి చింతా
సమ్మూర్ఛితాకృతింబడి, నమ్మేర న్గాంచి వినతుఁడై నిలుచున్నన్. 200

క. కనుఁగొని పింగళకుం డి, ట్లను సనయా మంత్రితనయ యచ్చోటికి నా
యనుమతిఁ గైకొనిపోయిన, పనియేమియొనర్చి తనినఁ బలికె నతండున్. 201

క. పొనపొనఁ గానకు దేఁర, పనుపునఁ జని యచటఁ గంటిఁ బ్రళయాంతరట

ఘననినదు గోత్రగిరినిభ, తనునభ్రంకషవిషాణధరుఁ గన్గొంటిరకా. 202

వ. భవత్కర్ణశూలాయమానం బగునప్పటిభయంకరధ్వానంబు నిన్ను నుద్దేశించి చేయు టగా నెఱుంగుము. 203

క. ఆలఁతులఁ బోరిఁ గొనరు మహో, బలులు లాహో ఘనులఁ గాని పవమానుఁ డిలం
బిలువెఱుకనె బహుశాఖా, కులగగనస్పంది వృక్షకోటులుదక్కన్. 204

క. ఈదృశబలవంతుని నీ, పాదముల కుపాయనంబుఁ బట్టెద లేదా
నాదెసనిచ్చిన నిర్మ, ర్యాదప్రేమమున సింహ మాతని కనియెన్. 205

క. నీ వనఁగ నంతవాఁడవె, కావా సంరావభిదురఘాతంబున దై
ర్యాళినగల్చిన యబ్బలిఁ, దే వేగమె యనిన నతఁడు దెచ్చె న్వచ్చెన్. 206

క. వచ్చినసంజీవకునకుఁ, బొచ్చెములే కలమృగాధిపుఁడు సౌహార్ద్రం
బచ్చుపడ నెదురుసని కొని, తెచ్చి సదృక్షాసనప్రతిష్ఠితుఁ జేసెన్. 207

తే. తనువుఁ బ్రాణంబువిరియునుదావిభాను, డాతపముఁ బోలె నలమృగాధ్యక్షుఁ డతఁడు
పాలునీరును గూడిన పగిది నుండి, రతిశయస్నేహమునను న య్యడవిలోన. 208

వ. ఇట్లు పింగళక సంజీవకు లన్యోన్యప్రసన్న స్నేహప్రవర్ధమానులయి యొరుల కవకాశంబీక యేకగ్రీవంబయియుండ ననుజీవులు పొలపెట్టులేక యాఁకట నారట నొంది యొందేనియుం బోవ దావడిపడిన నచ్చెట్టకుపంతం జింతిలి దమనకుండు కరటకుఁ జేరంబోయి నిట్టూర్పునిగిడించి తలవంచుకొనిన నతం డతని నాలోకించి.

చ. దమనక యోపలేననిన దప్పగె యిప్పనుజెట్ట నీనిమి
త్తమున జనించెగాదె పతిదండకు నిన్నొరు లేగుమంచు హ
స్తముఁ దెమలించిరో కుడిచి సమ్మతినుండఁగ దైవమిచ్చునే
సమకొని వీరి కిద్దఱికి సఖ్యము సేయకయున్న సాగదే. 210

ఉ. యెవ్వ రెటుండి రేమి మన కేమిప్రయోజన మంచు మున్న నే
నవ్వలఁ జాటిమోపి పతినారయునప్పుడు నీకుఁ జెప్పనే
యవ్వచనంబు లిప్పుడు యథార్థములాయెగదా భుజించువా
రెవ్వరు నీవెకాక మఱి యేమనలేక స్వయంకృతాగమున్. 211

క. చేసినయంతయుఁ దడయక, చేసేతం గుడువుమనినఁ జింతానలకీ
లాసంతాపితుఁడై మే, ధాసంగతుఁ డతనిఁ జూచి దమనకుఁ డనియెన్. 212

క. కృతకేతరవచనంబుల, గతి నీపలుకులు యథార్థకథనంబులు నా
కతమున నకటా యీదు, స్థితివుట్టెం దీని కేమి సేయఁగవచ్చున్. 213

ఉ. ఈతఱి నక్క వెక్కసపు పేఁడికకయ్యముచేతఁ దొల్లి చే

నేతఁ బరిగ్రహించి యతిశిష్యునిచే నొకనేఁతకానిచే
దూతికనొచ్చె నాత్మకృత దోషమునన్గద నావు డుల్లస
త్కౌతుకవల్లిపల్లటిలఁగా నతఁ డాతనిఁ జూచి యిట్లనున్. 214

క. అది యెట్లు విస్తరింపం, గదె యాకర్ణింతు సకలగాథాబోధా
స్పదహృదయ యనుడు వికస, ద్వదనుండై కరటకునకు దమనకుఁ డనియెన్. 215

క. యువనాశ్వ నగరమునఁ గే, శవశర్మ యనంగ నొక్క సన్యాసి మఠం
బవలంబించి యశిష్య, ప్రవరుండై యుండె భైక్ష్య భక్షకుఁ డగుచున్. 216

క. కల దాసన్యాసికి బహు, కలధౌత సువర్ణపూర్ణ కంథసదా య
బ్బలుగుయతి మఠపు మోసము, గలనేనియు లేక దానిఁ గని రక్షించున్. 217

తే. స్నాన మొనరించునప్పుడు జపముసేయు, నపుడు కరపాత్రమున భిక్ష మడుగునపుడు
పండునపుడును బొంతపై నుండు మనసు, బీదగతిచినబూరె యబ్బిక్షునకును. 218

క. చిరకాల మివ్విధంబున, నరిగిన నాషాఢభూతి యను ధూర్తధరా
మరసుతుఁడు సేరి కంథా, హరణేచ్ఛ న్యతికి శిష్యుఁడై సేవించెన్. 219

ఉ. ఆయతి యొక్కనాఁ డొక గృహంబునసుం దగ భిక్షచేసి రాఁ
బోయిన వాఁడు వెంబడినె పోయి భుజించి మఠంబుఁ జేరి యా
చాయ నిజోత్తరీయపరిషక్తతృణాగ్రము గాంచిపట్టి నా
రాయణ కృష్ణయంచు గురుఁ డద్భుతమందఁగ మ్రొక్కి నెవ్వగన్. 220

క. వెలవెలనిమోముతో మతి, యెలుఁగొందఁగ గురునిఁజూచి యెవ్వరి కెందుం
గలుగనికలుషము నా కిదె, గలిగె నయో యెట్టిపాపకర్ముఁడ నొకో. 221

క. అని మడమలు మోపక వడిఁ, జని కపటవిచారశీలుఁ జపలాత్ముని శి
ష్యునిఁ దిరుగఁ బిల్చి మదిఁ గీ, ల్కొనినమహాద్భుతముతోడ గురుఁ డిట్లనియెన్.

క. నిను నేకలుషము వొందెనె, జనఁ గారణమేమి సరభసంబున నాతో
వినిపింపు మనినఁ దత్పద, వనజంబులవ్రాలి యతికి వాఁ డిట్లనియెన్. 223

క. గురునాథ నిన్ను భిక్షా, గరిమంబునఁ జాలఁ దృప్తుఁ గావించినభూ
సురునింటిపూరి వసనో, పరిద విలెం దీని కంటెఁ బాపముగలదే. 224

గీ. మగుడ నీపూరిపుడకఁ దన్మందిరమునఁ, గూర్చి క్రమ్మఱ నిష్పాతకుండ నగుచు
వచ్చి సేవింతుఁ ద్వత్పాదవనరుహముల, భక్తినామీఁద గలదేనిఁ బనుపు మటన్న.

క. పావనుఁడఁగాక యేవిధి, సేవించెద నిన్ను నోవిశేషవిధిజ్ఞా
నావుడు యతి విస్మయసం, భావితుఁడై నానిఁ జూచి పలికెం బ్రీతిన్. 226

చ. కలుషములేదు పూరిపుడకన్ ధనమో కనకంబో చీరలో

వలదటుపోవ నిల్చి మన నాఁడు కృతాంజలియై కనుంగవం
జలజలనశ్రువుల్దొరుగ సన్నుతిఁజేసి యతీంద్రు నివ్విధిం
బలుకకు మెట్టులేనిఁ దృణభంగము నేఁ బట వైచివచ్చెదన్. 227

క. నావిని యతిబంధువుఁ బతి, పావనుఁగా వాని నెగడి పనిచె నతండున్
వేవేగ నరిగి తృణమొక, చో వైచి భజింపఁ బొంటిచొప్పున వచ్చెన్. 228

వ. ఇట్టి యుపాయాంతరంబుల సంత్యక్తపరప్రత్యయస్థితికి విప్రపత్తిగలుగకుండఁ గొండొకకాలంబు నమ్మఁదిరిగిన నెళవెఱుఁగక నేయిపూసినకత్తి యగుటఁ దెలియక గోముఖవ్యాఘ్రంబగుట విచారింపనేరక యత్తులువం బరిగ్రహించి వసుగర్భయగు కంథఁ జేతికిచ్చి యలుఁగులఁదిరుగుట గజంబును నుదువులఁ బెంచుట మారుతభుగ్దష్టుని భువనవికారంబగుట నగజారమణుని విలాసభాసమానంబగుట వెలయాలిని దుర్గాభైరవ పాలితం బగుట నవిముక్తస్థలంబును సదసం బగుట విద్యత్ప్రబంధంబును ననుకరించి యచ్చెరువుసేయు చెరువునకు ననుష్ఠానార్థియై చనియె నయ్యవసరంబున. 229

క. అప్పాపజాతి మస్కరి, యెప్పుడు దనచేతికిచ్చె నేమఱి మఱి వాఁ
డప్పుడపోయె ఘనంబుగఁ, గప్పినతిమి కంథనొండుగంత న్గొనుచున్. 230

క. బొంతగొని నిజనివాసము, పొంతకు నాషాఢభూతిపోవుట మదిలోఁ
జింతింపక నికటతటా, కాంతమునకుఁ జనిన యతని యతిఁగన్గొనఁగన్. 231

సీ. కరినఖశృంగాగ్రసంఘటితలోహపలాశఘళిఘళాత్కృతులనక్రములు బెదర
నన్యోన్యసంపాతహతి ప్రస్ఫాలభాగమున శోణితము ముబ్బి కరుడుగట్టఁ
జించికాంగారరోచిర్దురాధారేయ నేత్రాంతముల గొప్పనిప్పు లురుల
ఖురశిఖాటంకసంక్షుభితగోత్రోత్థిప్తదవనిరేణువుల నిరసలు గాఁగ

తే. గళవినిర్గతఘోరభూత్కారనినద, మమితకేదారచరపతంగములఁ దఱుమఁ
బరమగర్వోన్నతములురభ్రములు రెండు, చెఱువుకొమ్మునఁగయ్యంబు సేయుచుండె.

క. తిరుగక విఱుగక యాభీ, కరమేషము లాహవంబుఁ గావింపంగా
సరిరెంటినడుమనెత్తురు, దొరిగెం బ్రవహించె నిలిచె దొప్పలుగట్టెన్. 233

క. ఆనెత్తు రానుతమి నప్పో నొకజంబుకము నడుమఁజొచ్చి తదీయా
మానవిషాణశిఖాహతి, చే నెమ్ములువిఱిగి నొరిగి జీవమువిడిచెన్. 234

క. జంబుకము మేషయుద్ధము,నం బడుటయు నంగ నిది జనస్తుతవినుము
ల్లంబమర మఱియుఁ జెప్పెదఁ, బంబినతాత్పర్యమేరుపడ సన్న్యాసిన్. 235

వ. అట్లు స్వాపరాధంబున మేషవిషాణసంపాతసంఘాతంబునఁ గొలెమ్ములువిఱిగి కాల
మ్మునేసిన సృగాలమాత్రమ్మం జూచి యిట్టిది నావివేకంబు స్వప్నాద్యవస్థలయం

దును మోసపోవక రక్షించిన చిరకాల సంచితార్థంబు శిష్యునిచేతి కిచ్చి యిచ్చితి
శంకాయత్తంబై చిత్తంబు తత్తరించుచున్నయది యేమియగునో కో యనుచు
ననుష్ఠానంబునకుం బాసి యబ్బడుగుసన్న్యాసి నిప్పుఁ ద్రొక్కినక్రోఁతిపడువున మడిమ
లూఁదక మఠంబునకువచ్చి. 236

క. తానకమున నిజశిష్యుం, గానక యాషాఢభూతిగా రారా తే
రా నాసొమ్మనిచీరు, స్దీనత నోరెండ యతి యతివ్యథతోడన్. 237

చ. వెలవెలనై మఠాలయమువెల్వడుఁ జాపనిషక్తకంఠుఁడై
కెలఁకులఁజూచు భూమిసురగేహము లారయు నేఁడు భిక్షుకై
తెలతెలవేగి శిష్యుఁ డరుదేఁడుగదా కనుఁగొన్నఁ జెప్పరే
కలుషవిదూరులార పనిగల్దను నుస్సను నూర్చు హాయనున్. 238

క. తప్పేనుగార్యం బను నిఁక, నెప్పుడువీక్షింతునను నిఁకెక్కడనున్నాఁ
డెప్పుడు చేదొరికెం ధన, మప్పాడె కపటాత్ముఁ డరిగె నని తలయూఁచున్. 239

క. అడిగినవారిం గ్రమ్మఱ, నడుగంజనుఁ జనిన కడకు నతఁ డార్తుండై
గుడిగుండమనక పల్లియ, పడుసరనాకరయుఁ జెటిచి పఱచినశిష్యున్. 240

క. ఈగతి యతివేసటలే, కాగడపుంబోక శిష్యు నారసి యచ్చో
నేగుఱుతునుగానక యా,భోగతరశ్రాంతి నొక్క పురమున కరిగెన్. 241

ఉ. స్నానమొనర్ప దీమసముచాలక నొంకృతి నోరఁ బేర్కొనం
గానక భిక్షుకుండు దిరుగం జరణంబులురాక ద్రవ్యకం
థానుఁబాసి తే యనుచుఁ దాపభరంబున మేన్చలింప లో
లో నడలూన రేయుఁబగలు న్విలపించు నతండు దీనతన్. 242

ఉ. గాసిలి పట్టఁగోల్పడిన గాలిపశాచముపోలెఁ గష్టస
న్న్యాసి దురంతతాపమున నారటమందుచు నార్తితార్థకం
థాస్మృతివాడలం దిరుగుఁ దాంతదశంగృశియించి యుచ్చలో
వేసరి నిల్చె సంజకడ వేఱొక సాలియవానిలోఁగిటన్. 243

క. నిలిచి యతి కొంతచింతిం, బలవించుచుఁ బంచ తిన్నెపైఁ బడి యొక
ద్దలక్రిందంజేరిచికొని, వెలవెలనై నిద్రలేక వేఁగునుచుండెన్. 244

వ. అంత. 245

ఉ. వంగలిపోకఁ బౌనగృహవీథికి నెక్కటి నేఁతికాఁడు రో
వంగనుజూచి దూతిపిలువం దలవాకిటిఁ బాసి పల్లవా
లింగనకాంక్షఁ దన్మహిళ లేఁగనుమబ్బునఁ దన్కఁబెట్టి తు

మగ్నవన్యచరణలగ్నాందుబహుసింధుపాన్థోరసగ్రాహిబాడబంబు
ప్రేంఖదాతపశిఖిన్యూంఖంబుదశదిశావృతమృగతృష్ణాతివృష్టిఘనము
తే. చించికాఘలహృష్టఘృష్టిప్రచండ, ఖురచతుష్కక్షురతోత్కృష్ణపరిణతాజ్య
పాకసురభితగిరిదృషత్ప్రసవకంబు, కటికివేసవి దోఁచె నకాలమునను. 577

క. వెలిఁబొరలు నీటఁ గొండొని, నలఁగినయాఁతిగముడుఁగునకు నొండొకనాఁ
డలసేతరగతివలగొని, వలఁగొని యొకవేటకాఁడు వచ్చెం జొచ్చెన్. 578

క. చొచ్చి యగాధజలంబగు, టిచ్చం దలపోసి వేఁట కిది సమయముగా
దచ్చపుటెండలలోఁ బడి, వచ్చినతరువాతఁ దిరిగి వచ్చెద ననుచున్. 579

క. అన్నిచుఁ దరుగుటయు ను,ద్యన్నీతిధనుం డనాగతవిధాత సము
త్పన్నమతి యద్భవిష్యుల, సన్నిధికిం బోయి క్షేమసంబున బలికెన్. 580

క. తెలతెలవారఁగఁ దొరపు, నలఁగొని యొకవేఁటకాఁడు వచ్చెం జొచ్చెం
జల మివిరినఁ జుట్టలతో, నలయకసురి మరలివత్తు ననియె న్జనియెన్. 581

క. జలమివిరిన జాలరు లీ, తలమునకద నరసివచ్చెదరు వారిచర
ప్రళయమగు నిలువవల దీ,సెలవున నొండెడకుఁబోయి నిలుతమె బుద్ధిన్. 582

వ. అనువాక్యంబు లాకర్ణించి ప్రత్యుత్పన్నమతి యనాగతవిధాత కిట్లను సఖా దూ
రంబున నేమికార్యం బుత్పన్నం బైనప్పటికిఁ బోలినతెఱంగుఁ జూచికొందము

క. నెట్టన నొండొకకార్యము, పుట్టిన నెవ్వనికి నిశితబుద్ధిగలుగు నా
దిట్టం డాకార్యముఁ గొను, గుట్టున జారద్వయమున గొల్లెతవోలెన్. 584

క. నావిని యతిధీరతమే, ధావననిధి యల యనాగతవిధాత యనున్
భావనమానస యిదిచెప్పు,మా వినియెద ననిన నతని కతఁ డిట్లనియెన్. 585

చ. గొఱియలమంద యాఁబసులగుంపు కృషిక్రియమక్కువెల్ల దొ
డ్డిటికిటిపెళ్ళకంప బలియించిన లోఁగిలిముల్లు పెండెముల్
తలుపులగాడికోడి యల దామెనగాదెలఁ గొల్చుగల్గి యే
కొఱఁతయు లేకయుండు నొకగొల్లత యొండొకపట్టణంబునన్. 586

చ. వెన్నెలఁ బెట్టుఁగట్టుఁజలువ ల్చలువ ల్వెదచల్లుచన్నులన్
గిన్నులకల్కి పూయుసిరిగందము మందమరుత్కిశోరముల్
జున్నులు రేఁప మెచ్చుముదుమ న్గడుఁజొక్కపుఁ గ్రొవ్విరు ల్సరుల్
పన్నశిరోధివీథిఁ గనుపట్టు నయారె యొయారమేర్పడన్. 587

ఉ. పాయనిమందనుండి యడపాదడపా చనుదెంచుబోయనిన్
బోయినఁ జీరజిక్కుదఁట పుణ్యము లేదని మానసంబునం

దోహియ కహాోపరస్థలముఁ ద్రొక్కియుఁ జూచినయేని నాలుగేన్
గాయలు గాయ వచ్చెలువగర్భమునం దెటువంటిపాపమో. 588

క. కని పెంచని గొడ్రాలిది, గననొడలు న్దొడలు నడలు కటి నెన్నడుమున్
బనుదోయి మెఱుఁగుజిగిబిగి, యనయంబుం ద్రచ్చివేసిన ట్లొప్పెసఁగున్. 589

ఉ. వేవిన నిద్రమేలుకని వేఱొకబానకు నేర్పుతోడఁ బై
మోవడఁ బుచ్చి కవ్వమిడి మిట్టచనుంగవ రాయడింప మేఁ
దీవ నటింప నెన్నడుము దీలుపడం గటిగుల్కఁ గాచముల్
జోవలఁ బాడజల్లఁదరుచు న్వడిఁ దర్శిణిరజ్జుపాణియై. 590

చ. వెడవెడ వేడివెన్నొరయు వేనలి మస్తకసీమఁ దక్రపుం
గడవ యొకింత పయ్యెదకుఁ గాకరదోఁచును రోజమాజ్యపుం
బిడుతపికాంగనోక్తి వలపించు నెలుం గమురంగ వీటన
స్వడఁతుక చల్లవిల్చుఁ గనుపండువు జారుల కాచరింపుచున్. 591

క. అది దండపాలకుం డను, మొదలితలారి న్రహస్యమునఁ బిలుచున్వాఁ
డెద నెఱుఁగకుండ నొండొక, కొదనయు రాకుండ వానికోడుకు న్బిలుచున్ 592

క ఈలీలఁ దిరుగఁ నొండొక, కాల మరిగె నరుగుటయు నొకానొకనాఁడ
య్యాలగి గొల్లెతపట్టణ, పాంతనాథుని ఁ గూడి బహురతిగతులన్. 593

క. చొక్కనెడ దండపాలను, డక్కడి కేతెంచె నప్పు డాతనిఁ గని తా
స్రుక్కక తర్జణి తత్సుతు, నొక్కకుసూలమున దాఁచె నుచితం బెసఁగన్. 594

గీ దాఁచి యెదురువోయి దక్కినగతి నవ్వు, నివ్వటిల్ల వదననీరజమునఁ
గూర్చి చెట్టఁబట్టుకొనితెచ్చె లోపలికవదగారినారి యత్తలారి. 595

క. తెచ్చి కుసూలములోపలఁ, జొచ్చినబొజుఁగెగసి యెగసి చూడఁగ నపుడా
దిచ్చరి హెచ్చరికఁ బ్రియుం, గుచ్చిరతిక్రీడసొంపు గులుకుచు నుండెన్ 596

వ. ఆసమయంబున. 597

సీ. అట్టలత్తినప్రాఁత మెట్టులు కడుగుటంబటిచాటికలతోడి పరువకాళ్ళు
నడిప్రాఁత ముతకగోణము మించుదుగలకించు ములుగు త్తియులిమిడి మూలికలును
కొడిదిపూసల నంటుకొలిపిన మొంత్రాడు తండుడ్డుచెరంబులదాఁ దరియును
నొడిసెలపాలకావడి నుచ్చుప్రాఁతలగుది మూఁపుపై వ్రేలుగొర్వడంబు

తే తూఁతకొమ్ము చంకదోఁపినయొడమెట్టి తొర్లు గోవిధూళిధూసరితము
లైనకురులు నమర నాకస్మికంబుగా, మందనుండి యింటిమగఁడు వచ్చె. 598

క. వచ్చిన జడియక కౌఁగిటఁ, గ్రుచ్చిన యలదండపాలకున కనునపుడా

దిచ్చరికంజే కావడిఁ, దెచ్చెను బతిచేయు మొక్కతెఱఁ గెఱుఁగింతున్. 599

క. కసరెత్తి ముక్కుడుస్సిన, పసరమువలె రేఁగి పరుషభాషల నన్నున్
విసువక పగఁ జాటుచుఁ బో, మ్మసమున నన దండపాలుఁ డప్లొనరించెన్. 600

క. ఆరెకుఁ డట్లరుగుటయుఁ జ, కోరేక్షణఁ జూచి గోపకం దనుమహిమా
కారణ మేమీ తలసరి, కీరూపున నన్నె మెఱసి యిఁ దరుదేరన్ 601

క. వచ్చుటయుఁ గాక నోరికి, వచ్చిన యిట్లేపురేఁగి పదరుచుఁ జూడ్కిన్
గ్రచ్చెగయుఁ బోవుచున్నాఁ, డచ్చెరువిది తెలియఁ జెప్పవమ్మా నాకుడున్. 602

వ. తర్షణి మగని కిట్లనియె 603

క. వెడవెడ నార్చుచుఁ బెటికిన, పెడిసిము వలకేలఁ గ్రాలఁ బిఱబిఱ వెంటం
బడి యూపోతుయిడుచు గుద్దుం, గొడుకుం దెగఁ జూచె నెందుకో నే నెఱుఁగన్ 604

క. తలముదువడి మేన్వడకం, బతిపతి యగుతాల్మిఁ జావు పలుకెత్తి యహో
వెలుపున నిలుసొచ్చినఁ గడు, పతిసుతిఁ జేపెట్టి కుఁచినట్లయ్యెఁ బతీ. 605

వ. అట్లు భయాతురుండై యిలుసొచ్చి వచ్చిన నచ్చిలుతవాని నతిస్థూలం బగు కసూ
లంబునం దాఁచితి 606

క. అప్పుడు కన్నులనిప్పులు గుప్పతిలఁగఁ గెరలి పండ్లు గొఱుకుచు వాఁడా
చొప్పునవచ్చి నన్నిటఁ, దప్పక వీక్షించి ప్రల్లదంబునఁ బలికెన్. 607

క. ఎచ్చరిక నెత్తిఁగి వెంటన, వచ్చితి నీయిల్లుసొచ్చె నాఁడుంటున నేఁ
డిచ్చట లేఁ డెందరిగెన్, దిచ్చటి విక్కనముఁ జెప్పితే మేల్గాదే 608

క. అగియుదరవైచి నన్నడిగినవానిం జూచి మెత్తిగిలఁ బడకంటిన్
నిను నెవ్వఁ డెఱుఁగు నెటుపో, యిన వాఁడో నీకుమారు నెవ్వం డెఱుఁగున్. 609

క. తలవరివి గావె యూరం, గలకొంపలఁ జొచ్చి చూచి కనుగొందువు నీ
కులముద్ధరించుకొడుకుం, దలయెవ్వరిమీఁద నొతిగెదవు నీవనినన్. 610

వ. ఇప్పు డప్పురుషభాషణంబులం బలుకుచుం బోవుచున్నాఁ డనిగాదె వెలువరించిన.

క. నిరవధికరాహుముఖగ, హ్వరనిర్గతశీతభాను, డనఁ గట్టెదురన్
బురరక్షకసుతుఁ డుండన్, హరిణేక్షణ నెంతదానవని పతిపొగడెన్. 612

వ. కార్యం బుత్పన్నం బైనఁ దక్షిణివలెఁ బోలినతెఱంగుఁ జూచికొందమని ప్రత్యు
త్పన్నమతి పలికిన యద్భుతవిస్మయం బమ్మాట లాదరింపక యూరకుండ ననాగతవిధా
తయను నందు నిల్వ వెఱచి యల్పసలిలసరంబున నొండొకసరసిజకరంబునకుం
బోయె నాయెడ 613

సీ. కాలు మొసళ్ళాకట్టుమంగలు చరణాంగుళంబులఁ దాఁకుటుంగరములు
కదలేనివపగట్టి పడినపక్కలు చుట్టి చెక్కనమొఱ్ఱప్పు చిక్కములును

జుంగులల్లాడుగోఁచులు తండుగోలల వెట్టుకొల్పినమీలపుట్టికలును
బ్రతిదినాందోళికాభృతినల్పులై వెంద్రుకలు నిండి కాయలు గలభుజములు
గీ. చెవులవెలుములుకలుబ్రాత చెవులనాగు, పడిగెపోగులు మెలిగొన్నపచ్చడములు
నమరఁగుమిగూడి జాలరు లరుగుదెంచి, రలరుమొగములతోఁ బ్రాటివలలు గొనుచు.
ఉత్సాహ. వచ్చి తజ్జలస్థలం బవారణం గలంగి రాఁ
జొచ్చి జాలముల్విదుర్చుచోట యద్భవిష్యుఁడు
ల్కిచ్చలోనఁ గందళింపఁ నెంచుఁ జొత్తునంచుమేఁ
టిచ్చపాటునొంద నత్తఱిం జరించె నల్గడన్. 615
క. మున్నాఁడి యొడలు డాఁపక, యన్నిటను జచ్చి తేలినటువలెఁ బ్రత్యు
త్పన్నమతినీతిరతియుం, డెన్నిరుపమధీరతాపటిష్ఠుం డగుటన్. 616
క. జాలరులు దానిఁ జచ్చిన, వాలువగా నిశ్చయించి వలెననక సరి
తూ్కాలమునకుఁ ద్రోచి సము, ద్వేలగతిం దిక్కులంబు ప్రీలక్షలీలన్. 617
క. దుముకులు వైచుచు నాఁగూ, సమయంబుల జలములెత్తి చల్లుచు వలల
శ్రమలీలవైవ నయగుణ, విముఖుఁడు దొలుదొలుత యద్భవిష్యుఁడు చిక్కెన్.
క. చిక్కిన లగుడంబునఁ దల, వ్రక్కలుగా మోఁది చంపి వైచిరి మఱియుం
బెక్కుఝుషంబులఁ బట్టిరి, యక్కొలసము మాని తనిసిరది సందగుటన్. 619
సీ. కైవర్తకశ్రేణి కనుబ్రాకి యొకదొడ్డమనికి ప్రత్యుత్పన్నమతి వసించె
మతిబలంబున నకాగవిధాతయు నొండుకడకు బోవుటఁ జేటుఁ గానఁడయ్యె
విమతి గావున యద్భవిష్యుఁ డేమియు లేక పొలిసి జాలరులకు భుక్తియయ్యె
నతిమూర్ఖునకు నపాయము రాదె యిట్లని వరునకుఁ జెప్పి తొఁవలము లేమి
గీ నంబునిధితీరమునఁ గులాయం బమర్చి, కొని కలంగుచుఁ డిట్టిభి గ్రుడ్లఁ బెట్టి
పాదిగె నేమఱుపాటు లేకదనఁబదన, కలఁచపడకుండ నొండొంటిఁ గలపికొనుచు.
క. టిట్టిభకాహంకృతికిం, గట్టల్క జనించి కడలికడ నొండొకచోఁ
బెట్టినగ్రుడ్ల హరించెం, బిట్టఱి వీక్షించి టిట్టిభిక గాఢార్తిన్. 621
వ కనుఁగవ బాష్పవారి దొరుగ న్వగఁ గన్గొని దూరి యప్పు డి
ట్లనియెఁ బయోధితోఁ గటహ మావిహగంబున కెంతలేదు పౌ
ష్పునక చెనంటినై షిపదహంకృతినమ్మి ప్రసూతినైల ని
వ్వననిధితీరభూమినిదె నాఁడె హరించె మదండపండముల్. 622
క. జలనిధి యుత్కృష్టంబని, తెలిసియు నీ వలఁతి వగుటఁ దెలిసియు బ్రజ్ఞా
బలముఁ దుదఁ జిదిమి యకటా, వలవంతలఁగలిటి గౌరవము వీడ్కొంటిన్. 623

క. నీకతనఁ దనకు వాటిలె, నీకాఱియ యనుచుఁ జిత్త మెరియంగా శో
కాకులమతిఁ బతిదూఱిన, నాకంపక్రోశవిశదమై ఖగమణి యనెన్. 624

ఉ. ఇంతగురంతచింతదగునే నను నెవ్వనిఁగాఁ దలంచితో
యింతి మదీయశక్తి యసుదేవసుదేవదురాసదంబు నేఁ
డింతకుఁ జొచ్చి వారినిధి యేపున మ్రుచ్చిలిగొన్నగ్రుడ్ల గ్ర
క్కింతు భవద్ఘనార్తిఁ దొలఁగింతు హరింతు యశఃప్రశస్తిఁ బ్రియన్. 625

చ. అని నిజదార నూఱడిలునట్లుగఁ బల్కి వయోనయోమణు
ల్దనుఁ గనుగల్గి కొల్వఁ జని తత్పతగాగ్రణి గాంచె నుందఱ
ఘనబలఘాతిహేతిభయకంపసమాగతమేనకాసుతా
వనకరణప్రహృష్టహిమవన్నగముద్రుఁ బయస్సముద్రునిన్. 626

వ. కని తత్పారావారతీరంబున 627

సీ. తనతల్లి కెగ్గొనర్చినపాప రామాత కడుపునఁ గడిఁది చిచ్చిడినవాని
గజకచ్ఛపాహృతిగ్రాసచర్వణతృప్తి వెలుఁగొందు జాఠరానలమువాని
ముఖసరిద్విటమధ్యమున నసాధు నిషాదఘోరవాహిని నుంచుకొన్నవాని
లావు పెంపునఁ గులగ్రావపక్షచ్ఛేదినిశితాసివేఁడి మానిచినవాని

గీ. నెల్లజగములు దనలోన నిముడుకొనిన, నిశిచరారంభసంరోధినిజశిరోధి
దివ్యమణిబోలెఁ దాల్చి వర్తించువానిఁ, బరమకారుణపూర్ణు సుపర్ణుఁ గనియె 628

క. కని మ్రొక్కి నిలువ వినతా, తనితాసమ్మదవిధాయి వచ్చినకార్యం
బనుచరముఖ్యా నాతో, ననురాగం బొప్పఁ జెప్పుమా నా కనుడున్. 629

మ. పలికెం డిట్టిభ మో విహంగకులదీపా కోప మేపార న
జ్జలధిగ్రామణి నీకుఁ బంచనని నిచ్చల్ నే ప్రశంసింపఁగా
సిలుగుల్ నెసిగణింప కేత్తెఱ హరించె న్మత్ప్రియాండంబుల
గ్గలమే దేవర కన్న సాగర మెఱుంగం జెప్పఁడా లావునన్. 630

క. కాకున్న నింతగర్వం, బాకడలికి నెట్టుకలుగు ననిటిట్టిభము
త్తేకత వినిపించిన రో, షాకులితస్వాంతుఁడై ఖగాధిపుఁ డనియెన్. 631

క. ఏమేమీ నాసుభట, గ్రామణి నని నీవు పల్కఁగాఁ డిట్టిభకం
కాముగ్నుఁడు గా కబ్ధి, స్వామి మహామహిమ నిట్టివాఁ డయ్యెగదా. 632

ఉ. ధీరగరుత్సమీరణహతి న్సలిలంబులఁ జల్లి దృష్టదు
ష్టోరగకోటిజీవితము లూడ్చి తిమింగిలతద్గిలాదివా
శ్చారములం ఘనజ్జఠరజజ్వలనాగ్నులవేర్చి వార్ధిని
స్సారముఁ జేసి గ్రుడ్లు నొసంగుదుఁ ద్వద్వనితాంబపిండముల్. 633

క. కులిశాయుధభీషణమై, వెలసిన నాలావుఁ గనఁడొ వినఁడో నన్నుం
గొలిచినవాఁడని నిన్నుం, దెలియఁడొ సాగరుఁడు చూచితే తలక్రొవ్వెన్. 634

క. అనియలుక మొలకలెత్తి, వ్వనరాశి న్గాసి సేయువాఁడై వినతా
తనుతాపహర్త చనఁగాఁ, గనుసన్న న్మాన్చి దైత్యఘస్మరుఁ డనియెన్. 635

క. మామహిళాజనకుఁ డు మా, మమ దుల్లసితకేళిమందిర మాప్త
గ్రామణిమణి నీరాకరుఁ, డామేటిం జెఱుప నుచితమా నీకరుగన్. 636

క. పలుకులనె చక్కఁజేయం, గలఁగలుహాం బేలకడలి కడవాఁడా గో
డ్డలిగోరఁ బోవుదానికి, వలెనా కన లుడుకుసునిక వడి నమ్రుండై 637

క. ఉరగాంతకుఁ డనియె మహా, పురుషా నను గౌరవమునఁ బొందింపం దే
వరవుఁ దలఁపున్న మత్కం, ధర నెక్కి పయోధి కరుగుతడ వేమిటికిన్. 638

ఉ. కడుపునకా మహామహులఁ గాచుట గొల్చుట గౌరవంబునం
గడుఁబొడవై సుఖించుటకుఁగాక సముద్రునిచే లఘుత్వముం
బడసితి వ్యర్థమయ్యెఁ దలఁప న్దనజన్మము దేవ యెట్టిరె
క్కఁడు తనమేడలావు దనకు న్దలఁచుకొనంగ నోఁచితిన్. 639

మ. ఆడిరంగాడు సముద్రుఁ డిందిరకులాయ[illegible]ము వారించి తు
క్కఁడఁగం దేవర కెనుగానె తగులాయం బస్మదీయేప్సితం
బడుగం జెప్పితి సంఘటింపుము మదీయస్కంధసంవాసివై
వడి విచ్చేయుము ఖర్వనిర్వహణగర్వగ్రంధికి న్గంధికిన్. 640

క. అని విన్నవించి వినతా, తనయుఁడు నికటమున నిలువ దనుజారి కన
త్కనకగిరిహేళివోలెన్, ఘనతం దత్కంధర మెక్కె ఖచరులు మ్రొక్కన్. 641

వ. ఇట్లు గరుడారూఢుండై గగనంబున కుద్గమించి నిలింపులు గుంపులై కొలువ సుర
స్సద్మంబునం బద్మయొప్ప నప్పురంధాముం డేతెంచి 642

మహాస్రగ్ధర. కలితాంత్రిప్రీతిరీతిం గనియె బహుజలగ్రాహనిర్గ్రాహధాటీ
చలపాతోత్పాతమీనా చరితసితిమహాశ్చామగగ్రామపూజా
ఫలరేఖాపట్టగప్రం బలరిపునగరప్రాంతవిభ్రాంతగంగా
లలనాసంశ్లేషభంగాఘుకరనికరోల్లాసముగ్రు న్సముద్రున్ 643

క. కని కదియఁబోవు నయ్యన, వ్వనరాశి మహాపతంగవల్లభకంరా
సనవర్తి నాదిమూర్తిన్, ఘనకీర్తి హృతార్తితార్తిఁ గని ముద మొదవన్. 644

క. అకలంకరత్నములుగా, సుకలుగ జగదేకమోహినులు వాహినులు
తృకలీల వెంటరాఁగా, మకరారిం జేరె సంభ్రమంబున మ్రొక్కన్. 645

వ. మ్రొక్కి నిలువంబడి కరంబులు మోడ్చి యిట్లని స్తుతియించె. 646

దండకము. శ్రీపారిజాతాలయానర్తకీపూర్వరంగస్థలత్కౌస్తుభద్యోతముక్తామణీదామ
కస్తూరికాసౌరభోదారపాటీరచర్చోల్లసద్వక్ష, దేవాంబుజన్మాసనాఖిల నిర్గ్లాన
దానజ్వలద్దానవానేకపధ్వంసనాహార్యహర్యక్ష, ధాత్ర్యంబకాక స్స్వర్భక్ష్యభుగ్వై
శ్వానరార్క.క్షపాక్ష్ణోనిలాత్మేశ మౌళిస్ఫురత్పాదుకాధ్యాసి నిస్పృష్టసంసార
గంధప్రబోధప్రకాశార్యచేతస్సరోనిత్యసత్యాధినాథాపచిత్యుజ్జ్వల స్వర్ణదీమా
ర్మరందప్రభాభాసుర స్వర్ణమంజీర హంసస్వనత్పాదకంజాత, ధాత్రీప్రగారాధ
నాహం క్రియామర్షి దేవర్షభ స్పష్టనిర్దిష్ట దుష్టోపలాసార సంరోధిగోవర్ధన చ్ఛత్ర
నిర్భీక గోగోపసంజాత, గోపాంగనాపాంగకాంతిచ్ఛటాచంద్రికాధౌతసద్విభ్ర
మభ్రూలతా కల్పకల్హారనీకాశనేత్రస్ఫురచ్చంపకోల్లాసనాసారుణోష్ఠాలకాలం
కృత ప్రస్తకస్తూరికా బిందుసౌరభ్య విభ్రాజిరాజాస్య, తాపత్రయారాతి షడ్వ
ర్గపంచేంద్రియాశా మృషావాదసంసార దూరాదిమోపాస్య, వాచాలకేయూర
పారంపరీరమ్యసవ్యాగ్రమాపాణి సంస్పర్శనంబుల్మహాయోగయుగ్ధ్యాన సాంతస్స్థలీ
ఖేలనంబుల్సదానర్థిత ప్రాణిసంమోదముల్ఖేదవిచ్ఛేదముల్భక్తిముక్తిద్వికశ్రీ
దముల్దర్పత్రాసనిర్భేదముల్నీ మహాపాదముల్మౌళిఁ గీలింతు-భార్యాసుతభ్రాతృ
మిత్రప్రియప్రేష్య దృగ్భీషణగ్రాహ సందోహదుర్గాహ సంసారనీరాకరభ్రంశితా
లంబ సంతారకల్దుఃఖనిస్తారకల్లంబకారిస్ఫురత్కాంతహాహాకారకల్భూర్భువ
స్స్వస్త్రయీధారకల్రక్షితప్రాణిసంఘుల్భవజ్జంఘలర్చింతు, సౌందర్యలక్ష్మీవిహారా
లయద్వార్బహిర్లగ్నరంభాధరాజాతముల్దానవధ్వంస నారంభకేళీకళాన్వితముల్
గాంచనాచ్ఛాదనాచ్ఛాదితంబుల్సుభావాదితంబుల్మనోజ్ఞప్రభాచారువుల్
దావకీనోరువుల్గొల్తు, సంవర్తవేళావినిక్షిప్తవిశ్వప్రపంచస్థితిన్భాసురస్వాకృతి
చ్ఛిన్నమారాభిచార జ్వలత్కుండకాండాయతిన్నాభిశోభాసనాభిం ద్వదీయం
బ్రశంసింతు, నస్మత్సుతాక్రీడనాగారము గ్గౌస్తుభశ్రీపరిస్ఫారసందీప్తరాజన్మణీ
నీలభూభృత్తటీ తుల్యవిస్తారము న్సారకస్తూరికాసౌరభోదారమున్ హేమవస్త్రో
త్తరీయ ద్యుతిస్మేరము న్నాయకశ్రీమహావక్షము న్భూమి నీళాపరీరంభసంభావనాద
క్షము న్సంస్తుతింతు-న్సరోజాతిచక్రాసి కౌమోదకీధుర్యముల్దుష్టశిక్షావిశిష్టావనస్థై
ర్యముల్రాధికోరోజ మాద్యద్రథాంగద్వయీనీడముల్రత్నకేయూరసంపీడము
ల్దీననిర్భీతిదానక్రియాశస్తముల్త్వచ్చతుర్హస్తముల్ప్రస్తుతింతు, న్సుధాంశూద్గ
తజ్యోత్స్నికావిభ్రమభ్రాంతికృన్మందహాసద్యుతిశ్రీకమున్ గుందబృందప్రతి
స్పర్థిదంతాంకురోత్సేకమున్ జంపకాకారనాసామణీకుండలాలంకృత శ్రోత్రకం
దర్పసందర్పణభ్రాజిగండస్థలాన్వీతము న్నిర్ణిరుద్ధానుకంపామృతస్నిగ్ధచక్షుస్సరో

జాతము న్నీతిరోచిస్సఖంబు న్మఖంబుం ద్వదీయంబు వర్ణింతు, నభ్రంకష ప్రాంజన గ్రావ శృంగాగ్రజాగ్రన్మహోగ్రాంశు ధిక్కృన్మహారత్న కోటీరముం దుందిలేందిం దిరాఖర్వగర్వాతినిర్వాపణన్యగ్రమందారగుచ్ఛప్రగామోది కేశాళివిస్ఫారము న్రత్న రత్నాసరగ్రస్తము న్దావకశ్రీమహామస్తముం బ్రస్తుతింతు, న్జగన్నాథ యాలోలక ల్లోలమై తోలుమూలాయతశ్వభ్రమార్గంబునం బల్మి జిమ్మించి యొక్కుమ్మడిం గప్పు వేళోరుమద్వారపూరంబు వారంర్ఘుపాకార తన్వేదహృద్రాక్షను న్రోయ నీవాయ తాక్షేప మేపారగా దంష్ట్రికావైఖరిం జాపరీతి న్మహాసీరభాతిం బ్రకాశించువార్లే ఖభావిక్షమాధార రామత్రయప్రక్రియం దెల్పగా, హవ్యభుక్క్రివ్యభుక్కూట రక్షు ల్మదీయాజ్ఞనస్మన్మణు ల్స్నిగ్ధగాఁజేయవాతాశరజ్జుభ్రమ న్మందరగ్రావశాణం బువన్నం దదాధారభూతాశ్మరూపంబునం గచ్ఛపచ్ఛద్మత న్మన్మ నాలో బ్రవ ర్తింపవే, దేవ చక్షుర్భయోత్పాది తేజోహిరణ్యాక్షు సాక్షాత్కృతిప్రోధ నిర్ఘోష రోషానలోద్దామ రోమాగ్రటంకంబులం దారకావ్యక్త ముక్తాఫలంబు ల్దొలు లోవ్వవ ధావత్ఖురాంతర్గతగ్రావము ల్గజ్జలోదారలీల న్రొదాలింప ఘోణాగ్రసంకల్పిత శ్వభ్రమేకీభవన్మజ్జఁ బొక్కాటం గ్రుక్కగాఁబట్ట నాయామదంష్ట్రిసురంగంబు సర్వదిక్కుడ్యము ల్వ్రియ్యదీపించు నయ్యాదిఘోణిం బ్రశంసింతు యుష్మద్విష ద్దైత్యధారాధరస్రస్తని స్తంద్రవిస్రావస్రావార్వభృష్టికి న్మర్త్యకంఠీరవాఖ్యై రవారావము న్నోరిపరాగాయితప్రోక్షణాత్క్షిణదీప్త ల్ఛవద్ఘోరనాసాపుటీనిర్గతశ్వాసముల్గర్జలు న్మిం చులు న్నాడ్పులుంగా, సవక్షస్థలిన్ విశ్వదాస్థానిలీలన్ బలీంద్రేంద్రజాలైకదా నాంబుధారాప్లుతిం ద్వత్క్రశాతేజ మావామనాకారబీజం బహో దివ్యధాత్రీజతం బొంది యత్యద్భుతస్థూలపాదత్రయి న్విష్టపత్రీకముం గప్పవే, చండవేదండశుం డాసముద్దండ దోర్దండఖండేంగ విస్ఫారపారశ్వధక్రూరధారాహతా శేషరాజన్యగా త్ర స్రవద్రక్తరోదస్వినిం ద్వత్పదాంభోజసంభూతకున్మద్గృహాసీతకు న్సంభుజా టాటవీసంగళుం గంగకు న్నిత్యసాపత్న్యవాదంబు గల్పింపవే జామదగ్న్యుండవై, మైథిలీశుల్కరూపాత్మ బాణాసనదోహిగాధేయసంకల్పసంపాదనోత్సాహిని న్వా హిని న్వాంపు దెంపారఁగా నొంపనూహించుశంభున్మహారోషసంరంభుజ్యాకృష్ట నిర్భిన్నతత్కార్ముకోద్భూతకల్పాంతగర్జా సముజ్జృంభితధ్వానసంత్రాసయుక్తాగజా శ్లేషసంపత్తిచేఁ దేర్పవే రాము రాజాన్యసుత్రామశేషాయు తేషామిళల్లాంగలతోటి కోటీసముత్పాట నత్రాసితంజేసి మర్దాంతకాంతారసీపద్రుమధ్యక్షమాధావదుష్టాంశు జాతన్మణీబంధవైదూర్యనాళస్ఫుర ద్వారిజాతిం గలంగింపవే సీరివై, కంజసూతి ప్రసాదప్రభావంబునం గావరం బెత్తి ముల్లోకము ల్హల్లకల్లోలము న్సేయు పూర్వా

నవవ్రాతము న్ద్విజయానీతము న్భారిమాయాకరాన్వీతమున్ శౌర్యసంపీతముం జంప
నానామరశ్రేణి బాలింపనై లింప విద్విట్ప్రవస్థాంగనామానసంగంబు గావించి తల్ల
యిన సర్వజ్ఞతాభూతియు న్స్వారజిత్త్వంబు నిర్ధర్మరాజత్వముం బొందునే, ఘోర
రుడ్భీకరభ్రూకుటీమాత్రదూరీభవల్లోకముం ద్సర్వశుక్లోకమున్ శాశ్వతానేకమున్ శా
తధారాకఠోరక్షురప్రప్రతీకాశపాదాగ్రసంక్షుణ్ణముంజేసి గంధర్వవిఖ్యాతి దీపిం
పవే, విశ్వరూపా జగద్దీప నీమస్తకం బంతరిక్షంబు నీనేత్రము ల్సోమసూర్యాంశు
వుల్ దావకశ్రోత్రము ల్దిక్కు లుర్వీసురక్షత్రవిట్ఛూద్రజన్మస్థలంబు ల్భవదీ
యాస్యబాహూరుపాదాబ్జము ల్నీవు విష్ణుండ వంభోజగర్భుండవు న్నీవ నీవేకదా
శూలి వింద్రాదిగీర్వాణులు న్నీవ సర్గస్థితిచ్ఛేదనాదిక్రియ ల్నీవ నీకుక్షిలో నుండు
విశ్వంబు నీవిత్తు విస్తారము ల్నీ న్బ్రశంసింపఁగ వేదాగమంబు ల్త్రిలోకైకరక్షా
కరసన్నీరజాక్షా కృపాసాంద్రవీక్షా హృతస్వర్గిపక్షా పరబ్రహ్మమూర్తీ విధూతార్తి
తార్థీ మునిస్వాంతవర్తీ జగత్పూర్ణకీర్తీ విపత్కాలమిత్రా నతాంభోజమిత్రా సము
ద్యచ్చరిత్రా సురస్తోత్రపాత్రా నమస్తే నమస్తే నమస్తే నమః 6±7

క. అనిపొగడి మగుడమగుడ, న్వనరాశిపలాశిశాసివరచరణముల
న్దనశిరము మోపి వినయం, బున నిలిచి కరాంబుజములు మోడ్చి సభక్తిన్ 648

క విన్నవించె వేదవిద్యేయతాపకా, గపునకార్య మెద్దిగారవమున
నానతీవె యనిన నాపగావల్లభు, దిక్కుఁజూచి వాసుదేవుఁ డపుడు. 649

క. నారాకనుఁ బనివిను మో, నీరాకర వైనతేయునికి నీవెఱుఁగం
బోరానిభటుఁడు టిట్టిభుఁ, డీరస మిప్పక్షితోడ నెవ్వరి కమరున్. 650

క. చన దండపిండములఁ దె, మ్మనుడుఁ బ్రణామంబుఁజేసి యబ్ధి వెసం
గొనితెచ్చి యిచ్చెనాలో, వనరాశిం బాసి భక్తవత్సలుఁ డరిగెన్. 651

క. విమతుని లావరయక వై, రముఁ బూనినవాఁడు వారిరాశిక్రియఁ దై
న్యముఁ గాంచుననుచు శాత్రవ, దమనకుఁ డగుదమనకుం డతని కెఱిఁగించెన్.

వ. ఎఱిఁగించిన నప్పలుకు లాదరింపక సంజీవకుండు దమనకున కిట్లనియె. 653

క కలనికిఁ బింగళకుం డెటు, వలె నుండెఁగఁజోగు ననిన వాఁడురుదంష్ట్రల్
నెలవడినవదనముం బెడ, తలవాలమునుండ వానతిఁజేఁ బొమ్మనియెన్ 654

క. అని గుఱుతుఁజెప్పి యద్ది, క్కున నిలువక వచ్చి కరటకునిఁ గదిసి యుపా
యమనములను మిత్రభేదము, నొనరించితి ననుచు నాలిఁ ముబ్బుచుఁ జెప్పెన్ 655

క. అప్పుడు గగనమున మొగ, ల్గప్పి మహిం జఱచి విస గాడ్పులు లొప్పెం
గప్పలు వడిగం డ్లురిలెం, గుప్పలుగొన నోనవాన గురియం దొడఁగెన్. 656

వ. అయ్యవసరంబున. 657

ఉ. జేవురుమీసె బకన్గొనలఁ జిప్పిల నూర్పులవెంట నుజ్జ్వల
త్పావకకీలలోలిఁ గనుపట్టఁగఁ గొమ్ములు వంచి కానన
గ్రావములం బ్రతిధ్వనులు గ్రాల ఖణిల్లన ఱంకవైచి సం
జీవకుఁడాగ్రహం బడర సింహము పైఁబడియె న్మహోద్ధతిన్. 658

క. సంజీవకపింగళకుల, ఖంజపరాక్రమము లడరఁగాఁ గయ్యము సే
యం జొచ్చి రపుడు మహిభృ, త్కుంజరఫణిఘోణికూర్మకులపతు లదరన్. 659

క. తొలఁగకఁ కలఁగక వృషభం, గళకము లప్పాటఁ బోరఁగాఁ జిత్తమునం
గలఁగి వెలవెలని మొగమునఁ, దలఁ గదలిచి కరటకుండు దమనకుఁ బలికెన్. 660

క. అతిహీనమానసా నీ, కతమునఁ జేటయ్యె నేలికకు నీ వేదు
ర్గతి కేగెదవో యెఱుఁగ, న్మతిమంతుం డంద్రు నిన్ను మతు లేవియొకో. 661

సీ. సాంత్వనం బుచితంబు సాంత్వనత్యాగికిఁ బరమదుర్భరపరాభవముగలుగు
వరుసఁ దక్కటివి యెన్నిరిగాని సామంబు ముఖ్యంబు దక్కినమూఁడు బుద్ధిఁ
దలఁప సంఖ్యామాత్రఫలములు నూనె దీపమున నాతపమునఁ బ్రచురరత్న
దీప్తిఁ జీఁకటిపోలెఁ దీవ్రారితిమిరంబు సిద్ధసామజ్యోతిచేత విరియు

తే. నల్లుగావున నగ్రాహ్యమైన దండ, మధిపతికి గ్రాహ్యముగఁ జేసి యనియె నర్చి
తకట నీబుద్ధిగాల నీయభినయంబు, గూల నీనేర్పు నీతీర్పు నేలఁగలియ. 662

చ. శ్రవణయుగాంతరావరణచక్రము లగ్గలఁబట్టుఁ దోరపుం
జెవుడు కనీనికావసథసీమకు నుమ్మలికాడు దృష్టిపా
టవము దురుక్తి నాలుకను డాసినచుట్టము పారుషత్వపుం
దెవులున వైద్యసాధ్య మెదద్రివ్వక యెవ్వని నాశ్రయించినన్. 663

చ. తలుచొకయించుకేని పరిధానమిడం బతిలాభకార్యముల్
చెఱుచు నరాతిజాతి కెడసేయక వాకొను మర్మకర్మముల్
గుఱుచలఁ బట్టఁజూచు విభు కూర్చినచోటన కీడు సేయు మే
ల్మఱచునయాని రాజుఁ జెడు మంత్రివిపజ్జలరాశి ముంపఁడే. 664

చ కలహము నిత్యకృత్య మపకారము పెట్టనిసొమ్ము సత్యపుం
బలుకు జడం బకార్యవిధి ప్రజ్ఞ యనాదరణంబు సద్వ్రతం
బలుక కులాగతక్రియ యహంకృతి కీర్తి సుహృత్తిరస్క్రియా
బలము బలంబు నీతి కెడఁబాసి నిను బురుడించుమంత్రికిన్. 665

చ. వడిచెడియూఁగుపల్వొటికిఁ బైచినఁ గూరిరవిష్ఫుల్లతాన్నముం
గడుపునఁ జేరనీక మహిఁ గ్రక్కినగాడిన ముల్లువుచ్చినం

గడుసుఖ మిచ్చినట్లు కొలఁగాని యమాత్యునియోగిపెన్నన
ల్విడిచి సుఖించుభంగిఁ బృథివీపతి వీడ్కొని మేల్గొనందగున్. 666

వ. ఆత్మభూత్యర్థంబు రాజు వివిక్తుంగాఁజేసి యొక్కరుండవయుండం బ్రారంభించి నాఁడవు రాజు లాకీర్ణవిరాజులగుచెలుఁగవే సహాయసంపత్తిచేసియో యని నభియాతిజాతి విభీతిరీతిం జేట్పులుఁచుఁగాదె యని కినిసి పలికి మఱియుఁ గరట కుండు. 667

క. తనబ్రదుకుకొఱకుఁగా దుర్జనుఁడు నృపాలున కసేతిచాటు శతంబుల్
పనిఁబూని కలపుఁ బిమ్మటఁ, దనకీడెఱుకపడఁ బతికిఁ దాఁ బగతుఁడగున్ 668

గీ. పతికి నభివృద్ధి దనకు శోభనముసైన, బుద్ధి బోధించునాతఁడు వో సుమంత్రి
పతికిఁ జెట్టయ్యు దనకు నాపదయుఁ జేయు, బుద్ధి బోధించునాతఁడు వోకుమంత్రి.

క అతిరోషుండయి శాంత, స్థితికి మతిం గపటమూఁది చెలిమికి సుఖసం
గతుఁడై విద్యకుఁ బరుష, వ్రతుఁడయి యంగనకు నాసపడఁ జనదెందున్. 670

క. కడుఁదేజ మొసఁగి దయతో, నొడయఁడు దనఁ బెంపుఁజేయ నుబ్బిన భీతిణ్
నడచుట శోభనకారణ, మడఁకువ భూషణము గాదె యనుజీవులకున్. 671

వ. నీయనుష్ఠానంబున నీతంత్రియము నిట్టివాఁడని యూహింపంబడుచున్నాఁడు. 672

క. జనకాచార మవశ్యము, తనయుం బ్రాపించునవుట తిథ్యము గిరలో
ఘనకైతకకంటకములు, దనరం దత్ఫలకులంబు దాల్చుటలేదో. 673

క. ఇంగిత మెఱుఁగనినీకు న, యాంగము బోధింపఁ ద్రాస మయ్యెడు మును దు
స్సంగతి నూచి ముఖాఖ్యప, తంగము కపిచేతఁ బోవదాదురోత్పథన్. 674

క. నావిని దమనకుఁ డినసం, భావితుఁ గరటకునిఁ జూచి పలికెం జెప్పుమా
యావృత్తాంతం బన నయ, కోవిదుఁ డాయనకుఁ గరటకుం డిట్లనియెన్. 675

ఉ. అంతనితాంతశైత్యకరమై కరమొప్పువహించి మించుహే
మంతము సేవమానలసమానబకౌఘువిళక్షితాఖిలా
శాంత ముపాంతకాంతమిహికార్తజగజ్జనవర్ధితవ్యథా
కాంతము కృష్ణసారమదగంధనృపాలనిశాంత మెంతయున్. 676

సీ. స్వపనువిత్రాణనస్వపితవాసరముల కాయామమదవీయమై చనుటనో
హిరానుషక్తిఁ జెన్నారుతమ్ముల కతిశ్రాంతిగాఁ గిలదని చింతిలుటనో
తనరాక మునులోకమునకుఁ బాటిలినకీర్తి యనుక్షణం బణఁచుటకునో
సకలసస్యాభివృద్ధికి గభస్తిస్తోతృజీవనం బవనిపైఁ జిమ్ముటనో

తే. పగలురుచివాని యొకమూలఁబడి సమస్త, సత్త్రములఁ జేరి యాత్మతేజమున రేలు

వెలుఁగు శిఖియున్నకడ కేగవలసెననియొ, భానుఁడకాలమునమందభానుఁడయ్యె.

చ. సదవనవైభవంబు పరచక్రవధోద్యతనంబు నిస్తులా
భ్యుదయ మనూనదానవిధియుం బరిపూర్ణకళావిలాసనం
పదయును గల్గిరాజు గనుపట్టె ననంతపనప్రవిష్టుఁడై
యధిగత మూర్జితప్రసవరైయె కొమరొందె ధరిత్రి యెంతయున్. 678

మ. ప్రతిదగ్ధప్రష్టతిమస్సమగ్రరుచిమార్యావర్వణాఖర్వముల్
హితగంధామృతముక్తతర్షములు భూయిష్ఠస్వమర్త్యాళయన
వ్రతము ల్నిండె నఖండపాండురతుపారక్షీరపూరంబు లు
ద్ధతహేమంతగవాధిపోద్యమముచేత న్రాజగోజాలముల్. 679

క. అతిశీతలవిమలవిధూ, న్నతిపాదాక్రాంతిన్నరలోకారా
ధితగాక యునికి చిత్రము, ఖతిలాగతయతితుపారగంగ దగంగన్. 680

చ. ఒకత్రుటికాలమేనిఁ బనికొగ్గక మీఁదులు చూచుగుక్కిబం
ట్రకు మడిఁ జేనఁగల్పుల కోడంబడి ఘాసము లూడ్చుకూలికాం
డ్రకు నెడసేద్యపుంబనుల డస్సిపడుండఁదలంచు పెద్దయె
డ్లకుఁ గలిగించె దైర్ఘ్యవికలస్థితి వాసరసంస్తు లూఅటన్. 681

సీ. అహరాస్యజటిలనీహారధారాసారశైత్యాపనోదనోత్సాహమననొ
మలయశైలాగతానిలఖాద్యమాద్యదర్పాఖర్వగతిరేఖ వరయుటకునొ
బహుధర్మయుతసుతప్రణిపాతపూజనస్వీకారసంభ్రమోత్సేకముననొ
మందేహదేహసంబంధశోణత్రాణరాక్షసత్రాసదారంభముననొ

తే. మారుతప్రియుఁడాసి పటీరవనము, దాసి శమనుసముల్లాసిఁ జేసి పలవి
కాసి పుణ్యాతిడాసి రోసి వాసిఁ, దిమిరములశాసి పర్తించె దినకరుండు. 682

ఉ. తోషణకారణైకవసతు ల్వతు లత్తితి భగ్నసైంధవ
ద్వేషివిషాణగర్భరుచివిస్ఫురితాగురుదారుఖండసం
పేషితనూతినైణమదమిశ్రఘనస్తనదత్తనిర్భరా
శ్లేషణలీలఁ దేలుతురు శీతభయార్తులఁ బ్రాణనర్తలన్. 683

ఉ. భోగులు పుచ్చిరద్దినముల్ పృథువహ్నిహసంతికాదివ్య
ఘోగతులం గురంగమదసమ్మిళితప్రతినవ్యదివ్యకా
లాగురుచందనంబుల మహాయముళీభవదంశుకంబులన్
రాగరసైకవీటికల రాజముఖీపరిరంభణంబులన్. 684

సీ. నిర్ణిద్రదోషఘూర్ణితమనస్కులభంగి దృఢతరపంబుగనొంద్లు దీడితీడి
ధృతిబలోద్ధతవిరోధిత్రాసితులలీల వారక వడవడ వణఁకివణఁకి

మానినిస్పృన్నికటన స్త్ర్యనుజీవులో యనఁ జేసు ఁంసములపైఁ జేర్చిచేర్చి
యాభీరవల్లభు లన దలవాకిళ్ల నొకట యావులగుంపు లొత్తియొత్తి
తే. సాగుబడినాటికమ్మరజాతివోలెఁ, గటికినిష్ఠురుష్సలఁ గదిసి కదిసి
పొలిచి రప్పలంగు వోలినచలికతమున, నాకుంత నొంది రిలలోనిలోపలెల్ల. 685
క. శాకపురసకులఁ బోకలు, నాకులు గొంగళ్లు గుడుపుల బంబరములు కం
బీకాలాగురువు ల్గానఁ, గైకొనఁ బ్రియమయ్యె శీతకాలమునందున్. 686
ఉ. ఆరికకూడు పుచ్చవరు గావులవెన్నయు దోసగింజ సం
బారపుటాంబురంబు తనిమజ్జిగ మాకొనకంపుతోడఁ దం
డారగఁ బట్టి రడ్డిమడియ ల్చలుగోలలఁ బూని యొడ్లకో
పేరులు వైచి దున్నులకు నేగిరి కోంప్రభు నాలివచ్చినన్. 687
సీ. చవులవేడబములఁ జాలించి తలసారె దఱలక చప్పిళ్లు ద్రావువారు
కాయసంధుల మహోగ్రగ్రంథు లొదవినఁ బెట్టిదంబుగ నూలఁ బెట్టువారు
రసధూమ మఖిలగాత్రచ్ఛిద్రములఁ బ్రాఁక నుబ్బలఁ బడి మూల్గుచుండువారు
ఛీసిగ్గు గాదొకో చేరమాకాటది యన్నఁ జెల్లెలి వావి యనెడువారు
తే. కోరి వాలుమత్తైలంబుఁ గ్రోలువారు, కుముదపుంపటిశాకముల్ గోరువారు
నైరి యొకకొంద అచ్చలినలసవాఘ, వానిధాటివిహారంబుఁ బూనుటయును. 688
వ. ఇట్లాభీలంబైన చలికాలంబున 689
క. ఒకగహనంబున నొకచో, నొకశీతార్తప్లవంగయూథము ఖద్యో
తకముల శిఖియని కానఁగఁ, బకపకనూచిముఖాఖ్యపతిగము నగుచున్. 690
క. ప్రతికీశస్రుతిపుటసం, గతమై యటసహజవహ్నిగా దిది శీత
చ్యుతిదీన నగునె యని వి, శ్రుతిగాచారభటిఁ జెప్పచుఁ న్వదిరుగున్. 691
క. ఈరీతి పులుఁగు పిలుని, పేరఁట మేతెంచి చెవులు బీఱువడ న్వే
సారక చెప్పఁగ నందొక, హరిరుప్లవగంబు పండ్లుగొఱుకుచుఁ గినుకన్. 692
క. వడి నొడిసిపట్టికొని కూ, యిడ నుష్ఠి మెత్తియొమ్ము విరియఁగ శిలతో
నడిచిన నెపుడో ప్రాణము, విడచె న్పృథాబోధకుండు వీడఁడిగాఁడే. 693
వ. ఇట్టికథ యయ్యెడునని నినుబోధింప వెఱచెద నైనవినుము. 694
క. అలఘుతరప్రజ్ఞానన, బలములు నెవ్వఁడు గోత్రభరము వహించుం
బలుకులు వేయేలనిజం, బలయుత్తము నోఁచి కాంచినది తల్లిగదా. 695
గీ. దేశకాలాంతరంబులఁ దీలుపడని, బుద్ధిసౌందర్య మొక్కఁ డద్భుతముగాక
గాత్రసౌందర్య మేటికిఁ గలుగదనిన, దానివిని విన్నపై యుండె దమనకుండు.

ఉ. వేసటతోడిపల్కు తను వేపనభావము సోష్ణదీర్ఘని
శ్వాసము గద్గదస్వరము శంకితదృష్టిక పోలహస్తవి
న్యాసము వాడుదేఱువదనంబు స్వయంకృతఘోరకల్మష
త్రాసితతక్షణంబు లని తత్త్వవిధిజ్ఞులు సెప్పిరేర్పడన్. 697

క. ఈరీతి నుండ నేల మ,హీరమణున కిట్లొనర్ప నేల విచారాం
కూరముఁదుదఁ జిదిమితివని, రారాపున వాని నక్కరటకుఁడు మఱియున్. 698

క. అనయపరుం డగుమనుజుఁడు, తనవారిం జెఱిచి పిదపఁ దానుం జెడుఁబో
మును దుష్టబుద్ధిమాటలు, విని తజ్జనకుండు ధూమవేదనఁ దెగఁడే. 669

క. అని పలికిన నీతికథా, ధనుఁ గరటుఁ జూచి పలికె దమనకుఁడో స
ద్వినయార్ణవ యెట్టిది కథ, విననిష్టం బయ్యెఁ దెలుపవే నాకనుడున్. 700

క. కరటుఁ డిట్లను నొండొక, పురమున వర్తించుధర్మబుద్ధియనంగాఁ
బరఁగు నొక సెట్టివానికి, సరిచుట్టము దుష్టబుద్ధి సఖుఁడై తిరుగున్. 701

క. వానికి వానికి బ్రాణస, మానమహామైత్రి పెరుగు మఱి యందు మనీ
షానిధికి ధర్మబుద్ధికి, దీనారసహస్ర మొక్కెడఁ గననయ్యెన్. 702

క. కానంగనైన సొంపు ని,ధానమున మొలకలొత్త నవ్వార్త నుహ్యా
స్మానసమున డాఁపనేరక, పూని సఖుండనుచు దుష్టబుద్ధికిఁ జెప్పెన్. 703

ఉ. చెప్పిన నద్దురాత్మకుఁడు శింగఁడు బూరఁడునై సుహృత్తముం
దప్పక చూచి పూర్వసుకృతంబున గాంచినసొమ్ము నెమ్మిమై
నిప్పొలిమేర కేసరమహీరుహమూలమునందు డాఁచిపో
నొప్పునొగు ల్గనుంగొనరె యూరికయో కొనిపోవఁ జూచినన్. 704

గీ. ఇతరు లెఱుఁగ నేల యింటికిఁ గొనిపోవ, నేల నేల యరసి యెఱుఁగకుండఁ
గుండబాఁతి యింతకుండనె చనుటొప్పుఁ, దగ నొనర్పు మనల ధర్మబుద్ధి. 705

ఉ. వంచనసొమ్ముఁ బుచ్చుకొనువాఁడయి వీఁడిటులాడుచున్నవాఁ
డంచు మనంబునం దెలియ కాతని నిక్కము నెయ్యుఁగా విచా
రించి యొకొన్నిపుచ్చుకొని వృక్షసముజ్జ్వలమూలమందు న
క్కాంచినసొమ్ముఁ బాఁతి చెలికాఁడును దానును బోయి రిండ్లకున్. 706

ఉ. పోయి నిశీథమైనఁ జెడుపోకలకోమటి దుష్టబుద్ధి యా
రేయి గృహంబుఁ బాసి నగరీజనులం గనుబ్రామి యొంటి నా
చాయకు నేగి కూడుబలిఁ బల్లి పెకల్చి ధనంబుఁ గొంచుఁ బే
రాయపుసొంపునం జనియె నచ్ఛతరత్వర నొంటి నింటికిన్. 707

గీ. అతఁడు గొన్నిపూఁట లరిగిన నింటికిఁ, బోయి తాను ధర్మబుద్ధి కనియె
దిరుగఁ జూడఁగలదె దీనారభాండంబు. సురిగె నేమొ దిగులుపొచ్చె నాకు. 708

క. అని వెరవుఁజూపి పిలిచిన, ననుమానము పుట్టి తాను నాతఁడు జోడై
చని ధర్మబుద్ధి వినిహిత, ధనభాండముఁ గానఁడయ్యెఁ దరుమూలమునన్. 709

ఉ. కానక మానసంబు కలఁగంబడ నిట్లను ధర్మబుద్ధి య
య్యో నిను సద్మనుష్యుఁడని యొండొకచిత్తములేక నమ్మి యి
చ్చో నిడి చన్న నాధనముఁ జోరునిచాడ్పునఁ బుచ్చుకొంటి వి
స్సీ నరభోజనుండయినఁ జెట్టఁదలంచునె విశ్వసించినన్. 710

ఉ. పూని మదీయవిత్త మిటఁ బూడ్చుతతిం బరికింప నక్కటా
యేనును నీవకాని యొరులెవ్వరెఱుంగరు నీవుదక్క నో
పౌ నిజమాఁ బరుల్పొరయ రర్థముఁ గ్రమ్మఱఁ దెమ్ము దొంగవే
రానరుఁ బాలుపడ్డ నగరా నగరాలుమరాత్మ నావుడున్. 711

క. విని దుష్టబుద్ధి బుద్ధిం, గనలుచు నధర్మబుద్ధి గనుఁగొని పలికెం
గనినాఁడవొ వినినాఁడవొ, చను నే నాపైఁడి నెట్టినడి మోపంగన్. 712

క. నీసఖ్యమునఁ జరించిన, దోసము మోసమున నేఁడె తోఁచనకలిగెం
బోసరమొ నోరిక్రొవ్వో, చేపో యిట్లాడ నెవ్వరికి నీడేరున్. 713

ఉ. ముచ్చుదనంబు నాపయిన మోపక నుంచిన సెట్టిబిడ్డవే
పచ్చునె నీకుఁ గూడుఁగుడుసం గుఱుకామిని ప్రక్కఁబండెదే
క్రచ్చఱఁ గన్నసొమ్ము తిరుగంబడినం గొనకున్న నెట్టిరా
రచ్చకునంచు నీడ్చి పదరంబడి వాఁడు సుహృచ్ఛిఖామణిన్. 714

వ. ఇట్లు ధర్మబుద్ధి నీడ్చుకొని చని నగరంబడి ధర్మంబున కొప్పి పిన్నపెద్దలం గూడ బెట్టిన ధర్మవేదు లుభయవాదుల నాలోకించి తమకింపక అంతుసేయ కష్టంబుసా రక యిరువురు గలసి పలుకక యొకరొకరిపూర్వోత్తరంబులు తెలియునట్లుగా మీమీసుద్దు లుగ్గడింపుఁడనుటయు నంత ధర్మబుద్ధి కృతాంజలియై సభవారి కిట్లనియె 715

క. ఈతఁడు నాతోఁ జెలికాఁడై తిరుగం బెద్దకాల మరిగె న్వినుఁడీ
భూతలమున దీనారస, మేతవినిష్టంబభాండ మేఁ గనుఁగొంటిన్. 716

క. కనుఁగొని నిక్కము చెలికాఁ, డని పెద్దయు విశ్వసించి యీకథయే నీ
తనికి నతిగోపనంబుగ, వినిపించితి నావివిక్తి వీటింబోవన్. 717

క. వినిపించిన నాతఁడు నా, కనురక్తునిపగిది ననియె ననఘా యేత
ద్ధన మూరియొద్ద నేటికి, నినువేఁడెద నలయు నిచట నిక్షేపింపన్. 718

క. అని తరుమూలముఁ జూపిన, మనమున నద్దుష్టబుద్ధిమత మెఱుఁగక చె
ప్పినయట్ల సేసిపోయితి, తనయింటికి నీతఁ డంతఁ దానుంబోయెన్. 719

క. కతిపయదివసము లరుఁగఁగ, నితఁడు ననుం బిలిచి పలికె నిష్టసఖా నా
మతినతితాపము వొడమెడు, నతులగతిం జూడఁబోత మావిత్తంబున్. 720

క. అనపలికి నన్నుఁ దోడ్కొని, చని తరుమూలమునఁ జూడ సంగుప్తధనం
బునిచినచో లేదయ్యె, న్ననసెరియం జొచ్చె దైన్యమగ్నుఁడ నైతిన్. 721

క. సొమ్మున్నది నీయొద్దం, దెమ్మని నే నదరవైచితే నీతఁడు న
న్నమ్మాటలాడి త్రిప్పెం, దిమ్ములనం జొచ్చి యీడ్చితెచ్చె న్సభకున్. 722

వ. ఇంతియ యని ధర్మబుద్ధి యూరకుండె నప్పుడు దుష్టబుద్ధి ధర్మాసనస్థులకుఁ బ్రణా
మంబు లాచరించి యిట్లనియె. 723

చ. ఎనసినచెల్మి నుండుటయు నెక్కటిపాటఁ దదర్థభాండమున్
గనుటయు నాకుఁ జెప్పుటయుఁ గప్పుటయుం గల దంతనింట్లనుం
జనియొక నాలుగేనుదివసంబులు వోవఁగ వచ్చిచూడఁ బాఁ
తినకడ సొమ్ములేదు కనితీసికొన న్మహిజంబుసాక్షిగాన్. 724

క. నావిని ధర్మాధికృతుల్, వావాదంబేల యేనువారము లెడ మీ
రేవివరము నాఅవవాఁ, డావిస్మృతబుద్ధిఁ దెలుపుఁ దరుగుఁడు మగుడన్. 725

వ. అనువచనంబులు విని దుష్టబుద్ధి. 726

క. అవకాశ మేమిటికి వట్టివివాదం బింకనేమిటికి శుద్ధాత్ముం
డవు నితఁడని నన్నందఱు, దగఁ బొగడఁగ సాక్షిఁ దెలిపెదను మీపాలన్. 727

క. నా విని ధర్మమువారల్, నీ వెవ్వరి సాక్షిఁ దెలుపనేర్తువు చెప్పుమా
వావాద ముడిగె వన మా,యావాదనశాలి వారి కతఁ డిట్లనియెన్. 728

క. ఏపాదపమూలంబున, బాపురె దీనారపూర్ణభాండ మహాన్ని
క్షేపింపఁబడియెఁ దెలియఁగ, నాపాదపవిభుఁడు సాక్షి యగు మీ రడుగన్. 729

క. అనుదుష్టబుద్ధిపలుకులు, విని యచ్చెరుపాటు గదుర విద్వజ్జను లే
దినమునకు నేమిప్రొద్దునఁ, జనుదెమ్మనసెదము గాక సకలం బనుచున్. 730

క. చని రంతధర్మబుద్ధియుఁ, జనియె గృహంబునకు వానిజాడనె తోడ్తోఁ
జనియెఁ బ్రతివాది యాలో, దినకరుఁ డపరాబ్ధి వారిఁ దెప్పలఁదేలెన్. 731

గీ. సంజచివురించెఁ జీకట్లు సందడించెఁ, గలువ సొంపెక్కెఁ జక్రవాకములు స్రుక్కె
జలజములు వాడె దిశలఁ దేజంబు వీడె, ఘూకములు మించె విహగముల్గూండ్లుసేరె.

వ. అప్పుడు దుష్టబుద్ధి యేకాంతంబునఁ దనతండ్రి యడుగులంబడి యిట్లనియె. 733

ఉ. చోరుఁడె దుష్టబుద్ధి యతిశుద్ధుఁడుగా కని భూరుహంబుచేఁ
చౌరులు గుంపులై విన సభం బలికించెదనంటి వచ్చితిన్
జేరెడుమాటమాత్రమునఁ జేకొను మస్మదభీప్సితంపుదీ
నారసహస్ర మెప్పటికి నందనులాభముతండ్రిఁ బొందదే. 734

క. తరుకోటరమున నీ వొ,క్కరుఁడవ వసియింపు మొరులు కనుఁగొనకుండం
బరిషజ్జనము భయంబున, నరుదెంచినఁ బలుకుసభ్యుఁ డని నిన్నడుగన్. 735

వ. అనినం గొడుకునకుఁ దండ్రి యిట్లనియె. 736

క. చెడుబుద్ధి నీకుఁ బుట్టెం, జెడితివి నన్నుం గృతఘ్న చెఱిచెదె యూఁకో
నోపఁబాటుగాదు చిత్తము, వెడఁగులపని పంపుసేయువిటేఁడి గలఁడే. 737

క. మొదల నపాయం బెన్నట, పిదప నుపాయంబు లెక్కఁబెట్టుట తగునీ
చిద గొదలఁ గాదె ము న్నొక, మదికొక్కెర యనఁగ నుతుల ముంగిస కిచ్చెన్.

గీ. అనిన దుష్టబుద్ధి జనకు నిరీక్షించి, యిట్టు లనియె నకుల మేకతమున
బకపికార్భకముల భక్షించె బకవేమి, సేసె నంతఁవట్టుఁ జెప్పవలయు 739

వ. అని యడిగినఁ దండ్రి కొడుకున కిట్లనియె. 740

మ. కలదభ్రంకషభూజరాజిశుకపాకగ్రస్తశస్తస్వరు
త్వేదృగ్వాక్యము కూలముద్రుజర్ఝరీభంగాంగసంఘర్షజా
విలఘోషప్రతిఘోషితద్విరదవిద్విడ్జృంభ ముగ్రద్విపి
స్థలకృత్కీలదరీనికాయ మొకకాంతారంబు దుర్వారమై. 741

ఉ. ఆవిపినంబునం దొకమహామహిజంబున నగ్రశాఖపైఁ
దా వసియించి యొక్కబకదంపతి పిల్లలఁ జేయుఁ జేయు నా
శీవిష మాసమీపబిలసీమమున న్వసియించియుండి వా
పోవఁగ నన్నిటి న్మెసవిపోవు సమాసమ నివ్విధంబునన్. 742

క. ప్రతిసంవత్సరమును నీ,గతిఁబిల్లలఁ బాముపాలుగావించి మనో
గతి బకమిథునము పొగులుం, బ్రతికృతిఁ గానక యలంతఁ బగలు నేరిలున్. 743

వ. అట్లుండఁ గొండొకకాలంబునకుఁ దననాతికిఁ బ్రసూతిసమయం బగుటయు భుజగభయానకం బగుబకంబు తికమకంబై సంతతిసంభరణంబునకు విరోధిసంహారణంబునకు నుపాయంబుఁ గానక తానకంబుఁ బాసి ప్రియసఖుండు నాసజ్జయాభిముఖుండును నగుకర్తరీపాణినామకుళీరకుం జేరంబోయి కాయం బడచిపడ బుడిబుడికన్నీరు గ్రుక్కుచుఁ జిక్కుకొన్నకంఠంబునఁ దనకుఁ బాటిలినచేటుపాటు ప్రసంగించి శోకించి పుత్రత్రాణవిధేయం బగునుపాయంబుఁ జెప్పి యాశత్వారా

వారతీరంబుఁ జెప్పవై చేర్పుము నన్నీడేర్పుము నీవనికనికరం బొలయఁ బ్రార్థించిన బకంబునకుఁ గుళీరం బిట్లనియె. 744

క. భువనవిహారివి నవలా, ఘవమును లావును గొఱంతగా దెన్నటికిన్
దివిరిపడియింతు వనిమిష, నివహము నీయంతవాఁడు నెగు లెట్లొందెన్. 745

క. శోకార్తులకు సహాయము, లేకరిణిం దోఁచు ధైర్య మెవ్విధిఁగలుగున్
రాకడపోకడలకు జవ, మేకొమరున దొరకుఁ గడఁక లెటువలె నొదవున్. 746

క. ఐనను దీనికిఁ దగుతెఱఁ, గే నీకెఱిఁగింతుఁ జేయు మిది భవదీయ
స్థానతరునికటగతకా, దే నబిలంబునకు నకులదృఢబిలమునకున్. 747

క. ఎడత్రెవ్వకుండ మీలం, దడవైవుము వానినెల్ల భక్షింపుచు నె
వ్వడి నేఁగి ముంగిపాముం, బడలుపడం గఱచిచంపుఁ బగ నీ కణఁగున్. 748

క. చనుమని యాహారంబిడి, పనిచిన నప్పులుఁగు చనియెఁ బయనంబైత
ద్వనిత యొకకొన్నినాళ్ళకు, గొనబై యప్పోట గూఁట గ్రుడ్లంబెట్టెన్. 749

గీ. పెట్టి ముదిగుడ్లువడకుండఁ గట్టుగాచి, పొదుగుటయు నైరకొని కొన్నిపూఁటలకును
బికిలడింభంబు లాలోన బకవిభుండు, యెండ్రి చెప్పినగతి మీలనిండవైచె. 750

గీ. కవుచుగాలివాఁడఁ గవిఁ బాసి వెలుపడి, వరుసమీల దినుచు వచ్చివచ్చి
పాముజంపి పాదపముఁ బ్రాకి బకశిశు, ప్రకరభుక్తిఁ దనిసి నకుల మరిగె. 751

ఆ. ఒకఁడు సేయఁబోవ నొకఁడగు నీబుద్ధి, గూల నన్నుఁజెఱుపకుము దురాత్మ
చెడిన నీవ చెడుము చెప్పకు మీమాట, యర్థభాండ మొల్ల నన్యమొల్ల. 752

క. అని ముగియంబలికిన నా, ననమున దైన్యంబుదేఱ నందనుఁ డాసె
ట్టినకాళ్ళమీఁదఁబడి యిఁక, వినునావచనంబటంచు వేఁడుకొనంగన్. 753

తే. మోసపోవనివాఁడయ్యుఁ ముదుకఁడయ్యు, విధివశంబునఁ జెవివ్రేలవేసి సెట్టి
యర్థరాత్రంబునం దేగి యడగియుండె, గూబచందాన నలవృక్షకోటరమున 754

వ. అంతఁ గొంతప్రొద్దునకుం బద్మబాంధవుండు పూర్వపర్వతశిఖరసింహాసనం బెక్కినప్పుడు పిన్నపెద్ద లుభయవాదుల రావించి వృక్షసమీపంబునకు వచ్చి యర్చించి యయ్యిరువురిలోన వంచకుం డెవ్వఁడు చెప్పుమని ప్రాంజలులై నిలిచిన. 755

క. ఎలుగొందఁగఁ దరుకోటర, తలమున నగ్గుప్తబుద్ధితండ్రి మహాని
ర్మలధర్మబుద్ధి సుగుణో, జ్జ్వలు వంచకుఁ డనియె నెల్లవారు వినంగన్. 756

క. అందఱు నమ్మాటకు వెఱఁ, గందిరి యలదుష్టబుద్ధి యానందమునం
జెందినటియించెఁ బౌరుల, ముందరఁ గిరితాళగతులు మొరయ స్వరయన్ 757

ఆ. ధర్మబుద్ధి వగచి తేఁటయూఁచి తనలోన, ననియె నేఁడు సత్యమణఁగె ధర్మ
మడని వెల్లివిరిసె ననృతంబు చూచితే, నిర్నిమిత్త మిట్టినిందపుట్టె. 758

క. తరువులు సాక్షులు పలుకునె, నరుఁ డడిగిన మనుజభాషణంబుల నిదిపో
యరుదు పరామర్శింపం, గరము ప్రయత్నంబు తోడఁ గల దిందనుచున్. 759

క. ఆతఁ డఘునకోటరమున, నాకులములు వైచి యనలమంటించిన న
స్తోకతరకీలసంయుత, మై కీలలు ప్రబ్బికొనియె నక్కోటరమున్. 760

క. పొగ నుద్ధురపడి మంట, న్నగమునుగం గాలి యేడ్వఁగ నన్నగమున్
డిగనుఱికి దుష్టబుద్ధిం, బెగిలింపుచు బిడుగుపడుగు దేహము విడిచెన్. 761

వ. అప్పుడు రాజపురుషు లద్దుష్టబుద్ధి నిరీక్షించి. 762

సీ. చెల్లునె ల్లముల కీక్షింప నిచ్చినసొమ్ము మగుడ నీలేని కోమటి గులామ
చేనేత విశ్వసించినవారి వెచ్చసచ్చములఁ గిన్పఁబుచు వైజాతితోంప
తెగిగంటిలేని పోటుగ నొజ్జయద్దల గిద్దఁ బోడుచు వేగినబిగది
బూసంబు దరిపి నేర్పున నమ్మికొనుటకుఁ గరవుఁగోరెడు దోసకారిబుడుగ

తే. యప్పనెపమున నూఱాఱు లడిగి పుచ్చు, కొని నయంబునఁ దీర్పక కోఁకపోఁక
సరకు సప్పటు సరిచెప్పి యరగఱాచు, చెడగరపుఁడొక్కయోరోరి సెట్టికుక్క. 763

వ. అని తిట్టి సొమ్ము ధర్మబుద్ధి కిప్పించి దుష్టబుద్ధిం గొఱతఁబెట్టిరి దుష్టబుద్ధి యగు
వాఁడు తనవారినిం జెఱచి తానుం జెడు నిట్లు రాజునుం జెఱచి తరువాత నీవునుం
జేటునొందెద వనిపలికి కరటకుండు వెండియు. 764

చ. కడుఁ జెడుకార్యము ల్దమనకా మనకా ఘనమయ్యె నేఁడు నీ
నడవడిఁ జూచి నమ్మదగునా నినుఁ జిల్వకుఁ బాలుఁబోసి ముం
గడ నసియింపఁజేసి చిరకాలము పెంచిన మేలెఱుంగునే
కడఁగి బడల్పడం గఱచుఁగాక కృతఘ్నులె దుష్టమానసుల్. 765

క. తెలియనినరుఁ దెలుపఁగనగుఁ, దెలిసినమానవుని పలదు తెలుపఁగ మదిలోఁ
దెలిసియుఁ దెలియనికఱటికిఁ, గలితన మెఱిఁగింపఁ గమలగర్భునివశమే. 766

క. పతి కిట్లొనరించిన నీ, కితరులనం దృణకణంబు లెలుకలచే భ
క్షితమయ్యె నినుపత్రాసను, కత వినవే మున్ను దమనకా నీ వనుచున్. 767

క. దమనకుఁ బలికె నటకుఁడు, క్కమొగంబై యెట్లు నీతికోవిద యిది స
ర్వముఁ జెప్పుమనిన నక్కథ, యమలమతిం జెప్పఁదొణఁగె నతఁ డాతనికిన్. 768

చ. వినిచికవేరజాతటమున న్మహాసారపురంబునం గృత
ఘ్నునిచెలి మందభాగ్యుఁడను కోమటి యిత్తిలు విక్రయింపనుం
గొనఁ దిన లేమిఁ బూటికిని గోఁకకు నీదిరమై కృశింపుచుం
గనుఁగవఁ బ్రాణము ల్నిలిపి కాఱియ గాఁగ నతండు నిచ్చలున్. 769

ఉత్సాహ. కోరి క్రొక్కెఁ గ్రొత్తపెండ్లికూతుఁ గృష్ణఁ జూచి యో
వారిజాయతాక్షి భాగ్యవంతుఁ గాంతుఁ గాని వి
ద్యారణప్రవీణుఁ గాంచ కట్టిమత్సుతు ల్వనీ
చారులైరి చూడుమంచు సాధ్వికుంతి వల్కెడే. 770

వ. అని తలంచి. 771

క. అతఁ డొకనాఁడు ధనార్జన, మతిఁ జనుచుం గరినలోహమయాతులసుహృ దా
యతినమునఁ బెట్టితిరిగెం, గతిగలిగెదునను చుఁ దిరుగగలచోటెల్లన్. 772

చ. సరకులకేఁగి వేసరెఁ బసారముఁ బెట్టిన సెట్లఁ గూడి వే
సరె నడుగానఁ గానక యజస్రము గూలికిమూటమోసి వే
సరె మఱియుప్పఁ గూరయును సంగులగొందుల విల్చివిల్చి వే
సరె నొకత్రోవయు న్ఫలమొసంగదు సెట్టిన భాగ్య మెట్టిదో. 773

ఉ. అల్లన మందభాగ్యుఁ డగునాతఁడు వేవిధులం గృశించియున్
బల్లముపచ్చగాక పసివాడినమోమునఁ దా నివృత్తుఁడై
తెల్లముగా సుహృత్తతుల దెమ్మని వేఁడిన పంచనామతిం
గల్లలఁ బల్కె నాతఁ డెలుక ల్దినెఁ ద్రాసనియూసపెంపునన్. 774

క. ఆమాట కేకిరాటు, గ్రామణి దలయూఁచి యట్లగాకున్నసఖా
యీమాడ్కి నాకుఁ జెప్పుదువే వింగుల నపూర్వమిదిసుమీ యేమాయెన్. 775

క. అని వెగటుదోఁపనుండ, న్మనుపటివలెఁ దన్ని వేశమున వర్తిలుచున్
దనలోఁ రోయుచుఁ గతిపయ, దినములు క్రమియించి కలఁకదీఱినపిదపన్. 776

క. బడుగుంగోమటి తుకతుక, నుడుకుచుఁ దులదక్కె ననుచు నున్నాఁడోయి సీ
గుడిఁ ద్రిప్పినకపటాత్మునిఁ, దడయక గుట్టయినఁ ద్రిప్పెదం జేసేతన్. 777

క. అనితలఁచి యలకృతఘ్నుని, తనయునిచే నొక్కనాఁ డతఁడు నూనియను
న్నను కగునుసిరికపిండియు, జనవునఁ బట్టించుకొని ప్రజల్వీక్షింపన్. 778

క. స్నానవ్యాజంబునఁ జని, వాని నొకానొకసుహృన్నివాసంబున నా
లోనిడి క్రమ్మఱుటయుఁ జిం, తానతుఁడై వాని కాకృతఘ్నుండనియెన్. 779

శా. అయ్యల్ వచ్చెఁ గదయ్య నీపిఱుఁద రాఁడాయె న్మహాసాధ్వసం
బయ్యెం జెప్పఁగదయ్య నావు డతఁ డత్యార్తుంబలెం బల్కె నే
నయ్యేట న్సలిలంబులాడఁగఁ దటస్యస్తాంఘ్రిపి నాహూద్ధతం
బయ్యో నీసుతుఁ గ్రద్దదన్నుకొనిపోయెన్ భీతివాపోవఁగన్. 780

క. ఏను వితాకుఁడనై నీ, తో నీచెడువార్తఁ జెప్పుదుం గాకనుచు
న్వే నిలువక వచ్చితి నన, నానసుఁ డవ్వాడు నాతఁ డాతని కనియెన్. 781

ఆ. చేఁపజెల్లగాదు చిట్టెల్కయును గాదు, పిట్టగాదు కోడిపిల్లగాదు
కొట్టిజుట్టుఁబట్టుకొనిపోవఁ బసిబిడ్డ, లేవ నీలగ్రద్దలేవఁ జెప్పుమా. 782

క. వినసంగతిగాదు సుతుఁ, గొనితెచ్చిన నతఁడు గ్రద్దగొనిపోయిన బా
లునిఁ దేనగు మూషకములు, దినిపోయిన యినుపత్రాసుఁ జేబాగ్గైనన్. 783

క. ఇనుపతుల నెలుకదినఁగాఁ, గొనిపోవఁగరాదె గ్రద్దకు న్శిశు వయ్యు
త్తనయుని నీమాటలకుం, జెను వింతలె తెలియఁజెప్పుటికి నామాటల్. 784

క. అని మాటమాట సరిపుచ్చిన నంచకుఁ డెఱిఁగి యతనిచేతికిఁ దులని
చ్చె నతండును దాఁచినత, త్తనయుఁ గృతఘ్నునకు నప్పుడమ్మున నిచ్చెన్. 785

క. ఇదినీకు నిదర్శనముగఁ, గద నిముసని నష్టకాముగద యేమనిచె
ప్పెద వొప్పుగులుక నయగుణ, మనిలే వొట్టైన సత్యమైనన నీకున్. 786

ఉ. ఆదరమొప్ప నుత్తపరుఁడై మనువాఁ డుపదేశికిం దృఢా
హ్లాదము సంఘటించుఁ బరమాదరణశ్రవణంబు పెంపునన్
ధీదశలేమి నన్యదుపదేశ మృదూక్తిశతంబు లక్కటా
సూములువోలు నీచెవులుసోఁకిన నొచ్చుసహింపవుండుటన్. 787

క. ఘనగుణములఁ దనుగుణముల, జనుఁ డమరు న్సాధ్వసాధుసంపర్కముచే
వనజనపదపథిసం డగు, ననిలుఁడు పోలెన్ శుభాశుభామోదములన్. 788

వ. కార్యాకార్యవిచారంబు చాలనిగురునయినఁ బరిహరింపవలయునని పలుకుచు దమనకుం బరిహరించుకొని కరటకుండు రాజనికటంబున కరిగె దమనకుండును దోడన జనియె నంతఁ బింగళకుండు సంజీవకుం జంపి విన్ననైన మొగంబున దమనకు నాలోకించి. 789

చ. ఇలఁగలఁ డేని కేమిగడియింపఁగరాదు హితత్వసత్యవి
శ్వలగుణశాలి యైనభటసత్తము నొక్కనిఁ గూర్పరాదు గా
కలవున నిట్టిబంటు దెగటార్చె వృథా మతిలేక నీదురు
క్తులు విని చంపితి న్విగతదోషుని నష్టహానియభాషునిన్. 790

వ. అనినఁ బింగళకునకు దమనకుం డిట్లనియె. 791

ఉ. పంచకులం బడల్పఁజేచినైచుట సత్పురుషవ్రజంబు ర
క్షించుట విత్తమాశ్రితులఁ జేర్చుట భూప్రజపై దయాగుణం
బుంచుట రాజచిహ్నములువో యభిషేకముఁ బట్టబంధముం
గుంచెయు మంత్రతంత్రములగుప్తియు బంటికి లేకపోయెనే. 792

క. అరిమరణంబున కేలా, పరితాపము నొంద విరసభావముగఁ బోఁ
బరులేల యగ్రజునో, దరునైనను జంపుదురు మొదల్ రాజన్యుల్. 793

క. వైరముపుట్టినఁ బోరక, ఘోరులు నిర్జరులు రాక్షసులఁ జంపరె యా
వ్వారికి నిది వింతయె బ్రం, దారకులును వారు నన్నదమ్ములు గారే. 794

క. విరసించినచో రాజులు, దురమున నెవ్వారినైనఁ దునుముదు రలుకన్
గురు నగ్రజు ననుజు న్మో, హరమున వధియింపఁ డోటుహరిసుతుఁ డెరయన్ 795

చ. పరుషసముల్లసన్మధురభాషిణిహింసయఖండసత్కృపా
నిరతవసువ్యయవ్యసన నిత్యధనాగమకోపసుప్రసా
దరనయసత్యసత్యపరితాపదసౌఖ్యదవారకామినీ
స్ఫురణనసత్యదాప్తిఁ బొలుచు న్నృపనీతి యనేకరూపమై. 796

వ. అని యిట్లు దమనకుండు బోధించినఁ బశ్చాత్తాపంబు మాని మృగరాజు ప్రాజ్యరాజ్య
సుఖంబు లనుభవింపుచుండె 797

క. అని వినిపించినగురునిం, గనుఁగొని నృపపుత్త్రు లనిరి కమనీయగుణాం
బునిధీ రెండవతంత్రం, బనురక్తిం దేటపఱుపుమని యనుటయున్. 798

మ. ప్రతిబాధీకృతకామకామనుజభుక్పరిధ్వంసనారంభణ
వ్యతిషంగవ్రతసత్త్వసత్త్వరనరవ్యాపారపూర్ణీభవ
న్నుతసంకల్పవిశేషశేవరచితామ్నాయోక్తిపద్యస్తుతో
ద్గతరోమాంచవితానతానవభుజాధాటీభిషక్పుంగవా. 799

క. వనజభవతనయమేధా, వినుతవినీతైకదివ్యవృషభజగత్పా
వనపంచతత్త్వమయవి, ధ్వనలోచన సర్వభూతహితసంచారా 800

మాలిని. అవనలయకగాత్రా హారిముక్తిప్రదాత్రా
వివిధనిగమవేద్యా విశ్వసర్గోపపాద్యా
భవతిమిరపతంగా పర్వచంద్రోపమాంగా
హవిరశనబలిష్ఠా హార్యకల్పాజినిష్ఠా 801

గద్యము. ఇది శ్రీ వేంకటనాథకరుణాలబ్ధసరసపాహిత్యనిత్య కవితావిలాస సకలసుకవి
ప్రశంసాభాషణోల్లాస రాజమౌళిపాదారవిందపర్వశర్వరీరమణ నీతిశాస్త్రమార్గ పరి
శ్రమణధైర్యసర్వాయధికస్ఫీతనీహారపర్వతపర్వరాజకుమార నిస్సహాయప్రబంధ
నిర్మాణభోజభూదారసుధామధురభారతీసనాథ వేంకటనాథప్రణీతం బయినపంచ
తంత్రంబున మిత్రభేదం బనునది ప్రథమాశ్వాసము.

శ్రీ ర స్తు.

# ప ం చ తం త్ర ము.

## ద్వి తీ యా శ్వా స ము.



క. గౌరీవక్షస్తన
భాగాభిజ్ఞాననిశ్చలచపలాసం
భాగభ్రమవ్యపత్యాస
మాగమసురసింధురూపహరిహరనాథా 1

వ. దేవా సుహృల్లాభాభిధాన ద్వితీయతంత్ర మాకర్ణింపు మధీతనీతిశాస్త్రి మస్తం
డవిష్ణుశర్మండు సుదర్శనకుమారుల కిట్లనియె. 2

క. సాధించెఁ గార్యములు ధన, సాధనములు లేక సారసౌహార్దసమా
రాధనమున మున్నార్జిత, మేధాస్మృతిఁ గాకి కూర్మమృగమూషికముల్. 3

క. నా విని రాజకుమారకు, లావిప్రునిఁ జూచి పలికి రదియెట్లు నయ
శ్రీవిభవ తెలుపు మన వి, ద్యావారిధి వారికద్ధరామరుఁ డనియెన్. 4

క. శతమఖవనసఖవిటప, స్థితి మహిళారోప్యనగరిచేరువఁ గలద
ప్రతిమం బొక బూరుగు లఘు, పతనకుఁ డను కాకి దానిపై వర్తించున్. 5

సీ. వసుధ నెవ్వనిసదన్వయకర్త జేజేలతేనికిఁ గుల ముద్ధరించు కొడుకు
పితృకార్యములు సమర్పింతు రెవ్వానికి నాదిత్యరుద్రవస్వగ్రభుక్తిఁ
బొదలు నెవ్వనిగృహంబున మనోహరభారతీభారవహముఖద్విజకులంబు
పథికసంతతి కేరుపఱుచు నెవ్వనికంఠమిశ్రితారావంబు మేలుగీల్లు
తే. ప్రజ్ఞ పెంపున నెవ్వానిబలమునకును, బ్రహ్మకొడుకైన లెక్కఁ జెప్పంగఁజాలఁ
డతఁడు నగరోపకంఠచైత్రాగ్రవర్తి, పక్షిమాత్రుండె వాయసపరివృఢుండు. 6

క. ఆకాకి నాకపథమున, నేకాకిత మేఁతలాపె నీరము గముచుం
గీకామండల ముగుసర, యూకాననమునకుఁ బోవను న్నేఁడ నటమున్. 7

చ. వెడవెడఁ జంకఁ జిక్కమున వ్రేలెడుచద్దియు సందిలోహపుం
గడియము క్రూరదృష్టిగలకన్నులు నల్లనిమేను మూఁపునం

బడిసెము జొంజాఱుందల తపారము జేసురుబొట్టు మేఖలం
గొడవలి గల్గివచ్చె నొకక్రూరకిరాతుఁ డమంధరత్వరన్. 8

క. వచ్చిన వాయసపతి దన, యిచ్చ న్వెఱబొమ్మవంటియితఁ డెందులకై
యిచ్చటి కేతెంచెనొకో, యచ్చెరు వనుచుండ నద్దురాత్ముం డచటన్. 9

క పులుఁగుడిసెఁ బన్ని వల శా, డ్వలధరణిం బొందుపఱిచి ప్రస్పినకన్న
ల్గలపులఁగుడీమ మిడి యు, గ్గలపుఁదమి న్గాచియుండఁగా దైవగతిన్. 10

శా. చిత్రగ్రీవుఁ డనంగనొక్కవిహగశ్రేష్ఠుండు సత్కృత్యకృ
త్పత్త్రివ్రాతమువెంట గుంపుగొనిరాఁ బైఁబోవుచున్ శాద్వల
క్షేత్రస్థేమము దీమము న్గని నఖక్రీడాపరిత్యాగియై
ధాత్రి న్వ్రాలె ననాయ మధ్యమునఁ బత్త్రధ్వానము ల్భోరనన్. 11

క. పులుఁగులఁ బినుఁగు కిరాతుఁడు, వలఁదవులఁగఁ దిగిచి తగ్గ వగ్గెరపగ్గం
బలఘుతరకీలమున సం, వలనముఁ గావింపుచుండె వలసినభంగిన్. 12

వ అంతఁ బత్త్రిసుత్రాముం డనుజీవులఁ గేవలయత్నంబునం బిలిచి దుష్కర్మానుకూలంబున నిందఱ మిజ్జాలంబునం జిక్కితి మీయపాయంబున కొండొకయుపాయం బూహించితి యోగపద్యాభిమానంబున నిందఱ మిజ్జాలంబుం బత్త్రజాలంబునం బెట్టుకొని దూరం బరుగుద మప్పటికి నొకగతిలేకపోయెడునొటు నిర్వాలంబంబున లెం డనిచెప్పిన నొప్పుకొని యప్పులుఁగు లొక్కయూఁకున దెప్పరంబుగా నుప్పరంబున కెగసిన నున్మూలితకీలంబై జాలంబు వెంటరాఁగొని యాయుర్బలంబున గగనమార్గంబునం బఱచుచుండె. 13

క. ఆవిధి విధిమూఁడక వడిఁ, బోవఁగ నిది'య ననుభూతపూర్వం బనుచున్
ధావనమున వనమునఁబడుఁ, బో విహగములనుచు బోయ వోయె న్బిఱుఁదన్. 14

ఉ. ఎప్పుడు నేలవ్రాలు శ్రమ మేర్పడ జెక్కలునొచ్చి పెచ్చుగా
నప్పుడ చిక్కు నిప్పులుఁగు లన్నియు నా కని నిశ్చయించి వాఁ
డెప్పటిభంగి వెన్దగిలి యేఁగుచునుండ విహంగమంబు లా
చొప్పున జాల మెత్తుకొని చూడఁగఁజూడ నదృశ్యమాటయున్. 15

క. అతిలాఘవమున నలఘు, పతనకుఁడు న్దత్కపోతపతివెంబడిన
భ్రతలంబునఁబఱచెం బ, త్త్రతిర్యుంక్కృతు లఖిలదశలఁ గ్రుంకుకొనంగన్. 16

క. జాలగ్రాహివిహంగము, జాలముఁ బరికింపలేక జాఱనిజాలిం
దూలుచుఁ గ్రూరకిరాతుఁడు, వ్రీలినచరణములతో నివృత్తుండయ్యెన్. 17

క. ఆపదువున నలచిత్ర, గ్రీవుఁడు దూరంబు నరిగి భృత్యుల నటుసం

భావించి పలికె నోహో, ధావన మతియిచట వ్రాలుద మె యిందఱముఀ. 18

చ. సకలపథీనమానసుఁడు శాంతిసమగ్రుఁ డజాతశత్రుఁ డం
తకనిభపత్యుఁ డిష్టజనతాఘనతాపవిఘాతి సర్వమూ
షకములసార్వభౌముఁడు రసజ్ఞుఁడు ప్రాణముప్రాణ మాహిర
ణ్యకుఁ డిటనుండు నాయనదయామతి *నివ్వలవంతఁ బాపుదుఀ. 19

చ. నిలువుఁడు నా విహంగములు నిల్చె బిలస్థలభూమి నంత న
క్కలకల మాలకించి పొడకట్టి యనాయగుణాస్పృతాంగుఁ గే
వలసఖు జీవితప్రతిము వారితమత్సరు వీతరాగుని
ర్మలుఁ బతగాగ్రణిం గని హిరణ్యకుఁ డత్యధికప్రమోదుఁడై. 20

చ. పలికె సఖా సుఖుండవయపారగతుండవు దీర్ఘదర్శి వే
వలన విపత్తిఁజేల్పడనివాఁడవు నిత్యసుఖానుయాయి వి
య్యలమట నీవు నెట్లొదవెనయ్య విధాతకుఁ బాఁడిలేదుగా
వలయుఁ గదయ్య కర్మమెటువంటిది చూడఁగదయ్య యక్కటా. 21

క. అనిపగమహిరణ్యకుఁ గనుఁ, గొని చిత్రగ్రీవుఁడనియె గూర్మసఖా నా
యనుజీవు లలసి రేను, న్వనటం బెగ్గిలితి నణుకు వలఁ గేవలముఀ. 22

క. ఏవాసరమున నెగ్గెస, నేవయసున నెట్టికర్మ మేమఱఁ డెవ్వాఁ
డావాసరమున నద్దెస, నావయసున నట్టికర్మ మతఁడుభుజించుఀ. 23

క. కలకాలము లేదలమట, కలకాలము లేదు సుఖము కాయము మోసం
గలిగినవటు గొన్నాళ్ళు, యిల నిటు గొన్నాళ్లు దీనికేలా వగవఀ. 24

క. దైవికములైనపనులకు, వావిడుపఁ డవార్యధైర్యవంతుఁడు నయరే
ఖావిభవయొప్పుడటువలెఁ, గావలెనటు కాకపోదుగా యనితెలివిన్. 25

వ. అనుచిత్రగ్రీవునకు హిరణ్యకుం డిట్లనియె. 26

క. వేసటనొందక లఘువి, న్యాసంబున నూఱుయోజనము లరిగి సుఖ
గ్రాసమునఁ బొదలివత్తువు, యో సఖ నీకెట్లుమోస మొదవెం జెపుమా. 27

క. అక్కట యాపల్లతలం, జిక్కక నయపరణిఁ ద్రొక్కుచిత్రగ్రీవుం
డెక్కడ యీనిర్బంధన, మెక్కడఁ గాలముఁ దరింప నెవ్వరునలఁతుల్. 28

క. ఆపత్సంపద లలఁతులఁ, బ్రాపింపవు ఘనులగాని ప్రజ్ఞంబొడవై
చూపట్టుచంద్రుఁ †డారెం, డోపతగాధ్యక్ష కలవె యుడుసంహతికిఀ. 29

* వలవంత=వలవలనిబాధ. † ఆరెండు=ఆపత్సంపదలురెండు.

చ. ఉరువిహగవ్రజంబునకు*నోదముదంతికిముందుచిల్వకుం
బరుషతమోగ్రహగ్రహణబాధ సుధాంశున కంశుమాలికిం
బరమదరిద్రతాప్తి మతిమంతులకుం గలుగంగఁజేసె నె
వ్వరు సవ తిందునందు బలవంతుఁడుపో విధి నాకుఁజూడఁగాన్. 30

చ గగనమునంజరించుపతగంబు లగాధసముద్రవారిలోఁ
దగ విహరించుమీలు వలతంపములంబడిచచ్చునవ్విధిన్
దెగిచనస్థానశక్తిగలదే వల దేర్పడఁజింతదీనికై
తెగునెడ కెంతదవ్వయినఁ దెచ్చుగదావిధి దేహధారులన్. 31

కే. అని †యాఖులేఖపతినె, మ్మనమున నస్తోకశోకమగ్నుండై వ
చ్చిన మచ్చెలికానిఁ దగు, ల్కొనినయనారయాంశ మెచ్చి కొలుకుచునుండెన్.

వ. అప్పుడవార్యధుర్యతుహీనగ్రావుండగు చిత్రగ్రీవుండు సుహృల్లోకశరణ్యుండగు
హిరణ్యకునకిట్లనియె. 33

క. పరహితచరితా యస్మ, త్పరివృతబంధములఁబోలెఁ బరిచరబంధో
త్కర మేలనలుక విప్పుదు, పరివారములేనిభూమిపతి పూజ్యుండే. 34

క. సిరిగూడదు కూడినఁ బదు, గురుగలవాఁడడఁచిపుచ్చుకొనుఁ బరవీరుల్
సరకుగొనరు సిరిదక్కదు, పరివారములేనిరాజు బ్రతుకునె పోడవై. 35

వ. అనునప్పలుకుల కలరిహిరణ్యకుండు. 36

క. హితభృత్యులతో నేభూ, పతిక లఘుస్నేహసంవిభాగము లమరున్
బ్రతివాసర మతఁడుబలో, ద్ధతుఁడైపాలించుఁజువ్వె త్రైలోక్యంబున్. 37

క. పరివారముపట్టునవా,దరలేశములేనిభూమిపవుఁ డభివృద్ధిం
బొరయఁడు సంతతికెడసిన, పురుషునివంశంబు నష్టిఁబొందినభంగిన్. 38

చ అదననుజీవితంబిడమియారజమాడుట లేవినేరము
ల్వెదకుట నిచ్చలు న్పరిభవించుట కింకరసంకటంబునె
మ్మదికెనసహ్యవాట దయమానుట ‡పిమ్మటనాడికోల్మ హి
పదవికిఁ బాసి యొంటిపడుబాటులఁబొందు నృపాలుచిహ్నముల్. 39

ఆ సైన్యధాన్యబంధుసమృద్ధముల నెవ్వఁ, డొప్ప గలిగి పుడమి నుల్లసిల్లు
నతఁడుసూవె నీరజాధీశ వసుమతీ, హిమము నూఖుపదన కింటిమగఁడు. 40

క అనిపలికి జాలగుణము, ల్దునియలుగాఁజేసి ఖగపతులవెడలించెన్

---

* ఓదము=ఏన్గులుకూలుటకై మొఱుఁగుపుచ్చినగొయ్యి † ఆఖులేఖపతి=మూషకేంద్రుఁడు. ‡ పిమ్మటనాడికోలు=నున్నమొగముచాటైనతర్వాతమాషించుట.

జనితాద్భృతి మూషకపతి, ఘను లాప్తులనేగి శోర్వ్యఁగాళేపగదా. 41

శా. చిత్రగ్రీవునిఁ గౌఁగిలించుకొని తత్సేనందురంతాద్భృతి
చ్ఛత్రచ్ఛాయఁ బ్రహృష్టుఁజేసి యభివృద్ధి న్విందుఁగావించి యో
పత్రిగ్రామణి పోయిరమ్మనిన బాష్పచ్ఛన్ననక్రాంబుతో
నత్రాలం దనుఁదానవీడుకొనిపోయెం బక్షియాలోకపుల్. 42

క. జాలమునఁజిక్కి విహంగము, జాలము ద్రుంచి కొలుచుసాముల హేలా
లీలం గలపుటఁ గనుఁగొని, యాలఘుపతనకుఁడు మూషకాగ్రణికనియెన్. 43

సీ. పదగరాధిపభేద కరము నీకరము నీవిస్తరంబుబహుమార్గవిశ్రుతంబు
రాజశేఖరకుమారక మనోహరము నీచర్య నీసన్మానసం బుదాత్త
మవిరళసుగతిహేతువు నీవినీతత్వ మఖిలనీగుణముపోర్ణానుకూల
మతివృద్ధిమహిమఁ జెన్నారునీయాకార మిష్టకార్యముల నీయీగి నెరుగు
తే. నీకరుణ లక్ష్మివాటిల్లు నీరసజ్ఞ, సత్యభారతి నిలుచు నీసన్నిధాన
మభిమతార్థంబు లొసఁగు ని న్నభినుతింప, శక్యమే నాకు మూషకక్ష్మాకళత్ర. 44

క. ప్రతిలేనికరుణ నీడజ, పతిమృతికిం బాపి సుగతిఁబడసితి నీసం
గతిగాదే యీయాప, ల్లతలంటినమమ్ముబోటులకుఁ గృతకృత్యా. 45

క. భవదీయస్నేహము నా, కవిరళతేజోవిధాయి యగు నెయ్యుఁడవై
తపతపలేక మనీషిప్రవరా వర్తింపు మన హిరణ్యకుఁడనియెన్. 46

క. కయ్యమునకు నెయ్యమునకు, వియ్యమునకు సమతపలయు వేల్పోకఁడైనన్
గయ్యము గెలువదు నిలువదు, నెయ్యము వియ్యంబు పొసఁగ నేరదు మొదలన్.

క. బలహీనుఁడ నేను మహా, బలుఁడవు నీ వధముఁడెట్లు బలవంతునితోఁ
జెలిమియొనరించు జెపుమా, తలద్రివ్వక మ్రింగఁజూచెదవు వెలువడినన్. 48

క. అమరదునీపొత్తు వృథా, భ్రమఁబెట్టకు భోక్త వీవు భక్ష్యమ నే నం
చుమొగంబోడక పలికెనఁ, దగుకింపక మఱియు లఘుపతనకుఁ డనియెన్. 49

క. బలవంతము కాకము నే, బలహీనుఁడ నను మ విడిచిపలుకకు ప్రజ్ఞా
బలమున నధికుఁడ వదిగో, బలము శరీరస్థమైనబలము న్బలమే. 50

క. తలద్రివ్వక మ్రింగెద నని, పలికెద వేనట్టికస్వభావుఁడ నే నీ
కలిమిపరాప్తిదని, జ్వలనఘనాఘనము గాన సాధుచరిత్రా. 51

క. నీవంటియుత్తముఁడు సుఖ, జీవితుఁడై యున్న నేనుజిరజీవిఁ జామీ
నీవింకుఁగలుగఁ జిత్రగ్రీవుఁడు విపదంబునిధిఁ దరించెనొ లేదో. 52

చ. పరుషవిశృంఖలాలపనపంక్తుల సాధుమనంబు లీక్రియం
బొరయఁగఁజేయ నెవ్వరికిఁబోలదహో ఖచరాపగాపమో

ధరపరిరంభసంభ్రమణతత్పరతుంగతరంగహస్తను
స్తరశరధిం దృణాగ్రశిఖితప్తము గా నొనరింప నేర్చునే. 53

క. అనులఘుపతనకుపలుకులు, విని మూషకరాజు పలికె వెఱ్ఱీనీతో
ననుబోటి యల్పతినెయ్యం,బొనరించినఁ దగునె లేరొకో బలవంతుల్. 54

క. తనగుణముఁ బూరియున్నాఁ, డనిపగతుని నమ్మఁబోల దనిశము మదిలో
ననలశిఖాతప్తోదక, మనలు నిప్పఁ జింది చల్లనార్చునొ లేదో 55

క. పోలినదిపోలు నెవ్వోఁ, బోలని యదిపోల దంబుపూరంబునఁ బోఁ
జాలునె శకటములీల, న్నేలం బోతములు నేర్చునే యేఁగంగన్. 56

క. మోసంబూరకతలఁచుం, జేసినమేల్మఱచు విశ్వసించినఁ జెఱుచున్
నాసత్యము దుష్పురుషుం, డోసుగుణా వినుము చూడ ముత్తమునొకనిన్. 57

వ. సుజనశబ్దంబు పురాణోక్తంబు గావిచారించెద నిష్టుండయ్యును బహుసుకృతోపలా
లితుండయ్యును దుర్జనుం డంకగతక్రూరోరగంబు చందంబున భయంబుసంపాదించు
చుండునని వెండియు. 58

క. పరపురుషచింత యంతః, కరణంబునఁ గలిగి మగనిఁగరఁగింపతలో
దరికరణి హృదయకలుషము, మఱుఁగిడి ఖలుఁడాడుమధురమధురతరోక్తుల్. 59

క. నేరములొనరించిన నుప, కారము సేయుదుము నొవ్వఁగాఁ బల్కినఁగ్రై
వారము మఱవము మే మను, వారలమన్ ఖలు లకొండవైగుణ్యగారే. 60

ఉ. కావున నిన్నువంటిబలగర్వసమగ్రులతోడిమైత్రి దుః
ఖావహ మేఁగుమన్నఁ గరటాగ్రణి వహ్నిశిఖాయమూషకో
పావిలచిత్తుఁడై పలికె నద్దిర మాటలబోలిఁబన్న నే లా
విను లక్షుఁడయినపదల న్నిను మూషకలోకవల్లభా. 61

క. చెలిమికి దూరస్థుఁడవై, తొలఁగిచన న్మదిఁదలంచెదో యదినాతోఁ
గొలుపదు త్రవ్వెద ధరణీ, తలవివరముఁ ద్రవ్వినల్లఁ ద్రావెదఁ బిదపన్. 62

క. అనలమునఁ గాఁచిలోహము, నెనయించినకరణి వేఁడి నేనియుఁ బ్రజ్ఞా
ధనులఁ దమఁగూర్చికొమ్మను, మనువచనము వినవె యదియు మత మెవ్వరికిన్. 63

క. ఖలుఁడు సుఖభేద్యుఁడతిమృ, త్కలశగతి న్సజ్జనుండు గాఢాగ్నిశిఖా
కులతప్తకనకఘటముం, బలె దుర్భేద్యుండు చక్కఁబడఁడు మృదూక్తిన్. 64

తే. అట్లుగావున నిమవంటి యనఘచరితు, వెఱపుపనినైన సఖునిఁగావించుకొనఁగ
వలయు మేల్గోయ నావంటివాని కనిన, సమ్మదంబంది మూషకస్వామిపలికె. 65

క. అరివలెనుండుట క్రియలం, బరమాప్తస్ఫూర్తిఁ దేటపఱచుట యదివో
యరయ సుహృల్లక్షణమో, కరటా నీయందుఁ దోఁచెఁ గదయీసరణుల్. 66

క మతిశంకలేక మూషక, పతివివరమువెడలి కరటపరివృఢుతో న
ప్రతిమగుణరత్నఖనితో, గతకల్మషతోడఁ జెలిమికాఁడైయుండెన్. 67

వ. అట్లు కృతసఖ్యుండగు నయ్యుందురుముఖ్యుండు విందుఁబెట్టి వీడ్కొలిపిన దరి
ద్రునకు నిధానంబునంబోలె సుహృల్లాభంబుఁ గనుట కలరుచు సింహవ్యాఘ్ర
గజగవయ గండభేరుండ ప్రముఖజంతు వహనంబులగు గహనంబుల విశ్రమించి
సారంబులగు నస్యాహారంబులఁదెచ్చియిచ్చుచు నచ్చిక బుచ్చికలడరఁ గొంతకాలం
బుఁగడపి యొక్కనాఁడా వాయసపరివృఢుండు హిరణ్యకు డాయంబోయి
యిట్లనియె. 68

ఉ. పోయెదనిప్పుడన్యవనభూమికిఁ బ్రాణసఖా ప్రమోదసం
ధాయక నన్నుఁబంపు మనినన్విని ధైర్యము ప్రస్సి వెల్వెలం
బోయినమోముతోడ బలిభుక్ప్రవరుఁ బురుషార్థసంగ్రహో
పాయము సుహృద్విధేయుఁ గని పల్కెహిరణ్యకుఁ డార్తచిత్తుఁడై. 69

చ ఇటు నను డించి యేమికతమేఁగెదు చెప్పఁగదన్న యెట్టు లె
క్కటినిజరింతునన్న త్రుటికాలమునిన్నెడఁబాసియుండు దు
ర్ఘటముగదన్న నాకడనుగల్గినయీధృతియెందుఁబోయె ని
ప్పటికివిచిత్రమన్నవిధిసద్రవిరోధిగదన్న యెన్నఁగాన్. 70

చ అని కనుదోయిచెమ్మగిల నాకృతివిస్మృతినొంద మూర్ఛపో
యినబలిభుగ్విభుండు చలియించి గరుద్వ్యజనానిలంబునన్
దనువిడిఁదేర్చి యోపరమధార్మిక నిన్నెడఁబాసిపోవ నే
ర్తునె సకలార్థసిద్ధిఫలదుండని చూతుఁగదయ్య నిన్నిటన్. 71

ఉ నాపయనంబువిన్ము కరుణావరుణాలయ వృత్రశాత్రవా
సాపురకాననోర్వి నొకసారసరోవరమొప్పు నందు వి
ద్యాపరమేష్ఠి మంథరకుఁ డన్కమరాగ్రణి మత్సఖుండు సౌ
ఖ్యావహుఁ డుండు నప్పరహితార్థిఁ గనంగొని సాదరంబునన్. 72

ఉ. అతఁడు నాకుఁ బ్రీతివశుఁడై యొనరించు ననూనమీనమాం
సాతిభుజక్రియ న్బలసమగ్రుఁడనై చనుదెంతుఁ గ్రీష్మజన్
నీతిధురీణ వన్ననుపు నీ వనఁ గన్నులశోకబాష్పధా
రాతతు లుప్పతిల్లఁగ హిరణ్యకుఁ డాతనిఁజూచి యిట్లనున్. 73

చ. ఉడుగనియంత నింతతిడ వూఱటలేక పరాకువోలె మే
నడిచిపడంగనున్కిఁగహనాంతరచింత జనించె నంఘ్రులి
వ్వఁడకున నూదసైఁపవు కృపానిధి మందరకాంకు డుండు న
క్కడకరుదెంచు నింపడరఁగా ననుఁదోడ్కొనిపొమ్ము నావుడున్. 74

వ. లఘుపతనకుం డిట్లనియె. 75

ఉ. కాదన నేలవచ్చెదవుగాక సఖా వెఱఁ గావహిల్లె ని
ర్వేదము నీకు నెట్టులొదవె న్వివరింపుము నావు డాత్మ సం
పాదిహిరణ్యకుం డనియె బల్కుల కిందెడలేదు నెవ్వడిం
బోదము పోయియావ్విపినభూమి సమస్తముఁ దెల్పిచెప్పెదన్. 76

క. నావుడు దత్తప్రతిభాషావర్గం డగుచు వాయసస్వామి నయ
శ్రీవిభవు మూషకాగ్రణి, వే వాతనిఁ గొని దివిజమార్గమునన్. 77

వ. చని యగాధశరంబగుతత్సరోవరంబున కరిగితీరంబున హిరణ్యకు నునిచిలఘుపతన
కుం డుదారస్వరంబునం బిలుచుటయు సందర్శనకుతూహలంబునమందరకుండచ్చో
దమ్మికొలఁకు వెలువడి ప్రత్యుత్థానం బాచరించి వారిచరతిరసాహారంబున విముక్త
మార్గశ్రములంగావించిస్వాగతాదికార్యంబులు వేఱువేఱనడిగినలఘుపతనకుండుకమఠ
పరివృఢునాలోకించి. 78

చ. అనుదినదూరితాఖిలశరా కమఠా యితఁ డాఖుఁలేఖరా
జనుఁగునఖుం డుపాయసఖుఁ డాత్తహిరణ్యుఁడు పుణ్యుఁ డిట్టియి
మ్మనుపథవర్తి యంత నడుమం బొడమం బొడ వేఁది యిల్లువీ
డ్కొనియిటకేగుదెంచె నినుఁగూర్చి సుఖస్థితినుండు నాతఁడై. 79

క. క్షణభంగురములు కపట, ప్రణయంబులు ప్రాణపతనపర్యంతంబున్
గుణవికలత శశశృంగము, ప్రణుతమతీ యిట్టిసాధుపథగాములకున్. 80

క. చావునకుఁ బాపెఁ జిత్ర, గ్రీవుని నిటువంటిపుణ్యకృత్యము లాహా
యేవేళ నెన్నిసేసెనొ,కో వేడుక నీహిరణ్యకుఁడు మందరకా. 81

వ. అని లఘుపతనకుం డుత్కర్షించిన నాశ్చర్యధుర్యుండై కమఠపర్యుండుహిరణ్యకున
కిట్లనియె. 82

చ. వినుతనీచరిత్రములు వింటిఁ గృతార్థుఁడనైతి సత్యభా
షానిధి యోగిమానసముచాఁన్పన నిర్మలమైననీమహా
మానస మెట్లు దుఃఖగరిమ న్భజియించె విచిత్ర మివ్విధం
బే నిటవిందుఁ జెప్పఁగదవే యన నాయన కాతఁడిట్లనున్. 83

ఆ. అనఘ సఖ సఖుండ వగునీవు మామక, వ్యథనకథన మభినయంబు నొనర్చి
సరసతావకాశ్వసనభాషితంబుల, గాఢసమ్మదంబుఁ గాంతు నేను. 84

సీ విను మహిళారోప్యమను పట్టణము సర్వసౌభాగ్యవిలసనాస్పదము గలదు
దానిచెంగట వసుంధర బొక్కయొనరించుకొని యేను గౌరవంబున సుఖింతు
నటకుఁ జూడాకర్ణుఁ డనుతుచ్ఛసన్న్యాసి చనుదెంచి యేనుండు మునికిలోను
గాఁ గట్టిమఠము భిక్ష మనుదినము పాత్రఁ దశ వ్రేటఁబెట్టుచునుండుగాన

తే. నెట్టుకొని పెద్దగాలంబు నిలువవాసి, స్నానమొనరింపఁ డోంకారజపముఁ దడవఁ
డాంతముగఁజూడఁ డంత వేదాంతవిద్య, కడుపు కైలాస మనయ నక్కష్టయతికి. 85

క. భక్షింపఁ దగునలయా, భిక్షుఁడు వేసరక తిరిగి భిక్షించినయా
భిక్షము భక్షింపుగు ర, క్షాత్ముండై పేఁగోలన దలింపంగన్. 86

క ఆయతిహారిమిసఖుఁడు క, థాయుతశతవాసనుఁడు బృహస్ఫికనువాఁ
డాయెడ కేతెంచె నతొ, మ్నా యా యొక నాటిమిట్టమధ్యాహ్నమునన్. 87

క వచ్చిపురాణోక్తకథల్, నెచ్చెలి వినుచునుచు నాతనికి రసభారల్
పిచ్చిల వినిపింపఁగవిన, కచ్చెనఁటి పరాకుఁబోలె నలుమొగమయ్యెన్. 88

క. అగుటయుఁ గథకుండాయతి, మొగమారసి పలికె మాఱు మొగమైతివిదేమో
తగునే నీతో రసపు, ష్టిగ నేరుపు మెఱసి కథఁ జెప్పుచునుండన్. 89

శా. నాకీచందముఁ దెల్పిచెప్పు మని విన్నంబోయినం బల్కెఁ జూ
డాకర్ణుండు సఖాసుఖంబెఱుఁగ కింక్లం భిక్ష భిక్షించి యం
టాకుంబాత్రికఁ బెట్టి తెచ్చి మఠమధ్యం జేర్చితిం జూడు నేఁ
డీకొండాటపుటెల్క యుల్కెఱుఁగ కిక్లేపార భక్షించెడున్. 90

క నా కెక్కుడిదిపరాక, స్తోకంబగు పలుక నెలుకఁ జూచెద నని చూ
డాకర్ణుఁడు వల్క బృహ, స్ఫిక్ కాకరించి యుల్లసిల్లుచుఁ బలికెన్. 91

క. ఇక్కలఁగున నిమ్మూషిక, మెక్కటి మెలఁగుటకు వలయుహేతువుగలుగన్
బొక్కలుగము లై యుండుట నిక్కమనిత్తెంటినుండు నేయుండునవుల్. 92

క. ఒలువనితిలలను నొలిచిన, తిలలీ నబ్రాహ్మణవసుమతీసురభార్యా
తిలకమునం దొక కార్యము, తిలఘాతిని యూహ సేయదే పూర్వమునన్. 93

క. ఆకరిణి జాంగలంబున, నేకాకితఁ దిరుగు నెలుక యెడ నూహింతుం
గాక యొక కార్యమునఁ జూ, డాకర్ణుం డనియె నాదృఢప్రజ్ఞునకున్. 94

క. ఒలువనితిలలకు నొలిచిన, తిలలీనబ్రాహ్మణవసుమతీభార్యా
తిలకమునం దేకార్యముఁ, దిలఘాతిని నిశ్చయించె దెలుపవె యనుడున్. 95

వ. బృహస్పతికిట్లనియె. 96

క. తొలుత నొకానొకభూసుర, నిలయము కనుపతి యగుట నివసించితి న
న్నిలయపతిప్రొద్దుపొడుపునఁ, గులభామం బ్రీతిఁ బిలిచికొని యిట్లనియెన్. 97

క. బాలాబుధసంతర్పణ, కాలంబిది యదనుగూడఁ గావింపు శుచి
త్వాలంకృతవై చరువన, లీలావతి పతికిఁ గొలుచులే దనిచెప్పెన్. 98

క. చెప్పిన యజమానుఁడు సతిఁ, దప్పకవీక్షించి పలికెఁ దన్వీ గృహమం
దెప్పుడుఁ దఱుగదు కొలు చిట్లొప్పునె లేదని విలాసయుక్తులు నెరపన్. 99

క. సంచయముచితంబగు నతి, సంచయ మనుచితము సర్వజనులకు నెందున్
సంచయలోభంబున నొక, వంచక మారూఢచాపవశమునఁదెగదే. 100

క. నావినివాతెరపై నొఱ, పైవిన్నాణంపునగవు లుత్తమిల న్ల
జ్జావతి పతిఁగనుఁగొని తన, కావిధ మెఱిఁగింపు మనిన నతఁడిట్లనియెన్. 101

చ. అవహితబుద్ధి విను మధురాధర యామిషగంధదిక్షణం
బవునొకపక్షణంబున మృగాహృతిలిప్సుఁడు కూరికపుల్కస
ప్రవరుఁడు గ్రాలు నాతఁడు ప్రభాతమున న్మృగఘోషభీషణా
టవిచొఱఁబాఱి చేరి యచటం గిరిమేషము నేసె నెక్కటిన్. 102

క. వాలికతూపుల నేలం, గూలిన యలకొండగొఱియఁ గొని తనియక నా
శాలంపటుఁ డొక్కఁడయా, భీలాటవిలోన నిర్లపితుఁడై తిరుగన్. 103

వ. ముందర నొకశాద్వలంబున. 104

ఉ. క్రమ్మి చతుష్ఖురింజమురు కాలువలై ప్రవహింప రోమపుం
గుమ్మెలఁ బార్శ్వభూజములు గూకలు వ్రత్తులుగా ముఖంబునం
దుమ్ములు రేఁగ మైమఱచి దున్నుచు ముస్తలఁ దెల్చి కుంజముల్
గొమ్ములఁజిమ్ము దాని నొకఘోరవరాహముఁ గాంచియాత్మలోన్. 105

క కలముంబోలినయీరాయే, కలము మదాహారమునకుఁగా దైవంబీ
పాలముతిలఁజూపెఁ బొమ్మని, యలరుచు వాఁ డప్పుడమ్ము హాళిటి నేసెన్. 106

ఉ ఏసిన బద్ధరోషమున నేకల మేడ్తెఱఁదూఱిపుల్కసా
గ్రేసరు మోరనెత్తితలక్రిందుగఁ ద్రెళ్ళఁగవైచి వజ్రధా
రాసునిశాతదంష్ట్రికల వ్రచ్చి యచేతనుఁజేసి నొప్పిచే
గాసిలి ప్రాణముల్విడిచెఁ గన్నరమూసి ధరిత్రి నత్తఱిన్. 107

వ. ఇట్లున్న మృగనరశవంబుల గాలివాఱఁ గాలప్రేరితంబై దహ్యకనామధేయం
బొక్క జంబుకంబువచ్చి కొండగొఱియ రెండుదినంబులకు నేకలంబు పదినాళ్ళకు

నరుఁడు నాల్గువారంబులకుం జాలుఁ గృతసుకృతవిశేషంబునం గాక యీబహు
సంచయం బెవ్వరికినని తలంచి హాలాహలాభంబగు లోభంబునఁ గొంచెపుఁడునని
రొంచి యందేమిటిని గంటిపెట్టంజాలక పండ్లయూటలు ద్రావుచుఁ గొండొకతఱ
వుండి మంఘుదండియాఁకటిచిచ్చునకుం గాక యబ్బక్కనక్క ఱెక్కిడిన శరాస
నంబుంగదిసి నేఁడీఘనుః ప్రతిబంధంబునఁ బ్రొద్దుఁ బుచ్చెదం గాకయని నిశ్చయించి.

క. ఆపిసినినక్క చాపము, కోఁపంగిట నిఱికి నరముఁగొఱికినరభసం
బేపార మిడిసి మర్మని, రూపణ మొనరింప నక్క రోజుచుఁగూలెన్. 109

క. అతిసంచయపర మిదిపో, రతిబోటీ వలగు దాఁపురంబన నగుచుం
బతికి సతివలికె దాఁప, న్గతమేమీ ధాన్యమొగుఁగు గాలేదింటన్. 110

గీ. ఔలఁదిలలుగ్రమ్మితైలంబుఁదివి చిధూ, తాఘవిసరకృసరమాచరింతుఁ
బుడమివేలుపులకు నిడుమన్నవిప్ర, సింహుఁ డబల నట్లచేయుమనియె. 111

క. నూనియఁదివియుటకై తిల, లానీరజనయన దెచ్చునప్పుడొకకాల
జ్ఞానిహాలికాలయాగ్ర, స్థానంబునమండి చేట జడియన్రావలెన్. 112

క. ప్రేలినఁ జెల్లాచెదరై, నేలందిలలొలికె వంతనివ్వెఱఁగున న
న్నీలాలక చూచునెడన్, వాలింపకసతికిఁ బ్రాణవల్లభుఁడనియెన్. 113

క. కలికి యున్నట్టి యీక్రియ, నొలికినతిలలెత్తి దంపు మోర్పున నన న
క్కలకంఠి యట్లచేసె, న్నలి భీతిప్రీతులగ్గలములై పెరుఁగన్. 114

క. ఆమహీసురశరణమునకుఁ, గామందకి యనఁగ నొక్క గానులది సుతుల్
నేమింపఁ బేసగంపం, గోవులగతి నువ్వులమ్ముకొన నేతెంచెన్. 115

క. ఏతెంచినఁబలుకులసరి, నాతీ మడినువ్వులిత్తె నా కనివిప్ర
స్త్రీతిలకము మదలించిన నాతిలలది యంటువడియె ననియూహించెన్. 116

వ. అట్లు బుద్ధికౌశలంబున నేను నియ్యుత్తియ యొలుకవోట నిక్షేపంబుగలదని నిశ్చ
యించితినని చెప్పి ఫాలకుద్దాలంబుల నామెలంగు కలుఁగుఁ ద్రవ్వి నాచేతఁ జిరస్థా
పితంబగు ఘనంబుఁ బుచ్చుకొనియె నదిమొదలు పొదలుటలే కచ్చోటనాహారో
పపాదనంబునకుం గాక వితాకుండనై మందు నాకఁటికి మిడికినడఁకి యునికిపాసం
గక మఱియుమఱియు భిక్షాపాత్రంబునలగొనుచుండితి నట్టి నన్నుంగనుంగొని
చూడాకర్ణుం డుపాలంభ గంభీరభాషితంబుల నిట్లనియె. 117

క. అతిరక్షితార్థమంతయు, నితరులపాలయ్యెఁ జెడుగు లెలుకా నీయు
ద్ధతిమాన వింకనిదేమీ, గతవిభవులు సాధుతరులు గారా పుడమిన్. 118

తే. ధనముడిగిన నుడుగయుని, తనుజనితంబైనదుర్మదము నేఁడనుచున్

గన లునికిఁ గనికరంబఱి, తనపదిలినకోలచే నతఁడు ననువేసెన్. 119

క. వ్రేసినవేటు దురంత, త్రాసంబున నోహటించి తప్పించుకొనన్
రోసంబున నన్నాస, న్యాసి నిరీక్షించి మఱియు నపు డిట్లనియెన్. 120

క. అర్థమునఁ బండితుండగు, నర్థమునం బలసమగ్రుఁడగు నర్థమునన్
బార్థివుఁడగుఁ బుణ్యుండగు, నర్థమునను భువనపూజ్యుఁడగు నరుఁ డెందున్. 121

గీ. అన్వవాయవృద్ధు లాచారవృద్ధులు, శౌర్యవృద్ధు లిద్ధసత్యవృద్ధు
లాగమార్థవృద్ధు లఖిలార్థవృద్ధులు కొలుతురర్థవృద్ధుఁ గోరినేడి. 122

చ. వినఁ డని రోయ రంధుఁడనిపిఁగరు తుందిలుఁడంచు గేలిఁ గాఁ
గొనరు వికర్ణుఁడంచుఁ దగఁగూయరు వాముఁడంచుఁబోరు దు
ర్జనుఁడనిపాయ రజ్ఞుఁడని మానరు నిష్ఠురరోగపీడితుం
డనరు కునిష్ఠుడంచుఁ జెడనాడరు భోగిను లర్థవంతునిన్ 123

చ. కనకముఁ గూర్చి యెన్నఁబడుఁ గాదె సమస్తగుణంబు లర్థమె
వ్వనికి వసుంధరం గలుగు వాఁడె కులీనుఁడు వాఁడె పండితుం
డనఘుఁడు వాఁడె వాఁడె సకలార్థవిధిజ్ఞుఁడు వాఁడె వక్త వాఁ
డె నయపరుండు వాఁడె ప్రకటప్రియభాషణుఁడుం బ్రసిద్ధుఁడున్. 124

క. కలవానికిఁ జుట్టంబులు, గలరు హితుల్గలరు భటులు గల రఖిలంబున్
గలదు మఱి లేనియట్టిది, కలవానికి నీడుజోడు గలదా జగతిన్. 125

క. బిట్టడుగులేనియిల్లును, జుట్టంబులులేనిచోటు శూన్యము శూన్యం
బెట్టనుదుర్జనహృదయము, కట్టా మదిసర్వశూన్యకము లేమిసుమీ 126

క. ధనహీనుఁ డధముఁ డల్పుఁడు, ధనహీనుఁడె మూర్ఖుఁ డప్రధానుఁడు ధరను
ద్ధనహీనుఁడు తలపెట్టిన, పని గ్రీష్మసరిజ్జలంబు పగిది నడంగున్. 127

వ. అని భిక్షుకుండు నన్నధిక్షేపించిన రోసి నివాసత్యాగంబు చేసివచ్చితి నిన్నుం
డాసితి. 128

క. త్రిదశవిమానారోహణ, మొదవిన నవమానధరణి నుండుట కష్టం
బదియెఱిఁగి నితవిద్యా, విగుఁ డభిమానస్థలంబె నదకుం బుద్ధిన్. 129

క. యమయాతన యానమన, క్షమబోధ యిఁకెద్ది దాసిఁ గడచునవిద్యా
గమసౌఖ్యాగమవిత్తా, గమశూన్యంబైనచోటఁ గాదు వసింపన్. 130

క. పరదేశం బెఱుఁగక తను, గరగరిక న్విడువనుడుపఁ గలిగి నడుమఁ బే
దరికము వాటిలి తిరియ, న్దిరిగిన ననుబోఁటి కమరునే యింతైనన్. 131

ఆ. వెల్లివిరిసెఁ బెంటివిద్యలు మగవిద్య, లడుగుఁబట్టెఁ గ్రింద పడిరి బుధులు

హీనజాతిపురుషు లెచ్చిరి యాచింపఁ, బోవు టెల్లు నేఁటిభూమిపతుల. 132

శా. ఏల త్రుందనతాన లేమయినలేవే యంచు బోధించునే
నూలంబెట్టఁగఁ జాల మూర్ఖనృపుఁ డోహో నాసుహాసాహితీ
శూలంబు ల్సెవులాడసొమ్మసిలునో చ్చుంజచ్చుఁదత్కల్మషం
బేలా యంజలిచేసి మ్రొక్కెదఁ బదార్థేచ్ఛాపిశాచారికిన్ 133

క. అనుచితభాషణముఖరా, ననులమొ విటగాయకులమొ నటులమొ గాఢ
స్తనసంభరనమ్రవధూ, జనులమొ మమ్మేలు రాజు సంభావించున్. 134

ఉ. కోరినగద్యపద్యములు గూరిచి యిచ్చెద నంచి నేని ని
స్సారము లంచు విత్తమిడఁ జాలక కేరడమాడులోభి యా
నేరుపు నేర్పు గాదు తనునిందలఁ బెట్టు రసజ్ఞుఁ డైనయు
ర్వీరమణుండు గల్గినఁ గవిత్వము సర్వఫలంబు లీదొకో 135

చ. పలుకులశబ్దసర్గశతపత్త్రభవంబులు జాతపర్ణముల్
బలుకడుపుల్ నిరుక్తికలు ప్రజ్ఞ లనర్థకము ల్విచారముల్
వలవనిఠీవినవ్వఁ బెఱవారి నెఱుంగక తిట్టికూళ లే
పొలుపునఁ దప్పులొప్పులనఁ బోదురొకో సుకవిప్రబంధముల్. 136

చ. మెఱసి బహుప్రబంధతను మెచ్చుట మెచ్చుట యొచ్చమంటి పా
పతిమతి నెన్న నెన్నుట నిరక్షరకుక్షు లధీరశిక్షితుల్
కఱటులు భూరుహోశ్మపశుకల్పులు మత్కృతిఁ బ్రస్తుతించినం
గఱగఱఁ బోవనాడిననుగల్గవు నాకుదిమోదఖేదముల్. 137

క. పరిహాసకులకు నటులకుఁ, దరుణులకును లంజెదారితమ్ములకుం గా
పురుషులకు గాయకులకుం, బొరయింతురు రాజు లీరుపో సరసులకున్. 138

ఉ. ఏపున సంచితార్థము పరేంగితభావ మెఱింగి యీఁగి మే
లై పొగడొందనిచ్చి నెఱయన్మఱచున్నెఱదాత యిట్టిచో
దాపయిత్రు ప్రబోధపశతం బొరయుంచి యనంతరంబు సం
తాపమునొంగునాఁడనమదాత వృథాలపితంబులేటికిన్. 139

ఉ. దాతలు దాతలం డ్రదియుతథ్యము లోకమునందులేఁడు పో
దాత యతండుగల్గినను దాతృతదాసకలార్థులందు నే
లాతుఁ తూఁగసుండు నచలస్థితి నింతయెఱింగి యే నహో
దాతబుణాను బంధముగ దాయనిచిత్తమునందలంచెదన్. 140

క. ఆపలెత్తిమాటనెఱతురు, నెలవెల్లనె మాఱుపలుక వెఱతురు నెఱయం

జలియించిపఱతు రిన్నీ, కొలప గతులుగారె యాచకులు లోభులకున్. 141

క. చరణములుపడఁకు భీతిం, బరవశమౌనొడలు రాఱపడు నెలుఁ గాహా
మరణమున నెట్టి చిహ్నము, లరయ న్యాచకుఁడు దాల్చు నచ్చిహ్నములన్. 142

వ. అట్లగుటఁ జింతించి యాచకత్వంబునకుఁ జిత్తం బొడఁబాటుగాదు దారిద్ర్యంబునం బ్రజ్ఞాహైన్యంబు వాటిల్లుఁ బ్రజ్ఞారాహిత్యంబున సత్త్వక్షీణంబగు సత్త్వభ్రంశనంబునఁ దిరస్కృతివొడముఁ దిరస్కారణంబున నఖర్వనిర్వేదనం బావహిల్లు నిర్వేదనంబు శోకంబుదెచ్చు శోకంబుబుద్ధిబాధకంబగు బుద్ధినాశకారికావున నిర్ధనంబఖిలవిపదాస్పదంబని పలికి మఱియును. 143

చ. సముచితభాషణంబులకుఁజాతురిసాలక యున్న మాన ము
త్తము పరాంగనాగమనతత్పరుఁడయ్యెడు దానికంటె షం
డమతము మేలు చాడికినొడంబడియుండెడివృత్తికన్నఁ జా
వుమిగులలెస్స యాన్యవసువుల్గొనుకంటెను భిక్షమొప్పగున్ 144

క. దీపమునఁ దమము రోగ, వ్యాపృతిఁ జెలువంబుహారిహరాఖ్యానముచేఁ
బాపమువలె యాచ్ఞావిధి, వేపాయుగురుత్వ మతులవిజ్ఞాననిధీ 145

చ. అలఘులఘుత్వమూలమగునర్థిత కంజలిఁజేసి మ్రొక్కివీ
డ్కొలిపి నృపాలురంగొలిచి కూర్చెదభూరితరార్థమంచు నేఁ
దలఁచితి నేని పట్టియులఁతంబడుటొక్కటి నిర్దయుఖలు
ల్లులువలు హీనమర్త్యఫలదుల్నరవల్లభు లీరు విత్తముల్. 146

క. తానీఁగొఱమాలినుహో, హీననరాధిపుఁడు భాగ్యహీనుఁడను స్న
నానార్హ్యలసుభటులవి, ద్యానిధులన్ హాలహాలాభమగులోభమునన్. 147

వ. అట్లగుటరాజసంశ్రయంబును గూడదు ప్రేత్య భావంబు మృత్యుద్వారంబు రోగియుఁ జిరప్రవాసియుఁ బరాన్నభోక్తయుఁ బరగృహశాయియు జీవన్మృతులని చెప్పి హిరణ్యకుండువెండియు 148

క. సంతుష్టివర్మసంగు, ప్రాంతఃకరణునకువెఱచునతిశయతృష్ణా
కాంతములుభీతిచింతా, సంతాపక్లేశరుజలసంపాదింపన్. 149

ఉ. వీతఖలీనమై యతులవేగమున న్మానగాలు ద్రొక్కుతృ
ష్ణాతురగంబు నెక్కి యలసస్థితిఁజేట్పడకుండు వానికిం
జేతెడునేల మేరుగిరి సింధువువత్సపదంబు దూరతృ
ష్ణాతినుఁడైనవానికి నిజాంకగతార్థము దవ్వు పెద్దయున్ 150

క. ఆశాశృంఖలఁబడినా, నాశాభూములఁజరించునదిహో యసుఖ

శ్రీశోభితుఁడై నిలుచును, ధీశరధీ మనుజుఁడొక్కఁ డెసయరుదేరన్. 151

క. పొట్టకుఁగా బట్టకుఁగాఁ, జెట్టాడుం డెలివిలేనిజీవి నిజంబా
నొట్టపు శపథంబవుఁ దనుఁ, బుట్టించిన దేవుఁ డిమ్ముఁబో కన్నగతిన్. 152

క. కూరలు నారలు చాలవె, పూరింప న్నెప్పటిమేలు పొట్టకు మతి యే
నీరైనఁ గాలదే పన్నీరేటికి నింగిఁగీల్కొని నచిచ్చార్పన్. 153

ఉ. ఊరెయెలమంచము ల్పసిఁడియుప్పరగ ల్లపురంపువీడెము
ల్తాయనిపుట్టము ల్రుచిరమండనము ల్గడలేని క్రొవ్విరు
ల్గాయనగాయకమధురగానసుఖంబులు గన్నగాని నీ
పాయదె యన్నమాత్రమునఁ బస్తుమజీవికిఁ జక్రవర్తికిన్. 154

చ. ఒకరునికిమ్ముఁ నిచ్చి తిరియు న్మతియొక్క తతిన్మహోగ్రుఁడై
యొకరునిఁజంపుఁ జంపిపొలియు న్మతియొక్కనిచే బలాఢ్యుఁడై
యొకరునిఁద్రోయుఁ ద్రోచియుమతియొక్కనిచేఁబడు నేలు నొక్కనాం
డొకరునిఁగొల్చు మానవుఁ డొహో సుఖసంపత్తి విపత్తివృత్తులన్. 155

వ. అట్లగుట మేలుగీళ్ళు దేహధారులకును భోగ్యంబులుగదాయని తెలిసి మదింబదిలంబు సేసికొని యిచ్చటికివచ్చితివని హిరణ్యాక్షుండు చెప్పినసుందరకుండతని నాలోకించి

క. నెలవునఁ బూజ్యంబులు నఖ, ములు దంతంబులు శిరోజములు గాలగతిన్
నెల వెడలియుఁ బూజ్యంబులు, పులిగోళ్లును దంతిదంతములు చామరముల్. 157

క. హరి పెంపువడయుఁ గరి పెద్దరికముఁగను సజ్జనుండు తగఁబూజ్యుండౌ
నిరవెడలియునిరవెడలినఁ, గరటము చెడుఁ గుజనుఁ డీల్గుఁగడచనుమృగముల్. 158

క. అరివిదళన పరుషుండగు, పురుషుం డెచ్చోటనయినఁ బూజ్యుఁడు గాఁడే
ఖరనఖరవిజితకరిహరి, తిరముగ మృగరాజ్యమేలదే పెఱయడవిన్. 159

క. కదలనినీటికిమీనము లెదురెక్కు నెయుతెదిఁ బాఱు నేటికిఁ బోలెం
బదవి నిరుద్యోగులఁ బొం, దదు సోద్యోగులనకాని ధార్మికముఖ్యా 160

క. తనపుణ్యపాపవశమునఁ, దనివిసనన్వచ్చు సంపదలు నాపదలున్
ఘనతకు నుబ్బక హీనత, కనుతాపం బందకుండునది సుజనునకున్. 161

క. శకటగతచక్రభంగి, న్నొకరము లై తిరుగుచుండు సుఖదుఃఖము లిం
తకు ఖేద మంద నేటికి, నకటా సంతోషియుక్తుఁడగు టొప్పుఁగదా. 162

మ. సతతోత్సాహపరుం గ్రియానిపుణు భాస్వద్దీర్ఘసూత్రుం గృత
జ్ఞు తము న్సత్యధురంధరు న్మధురభాషావేది సౌహార్ద్రభా
సితు నారంభవిజృంభమాణుఁ గరుణాసింధు న్శుచి న్శాంతు ని

ర్జితకామ్యుం దనుఁడా పరించు సిరి నిర్నిద్రానురాగంబునన్. 163

క. అవివేకి నలసు విగత, వ్యసనసాయుఁ హీనుఁ గుటిలవర్తను వశముం
గువిచారుఁ జేర దిందిర, యువతీమణి వృద్ధుఁ గవయనొల్లనిభంగిన్. 164

క. సరసప్రజ్ఞోత్సాహ, స్ఫురితుఁడ వీ వెవటనున్నఁ బూజ్యుఁడవు గుణా
కర మూషకకులశేఖర, యురగేంద్రుఁడుఁ గానునిన్నునుత్కర్షింపన్. 165

చ. అడఁగని లేమిఁబొట్టుపొటులయ్యును ధీరుఁ డొకానొకప్పుడున్
విడిచిచరింపఁ డగ్రపదవిం గృపణుం డసమానసంపదం
బొడవయి యుండియుం దపయఁబోఁ డదియెవ్వరికేదిమార్గ మా
నడపడి వారొకింతవిడనాడరుగా గడతేరునంతయున్. 166

క. ధనవంతుఁడనని మదమున్, ధనహీనుఁడ నని విషణ్ణతం బొందవు హ
స్తనిహతహేలాకందుక, మనఁ బాతోత్పాతములు జనా వళికగుటన్. 167

సీ. జలధరచ్ఛాయయు ఖలమైత్రియును నవసస్యంబు యువతియు జవ్వనంబు
సంచితార్థంబు నీపత్కాలభోగ్యము ల్గావున వలవంత గా దొకింత
తెలు పంచగమికి నెమ్ములకుఁ జిత్రతి కీరములకుఁ బచ్చదనంబు గలిగె మొదల
నేవేల్పువలన నద్దేవదేవుఁడు పోషకుఁడు సువ్వే మదినేల కుతిలపడఁగ

తే. జనుఁడు బ్రతుకునూఱుసంవత్సరములంత, కాల మెవ్వఁడుండు మేలుతోడఁ
గొంతుకమునఁ గొంతకాలము చను మహా, కష్టవిష్టిఁ గొంత గాల మరుగు. 168

వ. దానతుల్యయాగువిధియును సంతోషసమం బగుసుఖంబును శీలసదృశం బగుభూ
షణంబును నారోగ్యసదృశం బగులాభంబును లేదుగదా యిమ్మాటలటుండె
మదీయ స్నేహంబునఁ గాలం బపనయింతురుగాక యని మందరకుండు హిరణ్యకు
నాశ్వాసింపుచుండె నప్పుడు లఘుపతనకుండు. 169

క. శమితశరాకమరాని, ర్గమనప్రమదంబు హృదయగతచింతాశ
ల్యముఁ బెఱికితివి నీమై, త్రిమనోజ్ఞవిశల్యకరణి ధృతినూహింపన్ 170

క. ధరలో సత్పురుషులు స, త్పురుషాపద్ధరణ హేతుభూతులుగారే
కరులుబ్బలిలోఁ జిక్కినఁ, గరులెత్తఁగఁ జాలియుండుఁ గాదే పుడమిన్. 171

క. నిధిసాధకుఁడు ఘనాంజన, విధినిక్షేపంబుఁ జూపువిధమున సుజనుం
డధికాపదార్తులకు హిత,మధురోక్తి నఖండసౌఖ్యమహిమ ఘటించున్. 172

మ. కఠినీరేరుహామర్థిపాఁపఁ బ్రతిపక్షుత్రస్తుఁడై వచ్చి కా
తరబుద్ధి న్మనుజుండు మాటుసొరనాస్థన్నిస్తులార్థాభయా
చరణప్రక్రియలం గృపామతిఁ దదాశాభంగివై ముఖ్యముం

బోరయం గోరనివాఁడవో పురుషుఁడొప్ప న్వానిఁ గీర్తింపగాన్. 173

చ. విటపసమృద్ధిభూజముల వీవలుల న్విరుల న్మరందలి
ట్వలివియత్ప్రదేశమునఁ బత్రులు వారిమరాళమండలం
బెటువలె నాశ్రయించి బలమివ్విధిఁ గైకొను నేము నిట్టిచో
నటువలె నిమ్ముఁజేరి ముదమందెద మోకమతాన్వయాగ్రణీ. 174

వ. అని లఘుపతనకుం డనేకప్రకారంబుల మందకు నుత్కర్షింపుచుండె నాసమయంబున. 175

మ. చకితస్వాంతముతో మహామహీరజశ్ఛన్నప్రతీకంబుతో
వికసద్వక్త్రముతో బృహద్గతిజనిర్వేదైకనిశ్వాసవీ
చికతో బహ్మైరపోకతో నటకుఁ గశ్చిల్లుబ్ధకక్షోభ మొం
డొకకాంతారమృగంబు భిన్నఖురటంకోదగ్ర మేతెంచినన్. 176

క. మాత్రినికిఁ బోఱియకు సలిల, స్థానమునకుఁ గాక విపరసజ్జలచరముల్
లో నెరసినభీతిఁ బసిం, దానిఁ గనుంగొని యథాయథముగాఁ బఱచెన్. 177

క. క్షితిజాతాగ్రస్థితలఘు,పతనకుఁ డద్దిక్కు లెల్లఁ బరికించి యుప
స్థితమైనది కించిద్భయ, మతిభయ మిచ్చోటఁ గలుగదని తెలుపుటయున్. 178

వ. హిరణ్యకమందరకులు బహిర్నిర్గమనం బొనర్చి వెగడుపడియున్నమృగంబు నూఱడించి యాతిథ్యం బొనరించి చిత్రాంగసుం డను నామం బిడి ముఖ్యసఖ్యంబున నలరించి భీతికి హేతువెద్ది చెప్పుమని యడిగిన నది మృగయువృత్తాంతంబనిచెప్పె నమ్మువ్వురు నతం డొక్కరుండునుంగూడ నలువురై యన్యోన్యస్నేహవ్యామోహంబునఁ గొంతకాలంబు గడపి రట నొక్కనాఁడు. 179

సీ. ఆహారవాంఛఁ జిత్రాంగదుం డడవికి బఱచి యొండొకవంటఁబడియపోట
నలఘుసధీవరయంత్రవాగురఁ దగుల్కొని భీతినంగము ల్వడఁక గోడు
గుడుచుచుఁ దోసిద్చుకొనుచు శుష్యద్గ్రీవమై వచ్చుచుండ వృత్తాగ్రవర్తి
యగుచు దూరమున వాయసనాథుఁ డచ్చోట్టఁ గని నుర్కి యెటువంటికష్ట మొదవె
తే. నేమిసేయుదు ననుచు నహీనవేగ, కలన ఱెక్కల పటపటాత్కార మెసఁగ
నరిగి బాష్పనిరుద్ధాక్షుఁ డగుచు సఖుని, గదిసి యిట్లనుఁ గంఠగాద్గద్య మడర.

మ. చెలికాఁడా పదబంధ మేపఁ నపచ్చెం జెప్పుమా నివ్వెఱం
గలఁగె న్మానసమన్న నాతఁడను బల్కుం దాల్మి లే దెంతయుం
దెలియం జెప్పెదఁ బిమ్మటం బ్రతుకఁగం జేఁ గ్రమ్మఱం బోయిని
ర్మలహృద్ధాము హిరణ్యకుం బిలిచి తెమ్మా బంధవిచ్ఛిత్తికిన్. 181

చ. మనుపఁ బ్రియంబయేనిఁ జనుమా యన నాయన నిశ్చరత్వరం
జని నిరవద్యహృద్యగుణసారు హిరణ్యకుఁ జేరి చూచితే
చెనఁటివిధాతచేత మనుఁ జిత్రమృగాగ్రణికృత్తివాగురా
భినిహతపాదుఁ డయ్యె నినుఁ బిల్వఁగ వచ్చితిఁ దత్ప్రశాంతికిన్ 182

క. నా విని మూషకపతి దుః, ఖావేశితహృదయుఁ డై సఖా పోవలయుం
బోవలయు జాగుసేయక, వేవేగ న్నన్నుఁ జేర్పవే నీవచటన్. 183

వ. అనిపలికిన నతని మృదురీతిం గఱచుకొని చని వాయసకులవల్లభుండు నికటంబున నిలిచిన రుగ్ణునకు నౌషధంబును దృషితున కుదకంబును క్షుధార్తునకు మృష్టాన్నంబును నగాధజలపతితునకు నోడయు దరిద్రునకు నిధానంబునుం బోలె నుపస్థితుం డైన హిరణ్యకుం జూచి చిత్రాంగుం డిట్లనియె. 184

క. మృగయుభయంబునఁ జీకా, కగుచున్నది మది భుజంగమాకృతిఁ గాలం
దగిలినయురిగొఱికి భయా, ర్తగచిత్రగ్రీవుఁ బోలెఁ దగు నను బ్రోవన్. 185

క. మందరకుండును గరటపు, రందరుఁడును నేను నీపరామర్శ న్నే
లందెదమని తలపోయుదు, మందెక్కడి శంక నీదయకుఁ బాత్రంబున్ 186

క. విచ్చలవిడి వాగురికుఁడు, వచ్చినఁ బ్రాణములమీఁద వచ్చును గృపనేఁ
డిచ్చెట్టు మాన్పు మనవుడు, నచ్చకితునిఁ జూచి మూషకాగ్రణి పలికెన్. 187

క. వెఱవకు వాగురదునియుం, గొఱుకుటయన నెంత నీతికోవిద నీకే
తెఱఁగున నీదుర్దశ దు, స్తరమై చనుదెంచెఁ దేటపడఁ జెప్పవనా. 188

క. అనిన నిది నేఁడ కాదట, మునుగలదన నతనిఁ జూచి మూషకరాజో
ఘనఘా నీతొలుతటికథ, విన నిష్టంబయ్యెఁ దెలుపవే నాకనుడున్. 189

ఉ. రంగదుపాయపారగుహిరణ్యకుఁ గన్గొని యొప్పఁ బల్కెఁ జి
త్రాంగదుఁ డిత్తెఱంగుఁ దెలియ న్వినుమా ఱవమాస మేగుచుం
డంగ సుగంధనై జననిడాఁపునఁ బర్వి యఖర్వపర్వత
ప్రాంగణశాద్వలస్థలులఁ బచ్చికమచ్చికమేయ నా యెడన్. 190

చ. నరనుతకీర్తి యౌత్కలమునాఁ గటకంబునఁ బుష్కరుండు భా
స్కరకులుఁ డొక్కనాఁడు తెలిగన్నులయన్నులొయారమొప్పఁ జా
మరము లిడంగ దివ్యమణిమంటపమధ్యమృగేంద్రపీఠి నం
బురుహవిరోధి పూర్వగిరిఁ బోలె రహిం గొలువుండె నుండఁగన్. 191

మ. తుటుమై యొక్కటఁ గూడి గూడెపుఁ గిరాతుల్ నను వీక్షింపఁగా
నటకాలోన హుటాహుటిం బఱచి పచ్చాకుల్ దృషత్సానము

ల్గిటిదంష్ట్రి ల్గరిదంతము ల్సవరము ల్తేగ ల్శివాశృంగముల్
చిటుకల్వైచిన ప్రేమోగువారుపములుం జేకానుక ల్సేయుదుర్. 192

గీ. ప్రొక్కి చేమోడ్చి మాయున్న చక్కఁ జెప్పి, యెన్ని హరులెన్ని యేనుగులెన్ని పంది
లెన్ని పులు లెన్ని మనుబిళ్లు లెన్ని లేళ్లు, చెప్పఁ జిత్రంబు వేఁట విచ్చేయుమటకు 193

సీ. కొసవెంట్రుకలబట్టి కూపెట్టసింగంబుఁ బట్టితేకున్న నీబంటఁగాను
నెలవారసిలసొమ్ముసిలవైచి శరభంబుఁ బరిమార్పకున్న నీబంటఁగాను
గండ్రగొడ్డటన వక్త్రంబుఁ జించి గజంబుఁ బడఁద్రొక్కకున్న నీబంటఁగాను
గండభేరుండపక్షుల నెత్తుట భూతబలిఁ జల్లకున్న నీబంటఁగాను

తే. గబ్బిబెబ్బులిడాకాల ద్రొబ్బి విరియఁ, బ్రామి రూపార్పకున్న నీబంటగాను
లాచిగవిఁ జొచ్చి యచ్ఛభల్లములగముల, బడలువాపకయున్న నీబంటఁగాను. 194

వ. అని మృగారాతు లక్కిరాతులు పంతంబులు పలికి మృగయావినోదంబునకు
మోదం బాపాదించిన నం బుష్కరుం డలరి వేటసన్నాహంబు వీటఁ జాటించిన. 195

సీ. అడంగించుఁబో యిమ్మహాసారమేయంబు జముఁ డెక్కు కాసరస్వామినైనఁ
గూల్చుఁబో యమ్మహాకుర్కురం బద్ధిశముద్గలాయముకాఱిమొసలినైనఁ
గఱచుఁబో యిమ్మహాకౌలేయకము విష్రగ్రీవు పేరెకిరింతగిత్తినైనఁ
బట్టుఁబో యిమ్మహాభషకంబు తోలుసంజ గన్నమానిసి వాల్మీకంబునైన

తే. ననఁగఁ బులిగాఁడు చిలుకుటమ్మచ్చపచ్చి, మిరియమురిద్రాడు కాత్రెఁడు మెఱుపుదీగ
పిడుగుకలగూరగంపను పేళ్ళవలరు, నిడుదకుక్కల పట్టుపట్టెడలఁబట్టి. 196

గీ. పరుసుకరసానఁ దీటినపందిపోట్లు, భూరిభుజపీఠములయందుఁ బొందుపఱచి
పరికరంబులఁ గొనుచు భూపాలునగరి, యేలుబడి వేంటకాండ్రు మున్నేచినడన.

క. ఏలలఁ బాడుచుఁ దగ విలు, గోలలఁ గొని నల్లప్రజలు గుములై నడవ
న్నీలాంబరుఁడై విభుఁ డు, ద్వేలాశుకశావిరాజి తేజీనెక్కన్. 198

క. ఎక్కినఁ ద్రొక్కనిచోటులఁ, ద్రొక్కుచు గుఱ్ఱంబునడవ దూరము ఁగుమా
యెక్కలకు వచ్చె నరపతి, పక్కణవాస్తవ్యసమితిపథ మెరిఁగింపన్. 199

తే. వచ్చి మాయున్నపొలమెల్ల వల్లవైచు, చందమునఁ జొట్టుకొనినఁ బోసందులేక
చలితచరణంబులును బరాసన్నదృష్టి, గలిగియుండెతి మచటఁ గాకపులకరణి. 200

వ. అంత. 201

క. పవికల్పప్రదరంబున, నవనీపతి దుప్పిదుప్పారనఁ బడనేసెన్
నవలాఘువ మేర్పడ రా, రవబాధకు మొదలుగారె రాజులు దలఁపన్. 202

క. శిఖిధూమశ్యామలములు, ప్రకరగరుద్విసరభాసురము లుద్యజ్జ్యో

ముఖరితములు రాజశిలీ, ముఖములు బహుపుండరీకముఖముల వ్రాలెన్. 203

క. తారలుచెడ నక్షీణో, దారగతు ల్నెఱపి గగనతలమున జవప
ద్భేరుండము లాస్యముల న,పారముగాఁ గొనియె రాజబాణఫలంబుల్. 204

క. తులలేని శైత్యములుఁ జిఱు, బిలముల బురుడించుచోనలఁ బెరిగినశరముల్
పాలములు లావుంబులగళ, ములు మోవఁగఁ దుండషండములఁ బూరించెన్. 205

క. నిరవధికదానవిద్యా, పరఘనుఁడాఘనుఁడు దాత ప్రజ్ఞాని వనే
చరమృగచరజాంగళముల, శరధిపృషత్కముల సరభసంబునఁ గప్పెన్. 206

క. సమయించె ఖడ్గముల ఖ,డ్గములం గ్రూరాచ్ఛభల్లగణముల జగతీ
రమణుఁడు దుర్గాహనన, క్షమఁ గ్రూరతరాచ్ఛభల్లగణములఁ గప్పెన్. 207

వ. అయ్యాఖేటనంబు శాసితపశుప్రకరంబు గావున యజనవాటంబును ధ్వనిప్రధానంబు గావున సుప్రబంధంబును భంగదుర్నిరీక్ష్యంబు గావున బయోనిధానంబును నఖండధర్మసంపన్నంబుగావున గృతయుగంబును నిరూఢఋశ్యశృంగంబు గావున విభాండకాశ్రమంబును శిథిలీకృతాచ్ఛభల్లంబుగావునఁ బ్రభగ్నసంగ్రామంబును గుంతీష్టవిహారయోగ్యంబు గావునఁ బాండురాజార్జనంబును నష్టసింహబలంబు గావున భీమసేనోత్సాహంబును నహాస్తసింధురాజంబు గావున ఫలితార్జునప్రతిజ్ఞయు నిపంచితపంచకంబు గావున రాజనగరంబును నిశ్చేష్టితగవయంబు గావునఁ గుంభకర్ణసంరంభంబును సుప్రకాశితపుండరీకంబు గావున శిశిరకాలంబును ననుకరించె నప్పుడు. 208

క. పోలములు వెదకి పక్కణ, పాలురతఱుమటయుఁ దల్లి ప్రజ లుద్ధురజం
ఘాలురు గావునఁ బరచిరి, పోలేకం దగులుపడితిఁబో వారలకున్. 209

క. నను నంతఁ జిత్రవర్ణుఁడు, గనిఁజంపక తెచ్చి పతికిఁ గైకానుకగా
నొనరించిరి శబరసుతు, ల్వీను రా జవ్వేటమీఁద విరిగె న్దిరిగెన్. 210

వ. తిరిగి మహామహీశకటకం బగుకటకంబునకు వచ్చి రాజు యువరాజునకు నన్నిచ్చె నిచ్చిన నచ్చెలువుండు నన్నుఁ గన్ననందనుకంటె నగణ్యకారుణ్యంబున రక్షించె నట్లు కుక్షింద్రక్షితుండనై యుండి యంతఃపురంబున వాసగృహంబున యువరాజొక్కరుండు పవ్వళించియుండ నేనును దత్సమీపంబున నుండితి నయ్యర్ధరాత్రంబున. 211

క. ప్రతిగర్జితేక్షసరిద్యై, యతికంపజ్జంతుహృదయమై నిర్భిన్న
శ్రుతిహృత్స్ఫుటమై విద్యు, ద్ద్యుతివాంతధ్వాంత మగుచు నొకయుఱుము మ్రోసెన్.

మ. తనకల్లోంబుల కెంతయాఘననినాదం బూర్జితామోదకం
బొనరింప స్సుఖమెత్తి వానతఱి యుయ్యోవ్యాపర్వతాధిత్యకా

వనుల నన్యద్వనులం గులప్రభులతో వర్తింతుఁగా యందు బా
ష్ప నిరుద్ధాక్షుఁడనై సఖా మనుజభాషం బల్కితిం బల్కినన్. 213

చ. విని యువరాజు ద్రాసరసవిహ్వలుఁడై సదనంబు నద్దెస
ల్గనుఁగొని యేను నీమృగముకాని యొరుల్ విహరింప రింకుఁ జె
ప్పను వినఁగూడునే మనుజభాషల నిప్పుడు నద్భుతధ్వనిం
బనివడి ప్రాసె వేగి తెలుపందగునీ తెఱఁ గెల్లవారికిన్. 214

క. అనితనువు వేఁగ వేగినఁ, దన కాపుష్కరనరేశుతమ్ముఁడు నెమ్మిం
గనుఁగూర్కు వెఱచి యొకలా, గున నంతయు దైవచింతకుల కెఱిఁగించెన్. 215

క. ఎఱిఁగించి మృగములెక్కడ, తరి నేతన్మనుజభాషితము లెక్కడ నే
తెఱఁగో యేమియుత్పాతమొ, వెఱఁగయ్యెడు ననిన నవ్వి విద్వత్సింహుల్. 216

క. యువరాజుఁ జూచి ధరణీ, ధవనందన యేలవెఱచెదవు మృగజాతుల్
పవలూరకుండి నిశనవ, నవభంగి మ్మనుజభాషణంబులఁ బలుకున్. 217

క. నరసంచారవిహీనో, ర్వర నని చెప్పాటయు భయము వదలి నృపాలా
వరజుఁడు ననువిడిపించెను, గరుణాపరుఁడై దురంతకాంతారములన్. 218

క. ఇదినాకు నేఁడకాద, మ్మొదలం గలదనుమఁ డెల్లముగ మృగము జగ
ద్విదితుఁ డగు నెయ్యునకు నా, ర్తదశం దడిలేనినోరఁ దనకథఁ జెప్పెన్. 219

క. అతివేలచింత నంతట, నెతమదిలో నెరసి సరసి వెలువడి మంద
స్థితి చాయఁ జూచుకొని య, ప్రతిమదయాశరధి మందనకుఁ డేతెంచెన్. 220

క. ఏతెంచిన భీతి విని, ర్ఘాతహతిం ధృతినగంబు ప్రయ్యలు గాఁ జిం
తాతంతుబద్ధమానసుఁ, డై తత్తర మెసఁగ మూషకాగ్రణి పలికెన్. 221

చ. అరయ నుపాయపారగుఁడ వయ్యు నయోదధివయ్యు సంతత
స్థిరమతివయ్యుఁ గానిపనిఁ జేసితి నర్మసఖా మృగంబు ని
క్కరటము నేను నెప్పటికిఁ గాల్గలవారము చిక్కి మేరికి
ట్లురుగతి నికులే దిచటికుద్ధురుఁడా మృగయుండు వచ్చినన్. 222

చ. అతివిమలాత్ముఁ డైనసఖునందును బెంపొనరించు ధారుణీ
పతివరునందు భూరిగుణబంధుర మైనకళత్రమందు ను
న్నతనయతత్త్వశాలి యగునందనునందు మనంబు నొన్పి యా
గతబహుదుఃఖము ల్దొలఁగుఁగాదె విచారధురీణుఁ డుర్వరన్. 223

చ. అను నెడ వేఁటకాఁ డదయుఁ డప్ప డుపస్థితుఁ డైనదైన్యమా
ననమున మోసులెత్తి మృగనాథుఁడు బెగ్గిలినన్ హిరణ్యకుం

డనుచు నయవాక్యము ల్మెఱయ నాత్మఁ మంత్రి పరీతవాగురం
దునియలు సేసి మందరకు దూఱి యథాయథలయ్యె నయ్యెడన్. 224

క. జలచరుఁడు గనవరత్వర, నిలఁబోవం జేవలేక యెప్పటిపోని
ర్గళితగమనేచ్ఛఁ గచ్ఛప, కులనాథుఁడు శిరము ముడుచుకొని యుండుటయున్.

క. సరిసరికిఁ బాసి గాఢ, త్వరఁబఱచినమృగముఁ జూచి దారుణచింతా
పరితప్తుఁ డగుచు మృతయుఁడు మరుగుచు నచ్చో ముహూర్తమాత్రము నిలిచెన్.

వ. అట్లుండి మందర మందరకుం గాంచి పట్టుకొని త్రాటంగట్టుకొని వింటికొప్పునం బెట్టుకొని విన్ననైన మొగంబునం దిరిగి యరుగుచుండె నప్పుడు హిరణ్యక లఘుపతనక చిత్రాంగదు లంతంత ననుసరించి చనుచుండి రందుందుర పురందరుండు తనలోన. 227

ఆ. అంబురాశిపార మైనను గననచ్చు, నిశ్చయింపవచ్చు నింగిపొడవు
బ్రహ్మ మిట్టిదనుచుఁ బలుకంగనగు సుహృ, ద్విరహ మింతయనుచుఁ దెలియరాదు.

తే. అదియ సువ్యక్త మది నిజప్రాణతుల్య, మదియ నిర్వాచ్య మట్లుగాదయ్యె నేని
జననిపై భార్యపైఁ దనూజన్ములపయిఁ గలిమిపై మైత్రిపైఁ బోలెఁ గలదె మమత.

సీ. కర్మచేష్టితములు గాలాంతరావర్తితము లగు మేలుగీ ళ్ళమర నైనఁ
గనుఁగొంటి మరిసమాగమవియోగములేల చెనఁటివిధాత సృజించె మొదలఁ
బృథులశోకారాతిభీతిఘాతిప్రమోదసంపాదిప్రీతివిస్రంభభాజ
నము మఱిరెండక్షరములఁ బూర్ణంబైనమిత్రశబ్దము మేర మెఱసి విడిసి

తే. యెట్లునిలువఁగూడు నెబ్భంగి రుచియించుఁ, గూడు కంటికెల్లి గూర్కువచ్చు
నని హిరణ్యకుండు దనలోన దుఃఖించి యపుడు పలికె వాయసాధిపతికి. 230

క. ఈయధముఁ డెంతదూరము, పోయెడునో యెంతదవ్వు పోదము సర్వో
పాయములఁ గానలోపల, నీయెడ విడిపించుకొంద మిమ్మందరకున్. 231

క. నావిని లఘుపతనకుఁడును, లావుపసం బోర నలఁతులము మందరకుం
జేవడువున విడిపడు నీ, చేవినికి దిక్కు చెప్పవే వెరవనినన్. 232

సీ. అశ్రుమిశ్రితనేత్రుఁ డైనహిరణ్యకుఁ డనియె నిప్పాపాత్ముఁ డరుగుత్రోవఁ
గలదు చెందామరకొలను దత్తటమున మృగముఖ్య చచ్చినపగిది నుండు
నేమించి యౌదల నిలిచి లోఁజెవులను మకుగోళ్ళఁ బొడుచునట్లొకలు గన్నుఁ
గ్రుడ్లూడ్చి మెసవులాగున నుండుచుండిన నాపుఁట కచ్ఛపనాథుఁ బ్రోవ

తే. వేగఁ గేడించి యన్నీచు వెనుకఁజేసి, యరుగుమచ్చక్కికనికూర్చి యనుచుటయును
ఖగమృగాధ్యక్షు లరిగి రాఘనులపజ్జ, నంతి నంతట దానును నరుగుచుండె. 233

సీ. చిత్రాంగిదుండు చచ్చినవానిగతిఁ బురస్సరణాసరస్తీరధరణినుండె

వానిమస్తకమున వ్రాలి వాయసకులాగ్రణి కనుగ్రుడ్లులు గ్రచ్చి పెత్రికి
గొని తినువానిలాగునఁ గావుకావున నఱచుచు ముఱియించునంతలోన
నరుగుచున్నకిరాతుఁ డగ్రభాగమునఁ జిత్రాంగకుఁ గని మేనుపొంగ నుండ

తే. కలిగెఁ దెకతేర నేతన్మృగం బనుచును, మందరకు డించి కాకి బల్లు నదల్చి
గొనుచుఁ జనుచోట మూషకకులవిభుండు, కూర్మవల్లభుబంధము గొరికివై చె. 234

క. కొరికిన మందరకుఁడు దె, వ్వరపుగఁడింబఱచి సరసిఁబడె మూషకరా
జొరికె మృగవాయసంబులు, తెరఁగొప్పగ లేచి రెండుదిక్కుల కరిగెన్. 235

తే అట్లు విఫలప్రయత్నుఁడై యడవిఁ బాసి విన్నబాటునఁ జనియెను వేఁటకాఁడు
కమఠమూషకమృగమహాకరటవిభులు, గాఢతరమైత్రిఁ బొదలి రత్యాంతనందు.

వ. సుహృల్లాభంబున సాధింపరానికార్యంబులు గలవేయని సుదర్శనకుమారులకు విష్ణు
శర్మం డెరింగించె నెరింగించిన. 237

క. విని రాజకుమారకు లన, ఘు నయాంశవిలాసదివిజగురు నిజగురునిన్
గని మూఁడవతంత్రము పా, యనిధీ మాతోడఁ జెప్పుమని యడుగుటయున్. 238

మ అతికారుణ్యకటాక్షసర్వభువనా కాధ్యక్షరాధాసుత
ప్రతిపక్షప్రియచర్యకల్పకనిశా రాడ్ముఖ్యచక్రత్రిశూ
లతిరోభూతిరవిప్రభూతశుభలీలాపూతరూఢాంధకా
హితతేజోవిభవప్రచారణదయాహ్యాప్తస్ఫురద్వారణా. 239

క. మాయాతీతమహానిత, కాయభటీకృతమరున్నికాయతపస్వి
ధ్యేయ నిజభక్తరక్షో, పాయ విభూతిప్రధానపాండిత్యనిధీ. 240

మాలిని. నిరనుమితమహాత్మా నిశ్చలానందతత్త్వా, నిరతసుఖితలోకానిత్యపుణ్యావలోకా
గరుడన్నపపతాకా ఖండితానన్యశోకా, మరణజననదూరా మానిచేతోవిహారా.

గద్యము. ఇది శ్రీ వేంకటనాథ కరుణాలబ్ధ సరససాహిత్య నిత్యకవితావిలాస సకలసు
కవిప్రశంసా భాషణోల్లాస రాజకులపారావార పర్వశర్వరీరమణ నీతిశాస్త్రమార్గప
రిశ్రమణ ధైర్యపర్యాయ ధిక్కృతనీహారపర్వత పర్వతరాజకుమార నిస్సహాయ
ప్రబంధనిర్మాణ భోజభూదార సుధామధుర భారతీసనాథ వేంకటనాథప్రణీతం
బైన పంచతంత్రంబునందు సుహృల్లాభం బన్నది ద్వితీయాశ్వాసము సంపూర్ణము.

శ్రీరస్తు.

# పంచతంత్రము.

## తృతీయాశ్వాసము.



మద్వృషాకపాయీ

రామాసాపత్న్యరోషరసకృత్పరతో

భామకుటీవ్యోమధునీ

వ్యామిశ్రకటాక్షవీక్షహరిహరనాథా. 1

వ. దేవా సంధివిగ్రహాభిధాన తృతీయతంత్రం బాకర్ణింపు మధీతనీతిశాస్త్రమర్ముం డగు విష్ణుశర్ముండు సుదర్శనకుమారుల కిట్లనియె. 2

క. ఆకడ వీరుం డగున, స్తోక ప్రతిపక్షుఁ బెనిచి తుది రాజు చెడుం

గాకంబుఁ జేర్చుకొని మత, లోకబలోద్రేక మొకయులూకము చెడదే. 3

క. నావిని రాజకుమారకు, లావిప్రుని జూచి చిత్రమది చెపుమా భూ

దేవకులోత్తమ మాకును, దావహముగ ననిన వారి కతఁ డిట్లనియెన్. 4

చ. మధురనభోమణిద్యుతిసమంచితరత్నవిరాజమానధా

మధురవిలాసినీశ్రవణమంగళరాగనదీరితేక్షుహృ

న్మధురగురంతసంప దభిమానతృణీకృతరాజరాజది

ఙ్మధుర చెలంగుఁ బాండ్యమహీమండలిఁ దన్నికటాయతాటవిన్. 5

చ. ఫలరుచివిద్యుదర్చిఁ దెలుపం బలిభుగ్రుతు లుగ్రగర్జలై

యొలయఁగ బెల్లుగా డిగినయూడలు పుష్కరవర్షధారలై

నిలువఁగ వార్షికాభ్రసరణిం గగనస్థలచుంబియై దళ

ద్దళములకల్మిఁ గార్కొనుచు నుగ్రవటం బొకఁడొప్పు నున్నతిన్. 6

చ. నటన ననేకకాకపృతన ల్ప్రతివాసరము న్భజింప న

వ్వటమున మేఘవర్ణుఁ డనువాయసవల్లభుఁ డుండు వాని కు

త్కటభయకంపనంబు లెసఁగ న్నికటప్రకటాటవీకుటీ

వటమునఘూకసేన గొలువం బెనుగూబయొకండు నెప్పుడున్. 7

ఉ. ఆయరిమర్దనుండు మది నచ్చలమచ్చఁ గృతాంతవాలుఁగా
లాయుధకంఠఘోర తిమిరాకులమై నొకనాఁటిచీఁకటిం
బాయనిఘూకసేనఁ బనుపం బెనుపొందినమట్టి కేడ్తెఱం
బోయి యజాగరూకబలిభుక్పటలిం బరిమార్చి పోయినన్. 8

క. ఆతెంకిఁ గరటవిభుఁ డొక, కోటరగర్భమున నణఁగికొని యుండుట నా
చేటొదవదయ్యె వానికి, నాఁటికి నదిపోయె మఱియు నాఁడుదయమునన్. 9

వ. హతశేషానుజీవకోటిం గూడుకొని యతనిమంత్రు లుద్దీపియు సందీపియుఁ బ్రదీపియు నాదీపియుఁ జిరజీవియు నను వారేవురుం గలసి రంత నందఱం గలయం గనుంగొని మేఘవర్ణుం డిట్లనియె. 10

ఉ. ప్రాఁకున నిద్రవోవ నరిమర్దనుపంపున వచ్చి ఘూకముల్
గాకముల న్వధించె నిది కక్కసపుంబని నిర్వహించుతె
ట్లీకడ నీతికార్యపరు లిందఱు పోలినభంగిఁ జెప్పుఁడా
నాకిపుడంచు రాజడిగిన న్వినయవ్యతిషంగచిత్తుఁడై. 11

వ. ఉద్దీపి యిట్లనియె. 12

క. ఈదృశబలవంతులతోఁ, వాదులకుం దించి బ్రతుకవచ్చునె యెందేఁ
బోద మశక్తుల కిది మ,ర్యాద వృథా పొలిసిపోవ నగు ఘనమేమీ. 13

క. అనువచనంబులు వాయస, జనపతి విని యానతిచ్చె సందీపికి నీ
వును నొకకార్యముఁ జెప్పుమా, యను డాతఁడు విహితహృదయుఁడై పతిమొగమై.

క. ఇది యొకపక్షమ్మున మం,చిది యగు నగుఁగాక యేమిచిరవిక్రమసం
పద గలరాజున కుచితమె, సదనత్యాగంబు మానుషచ్యుతిగాదే. 15

క. స్థానంబు సకలఫలసం,ధానం బొనరించుఁబతికిఁ దగనజకంఠ
స్థాన స్తనమిదునె యథా, స్థాన స్తనభంగి మధురతరదుగ్ధంబుల్. 16

క. చేఁగలభూమిపతు లటు, గావునఁ గోరరు విదేశగమనము దేవా
నీవెఱుఁగనికార్యములుం, ద్రోవలు మఱియెవ్వరెఱుఁగుదురు లోకమునన్. 17

వ. అనుమాటలు విని రాజు ప్రదీపి నాలోకించి తోఁచినకార్యంబుఁ జెప్పుమని యడిగిన నతండు. 18

చ. తడయక బాలవృద్ధవనితాజనతాదులవైరికోటికిం
గడువడిఁ జంపు మంచనిదుకంటె నయంబున సంధిసేయు టే
ర్పడ నుచితంబు వైరుల నపాయబలాఢ్యులు రాత్రిచారు లె
య్యెడఁ దగదీరసంబు బలహీనులకు న్మనబోటివారికిన్. 19

క. ఈవాలువచ్చి తేవం, జూపంగా నున్న వారిఁ జంపెద రహితుల్
దేవా సంధి యనూనశు, భావహ మొనరింపు మస్మదాదేశమునన్. 20

వ. అనుభాషితంబు లాకర్ణించి యధిపతి యాదీపినడిగిన నతం డతని కభిముఖుండై 21

క. సంధికిఁ జనుచె ట్లరులు ది,వాంధులు బలదుర్నిరీక్ష్యులయ్యును దుస్సం
బంధ మిదిగాదె మనము ని, శాంధుల మెట్లమరు దూత కరుగఁ దిరుగన్. 22

క. అటుగనుక సంధికార్యం, బెటువలె నొడఁగూడు రాత్రు లెదిరికి నెల వి
ప్పటికి మనకదను పగలు, త్కూటగతిఁ జని సంహరింపుదము పగవారిన్. 23

వ. అని యుద్దీపి ప్రదీపి సందీపి యాదీపులు తమకుఁ దోఁచినట్లు చెప్పినవిని మేఘ
వర్ణుండు చిరజీవి నాలోకించి. 24

క. ఈతం డితఁ డితఁ డీతఁడు, చేతోగతిఁ దోచినట్లు చెప్పిరి పథ్యం
బై తోఁపదు కించిత్తుం, దాతా నీవేమిచెప్పెదవు నాతోడన్. 25

క. నీసద్బుద్ధిబలంబునఁ, జేసెద రాజ్యంబు నేఁ డజేయదివాంధ
త్రాస ముదయించె నీకిది, పోసమయము ప్రాప్తకాల ముపదేశింపన్. 26

క. హరిపరిణామమునకు ని, ర్భరనీతిపరుండు గురుఁడుబలె నాభద్రం
బరయుటకు నీవెకా కె,వ్వరు నాఁ జిరజీవి మేఘవర్ణుని కనియెన్. 27

క. అఘనయవినయనిధు లీ, నలువురు విన్నపముఁ జేసినా రిమ్మతిమం
తులకంటెఁ గార్యనిశ్చయ, బలమున నధికుఁడ నె యంతపాండితిగలదే. 28

ఆ. వీరు నీకుఁ బరమవిశ్వాసఘటకులు, వీరినీతిరీతి వినుట యొప్పు
నైన నాకుఁ దోఁచినంతయు వినుపింతు, నేకతంబువలయు నింతదడవు. 29

క. హితుఁడని యొకనికిఁ జెప్పిన, నతఁడును దనకూర్చుసఖుని కది దెలుపు నర
క్షితమై నృపమంత్రం బీ,గతిఁ బలువురు వినుటచే విఘాతతనొందున్. 30

క. అతిగుప్తమయ్యు మంత్రము, హితనికగ శ్రుతముచేత నివ్వగంబడు ని
క్కృతి యెఱిఁగి ప్రాంతిజనసం, గతి రాజు రహస్య మొసఁగి కావఁగవలయున్

వ. అని యేకాంతంబు వడసి చిరంజీవి మేఘవర్ణునకు సంధివిగ్రహయానాసనద్వైధీభావ
సమాశ్రయంబు లనుగుణంబులం బ్రారంభోపాయపురుష ద్రవ్యసంపద్దేశకాలవిభాగ
వినిపాతప్రతికారంబు లనునంగంబుల సామదానభేదమాయోపాయంబు లనుచతు
రుపాయంబులఁ బ్రభుమంత్రోత్సాహశక్తుల విచారించి యం దుచితం బగుదాని
నంగీకరింపుము నాకుఁ దోఁచినకార్యం బొక్కటి ప్రతిపక్షు లుదగ్రసత్త్వద
క్షులు మనకు సమరసామర్థ్యంబు చాలదు దేశకాలంబులు విచారరమణీయంబులు

క. మీనోదవునంతకుం జనఁ, గానక బకముండుకరణి ఘననీతిధనుం

దైన్యతఁ బొరకుండుం, దానహితుఁడు చిక్కువడినదను కతిశాంతిన్. 33

క. తనసత్త్వ మెదిరిసత్త్వముఁ, గనుఁగొన కెవ్వాఁడు దర్పగర్వమునం బో
రునకుఁ దుదఁ గాలు ద్రవ్వు, న్వినుమ్ముష్కరునిఁ బొందు విపదోఘంబుల్. 34

చ. సురియఁ గరంబునం గొనక శూరుఁడు నీతి కళావిలాసభా
సురుఁడు వధించువైరి విరసుం దవుదవ్వులఁ జెంతనుండియున్
సురియ ధరించియు న్మగువచొప్పున నేమియుఁ జేయలేఁడు త
న్నెరలఁగఁ జేయుమాననికృష్టుఁడు మాటలు వేయు నేటికిన్. 35

క. తాలిమియు ధృతియుఁ బ్రజ్ఞా, శీలతయుఁ బరాత్మగుణ విశేషజ్ఞతయుం
గాలోచితశౌర్యము గల వాలుమగం డేలు వార్ధివలితధరిత్రిన్. 36

క. సిరిపొందును నాయకశ్రీ, పరిణతుఁ దనుఁ దానపాయపారగుసభయుం
బరుషోక్తిఁ జేరరా దిం, దిరకేలం గురులఁ బట్టి తివిచినయినన్. 37

క. గృహపేటినుండుమంత్రో, త్సహనాథ్యునకు న్రమాభుజంగినుమంత్ర
గ్రహణవిమూఢతన కది దు, స్సహభీతి ననారతంబు సంపాదించున్. 38

క. మతిమంతుఁడు శాంతుఁడు వి, శ్రుతగుణసంసిద్ధుఁడు న్విశుద్ధుఁడు నీతి
ప్రతిరహితుఁడు బలసహితుఁడు, గతభయుఁ డనఘుండుఁ గార్యఘటకులుసుమ్మీ.

వ విశేషించి యిట్లుచెప్పవలసి చెప్పితిఁ గాని యుద్ధ మెప్పటికి నకరణీయంబు. 40

సీ కోశమంత్రములు దక్కువలు గాకుండినఁ గలుగులెక్కలకు నగ్గలము బలము
శాంతులు నిర్మలస్వాంతులు విక్రమోదయులు నిర్భయులును ధర్మమయులు
కఠినశాత్రవుని సాగావిత్తవంతుని వేల్పుగాఁ జూచి సేవింతు రెపుడుఁ
బ్రభుతసహాయునిబంధనం బని చెప్ప విందుము నీవును వింటివట్లు
తే. కులము గుణము రూపు చెలువంబు మురిపంబు, మానధర్మవిక్రమక్రమముల
వాసిఁ జూడ దబ్జవాసిని నిరపాయ, శూరసంగ్రహంబుఁ జూచినట్లు. 41

క. ఏరీతి జైత్రయాత్రా, ప్రారంభము సెల్లుఁ బతికిఁ బ్రజలేమి నభ
శ్చారతి గూడునె పక్షికి, భూతిబలాఢ్యత్వపక్షములు లేకున్నన్. 42

క ఘోరారివీరపారా, వారం బెప్పాట దాఁటవచ్చు సహాయా
ధారతతి తారుఁ గోరక, పౌరుషసంపన్నుఁ డగునృపాలాగ్రణికిన్. 43

క. ధనమంత్రసహాయంబుల, నొనరినభూవిభునకన్నియును గల వట్ల
య్యును సమరమకరణీయము, చన నేరదు సంధి సహజశత్రుల మగుటన్. 44

వ. ఘూకంబులకుఁ గాకంబులకు సహజవైరానుబంధంబునన కాదె వాక్పారుష్యం బెవ్వ
రికిఁ జేటుఁజేయదు. 45

క. భీషణశార్దూలతనూ, వేషము దన కమర దాల్చి విశ్రుతసస్యా
న్వేషణతత్పరమతివా, గ్దోషంబున నొక్క ఖరము ద్రుంగదె పుడమిన్. 46

క. నావిని వాయసపతి చిర, జీవికి నిట్లనియె నీతిశీలా యేలా
గీవిధము దేటపడఁ జెపు, మా వినియెద ననిన నతని కతఁ డిట్లనియెన్. 47

క. ఒకపురి నొకచాకలవాఁ, డొకదిక్కున నొకనిచేత నొకగాడిదె వి
ల్వకుఁబుచ్చుకొనియెఁ జార, ప్రకరపటీభృతికి మేనుబటువై యునికిన్. 48

క. వలువలు చలువలుసేసెడు, నెలవునఁ బగలెల్ల నిలిపి నిశియగుటయు న
ప్పులుగాకి చాకి పెనుగ్రో, ల్పులిచర్మము గప్పి సస్యముల కెగవిడుచున్ 49

క. అది కడుపుకొలదియును దిని, సదనమునకు మగిడివచ్చు సరిప్రొద్దున ని
ట్లద నరసి యరుగఁ దిరుగం, బొది చెడియుం బైర గొన్నిపూఁటలుచనియెన్ 50

క. పొల మరయుకర్షకులు మదిఁ, బులిగాఁ దలపోసి భీతిఁ బులిపులి యనుచున్
దలసాలవెడల రందొక, హాలికుఁడు శరచాపహస్తుఁడయి నిశ్శంకన్. 51

క. నెలవొడిచినధూసరరుచిఁ, గలగొంగడిముసుఁగుఁ దిగిచి కడువడిఁ దనయి
ల్వెలువడి చని కని తనముం, గలబొంచినవానిఁ జెందిగాడిదె యనుచున్ 52

క. మిండుగ నుత్థాపించిన, దంపము గమనమున కెగ్గుఁదలఁపఁగ వీనుల్
బెండువడ నొండ్రపెట్టుచు, దుండగపుఖరంబు దన కెదుర్పఱ తేరన్ 53

క. హాలికుఁడు నీవాయనుచుం, జలివిడిచి ప్రహాస మెసఁగ శయములఁ గాల్గం
బిలుపిలు నెదురుగఁ బఱచిన, నలగాడిదెయుం దువాళినతితిక్కిపచ్చెన్. 54

వ. వచ్చిన. 55

క. తగిలి తనపైరు మేసిన, పగ యగ్గలమగుటఁ గినిసి పటుముష్టిని వి
ల్లిగిచి ఘనతరశరంబునఁ, దెగనేసిన గార్దభంబు ద్రెళ్ళెం బుడమిన్. 56

· ఇది వాగ్దోషఫలంబని చెండియు. 57

క. అనిచెప్పిన చిరజీవిం, గని వాయసరాజు పలికెఁ గౌశికములపన్
మనకు న్బగ వాగ్దోషం, బునఁ బాటిలె నంటి విదిచెప్పుము వినవలతున్ 58

వ. అనినఁ జిరంజీవి మేఘవర్ణున కిట్లనియె. 59

చ. అపరిమితానురాగమొలయ న్వలయాద్రిపరీతభూపతి
త్రిపటలిమంత్రకూట మొనరించి మదాంధదివాంధము న్మహో
కుపితముఁ బక్షిరాజ్యమునకుం బతిగా నొనరింపఁ బూనియు
న్నపు డొకవృద్ధకాక మటకై యరుదెంచినఁ బుల్గులన్నియున్. 60

క. వెడవెడ నొండొకకొండొక, తడవు విచారించి సమతిఁ దమలోననియెన్

జేడకిది బహుకాలంబులు, గడపినయది గాన యుచితగతి నెఱిఁగింపన్ 61

వ. కార్యాలోచనంబున నిందఱ మసమర్థులము కార్యనిర్ణయసమర్థుం బగుదీని నడిగి చూతమే యనుచు నాతిథ్యం బాచరించి పరివేష్టించి తమయభిప్రాయంబుఁ జెప్పిన నప్పక్షులకు వాయసాధ్యక్షుం డిట్లనియె 62

సీ. కర్ణహృత్పుటసూచికాయమానోత్తానవికటఘోషము విన్న వెగటుగాదె
కాలకాకోదరోగ్రస్ఫుటాస్ఫుటముఖం బాలోకనముసేయ నళుకుగాదె
భ్రమదుల్ముకభ్రాంతిభాగవీక్షణదృష్టిసరణిఁ ద్రిమ్మరుచుండ జాలిగాదె
కర్కశవ్యాయామగరుదమంగళమరుత్ప్రీతతిసోఁకినఁ బీడవుట్టుకొనదె
తే. దారుణాకార మప్రియదర్శనంబు, ప్రకృతిరౌద్రంబు తుచ్ఛంబు బహుక్షమంబు
ఘూక మేయూరు పికశారికాకలాప, కీరికాముఖభరణ మేయూరు చెప్పుఁడు. 63

క. దారుణదృష్టివికారా, కార మతిక్రూర మహముఁ గానదు కరుణా
దూరం బెల్లయ్యెడు రక్షారంభం బెఱుఁగఁ జెప్పుఁడా వినవలతున్. 64

క. వ్యపదేశక్రియ మెఱసిన, నృపు నింపెసలార నాశ్రయించినఁ గలుగున్
విపులసుఖ మమృతకిరణ, వ్యపదేశతఁ గుశలమంద దాశశ మడవిన్. 65

క. అనుకాకమునకుఁ బులుఁగులు వినయంబునఁ బలికెఁ దెలుపవే శశకం బ
వ్వనజరిపుని వ్యపదేశం, బున భద్రముఁ గనుట గరటముఖ్యా మాకున్. 66

వ. అని యడిగిన వాయసపుంగవం బవ్విహంగంబులకు నిట్లని చెప్పందొడంగె. 67

మ. ఆగళద్దుర్భరతీక్ష్ణభాస్వదభిషువ్యాఘాతపాతక్షర
న్మృగ మస్తక్షతజంబు పశ్చిమమరుద్వర్ధత్రిధామజ్వల
న్నగ మంతర్జలనిర్ఝరంబు మృగతృష్ణావాహినీ సంచితా
ధ్వగ ముష్ణాగమమయ్యెఁ దొల్లి పురజిత్ఫాలాంబకాభీలమై. 68

వ. అక్కాలంబున. 69

చ. జలధరము ల్దరాస్థలికి జాఱినవ న్దిననాథరశ్మికిన్
దొలఁగ కహో బయల్వెఱసెనో తిమిరంబులు నాఁగ జంగమా
ద్రులగతి గండకంపితగిరు ల్దరులారయ లెక్కకెక్కుఁడై
యలఘుమృగేంద్రభీతిరహితాటవిలో విహరించు నేర్పడన్. 70

క. ఏకసరోవర మగునల, భీకరగహనమున నిలువ బెగడి పిపాసా
వ్యాకులితమానసము లపు, డాకరు లిట్లనియె యూథపాధ్యక్షునకున్. 71

క. ఇచ్చోటిసరము శరముల్, నిచ్చలుగొన నివిరె మేఁపునీళ్ళకయో ని
ష్పచ్చరమై యెవ్విధి మన, యచ్చు నవారిగఁ బ్రవారివలె మాకున్. 72

క. ఆషాఢాశగభీరప, యోపూర్ణమహాప్రవాహమైనను గూపా
రాపరిమితసరమైనం, జూపుము విఱువిఱుక పోవఁజొచ్చెం దనువుల్. 73

వ. అని వదనోదరంబులఁ జూపి విన్ననయి యున్న నన్నిచదళవళావల్లభుం డరసి నిమిషంబునుం దడయక యప్పటికి సత్వక్షీణంబులు గానివానిఁ గొన్నిగజంబులం బిలిచి యనుజీవులారా యప్రతిహతమనోరథంబుల గహనఘంటాపథంబులం బఱచి యగాధశరం బగుసరంబుఁ గనుంగొని రండు పొండని నియోగించిన. 74

సీ. మదవనేచరవధూమధురగానధ్వానవివశకుంజక్రోడవిషధరములు
పరిపక్వఫలవిలుబ్ధ స్తబ్ధరోమ దంష్ట్రాటంకభిన్నగోత్రారుహములు
ధరచరత్పవనబాంధవదవ వ్యాయామధూమకల్పితమేఘదుర్దినములు
చరమదిఙ్ముఖపతజ్జరఠకాసరవిరక్త వ్యాఘ్రభీతఖడ్గవ్రజములు
తే. సవనతరసరస స్తేయసారమేయ, దళనదంశననిష్ప్రాణితరుణహరిణ
నాభిసౌరభ్యదశదిశాంతస్థలములు, ఘోరకాంతారములు కొన్నికొన్ని గడచి. 75

క సరిసెరసి మెఱసి బిలములు, దరిసి ధృతు ల్బెరసి దొరసి దంతావళముల్
వరశిఖరం బగు నొకమల, సరస న్సరసారసరసి సరసి న్గనియెన్. 76

వ తత్సరోవరం బావిష్కృత పుష్కరంబు గావున యాదవస్థానంబును మత్స్యకూర్మవిలాసభాసురంబు గావున యోగిరాజును బ్రకాశితాహిమకరంబు గావునఁ బ్రాతఃకాలంబును నధిగతబ్రహ్మరథంబు గావునం బర్యస్తవితానంబును నారాధితారికులంబు గావున నపారబల సంపన్నంబును బకవిహారయోగ్యంబు గావున నేకచక్రపురంబును నూర్మికాభిరామంబు గావున నలంకృతుం బురుడించి యొప్పుచుండు.

క కని యనురాగరసాబ్ధి, న్మునుము న్నోలాడి భిన్నముఖకమలవనీ
ఘనపరిమళగుణచిక్కణ, వనజాకరవారిలో నవారిగ నాడెన్. 78

ఉ. ప్రావృతమాతపోతమ్ముదుపల్లవపారణకారణంబునన్
లావుపహించి సొంపు వొదల న్బ్రదలం బదలాఘవంబునం
బోవఁగఁ ద్రోయుచు న్మరలిపోయి సరోవరలాభవార్త యా
క్రేవఁ జరించుయూధపతికి న్వినిపించె గజంబులన్నియున్ 79

ఉ. చెప్పిన నప్పు డుల్లసిలుచిత్తమునం గరిరాజు గౌరవం
బొప్ప మహోహితద్విరదయూథముఁ దోకొనిపోయెఁ బోవ నా
చొప్పున దాఁటిపోవ నొకనోటును గానక తత్పదాహతిం
జిప్పలు గుల్లలై పొలిసె శీఘ్రమె పెక్కుశశంబు లచ్చటన్. 80

సీ. అచ్చోట్లఁ జూచియు నంతశిలీముఖుం డనుశశరాజు దైన్యపాంబి
యగుచు మంత్రుల కిట్టులనునీతి నిధులార యబ్ధికి వారివాహములువోలె

సరసమున కలుషుతృష్ణాభరంబున నేఁ డవారణ నీదారివారణములు
పఱతెంచుచున్నవి పరికింపు మల్లవె కుండేళ్ళు వీని త్రొక్కుళ్ల మడిసె
తే. గ్రాసకర మైనయాశశప్రశయమునకు,నకట యెబ్బంగి శాంతికార్యంబుదొరకు
నేమిసేయుదు నసునంత నెదుర నిలిచి,వివితనీతికళాశాలి విజయుఁ డనిరొ. 81

క. దేవా నేఁ గలఁగఁగఁ జిం, తావారిధి నేలముని గెదవు శశములకుం
గావించెద శుభ మిభముల, రావిడునం జూడు నాపరాక్రమ మనుడున్. 82

క. పలికె శశరాజు గాఢో,త్కలికన్న యనిధి దేశకాలవిభాగం
బులు నీక తెలియు నిట నీ, కలిమిఁ గ్రియాసిద్ధి యెట్లుగాలేకుండున్. 83

క. ఆలస్య మకర్తవ్యము, కాలం బారంభమునకుఁ గరుఁనుదరులన్
దోలి శశప్రాణంబులఁ, బాలింపుము నీయుపాయపాటవ నుమరన్. 84

క. అని యాజ్ఞాపించిన నయ, వినయపరాక్రమవిధానవిజయుఁడు విజయుం
డనిలజయంబున నెఱుఁగఁ, జని యూథపుగాంచి మానసము గలఁగుటయున్. 85

క. గజమంటినట్లు యడచు, న్భుజగము మూర్కొనినయట్ల పొరిగొను ధరణీ
భుజుఁడు నగినట్ల చంపుం, గుజనుఁడు మన్నించునట్ల కొను బ్రాణంబుల్. 86

క. కావునఁ గరినికటమునకుఁ, బోవం గార్యంబు గాదుపో యిపుడు మహా
భావనమున నుపకంఠ, గ్రావాగ్రం బెక్కి ముఖ్యకరిఁ బలికెంతున్. 87

చ. అనిగిరి నెత్తమెక్కి శశ మగ్గజవల్లభుఁ జూచి యిట్లనుం
గనలున నీకు రాఁబోలను గాటిది నిల్వలు చందమామ న
న్ననుపఁగ వచ్చితిం బయనమై యలజాబిలిలో శశంబుగా
మనమున నన్నెఱింగికొనుమా యన దంతి వతంసుఁ డిట్లనున్. 88

క. ఏమినిమిత్తము శశక, గ్రామణి నిన్నిటపఁ బంపెఁ గైరవమిత్రుం
డామాట తేటపడఁ జెపు, మా మాకన విజయుఁ డగ్గజాగ్రణి కనియెన్. 89

క. హేతులు పైఁబడునపుడున్, దూతలు సత్యంబుఁ బలుకుదురు తద్భూపా
వ్రాతమునకుఁ గలఁగరు ఘా, త్రితలవల్లభులు నగరు తెగ చెప్పటికిన్. 90

క. అలనెల తనమాటలుగా, వలవున నీతోడ నాడుమని నన్ననుపన్
దలమోఁచి చెప్పవచ్చితిఁ. దెలియు న్వీను యూథపక్షితిప యప్పలుకుల్. 91

ఉ. చారువిచార యిక్కొలను చంద్రసరోవర మిందుఁ దారకా
ధారుఁడు చంద్రుఁ డిష్టవనితాజనతోయుతుఁడై యథేష్టసం
చారవినోదము ల్సలుపుసంతతము న్వీను మట్లుగాన నె
వ్వారికిఁ బోవరా దెఱుఁగవా యిట కిత్తెఱఁ గింతవింతయే. 92

చ. నిశతము నీయరణ్యధరణీసరణిం జరియించునీశశో
త్కరములు నాకుఁ జుట్టములుగాఁ బరికింపుము చంద్రనీరజా
కర మతిభీకరంబు తడగాఁజను నా విహితోపదేశ మా
దరమున వీనుల న్దొనుపు దవ్వుఁ లవాఁడవుగాక నీతికిన్. 93

చ. సరసికి మీ రఖండరభసంబున రాఁ బరికించి యాసుధా
కిరణుఁడు నేఁడు మేరుగిరికేసరుల న్మిముఁ జంపఁ బంపఁగాఁ
పరశువు గోరఁబోవుపనిపట్టున నేమిటికంచు మాన్చియీ
తెరువున మిమ్ము నిల్పఁ జమదెంచితి నీతిపరుండఁ గావునన్. 94

క. చావక నోవక యాదల, పూ వాడక నానియోగమున నెందైనన్
బోవుట శోభన మన దం, తావళ మిట్లనియె శశపతంసంబునకున్. 95

సీ. అదిచంద్రకాసారమాసారమానసతారలు దారలై తనుభజింప
జలవిహారం బందుసుఖపునె నిలుపునె యొరులెవ్వరిటకు రాకుండ విధుఁడు
పంచాననముల మాపైఁ బంప ననుకంప మాన్చి యేతెంచితె మమ్ముఁ గావ
నీవంటికారుణ్యనిధి యెన్నిభవములం గలుగు నీకతమునఁ గలిగె బ్రతుకు

తే మగిడి పోయెద మనుచు నమస్కరింపఁ
బ్రత్యయముపుట్ట నక్కరి ప్రవరుఁ గొనుచు
విజయుఁ డారేయి గొలనిలో వెలుఁగువానిఁ
జంద్రు ననుబింబితుని జూపి జరుగుమనియె 96

వ. అవ్విజయు నియోగంబున దంతిపతి వనాంతరచింతం బఱచె నంతి శిలీముఖ ప్రము
ఖశశంబు లానందించె గజంబుఁ దిరుగఁ ద్రిప్పుట శశంబుల ప్రశంసంబు మాన్చు
టచంద్రవ్యపదేశంబునం గాదే యట్లగుటఁ బ్రసిద్ధుం డగు రాజు నాశ్రయింప
వలయు దానసుఖలాభంబులు దుఃఖక్షోభంబును నగు నీయులూకంబు ప్రసిద్ధం
బగురాజ్యంబున కర్హంబు కాదనిచెప్పి కాకంబు వెండియుం బులుఁగుల కిట్లనియె.

క. సముచిత మెఱుఁగక క్షుద్రుం, గ్రమరహితు గుతించిపోవఁ గడుఁగీడౌదవున్
దమలో నొంటక మార్జా, లముడగ్గతి శశకపింజలంబులు దెగవే. 98

క. నావిని విహగములను నయ. కోవిద యారెంటికెల గొదగొదపొడమెన్
జా వేలవచ్చె నోతువు, చే నానికి నింతవట్టుఁ జెపుమా తెలియన్. 99

చ అని తను వేఁడుకొన్నఁ గరటాగ్రణి పక్షులఁజూచి యిట్లను
న్వినుఁ డలవింధ్యభూమి నొకవీరమహీరుహమూలకోటరం
బునికి యొనర్చి యమ్మనికినుండుఁ గపింజలు మప్పత్త్రితో
నెనసి కుశైకదేశమున నేనును నుండుదు సఖ్య మేర్పడన్. 100

చ. తగ గగనప్రచార మవిశారివిభాకరుఁ డస్తమింపఁగా
ఖగము నగంబుఁ బాసి పలుకంటుపల న్బెనుమంద పెంటలం
జిగి నిగుడం జదల్మెదలు చేఁ డెలపండినపూరిబాయలం
బొగసినపాళ్ళ మేఁపుఁగొనఁబోయి హుటాహుటి రాకతక్కినన్. 101

ఉ. డేగకుఁ జిక్కెనో యురువడిం ధృతి గాడ్పడి దవ్వుపోయెనో
లాగము దక్కి మచ్చువలలంబడెనో వెరవేదిపొదినెం
దేగెనో పుట్టలెక్కి కర మేసుతి పాములచేతఁ జచ్చెనో
యేగతి యంచునో తెలియ దింతయు రాఁడు వయస్యుఁ డక్కటా. 102

క. అని బాష్పవారిధార, ల్గనుదోయిం జెమ్మగింపఁగా నలుదిక్కుల్
గనుఁగొనుచు న్వితాకుఁడనై, చన నేరక యుంటి నన్నిశాసముఖమునన్. 103

శా. ఆహాకృచ్చపలావిలాస మఖిలప్రాణిశ్రుతివ్యగ్రగ
ర్జాహంభావసముగ్ర ముగ్రరయనద్యంబూత్థితాంభోనిధి
వ్యూహం బాహతకాననజ్వలన మోహో మింటితో వ్రేలఁగా
లాహిం గట్టినచాడ్పునం గురిసె ఘోరాసార మచ్చీఁకటిన్. 104

క. అలజడి యలజడిచేతం, గలఁగి మహాశకము దీర్ఘకర్ణం డనువాఁ
డలఘుకపింజలకోటర, నిలయంబున నంఘ్రులూఁది నెమ్మదియుండెన్. 105

క. జడిగొన్నవాననేనుం, దడిసితి నాలో నొకింతదపవుచ కానె
వ్వడి సడలె నడఁగె నుఱుముల్, నిడిమించులు మాసె వెలుఁగు నిలిచె న్వెలిచెన్.

ఉ. తెక్కునఁ బ్రాంతపక్కణకుటీశిఖరంబుల నెక్కలాడ్చుచుం
గుక్కుటకోటి మ్రోసె నెసగూరుమిటారులపుట్టినిల్లు గ
బ్బెక్కినమబ్బుశైలగుహ లీఁగె దిశ ల్వెలుఁగొందె నిక్కలం
జక్కవజోళ్లు గేరె జలుఁ జాత హితుం డుదయించెఁ దూర్పునన్ 107

క. పొలమున మేఁపాడికపెం, జలు మత్తటి మరలివచ్చి శశము నివాస
స్థలిఁ గనుఁగొని యదలింపుచు, నఘుతరక్రోధహృదయమై యిట్లనియెన్. 108

శా. ఔరా కన్గొన మెంచు నీతగవు లెస్సాయెం బురే యెవ్వరి
ట్లూరం బుటనివింత యన్యగృహమందుండ న్విచారింతురే
రారాపు ల్గొనగావు నేఁటి కొక నేరం బోర్చితిం జాలకో
ర్గోరీ యొచ్చటికైన నఁబోయెదవా పోపో యింతక్రొవ్వేటికిన్. 109

క. ఇది నాయది నాకేళీ, సదనము నీకిందు నిల్వఁ జనునె దురాత్మా
పదటతన ముడిగి యెంతేఁ, గదలుము లెమ్మనిన దీర్ఘకర్ణం డనియెన్. 110

చ. బిసములువల్కి నన్ను వెలపింపఁదలంచెదొ కట్టిపెట్టు నీ
గరపము వెట్టి యీశశశిఖామణిముందర నేడ నెవ్వరె
వ్వరు వసియించి యుండి రది వారిద కానన భూమిజాతకో
టరముల నాఁపువెట్టెనె యొడంబడి పక్షుల కుర్వి చెప్పుమా. 111

క. చెఱువులు బావులు గృహములు, తరువులు వృత్తులు ననారతము గాచినయా
నరుఁ డయవి యనుచు మనువుత్తర మొసఁగఁడె తొల్లి దేవతా సంతతికిన్. 112

క. బలవంతుఁ డైనధరణీ, తలభర్తకుఁ బోలునిట్టితగ వకటవకటా
పులుఁగులకును గుందేళ్ళకుఁ, బలుకులు వేయేల చెల్లుబడి గాదుసుమీ. 113

క. జగతీరుహవివరమునకు, ఖగనాథా నీకులేమ కారణమేలా
తెగిపోర నాకు నీకుం, దగ వెక్కడికేని నరుగుదము ధర్మునడుగన్. 114

వ. మదీయమైత్రీమంజాలం బక్కపింజలం బిట్లనియె. 115

క. ఒప్పితి నిటఁ దగ వెవ్వరు, చెప్పెద రెఱిఁగింపు మతనిఁ జేరఁగ నెడలే
కిప్పుడ యరుగుద మనవుడుఁ, గప్పినతమకమున దీర్ఘకర్ణుం డనియెన్. 116

సీ. తపనజాతటమున దధికర్ణుఁ డనుమహావృద్ధమార్జాలంబు విఖ్యాతిసల్పు
నది రుద్రచాంద్రాయణాదికార్యంబులఁ దనువు సన్నముఁ జేసికొని విరోధి
షడ్వర్గ మణఁగించి శాంతిపాత్రిలుబహువ్యవహారదర్శినయాంబురాశి
యుది నేర్చునన చిక్కువదలింపఁ బెనుజోలి ద్రవ్యైక నిమిషంబు దడయకటకుఁ
తే. బోదమావాద మాఱడి బోకపోవు, నని ప్రబోధించి శశ మమ్మహాకపింజ
లంబుఁ దోకొని చనుచుండె లాఘవమునఁ, దలలు వడుచోటికేగుపాదములు గావె.

క. ఏను గపింజలుఁ జిరమై, త్రీనిధి విడనాడలేక వృక్షులతాగ్ర
స్థాని విడనాడి యెపుడెం, తేనెవ్వడిఁ గూడిపోయితిం జెలికానిన్. 118

మహాస్రగ్ధర. చని కంటిం బ్రాంతకాంతక్షమనిరవధికశ్లాఘ్యసౌరభ్యసంప
ద్వనజాతవ్రాత రోధోవనసమధుమధువ్యగ్రమత్తాళిగీతన్
జనితశ్రద్ధానిమజ్జజ్జనఘనహరణోచ్చండకాండప్రపూతిన్
విరిషక్తబ్రహ్మనిష్ఠద్విజహితసికతాస్యూతఖద్యోతజాతన్. 119

తే. కని తదంచితమణివాలుకావితర్దిఁ, జరణములు మోఁపి నిర్గతశ్రముఁడ నైతిఁ
గంతపర్యంతపరిమిళగ్రాసమంద, జవనపవనాభిగమసమాచారకలన. 120

సీ. మనికిచోటిదిగాదె యనువాసరాచాంతఖచరజీవిత మరుత్కాళియునకు
నాటపట్టిదిగాదె యరివధాగతగోపవేషబృందావనత్రివిష్ణువునకు
నిష్టసజ్జనగృహంబిది గాదె రాసనృత్తాశ్రాంతకాంతావతంసములకు
హాలహాలంబిదిగాదె హాలోద్ధతప్రలంబారిలాంగలలేవి హానమునకుఁ

తే. ప్రతిదినము గ్రోల నిది గాడిబావిగాదె, కృతశకకృత్కరినందగోబృందమునకు
క్షేత్ర మిదిగాదె దివసకృజ్జలజమునకు, నని నుతించితి సంవిదాయమునయమున.
సీ. అచటఁ గపింజల మావృద్ధమార్జాలపతిఁ జూచి చిత్తంబు పల్లటిలినఁ
గదియఁగూడక దీర్ఘకర్ణుఁ జూచి నిజాలతఁగవరి యని వీనిఁ బొగడితీవు
కుటిలమానసుఁ డతిక్షుద్రుండు కేవలజఠరపూరకుఁడు మార్జాలజాతి
బెడిదుండు వీని నమ్మెడితెఱం గెయ్యది యొద్దికిఁ జనఁ జత్తు మొప్పకొనకు
తే. తగవు దయ్యానె యుంగు నీతగవుపుట్టు, ప్రాణమేటికిఁ దెకతేరఁ బాపికొనఁగ
ధర్మమునకొండుకడ కేగునము దురాత్మ, మగుడు మనుబయుఁ గనలి యమ్మదటశశము
చ పలికెఁ గపింజలంబున కపారకృపానిధితుల్యదర్శికే
వలపరిశుద్ధుఁ డార్తజనవత్సలుఁ డుత్తముఁ డబ్బిడాలభూ
తలపతి యిట్టిధర్మపరతంత్రుఁడు నమ్మినవారిఁ జంపఁ గాఁ
దలఁచునె యేమిపల్కితి పతత్త్రిప్రసంశయ మొప్ప దియ్యెడన్. 123

చ. ఇన్నియుఁ జెప్పనేమిపని యింకిట నీవది నంతసాధ్వసం
బున్నబిడాలముఖ్యుకడ కొక్కట నిద్దఱ మేగి సర్వమ
చ్ఛిన్నమనీషవిన్నపముఁ జేయుద మూరకవత్తు మంచు ము
న్నెన్నను గానలేక పిఱుబీకులు సేయ ఖగంబు బీరమై 124
వ యాగపద్యాభిమానంబున శశకపింజలంబులు డాయంబోవుచుండె నప్పు డారెం
టికి నిత్యప్రత్యయం బారాధించుటకుఁగా దధికర్ణుంను ధర్మవాక్యంబు లుచ్చ
రింపం దొడంగె. 125

క. ధర్మంబు తన్నుఁ బెనుచున్, ధర్మం బభివృద్ధిఁబొంది తను బ్రదికించున్
ధర్మము శర్మకరం బని, ధర్మం బేమఱరు సంతతము దత్త్వజ్ఞుల్. 126
ఉ. ఉపగతులై భజించుతనయు ల్సహజన్ములు గూర్మిచుట్టము
ల్విపులతరైకదుఃఖముల వేగుదు రింతియ రారు వెంబడిన్
నిపుణులకేల తన్మమత నెట్టన దేహి శరీరమూడ్చి చ
న్నపుడును ధర్మమొక్కఁడ సహాయము దానిఁ ద్యజింపవచ్చునే. 127
క. పురుషార్థపరున కిహముం, బరముం గలదండ్రు సత్యపరతంత్రు సురా
సుర లర్చింతురు గావునఁ, బరహితసత్యములు విడువఁబడ వెప్పటికిన్. 128
తే ఆత్మవత్సర్వభూతాని యనుపురాణ, వచనమూని బహుప్రాణివత్సలుఁడయి
సుఖము దుఃఖము సమముగాఁ జూచికొనుచు, దేహి పరలోకచింత వర్తింపవలయు.
చ. సొలవక మేను కంటకము సోఁకినఁ గొండొకశోణితంబు పి
చ్చిలి తనకెంతనొప్పి యగుఁ జెప్పెడి దొండొకఁ డేమిదేహులల్

గలిగినవారి కివ్విధముగాఁ దనువేదనలంచు నేరిపై
నలుగుటలేక హింస కెడమైయి చనంగాఁ జనుసద్వివేకికిన్. 130

క. అనుదధికర్ణునిపలుకులు, విని నిర్భయవృత్తిఁ గొంకువీడ్కొని కదియం
జనితనతనవాగ్వాదము, లనుదానికి శశకపింజలంబులు సెప్పెన్. 131

సీ. చెప్పిన నప్పుడాజీర్ణోతువారెంటి కనియె మీరేమనియెదరో వినుము
తెగనిచాంద్రాయణాదివ్రతంబుల దేహ మతికృశం బొనరించుకతనఁ జెవులు
తావకసూక్ష్మశబ్దస్వీకృతిం బాటిగావు గావున నీవు నీవు నిపుడ
శ్రవణము ల్గదిసి యుచ్చైస్స్వనంబులఁ బల్కుఁ డేర్పడ మీసుద్దులెల్లఁ దెలియుఁ
తే. గదవె మమునంటిమునులకుఁ దగవుదీర్ప, వేపురుండంగ మము మీరు విశ్వసించి
దూర మరుదెంచితిరి కానఁ ద్రోనరాదు, జాగుపనిలేదు మాకనుష్ఠానవేళ 132

క. అరుదెండని నికటంబున, కరిగినదధికర్ణుఁ దంష్ట్రిహతి నారెంటిన్
దొరకుపడఁ బట్టుకొని కం, ధరవిరియం గొఱికిచంపి తగభక్షించెన్. 133

సీ. క్షుద్రాశ్రయంబు నొవ్వుటకు జన్పుట కాదికారణం బనిచెప్పి కాకముఖుల
ఖగములఁ జూచి ఘూకంబేడఁ బక్షిసామ్రాజ్యాభిషేకసంరంభ మేడఁ
బనిగానిపని మానుఁడన రోసి కూడినపులుఁగులు చదలఁ బేరెలుఁగులెసఁగ
వెసఁగన్నదెస కుబ్బెసలారఁ బఱచినదర్పాంధ మద్దివాంధంబు గనలి
తే. పసపుజేగురుకొఱకచ్చు మిసిమిచేరు, మిట్టకనుగ్రుడ్లు మిడిమిట్లు మిడిసిపడఁగఁ
గంఠఘూత్కారములదిశ ల్గలవరింప, గర్వదుర్గ్లోకమునకుఁ గాకమున కనియె. 134

క. ఏమినిమిత్తము కుటిలా, త్మా మత్స్వామితకు నెగ్గుఁదలఁచితివే నీ
కేమిదురితం బొనర్చితి, నేమంటి భవద్విరోధినే యిదితగవే. 135

క. శైలవనవహ్నిశిఖలం, గాలిపాదల్పోవదలఁ బరశుగతిఁ ద్రెవ్వి మనున్
సాలములు సత్క్రియా ప్రతి, కులవచోదగ్ధమునుగుకొన దింతైనన్. 136

ఉ. వచ్చితమేమిగూడు సమకూడినరాజ్యము వీటిఁబుచ్చఁగా
వచ్చినలాభమేమి మఱవంబడదా తరువాత నిట్టినీ
యొచ్చెపుఁజేఁత సౌఖ్యమున నుండుదుగాకని పక్కి పోయెన
వ్వెచ్చఁజుమీ విరోధ మొదవెం గరటాళి కులూకజాతికిన్. 137

క. నావిని వాయసపతిచిర, జీవికి నిట్లనియె నీతిశీలా హితసం
భావన కిఁక నీతడవే, లాఁ వేగమ తెలుపు మనిన నతఁ డిట్లనియెన్. 138

వ. సంధివిగ్రహంబు విచారణీయం బాసనము బలిష్ఠమయ్యు నుపస్థితరిపుస్థానం బగుట
నదియునుం గూడదు యానంబునకు లావు చాలదు స్థానత్యాగంబు లాఘవమూలంబు

ప్రత్యాసన్నవిరోధికులం బభానంబగుట ద్వైధీభావంబు పొసంగదు సంశ్రయం
బన్నిటికిం గర్తవ్యంబు విను శరీరపతనపర్యంతంబు నీకార్యంబున కేఁ బాటుపడఁ
గలవాఁడ. 139

క. పలువురకు కృతవైరుఁ డతి, బలధుర్యులు విమతులున్నఁ బరకార్యంబుల్
పొలిసిపడుం జెడు మునుధూ, ర్తులు మేఁకం గుక్కఁ జేసి తొల్లి విప్రున్. 140

క. నావిని వాయసపతి చిర, జీవికి నిట్లనియె నీతిశీలా యేలా
గీవిధము తేటపడఁ జెప్పు, మా వినియెద ననిన నతని కతఁ డిట్లనియెన్. 141

సీ. చెనఁటి యాకులపాటుచే నలంగినసాధుతరుల కుబ్బూసఁగు నాదరణమూర్తి
భీమతీవ్రాంబకాభిహతిప్రక్రియ న మహావధురధర్మునినొప్పి మన్నవెజ్జ
ఫలభంగమున మాటపట్టుజాతిన పైకమునకు సత్యోక్తు లిచ్చినసుదాత
హాలినున్మత్తచండాలుర మాధవార్చనధురంధరులఁ జేసిన ఘనుండు
తే. కాలగతిఁ బేర్చు నలజళ్ళఁ గలఁగఁబడిన, సరసులకు నిర్మలత్వంబు సంఘటించు
సౌఖ్యసందాయకుండు సాక్షాత్కరించె, సన్మతానంతుఁ డవనిఁ బసంతుఁ డంత 142

సీ. ముక్తపత్రవ్యాజమునఁ జీరపడలించి కళికలఁ బ్రవాళకల గలుగఁ జేసి
పాలిపోనితావులఁ బూవుదండలఁ జుట్టి కడలేనిమధుసాత్త్వికమునఁ దెల్చి
రణదళిఝుంకారమణితము ల్పుట్టియించి దీవిచక్కెరలూటు మోవియాని
పరవినున్నతఫలస్తనములఁ గబళించి కళదేఱుతనువల్లి గౌఁగిలించి
తే. కలికిరాచిల్కపల్కులఁబల్కుల నలర్చి, సుగభికర్పూరరజముల సొంపొనర్చి
కలితవనలక్ష్మిఁ గూడి రాగము వహించె, మాధవుఁడు వ్యాప్తనిఖిలకుమాధవుండు.

వ. మఱియు నవ్వసంతంబు కళికాభిరామంబై యుదాహరణంబును శుకసూక్తి సందర్భ
గర్భితంబై భాగవతంబును గలకంఠకలాపదీపితంబై రాజానురోధంబును బ్రకాశిత
ప్రవాహంబై సముద్రతీరంబును సందృష్టశారికాజాలంబయి వీణాయంత్రంబును
బురుడించు నక్కాలంబున. 144

చ. కలఁ డిల ముగ్ధభూసురుఁ డొకానొకఁ డాయనయస్వార్థమై
బలిసిన మేఁకపోతు మెడ పగ్గమునం బిగియించి యీడ్చికొం
చలవున నింటికై యరుగ నప్పుడు గొందఱు ధూర్తులిచ్చలో
పలఁ దలపోసి యయ్యజముఁ బాపఁ దలంచిరి దుర్ణయంబునన్. 145

క. తలఁచి యొకఁ డొకఁడ చని లో, కులు నవ్వ న్విప్రుకడఁ గొనిపోయెదు ని
నులశీలంబులు పలుదం, గలపితి విటకేమియని వికావికనగుచున్. 146

క. ఈగతి నందఱు యాజన, చ్ఛాగముఁ గుక్కముఁ జేసి చనుచుండంగా

నాగరిక మేదినీవిప్రుఁడు, వేగలమున నిలిచి భ్రాంతి వికలుం డగుచున్. 147

క ఒకరిరువురు గా కందఋ, నకటా ఛాగంబుఁ గుక్కయని పోయెద రే
టికి బ్రమసి వేఁపిఁ దెచ్చితిఁ, దుకతుక నను నవ్వుకుందురు తత్త్వజ్ఞుల్. 148

వ అని విహరణస్థలదచ్ఛాగం బగుభాగంబు విడిచి విప్రుండు ఘూర్ణశరం బగుకాసా
రంబునకు స్నానార్థియై చనియె నప్పుడు ధూర్తులు ప్రహాసభాసమానాననులగుచు
నొండొరులకరంబు ఒప్పళించుకొనుచు నయ్యజంబుం జంపుకొని భక్షించి రట్లు
ప్రజ్ఞాశౌర్యధైర్యాదిగుణంబులు గలవారలు పరులకార్యంబుల విఘాతంబు సేసి
స్వకార్య ముద్ధరింతురని పుణియుఁ జిరంజీవి మేఘవర్ణు నాలోకించి. 149

క. తనలావుఁ జూచి మృతికా, కనికాయశరీరరక్తకణములు మేనన్
జినికినటతటమునందిడి, చనుఁ డుపహతిరహితభూమిజాతంబులకున్. 150

క. అరిమర్దనుండు సరిస్రా, ద్దరుదెంచుం గెరలి తరలి హతశేషరట
త్కారటప్పాతికటభజింతున్, హరుఁ డాపగవారిఁబోలె నాపగవారిన్. 151

వ కోజించి నీకార్య మార్యసమ్మతంబుగా నిర్వహింపం గలవాఁడనని పలికిన మేఘవ
ర్ణుండు లుంఛితగరుజ్జాలుం గావించి విస్రం బగు కాకజఠరాస్రంబుఁ జినికి యాచ్చి
రజీవిని న్యగ్రోధాగ్రకోటరంబునం బెట్టించి సపరివారుండై నియమహతిస్థానం
బున కరిగె నాసమయంబున. 152

చ అరుణగభస్తిబింబ మపరాద్రిఁ దిరోహితమయ్యెఁ బన్నగా
భరణశిరోధిహాలహాలఫంగి నిబు ల్మెరసె న్విరోధిభీ
కరగతి వంతకాఁబపరిగాఢమహీధరభూజదుర్గకో
టరములు నిర్గమించి వికటప్రకటాననము ల్మడింనుచున్. 153

క అరిమర్దనుఁ డనుపబల, స్ఫురణోల్లోకములు ఘూకములు నటకరటా
హరణేచ్ఛఁ గదలి బహుపా, ద్ధరణీరుహ మాశ్రయించి తద్విటపమునన్. 154

క. కాకములు మెదలకున్నన్, ఘూకంబులు కర్ణఘోరఘూత్కారహతా
శాకులము లగుచుఁ గ్రమ్మఱి, పోకవ నడాలిడుచున్నపుడ భూజమునన్. 155

క. మతివిదులకు నుచితమనూ, ద్యతనము సారంభుఁడయ్యు నాకృతకార్య
స్థితిఁ గడఁగనియునికి మహో, న్నతియని మను వానతిచ్చినాఁ డట్లగుటన్. 156

క. అనితలఁచి నిలిచి శివిం, బనివడి చిరజీవి యేరుపడ నొకనెట్టం
బొనరించినఁ గ్రమ్మఱి పరి, మునుమై యుత్తోలులఁ జుట్టుముట్టె న్వెట్టెన్. 157

క. పట్టుకొని చంప నొంపం, గట్టాయితపడక యరుగుఁ గావున నతనిం
జుట్టమువలెఁ గొనిచని పతి, కట్టెదురం బెట్టి కౌశికంబులు నిలిచెన్. 158

క. దూరితగరుదుత్కరుని, ప్రారుణఘనలోహితాక్తతాకృతి నతనిన్
దేరికొనఁ జూచి గర్వస, మారంభోక్తృ విరోధిమర్దనుఁ డనియెన్. 159

క. ఓరీ నీవెవ్వఁడ వీ,తీరేమిటికైతి వనిన ధృతిపెంపున నా
పేరు చిరజీవి యనిన య,పారగుఁ డాయన యులూకపతి కెఱిఁగించెన్. 160

క. ఎఱిఁగించిన మించిన ని,వ్వెఱ నిట్లను ఘూకలోకవిభుఁ డిట్లగుటే
తెఱఁగు చిరజీవి విన్నఱ, మఱలే కర్కరరాజు మన్నించుఁగదా. 161

వ. దివస్పతికి బృహస్పతియుంబోలె మేఘవర్ణునకు ముఖ్యప్రధానుండవు నీతిపథికుండవు
ధన్యుండవు నీయట్టి కృతకృత్యునకు నిన్నిచదర రానేర్చుకొక్కో సర్వంబునుం
జెప్పుమనిన జిరజీవి యరిమర్దను నాలోకించి. 162

చ. తన పెనుగాకిమూఁకల నదాటున నీభటకోటి చుట్టి కా
వనితఱిఁ జంపి చన్నమఱునాఁడు మృతేతరభృత్యవర్గము
ల్గనుకనిఁ గొల్వ నచ్చిలిచి కార్యము వాయసభర్త వేఁడినన్
మనమునఁ గొంకులేక యరిమర్దనునిం గనుమంటి నాతనిన్. 163

చ. ఘోరబలుం డగాధతరకోటరదుర్గవిహారి రాత్రిసం
చారనిరంకుశుండు పటుశౌర్యధనుం డరిమర్దనుండు క్రూ
రోరగభంగిఁ జంపఁదలఁచుండఁగ నెవ్విధి నిద్రవచ్చు నీ
వారికి నీవు నెట్లు మనవచ్చు శుభంబు భజింపుమా యనన్. 164

క. అరిమర్దను నిటఁ గని మని, తిరిగినజమునోరు దన్నితివి నాబుద్ధిం
జరియింపు మనిన వాయస, పరివృఢుఁ డందులకు మండిపడి నావంకన్. 165

ఉ. చూచి హితప్రధానుఁ డనుమన్మదిఁ బెద్దయు నమ్మినాఁడు ని
న్నీచు విరోధిపక్షుఁ డని నేరనయో తుది నిశ్చయింప నిం
దీవెడుగొట్టుకాల్నిలిచె నేఁటిజెశుం బ్రతుకించు నూఁచిపో
నైచి యులూకభుక్తికి కినవత్సలుఁడై విడిపించె మజ్జిషైన్. 166

తే. ఎఱుక పెడికెడు ఘనమంచు రదినిజంబు, నెరయ నీమూఁకమున్న నన్నెఱుఁగుఁగానఁ
గనలి చంపక కొంపక గారవమున, దేవ నీపాదములమ్రోలఁ దెచ్చి నిలిపె. 167

తే. తోడిమంత్రులజాడ నాదుర్మదాంధుఁ, డాడిన ట్లాడ కుచితకార్యంబుఁ జెప్ప
సిగ్గుగోల్పోతినని చిరజీవిజాతి, బాష్పుఁడై చెప్పెఁ దనచేటుపాటుఁ బతికి 168

క. ఆవేళ ఘూకపతి నయ, కోవిదు లగుమంత్రివరులఁ గూర్చి ప్రభుత్వ
ప్రావీణ్యంబున నచ్చిర, జీవిచరిత్రంబుఁ బ్రీతిఁ జెప్పెం దెలియన్. 169

తే. చెప్పి వాయసరాజన్యశేఖరునకు, మాననీయుండు ముఖ్యప్రధానుఁ డితఁడు

దీని కెయ్యది తెఱఁగు వేర్వేఱఁ బలుకుఁ, డనిన నయదత్తుఁ డంత రక్తాక్షుఁ డనియె.

క. చేరినమృత్యువు రిపుఁ డ, క్రూరాత్ముఁడు చిక్కినపుడ కొంకక చంపం
గోరుట నీతివిధానము, వైరికి దయఁదలఁచువెఱ్ఱివాఁడుం గలఁడే. 171

సీ. ఇతఁడు వాయసధరాపతికి మాన్యుఁడు ముఖ్యదండనాథుఁడు నీతిధాముఁ డనుచు
నానతిచ్చితి నిట్టివానికి నిట్టిదుర్వేషంబు వచ్చుట వెఱగు గాదె
ప్రత్యర్థికర్మమర్మము లెఱుంగుటకు రాజ్యప్రతిష్ఠకు నిట్టిసాధుమతులు
విను నీచవేషమైనను బూని బద్ధవైరులలోఁ బ్రవేశించి చెలిమిఁజేసి

తే. చిచ్చు దోలిసొచ్చి వృక్షంబుఁ జెఱచినట్లు, పొదివి నానాటి కభివృద్ధిఁ బొందఁ బిదప
జెఱిచి పోదురు వీనిరక్షింప నేల, చంపి రాజ్యంబు సేయు నిశ్శంక నధిప. 172

క. అని రక్తాక్షుఁడు చెప్పిన, వినఁగూడక ఘూకభర్త విశ్రుతనయధీ
ధనదత్తునిఁ గ్రూరాక్షుని, గనుఁగొనుటయు నతఁడు మధురగతి నిట్లనియెన్. 173

క. శరణాగతు రక్షించిన, పరహితచరితున కిహంబుఁ బరముం దుదగా
ధ్వరఫలముం గలదనిరొ, యరిమర్దన కావు మిమ్మహాచిరజీవిన్ 174

తే. అనుచు గ్రూరాక్షుఁ డాడిన నద్దిరాంధ, వల్లభుఁడు విని దీప్తాక్షునంకఁ జూచి
నీకుఁ దోఁచినకార్యంబు నీవు సెప్పు, మనిన నంగీకరించి యిట్లనియె నతఁడు

క. క్రూరాక్షునినీతి సుధా, పూరంబరి యెట్టిదుస్స్వభావుఁడు జంపం
గోరఁడు శరణాగతు నన, ఘూరాజకు నీకుఁ దగవు గానేర్చునొకో. 176

క. ఈరీతి నీతిగలిగిన, సూరిజనం బేలచెఱుపఁ జూచుం జనతా
వైరి యగుదొంగబంటుప, కారము న్నగ్ధునకుఁ దొల్లి గావింపఁడొకో 177

క. నావిని యరిమర్దనుఁ డురు, భావుని దీప్తాక్షుఁ జూచి ప్రభునీతికళా
సేవధి విన నింపయ్యెఁడు, నావిధ మెఱిఁగింపు మనిన నతఁ డిట్లనియెన్. 178

చ. కుండినరాజధానివసుగుప్తుఁ డనంగఁ బ్రధానసార్థవా
హుం డఖిలార్థవంతుఁడొకఁ డుండు నతండు ప్రియావియుక్తుఁడై
పండినమూర్తితోఁ డనగుపాటున కుంకుచుఁ దన్వి నొందుచో
నండజయాన రూపవతి యున్నొకకన్యకఁ బెండ్లియాడినన్. 179

క. అఱయం బ్రాయపుఁగన్నుల, కలికికి ముదిమగఁడు బూచి గావున గవియ
న్నిలతైలమువలె నెనయక, తొలఁగుం జెలిసెట్టిఁ గన్నఁ దుప్పాననుమియున్. 180

క. పతిఁ బంపొంగులుచు నెట్టన, రతిగతికిం బిన్నపడుచ రారమ్మనుచుం
బతిమాలి పిలుచు విన దది, పతిఁబట్టిన చెవుడు దమ్ముఁ బట్టినభంగిన్. 181

మ. పలితశ్మశ్రుశిరోజరోగలతికోపఘ్నున్ దనుర్భంగురున్
వలిముగ్వక్త్రసితస్రుతశ్చలితనిస్వాస్థోత్తమాంగుం గర

స్థలయష్టిం బటలావృతాక్షు విగళద్దంతు న్వయోగర్వని
స్తుతయోషిత్కుల మేర్పడం బరిహరించు న్నాలవాఁ డింబలెన్. 182

సీ. పాఱవేయుటె కాని భక్ష్యంబు లిచ్చిన వాతెర నంటు దవ్వాలుగంటి
చించివైచుటె కాని చీరలిచ్చినఁ గటీరమునఁ గైసేయు దాఱంపులాడి
త్రోలఁగఁబెట్టుటె కాని తొడవులిచ్చిన సొంపుపస మేనబూన దప్పలువచెలువ
మగుడనిచ్చుటె కాని మాపలిచ్చిన ముల్లెఁ గట్టి దాఁచఁగజాలఁ గలువకంటి
తే. యింటిముంజూరు పెండెలో నిడుటె కాని, పుష్పములిచ్చిన ముడువ దప్పాగరుమగువ
కుడిచి కూర్చుండి యిదియేమిగొడవఁ జేసె, వార్ధకంబున నా సార్థవాహకుండు 183

ఆ. చెనఁటిభార్య పేరుఁ జెప్పఁగ పెఱబోఁటి, పేర సిగ్గుఁ దొలఁగఁ బెట్టె సెట్టి
ముదిమి నేడ వోఁత యిదె నాకవిటవిటీ, జాతి వశ్యభేషజంబు లడుగు. 184

సీ. మొరడువంగిన సెట్టిముదుకకు జవరాలిమోము గానని వాని ముకురమయ్యె
నగ్గుభర్తకు నాఁతి వాతెర చండాలవాటిపండిన పిండివంటలయ్యె
గొయ్యలాడిన పెండ్లికొడుకుకుఁ జెలినవ్వు విపినమండలిఁ గాయు వెన్నెలయ్యె
వయసుపోయిన బేరివానికి సఖిచన్ను గొండలందని మానిపండులయ్యెఁ
తే. బలితునకుఁ గోకిలాలాపజిలుగు బెలుఁగు, బధిరునకు నయిన సంగీతపాకమయ్యె
మెలఁత నీక్షించి గుక్కిళ్లు మ్రింగుఁ గాని, సౌఖ్యమేమియు నెఱుఁగఁ డజ్జరఠముఁడు.

చ. నెల కొకనాఁడు గట్టెదుర నిల్వఁగఁ జూచినవాఁడు గాఁడు వీ
నుల కొకనాఁడు మాటవిన నోఁచినవాఁడును గాఁడు నవ్వులన్
వలపులఁ జల్లమెగ్గినవాఁడును గాఁ డలఁ డెందువాఁడు గాఁ
డలజవరాలితోడి రతి యందని మ్రానిఫలంబు సెట్టికిన్. 186

వ. ఇట్లు సన్నిహితవిశేష వేదనాజాత ఖేదంబున నారాటంబు బుట్టి యడియాసపస నుసు
రుఁ బరిత్యజింపంజాలక ఈలకలుమకొని యెడతెగక నిగుడు నమందోష్ణనిశ్వాస
మాతరిశ్వంబున నధరపల్లవంబు బల్లలనాడ నతం డొక్కనాఁడు శయ్యాతలంబున
నొడలుపడవైచి దాసీజనంబులు తనకాచరించు మూడిగంబులఁ గోడిగంబులం జేసి
కూడునీళ్ళకుం బాసి గాసిపడు సమయంబున రజస్వలాంభోజినీదివాసంగమక్రీడా
సంప్రాప్తదురిత ప్రాయశ్చిత్తార్థంబు భృగుపాతం బొనర్చినవిధంబున దపనుం డపర
గిరిఁ దిరోహితుం డయ్యె నయ్యెడ. 187

సీ. పిసవెత్తిఱంకుగుబ్బెతలతప్పులు దప్పదాల్చుట కిది కన్నతల్లియిల్లు
కడుపుకక్కుఱితిపిల్పుడుగను ముదిలంజె నఱుదుల కిది పిన్నకసుసుమంగు
గడికన్నగాండ్రయక్కఱలకు నిలుచూఱ సొమ్ము సొమ్మిదనిది పూఁటకాఁపు

కలవ ర్తకుల కన్నుఁగవఁ బాయనినిద్రఁ గదలింపనిది నిమ్మకాయపులుసు

తే. ప్రభుఁ బాసినకుముదినీపత్రనేత్ర, రంజనంబున కిది విశుద్ధాంజనంబు
నాఘనాఘనకాళిమోన్నతి నహించి, కటికిచీఁకటి జగమెల్ల గప్పుకొనియె. 188

తే. మానసాటవి నేర్చుమన్మథదవాగ్ని, బాహ్యసంచారమునకుఁ బాల్పడియె నవఁగ
దీపములు సార్థవాహమందిరమునందుఁ, బ్రకరశిఖ లుల్లసిల్ల జూపట్టినపుడు. 189

క. ఆరూపవతి సనాథా, హారంబుల నృప్తిఁబొంది యపుడొకభంగిం
బోరామి ఘోరనరక, ద్వారముగలె వృద్ధపతినివాసముఁ జొచ్చెన్. 190

తే. చొచ్చి వచ్చినచండాలుఁ జూచుమాడ్కిఁ, జూడ కల్లంత నోసరించుమ గృహాంత
కాంతభిత్తికఁజెంతఁ గంకటికి నరుగు, బిటికి నీక్షించి యప్పటిపెద్దసెట్టి. 191

తే విరహదహనగ్రహంబున విగ్రహంబు, కొలిమి నూఁదినగతి వేఁడి గలిగియుండ
సెజ్జ నాజాబపకుమ నక్షీణవిభవు, భల్లకంపితభవు మనోభవుఁ దలంచి. 192

ఉ తేరె ధనుర్ధరు ల్పుడమి లెక్కకు మిక్కిలి యొంటు రెంటుగా
వా రడరింతు రేటి నెఱవాదితనం బదిరెంటు నొండుగా
నారసి వేయనేరవలదా మతినీవలె నెంతవింత యా
నీరజగర్భుఁ డుండుఁ గడునీకరకౌశల మెన్న మన్మథా. 193

ఉ ఇఁపున నన్యచాపధరు లేసినతూపులు బాహ్యమాంసముం
జింపక మర్మభేదనముఁ జేయుఁగఁజాలవు బాహ్యమాంసముం
జింపక మర్మభేదనముసేయు భవద్విశిఖంబు లెల్లుగే
రింపుదు నీదుచాప మిపధీరితశంబరకాంచనాంబరా. 194

క. తీరనికోలపగయుంబలె, నీరమణీమణికి నాకు నెనయమ విరహాం
భోరాశి నెల్లుగవత్ను, నీవ్రోత్తమ నన్నుఁ గూర్పవే కలకంఠిన్. 195

క. అని వెన్నునికో ర్కొ మరు, న్వినతామగు విరహివ్యథదవిధసమునుఁ గన
త్కనకమణినిచయచామరు, ననుఒక్తభ్రమరు దూటి యతఁ డున్నంతన్. 196

తే. నరలగతి మజ్జనములాడి కుడిచి కట్టి, ప్రజలు నిద్రించి రయ్యర్ధరాత్రవేళ
ఖడ్గఖేటకపాణియై గస్తుదిరిగెఁ, బెద్దతలవరి కింకరోపేతుఁ డగుచు. 197

వ. అంత. 198

సీ. భవనదీపాహితభ్రమరపేటికవాలు కాగ స్త్రితలము ళ్ళుగద్దగోళ్ళు
ములుదోరణముబట్టు మొలత్రాటిమలువాఁడికైదువు దెసకట్టు కావుబొట్టు
జిలుఁగుగన్నపుఁగత్తి బలపంబు మొగమాయమందు తొలపుటాకు మైలగోఁచి
మడుపుటాకులు పోఁకపొడికాయ మోరచ్చు చెప్పులు భుజగవృశ్చికచికిత్స

తే. సుప్తివృద్ధికరౌషధక్షోద మసిత, వసనఖండంబు పెపతలనంకసికయుఁ
గాలునును మేను నెజ్జిలికన్ను లమర, దూరితత్రాసుఁడపుడొక్కఁడొంగబంటు 199

సీ. వచ్చి త్రిమ్మరుతలవరులు గన్గొనకుండ బవరిమట్టును బలపమున వ్రాసి
ముంచి కన్నపుఁగత్తి మొనకెత్తిపెట్టించి యొయ్యనొయ్యన శిలలూడ దివిచి
వివర మేర్పతిచి యావెంబడి బదములు వదపి నల్వంకలు దవవిచూచి
యలికిడిలేకుండఁ దెలిసి యిల్సోరఁజొచ్చి వాకిటికడియ నెవ్వడిసవల్చి

తే. గాలిరాకుండ వెలుతురు గాకయుండఁ, గఱకుగఱబట్ట గన్నపుగండిగప్పి
యొడలిసొమ్ములు వేర్వేర నొలిచికొనఁగ, సరస కేతేర బరికించి జడదరించి 200

క. కచభరము విరియ హార, ప్రచయం బల్లాడఁబఱచి పరిరంభించెన్
రుచిరగతి రూపవతి నిజ, కుచలికుచాగ్రములు నాఁటుకొనఁ బ్రాణేశున్. 201

సీ. యువతిసేసిన యపూర్వోపచారమునకు వెసమిన్నుముట్టి యమ్ముసలిసెట్టి
యిచ్చునచ్చెరువంది ముచ్చటయిననుమొగం బీనిరక్కఁస దనుదాన వచ్చి
ననునిటు గౌఁగిలించినది నేఁడింపుకుఁ గారణం బేమొనిఁ గలఁగవలయు
ననిలేచి నల్వంక లరసి యొక్కెడ భయంకరహేతికరునిఁ దస్కరుని గాంచి

తే. యితఁడుపో మూల మీశుభస్థితికి ననుచుఁ, బెన్నిధానంబుఁ జూచిన పేదవోలె
నీరదోదయ మరసిన నెమ్మివోలె, సమ్మదంబంది యాపరాస్కంది కనియె. 202

క. పొడపుఱుపుంబలె ననుఁ దన, కడకన్నులఁ జూడరోయుకిన్నులకలికిం
గడువేడ్కఁ గూర్చితిఁక నె, క్కడఁగలఁ డిటువంటిచెలిమికాఁ డారసినన్. 203

క. మానగుమహిజక్రోడ, స్థానంబున వెలుఁగుమదనదావానలకీ
లానివహము చల్లార్చెను, దీనిపయోధరము లద్వితీయచరిత్రా 204

క. చోరకుఁడవె యతిసమ్మద, కారకుఁడవుగాక తీర్చగలవే నీని
ల్కారర్ణ మీభవంబున, దూరీకృతకలుష వడ్డితోడం గూడన్. 205

క. తనగృహమునఁ గలవాసో, ధనక నకము [illegible]
గొని చనుమని యంజలిసే, సినఁ జోరుఁ డతిప్రసన్నచేతస్కుండై. 206

చ. నెఱయఁ జెలంగియున్నయతినిం గని యిట్లను సార్థవాహ యి
త్తెఱవ భవన్నియోగమునఁ ద్రిమ్మరదే యది క్రొత్తగాదె నా
మఱఁదివి నీవు చెల్లెలిది మమ్మిలలోకముఁ జేసికాదె బ
ల్వెఱపున నిన్నుఁజేరి పొదవెం దనచక్కనిసోగచేతులన్. 207

క. నీనిలయంబునఁ గలసొ, మ్మేనొల్లం బడుచుకరణ మిచ్చితిసిది నీ
తో నలగిన వేసారిన, చో నను మఱఁదలఁపు మఱయు చుం ఒఱ తెంతున్. 208

క. చెలియలనిచూడఁ గినిసిన, దలఁ గోయుదుఁ బతికి సమ్మదము గానిది య
వ్వలకేల హితులకేటికి, లలనామణి యిది మొదలై మెలఁగు నీయాజ్ఞన్. 209

వ. అని భయంబుఁ బుట్టించి కృతసత్కారుండై చోరుండు సార్థవాహు వీడ్కొని చని
యె నాసమయంబున. 210

సీ. రాజాస్యముఖతామరసవాసనల గ్రుక్క నానుముక్కునబంటి యైనదనుక
ధరపయోధరసుధాధరరసంబునఁ జొక్కుఁ బంచబాణపిపాస పాయుదనుకఁ
జంచలేక్షణఘన స్తనగుళుచ్ఛకముల నలముహస్తగ్లాని దోఁగుదనుక
నాతిగాఢాలింగనమునఁ దెప్పలఁదేలు బొంది తాపము శాంతిఁ బొందుదనుకఁ
తే. బ్రాయ ముడిబోయి కసరింకఁ బాటియుండు, పంటిచాట్పున నెఱవేరుపడినయొడలి
పరుసు సెట్టిన బీదచే పడినపగిదిఁ, గులుకుగుబ్బెతవయసెల్లఁ గొల్లలాడె. 211

సీ. ఉదయవేళకుమున్నె నిదురమేల్కనివచ్చి ప్రాణవల్లభుపదాబ్జములవ్రాలు
వ్రాలి నిర్మలతరజ్వలనతప్తసువర్ణకలశోదకంబుల జలకమార్చు
జలకమార్చి సపద్వశర్వరీశాతపోత్తాలచేలంబులఁ జాల్పనిచ్చు
నిచ్చి పొచ్చములేక హేమపాత్రంబున నిష్టాన్నముల భుజియింపఁ బెట్టుఁ
తే. బరిమళముఁ బూయుఁ గపురంబు సురటి విసరుఁ
బూవుదండలఁ జుట్టుఁ దాంబూల మిచ్చు
బడక సవరించుఁ జిటిపొటినడుగులొత్తు
నలముఁ గౌఁగిట నాతిచోరాతిభీతి 212

ఉ. ఏరికినైనఁ జోరుఁడు సుహృత్తముఁడే యతఁడేలనే సెస
త్కారము సార్థవాహునకుఁ గన్గొన నిచ్చిరజీవితావకీ
నారికి ముఖ్యమంత్రియగు నైనను నీతిపరుండు గాన నే
తీరుననైన నిట్టిసుమతిప్రవరుం డశుభం బొనర్చునే. 213

క. అని దీప్తాక్షుఁడు చెప్పిన, విని యరిమర్దనుఁడు నీతివిభవవిలాసున్
వినుతాసువక్రనాసుం, గనుఁగొనుటయు నతఁడు కౌశికప్రభు మొగమై. 214

క. కంటకులు రిపులు దమలో, నొంటకపురిఁబాసి యూర నొకఁడై వినుమి
ట్లొంటిఁ గృశియింపుచుండుట, గెంటనిశోభనము గాదె క్షితిపా నీకున్. 215

ఉ. ఈతఁడు మేఘవర్ణునకు నిష్టము గల్గినవాఁడు సత్క్రియా
న్వితుఁడు రాజకార్యపరినిష్ఠితుఁ డితఁడు లేమి లేమిను
మ్మాతని కూర్చితేకవిజయస్థితి నీ కితఁ డున్కిఁ జేసి వి
ఖ్యాతివిహీనతుశత్రుబలహైన్యము నీకు శుభంబు గాదొకో. 216

క. వైరులు రాయుట హితస, త్కారమునక యాసువుల్చెచ్చెఁ దస్కరుఁడు లక్షు
క్షీరమహాగోద్వితయము, రాఁపున గృహికి బ్రహ్మరాక్షసుఁ డిచ్చెన్. 217

క. అనవిని యరిమర్దనుఁ డా, నన మలరఁగ విక్రమార్కునకు నిట్లను ది
గ్వినుత నయప్రథ యుక్కథ, వినవేడుక యయ్యెఁ దెలుపవే నాకనుడున్ 218

వ. విక్రమార్కుం డిట్లని చెప్పం దొడంగె. 219

చ. కృతవిదధీశ చెప్పెదఁ బరిగ్రహలబ్ధము భూరిదుగ్ధగో
ద్వితయము పొల్చు నొక్కజగతీసురు లోఁగిట దానిఁ బంచ నా
మతి నొకటన్ హరింపఁ మటకు మందచుచుం డనుతస్కరుం డభి
ప్రతిభవకాలకూటరుచిబంధుర మైనయమానిశీకటిన్. 220

క. నెప్పెఱుఁగక చనఁ గానల, చొప్పున నొక బ్రహ్మరాక్షసుం డెదురుగ నా
దెప్పరపుఁబ్రచ్చు నచ్చోఁ, దప్పక వీక్షించి యద్భుతధ్వనిఁ బలికెన్. 221

క. ఓరీ యిటులూ రెడునీ, దారుణనిశి నెందుఁ బోయెదవు చెపుమా దు
ర్వారత్వర ననుటయు నల, చోరకుఁ డా బ్రహ్మరాక్షసున కిట్లనియెన్. 222

క. జయసిద్ధి యనఁగ రాముఁడు, నయనంబునఁ గలదు గోద్వయము దాని నతి
ప్రియతం గొని చనునాతఁడ, నయిపోయెద నొంటి నిమ్మహారాత్రమునన్ 223

ఉ. కందెనదా యుచా యికొలిఅ కచ్చులమేళ్లము లక్షగోళ్లము
ల్గుందెనమాయనోరుసుసిగొయ్యలదండులుపంశు లిట్టిరా
పెందును జెప్పఁ జూపనరు దెవ్వఁడపీఁని వేఁడినం దరా
స్కందికి బ్రహ్మరాక్షసుఁడు సత్యపురస్సరభాషనిట్లనున్. 224

క. ఈనిశ నిట నేవిప్రుని, ధేనువులం ద్రాట నీవు దివియుటకై చో
రా నేఁ డరిగెద వతని న, తానకమునఁ జంపఁబోయెద న్బలలాశిన్. 225

క. నావిని చోరకుఁ డంతం, బోవక యనునిన్నిశీథమునఁ గ్రోధమునన్
భూవిబుధుఁ జంపఁబోయెదొ, కో వాఁ డెటువంటి నేర మొనరించెనొకో. 226

క. కారణముఁ దెలుపుమన నల, చోరకునకు బ్రహ్మరాక్షసుండను రజనీ
చారపలాయనమంత్రిక, శౌర్యాఢ్యుఁడు గాఁడె యరయ నవ్విప్రుండున్. 227

చ. జరఠకపిశ్మశ్రుకంఠ్రములు సాంబిలంబు లగా నింబకో
టరములు మట్టిమానితొలుట లైనురావుంతొట్టిలు న్మహా
నిరవధితంత్రిణీమహీజనిర్వ్యథనంబులు తొంగిచూడరా
దరసిన బ్రహ్మరాక్షసుల కద్దరణీసురుచేతి రాయడిన్. 228

క. మెఱమెఱసి యద్ధరామరుఁ, బఱిమార్పం బోవరాదు బ్రహ్మకునైనన్

మొఱఁగి నిదురించువో నిది, తఱి యగుటం జంపఁబోయెదం బదమనుచున్. 229

వ. ఇరువురు చని యవ్విప్రగృహంబు ప్రవేశించి రందు బ్రహ్మరాక్షసుండు ప్రతి
రోధి కిట్లనియె. 230

క. తొలుదొలుత నరిగి విప్రుని, బొలుపారం జంపి కడకుఁ బోయెద నాలోఁ
దలఁకక నీ వరిగి నిరా,కులవృత్తిం బసుల నాఁచికొనిపొమ్మొకటన్. 231

క. తీరిదియని చెప్పినవిని, చోరకుఁ డా బ్రహ్మరాక్షసున కను నీద
ర్వారంభ మెఱిఁగిరేని మ, హారభసము పుట్టు నీగృహంబున నకటా. 232

క. ఈనెఱి నలికిడిపుట్టిన, ధేనువులను మ్రుచ్చిలింపఁ దీఱునె నాపూఁ
పైనతరువాత దూరము, గా నరిగినమీఁదఁ జంపు కాదన విప్రున్. 233

ఉ. నావిని బ్రహ్మరాక్షసుఁడు నన్నిటులాడఁగ నెంతవాఁడ వీ
లేవడి నిన్ను వేఁడ నవులేకలిగెం దొలుదొల్త నిద్ధరా
దేవునిఁ జంపెదం గనలు దీఱఁగ నం చడరంగ దొంగయుం
బోవను పోవ మం చతనిభూరితరధ్వని నడ్డగించినన్. 234

వ. అక్కలకలంబు విని బ్రాహ్మణుండు మేల్కనియె నప్పు డతనికి విశ్వాసంబుఁ బు
ట్టింపందలంచి 235

క. మును బ్రహ్మరాక్షసుం డి,ట్లను ననఘా తావకీన మగుగోద్వయమున్
గొన నున్నత్రాసదీపితుఁ, డని చోరునిఁ జూపె నిజకరాంగుళికోటిన్. 236

క. చోరుండును బటురౌద్రా,కారుండై నినువధింపఁగా నదయుండై
చేరినక్రూరుం డితఁడని, యారాక్షసుఁ జూపె భూసురాధ్యక్షునకున్. 237

క. నేరముఁ దప్పించుకొనం, జోరుండును బ్రహ్మరాక్షసుండును దనతో
నీరూపునఁ జెప్పినముఖ,సారసరిపుమీఁద హాసచంద్రిక మెఱయన్. 238

క. ధరణీసురుఁ డిట్లను మీ,రిరువురు పరమాప్తు లనఘు లిందెవ్వరిపైఁ
గెరలెదము చనుఁడు గాఢ,త్వరఁ గ్రమ్మఱ మీరు మీనివాసంబులకున్. 239

క. దీవింపవలవ దవనీ,దేవత లామోదవనధిఁ దేలిన శాపం
బీవలవ దలఘుసంతా,పావిలచేతస్కు లమ్మహామహులయినన్. 240

వ. బ్రాహ్మణద్వేషంబులేక బ్రతుకుం డని వీడ్కొలిపినం బోయి రాచోర బ్రహ్మరాక్షస
వివాదంబు జయసిద్ధికిం బోలె మేఘవర్ణ చిరజీవి సంవాదంబు నీకు నిస్తులకల్యా
ణంబుఁ జేయునని విన్నవించి వక్రనాసుండు వెండియు. 241

సీ. తనమేనికండలు దఱిగి డేఁగకు మెచ్చి ఖగముఁ గావఁడె శిబిక్ష్మావరుండు
గరుడుని కావరకఱళిపై నాగేంద్రవరుఁ బ్రోవఁడే మేఘవాహనుండు

నిజకళత్రద్రోహి నిర్దయాత్ముఁ గిరాతు మనుపఁడే విశ్వప్రమైత్రిపత్రి
శత్రుసోదరువిభీషణు సమిద్భీషణు రక్షింపఁడే తొల్లి రాఘవుండు
తే. సకలదిక్కామినీకుచస్తబకములకుఁ, దారహారకలాపమై తద్యశంబు
నేఁడు నాఁడును నున్నది నిత్య మగుచుఁ, గంటె శరణార్థి మనుచుటకంటె శుభము.

సీ. అని వక్రనాసుఁ డిట్లాడుమాటలు విని యందఱు వేఱ్వేఱ నసుకుబుద్ధి
నపుడు దివాభీతనృపతివికారకర్ణునిఁ జూచి తోఁచిన ట్లనఘ నీవు
పోలినతెఱఁగుఁ జెప్పనుగాక యనునంత చెడసొచ్చి రక్తాక్షుఁ డిట్లనియె
నేకార్య మెఱుఁగుదు రిందఱు పలుగూఁత లఱచెద రవివేకి పగుటఁ జేసి
తే. మంత్రులకు నైజములు మృదుమధురఫణితు,లవి యథార్థీకరించి వాయసముఁ బెంచి
యేలచెడిపోయెదవు సేవ నేఁ జెఱచెదె, దహింతు నిర్జింపు నాబుద్ధి నాదరింపు 243
క. నేరము ప్రత్యక్షంబై, చేరువ నంశంగ సంతసిల్లి సజారన్
దార న్నాధూర్తుల రథ,కారుఁడు శిరసావహించుకథ యిదియయ్యెన్. 244
క. అనవిని యరిమర్దనుఁ డా, యన నాలోకించి యోనయార్ణవ యిది యె
ట్లనురాగంబునఁ జెపుమా, వినియెద నన నతఁ డులూకవిభునకు ననియెన్. 245
క. కేరళదేశంబున రథ,కారప్రముదామతల్లి గల దవ్వికచాం
భోరుహముఖి యువజారులు,దారవ్యసనంబులకు వల్లిత్రాడై మెఱయున్. 246

ఉ. జారులకొంగుపుత్తడి యసభ్యులచేరువపంట మన్మథ
ప్రేరితకోటి కేడుగడ పెన్నిధి గాముకజాతికిం బర
ద్వారులపట్టుగొమ్మ యుపవల్లభసంపదపాంథబృందమం
దారము పల్లవాంగణనిధానము దానివిలాస మారయన్. 247

ఉ. క్రొవ్వినచన్నుదోయికులుకు న్నునుబయ్యెదఁ దెల్పఁ జూచిన
న్నవ్వునఁ బర్వుచూపులదరు ల్చెదరం బటుపాంథమర్త్యుల్
ద్రవ్వ మెఱుంగుమేనిచెలువం బెడఁ జేయక చూడఁ గోడెకాం
డ్రువ్విళులూఱ నూర మెఱయు న్రథకారవధూటి నిటునన్. 248
చ. మెఱుఁగుఁ గ్రుష్ఠరించుకనుమించులు త్రొక్కనివోట్లు ద్రొక్కఁ గ్రి
క్కిఱిసినగుబ్బచన్ను లెదయీక విరోధు లఁ జోక నొండొక
ళ్లొఱయ నితంబబింబమున నొక్కొక యించుక జాఱఁగట్టుఁ గ
ట్టాఱపు ఘటింప నేగునలయుగ్మలి మారుపుటేటి నీటికిన్. 249
శా. ఆస్పృత్తిస్తని రూపలక్ష్మి కనువిందై యుండ నిర్గ్రాహిహామో
హావేశక్షుభితుండు గానినఁ డిట్టాహోరసంచారని

ద్రావైముఖ్యము లేనివాఁడు గృహకాంతాకాంతసంతానచి
న్తావైరాగ్యనశుండు గానిజనుఁ డెన్నఁ డేఁడు లేఁ డొక్కఁడున్. 250

సీ. పలుమెఱుంగులు మోవిపై నటింపఁగఁ జేరి నవ్వు నొక్కొక సారి యవ్వనవ్వు
జారకర్ణగ్లాని చేర నారజముగా బలుకు నొక్కొక సారిపచ్చిపలుకు
ముఖదృష్టియునమర్మములు గ్రుచ్చి పారంగఁజూచు నొక్కొకసారి మొఱకుఁజూపు
గిలుకు మెట్టెలఱంతు బెళుకుసంపాదింప నడుచు నొక్కొకసారి బెడఁగునడుపు

తే. పదనుగా జాజుచేసినపసిఁడి రేకు, పోల్పఁ జూపట్టు దూతికపోఁతలము
తమ్మరస మంటఁగ అచ్చుప్రాయంపుకలిమి, మరియు నొక్కసారి నస్లంగి మోహనాంగి.

సీ. ఏతెంతునని యు పొక్కిడిపోయి మత్తాళిచూడ నాకట తొంగిచూడనయితి
చేసేఁత నప్పుడ యచ్చికబుచ్చికపుమాటలాడ నాతో మాటలాడనయితి
కెమ్మోవి విరచులఁ జొక్కించి తింతియ ముద్దుగుమ్మ గుబ్బలటొమ్ము గుమ్మనయితి
నను నేకతమున రమ్మని యొప్పి రప్పించి తెఱవ యేటికిఁ దల్పుఁ దెఱవనయితి

తే. నీవుఁ జాణాచతుఁడ వైతి నేత్రజితవ, కోరనన్నిచ్చలో నేఁకోరనయితి
వందు రాత్మప్రపంచకు లైనజారు, లెవరుతాఁకైన నవ్వాడవదినెఁగూర్చి. 252

తే. పరుషటంకకురారసంభరణకరణ, జనితతాపరసక్లాంతకాంతకాంత
హస్తములఁ దేర్చునొక్కొక్క యనసరమున, శైత్యశైత్యమున దానిచన్నుదోయి

క. కైసేసి బిడ్డపాపల,తో సందడిలేమి నొడలు నొడలుం బిఱుఁదిం
తేనియుచంబులు మెఱయుం,గా సుందరి పోతబొమ్మగతిఁ జూపట్టున్ 254

క. చెలిచెలువు తెరవు కొసగుం, బలె నానాపథికభోగపాత్రంబై వ
ర్తిలుచుండ దానిదెసపో,కలు చెలిసెం బతికిఁ గొంతకాలంబునకున్. 255

క. తెలిసి యొకనాఁడు నాఁడా, లలనాతిలకంబు తలతలం బట్టుకొనన్
వలయునని తలఁచి వెంగలి, కలికిం బరికించి నిర్వికారతఁ బలికెన్. 256

క. ఏలినయా కేరళినర,పాలుఁడు నా కొసఁగిచ్చెఁ బయనము చాలన్
గాలవిళంబన మోమహి. గాలిం దెప్పు సంబళముఁ గంబళమున్ 257

క. వేఱూరికిఁ జని యిట కై, దాఱుదినంబులకు నత్తు నద్దినసము లా
ఱ్ఱాఱు సుమీ నీసంగతి, జాఱుట నాకనినయోష సంతోషమునన్ 258

సీ. చివురువాతెర అచ్చసేయుఁబో వేఱూరి యొసపరి గానికప్లొత్తు కెంపు
తమిగుబ్బచంటి పాళెముడగ్గుఁబో వింతగుమ్మ విమ్ముట ప్రేలిగోరి తాఁకు
మోము దామరతావి ముదమంగుఁబో క్రొత్తభోజుఁగు కస్తురి మొక్కబొట్టు తేఁటి
చిన్నారి మేనవాసించుఁబో పొఱుగింటి కలికిమట్టెము ఱొమ్ముకమ్మపూఁత

తే. తనచొక్కాటపుఁ జెక్కుటద్దమునఁ బ్రతిఫలింపఁ బో మాయిమగని క్రొమ్మించుఁగూర్పు
ప్రాఁతపోరాట మెందుఁబోఁ బఱచెననుచుఁ బొంగె లావణ్యసీమ వశాంగి నేను 259

క. తలపేనవంటిసందిది, పులుకాలను ముల్లు వస్త్రమున యూకకటి
స్థలితీఁటపాదరక్షల్, శిలవోలెం బ్రాఁతమగఁడు చేసెన్వైరికిన్. 260

ఆ. నెరసుతోడఁబోలె నేత్రంబు దుర్భర, వ్యాధితోడఁ బాసి యంగకంబు
కాంతి నుల్లసిల్లఁగతి వీనిఁబాసి యి,చ్చానుకూలవృత్తి నగుదు నేను 261

క. అనిమూఁపులు మూఁడై లా, బనరథకారునకు సంబళము గంబళ మి
చ్చి నిలిచి మహానార్తి గడ,ల్కొన నప్పుడు నిలిచి పేరుకొని పతికనియెన్. 262

ఉ. నిక్కవ మూరికేగదవె నీకు దయారహితాత్ముఁడైనగా
జెక్కడఁగల్గె నిన్ను నొకయించుకనే పెడఁబాసి యుండలే
నిక్కడ నేను మీపిఱుఁద నిప్పుడవచ్చెదఁ దోడుకొంచుఁబొ
మ్మక్కఱదీఱ నాహృదయ మక్కట నీవశమై తెలుంగవే. 263

క. నిమిషము దివసంబై దిన, సము నెలయై మాసకంబు సంవత్సరమై
సమయుగమై చింతించెద, కరుణానదీశ యోగరాహిత్యమునన్. 264

ఉ. ఈచెలు వీక్షావిభవ మీగుణ మీకమనీయవిగ్రహం
బీచతురత్వ మీగరిమ మేమగవారికి లేదు చూచితిం
జూచితిఁ బ్రాణనాథ నినుఁ జూచినకన్నుల కాంతతాంతనా
రాముఁడుఁ బట్టఁడీవు మగరాజవు రాజవు నిక్క మింతయున్. 265

ఉ. కేవలసాధనంబు లిరుగేల వహించి నటించు మన్మహా
భావజునట్లు యుక్కుటులిబాడిసయుం గొని నీవు మామకీ
నావసథంబున న్మెలఁగ నచ్చెరచాడ్పునఁ గన్నులార్ప కిం
పావహిలంగఁ జూతు దరహాసపరిస్ఫురితాననాబ్జనై. 266

క. విడిఁగలమాణిక్యము పు, త్తడితోడం గూర్చినట్లు తనతో నినుసొం
పడరం గూర్చిన బ్రహ్మకుఁ, దడయక చేమోడ్తు మ్రొక్కెదమె ప్రాణేశా. 267

క తపసినఁ జత్తున్వడి ని,క్కడి కేతెమ్మనుచు ముచ్చ గన్నీరొలుకన్
బుడిబుడియేడ్పులతో న,వ్వెడమాయలప్రోవు మగనివీడ్కొల్పుటయున్. 268

ఉ వంచనఁజేసి వాఁడు తలవాకిలి వెల్వడి పోయిపోయి య
స్తాచలకుంజకోటరమునం దినుఁ డేగినఁ డక్కబెట్టి యా
ముంచినచీకటి న్మసలి ముచ్చవలెం జొరఁబాఱి యింటిలో
మంచముక్రిందఁ దూఱుకొని మౌనముఁ గైకొనియుండె నంతటన్. 269

ఆ. జలములాడి మేనఁ గలపాంబు వలఁది యు,చ్చెలువ చలువ వలిపెచీరఁ గట్టి
ముడిచి కడిచి లేచి విడియంబు సేయుచు, మొదలియామమయిన యదనెఱింగి.

ఉ. ఆ తెలిగంటిగంటి నెరసైనవిభుం డరిగె న్నిరంకుశ
ప్రీతి రమింపవచ్చు నిటఁ బిల్వుము నీవని తోఁపిన దూతి యా
రాతిరిఁ బోయి చీరనగరిప్రతిరథ్యముసుం గొనర్చి సం
జాతకుతూహలుం డగుచు జారుఁడు తత్సదనంబుఁ జేరఁగన్. 271

ఆ. కోర్కులూ రదుద్దుగొంగడిఁ బఱచిన, మంచమునకుఁ గ్రొత్తమగనిఁ గొనుచు
కులుకునడల నరిగి కూర్చుండె దానిక్రిం, దింటిమగఁడు డాఁగు టెఱుఁగలేక 272

చ. ప్రవిఘటితానురూపదృఢబంధ మమంథరమోదకృద్గళా
రవము కటీకపోలముకుర స్తనదృష్టనఖక్షతంబు కై
రతపరిహాసభాషితమతాంతచపేటముపాస్తలజ్జము
ప్రసదుపగూహ ముల్లసిలె సంగమ మిద్దఱకు న్నిరాంధ్యమై. 273

క. సాధీయాకృతధారా, సాధారణకరశిఖరనిశాతనఖంబుల్
సాధింపఁగ రతినాథా, యోఘనసాఘనములయ్యె యువయువతులకున్. 274

క. ఆసతి యుపపతియును నిజ, నసతిం జెలరేఁగి య ట్లవారణగాఢో
ల్లసనమునఁ బెనఁగ గుసికిల, వెస నచ్చెలికాలు మగని వెన్నొత్తుటయున్ 275

క. దిటచెడక యద్ధరిత్రి, కటిమదిలో నిశ్చయించెఁ గనలున నీచీఁ
కటి నెక్కటి నిక్కడికం, కటి క్రిందిటు వచ్చె గట్టిగా మగఁ డనుచున్. 276

క. గతితృప్తిఁ బొందె యయ్యుప, పతి నాతిం జూచి పలికెఁ బద్మముఖీ నీ
పతిరతిలో నారతిలో, మతిఁ దలఁపఁగ నీకు ప్రియతమం బెయ్యదొకో. 277

క. నోహార్పక నిక్కము జెప్పు,మా రామా ప్రేమ వనిన నది వానిదెసన్
గూరిమిఁ గలిగియు నలరథ, కారము నోరంజకంబుగా నిట్లనియెన్. 278

మ. *పతికందర్పరహస్యకేళికిఁ దలంప న్మాత్సర్యోచ్చాటన
స్థితి ముంగొంగుపసిండి గాదె యది నాతిం ప్రీతిఁ దేలింపఁగా
రతివాఙ్మాగతుఁడై విరక్తిఁ దొఱఁగంగాఁ జేరుజారుండు నీ
సతమే చెప్పను వానితోడి రతి నిస్సారంబు రాజాస్యకున్. 279

క. ఇదియేటిమాట యేలా, ఎదరెదు నిను నీవెఱుంగవా నారమణుం
డుదధిచిఱుపడియు వీవ, ల్లది నే ననసున్నఁ దెలియుదా నీమదికిన్. 280

క. రోఁతనినువంటిమానిసి, క్రోఁతికి నామగనిఁ బేరుకొనఁ జక్కఁదకున్

---

* ప్రతిప్రాణేశరహస్యకేళికి నని పాఠాంతరము.

జేతికిఁ గలవాసి సుమీ, కాతాళముగాదు నీకు ఘనుఁ డాతనికిన్. 281

ఉ. ఒండన నేల నామగనియొద్ద రమించుట యింద్రభోగమై
యుండునయో యనుంగువిభుఁ డూరికిఁ బోవుటెఱింగి యొంటి ని
ట్లుండఁగ వచ్చి పట్టికొని యోరిదురాత్మక సిగ్గుగొంటి పై
వెండయుఁబోలె వేఁడి ఘటియింపదె నాకిటువంటికూరిమిన్. 282

ఉ. రాచపను ల్వహించి పలరాచకుమారునివంటిదేవుఁ డ
య్యో చని కాళ్ళతో నరిగె నూరికి నెప్పుడు వచ్చువాఁడు తే
లే చవిగావు కండ్లు పెకలింపుచు నున్నవి ప్రాణవల్లభుం
జూచినదాఁక యెట్లునిలుదుం దనునెట్లు సహించియుండుదున్. 283

శా. కాయం బెక్కడనుండెనేమి వనితాకందర్పుఁ బ్రాణేశ్వరుం
బాయంజాలవు ప్రాణము ల్మసురుబ్బాయూళ్ళుగాఁ జేయుటన్
డాయ న్వచ్చుఁగదా పయోధరము లంటం గౌఁగిటం జేర్చి యా
చాయం బైకొని చెక్కునొక్కురతిరాజ్యశ్రీలఁ దేలింపుగన్. 284

చ. అగునగు బైసిమాలిచితివంచు విజృంభణవృత్తి నివ్విధి
న్నొగయనిమాటలం జెవులు నూఁదకు సైఁచినదానఁ గాను నా
మగనికి నిన్నువంటికొఱమాలినమానుసులీడె *భర్తతోఁ
దెగి యొడద్రెవ్వకం బ్రదికితే మని యైగునవై సుఖించెదన్. 285

చ. అనుతనుమధ్యభాషితము లారథకారుఁడు నాదరంబు గా
విని యిది నాయెడం బ్రణయవిశ్రుతయా నటుగాకయుండినన్
నను ననుకూలుఁడంచు నుపనాథునితోడ శతాననంబుల
న్వినుతి యొనర్చునే పరిభవింపక చంపక కాతు మెచ్చితిన్. 286

ఉ. ఏను బ్రవాసినా పెఱిఁగి యింతట నంతట నాకుమా తెవ
ర్లెని దెఱంగి కన్గొని చలింపక వీఁడిలుసొచ్చి యుద్ధతుం
డై నిలుపోవలేక కదియించబడెఁ గూఁతలు రోఁతలంచు ల
జ్జానిధిగాన మెత్తఁబడి సాధ్వి రతిస్థితి నూరకుండెడున్. 287

ఉ. చిక్కితి వీనిచేత రొదసేయుట సిగ్గులచేటు పొంగులం
జొక్కక వేగ నిల్వెడలఁ జూడఁడు మచ్చటఁ దీర్పకున్న నీఁ
డుక్కున నేమిసేయునో భయోదయ మయ్యెడునంచు నోడి యా
చక్కెరముద్దుగుమ్మ సరసప్రియుభావల నింపొనర్చెడున్. 288

* భర్తకుం దెగి యొడద్రెవ్వనం బ్రదుకఁగే యని పాఠాంతరము.

క. అతివా నారతిలో నీ, పతిరతిలో నిష్టమెద్దిపలుకం దగునం
చితఁ డడిగిన హితరూపా, న్వితుఁడని నన్నుబల పొగడె వీనిం దెగడెన్. 289

ఉ. పంచన యిప్పు డీతులుసవంకజనించె జనించుఁగాక యీ
చంచలనేత్ర నాయెడఁ బ్రసన్నమనోరథ దీనిమాటలన్
గాంచితి మోదమంచు రథకారుఁడు వేగ సజారదారతో
మంచము నెత్తికెత్తుకొని మంజుగతిం జని వాడవాడనన్. 290

ఉ. వాకొని యెంతశాంత యెటువంటిపతివ్రత యెంతయుత్తమ
శ్లోకవివేకరాశి యనుచుం బ్రియు నెన్నుచు హస్తతాళమా
నైకలఘుప్రచారగతి నాడెఁ బ్రహాసవిలాసవక్త్రులై
మూఁకలుగట్టి నాగరికముఖ్యులు తన్బరికించి నవ్వఁగన్. 291

వ. ఇచ్చరిత్రంబు సాపరాధుం డగుచిరంజీవిం జేపట్టిన నీ కుదాహరణం బగు నని రక్తాక్షుండు చెప్పిన నప్పలుకు లాదరింపక యులూకేశ్వరుం డూరకుండె నంత నయ్యభిప్రాయ మారసి. 292

క. తనకు నులూకత్రాసము, మనుగడ కుపహతి యును బహుమానత్వము లే
దని తెలిసి తెలివిఁ గలయా, ననమునఁ జిరజీవి ఘూకనాథుని కనియెన్. 293

క. నీరిపుచే నూరక యిల, ధీరతఁ గాంచితి జగద్విదితమతి నయ్యున్
గ్రూరాగ్ని కాహుతిగ దను, ధారణ మిఁకజాలు వేల్చెదం బ్రాణంబుల్. 294

క. నావిని రక్తాక్షుఁడు చిర, జీవిం బరికించి చచ్చి చేసెడుపనియే
మీవివరపుట్టఁ జెపుమా, నీవనుటయు నాతఁ డాతనికి నిట్లనియెన్. 295

క. ఈకాయ మనలముఖమునఁ, బోకార్చి యులూకయోనిఁ బుట్టి బలిమి మైఁ
గాకముల గర్వరేఖా, స్తోకములం ద్రుంతు మనసుతుందుడుకాఱన్. 296

వ. అనిన విని రక్తాక్షుండు. 297

క. లోకదృశుఘునసమీరము, హోమగృహంబులనరింతు నని కాదాపూ
ర్వాకృతికి వచ్చె నొక్కతె, కాకికి నీకేల కౌశికత్వము గల్గున్. 298

క. అనురక్తాక్షునిఁ గనుఁగొని, ఘనుఁ డచ్చిరజీవి పలికె గాఢప్రజ్ఞా
ధన వినఁగోరెద నిక్కథ, యనురక్తిం జెప్పుమనిన నతఁ డిట్లనియెన్. 299

సీ. కైటభాహితపదాంగదమౌక్తికచ్ఛాయ విధికమండలుసమన్వితమరాళి
మారారిమకుటమందారమాలిక పితృత్కృష్ణధేనుక్షరత్క్షీరధార
సాధుజీవంజీవచంద్రికసగరజస్ఫాటికస్వర్గసోపానపంక్తి
చిరతపోవిత్తసంచితభగీరథకీర్తి వారాశిహృదయకర్పూరవర్చ

తే. పరుషహాసిత్వశాపసంప్రాప్యమాణ, మిత్రసహపుత్రగేహాశత్రువేశ
సముదితక్లాంతిహృతిసమ్యగమృతవృష్టి, గంగ పొంగఁడంగ వెగడు శంగ త్తెంగి. 300

సీ. తజ్జలంబుల నొక్కతపసి యాస్వాదింప శయపుటం బల్లనఁ జాఁపుపోలఁ
దటకుటానిలనటద్విటపకాండనిషణ్ణ ఘనగృధ్రచంచువిగళిత యగుచు
మూషికపడియె నమ్ముని దానినిజతపోమహిమ నొక్క మనోజ్ఞమహిళఁ జేసి
కన్నకూఁతునకంటెఁ గడుగారవంబునఁ బోషింప నొకకొన్ని పూఁటలకును

ఆ. గుఱులుగూడె మేను మెఱుఁగెక్కెఁ జాలింప్లు, బయలు మెఱసెఁ బెఱుఁగుబకే సెనపెలు
ముఱిప మెఱెఁగె సిగ్గుమోమున నివుఁగొత్తెఁ, దోయజాస్య కలఁడు బ్రాయమైన.

క. కలితరుచిమించువించున, ఫలముంబలె నూఁగునూఁగుఁబ్రాయము చెలికై
నిలుసం గని ముని మనువీ, ఎఁదని తలపోసె నధికవాత్సల్యమునన్. 302

క. ప్రతినూతనర్తువేళా, న్వితయెవ్వతె యవ్విఘాటి వ్యాలి యగు నద్ధ
త్స్రతిపాణిగ్రహణముఁగా, మతిఁ దలఁచరు సుమతులనభిమతమై యునికిన్ 303

వ. ఇంతకుమున్న వివాహంబు సేయలేనైతి నిచ్చిపుచ్చుకొనువారికిఁ గులధనాది గౌరవంబులు సదృశంబులునయిన ననురాగంబు పెనుగుమూఁకయగావనాదులు పరస్పరానురూపంబు లయియుండిన సతిపతులకుఁ బ్రేమాంకురంబులు వృద్ధిఁబొందుఁ గావున నివ్వనజగంధి మహానుభావుండగు సూర్యదేవునకుం బరిణయంబు సేసెద నని యామ్ముని తీవ్రధాము నాకర్షించి. 304

సీ. తనునోరఁ బేరుగ్రుచ్చినవారి కారోగ్య మిచ్చువాఁ డఘములవ్రచ్చువాఁడు
పరరాజసంబాధ విరియుచక్రముల రక్షించువాఁ డిఱులశిక్షించువాఁడు
వేదాంత శుద్ధాంత వీధుల నోలగంబుండువాఁ డాపదల్ద్రెంచువాఁడు
దుష్టమందేహ సందోహంబు నెలగోలు తఱముువాఁడు మురారితెరమువాఁడు

తే. సంప్రదోషవచష్షిస్నతిజలదరించు, నానిజములకు దృష్టిపాటవము నిచ్చి
మించువాఁ డెల్లదిశల దీపించువాఁడు, సారసాప్తుండు మునికి సాక్షాత్కరించె.

చ. ముని యలతీవ్రధాముని సముజ్జ్వలధామునిఁ బూజసేసి యి
ట్లను దిననాథ యిక్కొ-సలయాధర పెంపుడుబిడ్డ నాకు నీ
కెన సుముహూర్తవేళ వరియింపుము నీకిదె యిత్తునన్న న
వ్వనరుహబాంధవుండు శ్రుతవంతుఁ బ్రశాంతునిఁ జూచి యిట్లనున్. 306

తే. అనఘ నాకన్నఁ బర్జన్యుఁ డధికుఁ డభ్ర, సంచయంబున నను నిరోధించుఁగాన
నమ్మహాత్మున కీకన్య నఖిలమాన్యఁ, బరిణయము సేయు మదినీకుఁ బరమశుభము.

క. అనిచెప్పి తపనుఁ డరిగిన, ననఘుం బర్జన్యు నంత నాకర్షింపన్
జనుదెంచి నిలిచె నతఁ డమ్ముని యావ్వేల్పునకు నెయ్యమున నిట్లనియెన్. 305

క. కన్య న్భువనత్రయమున, న్నాన్య ననన్య న్వరింపుమా యిచ్చితి నీ
ధన్యత్వ మమర నన బ్రజ్ఞన్యుం డిట్లనియె మౌనిజనమాన్యునకున్. 309

క. మరుదభిహతిదూదిక్రియం, దరలుదు నాకన్నఘనుఁ డతం డాయన కి
త్తరళాక్షి నిచ్చి సంయమి, పర పెండ్లి యొనర్చు మనుచు వాఁడుం బోయెన్.

క. పవమానుఁ గ్రోధహతరై, పవమానుఁ దలంపుఁ దపసిపాలికి నతఁ డా
ర్జవజవము లమరనచ్చిన, వివిధాతిథ్యముల గారవింపుముఁ బలికెన్. 311

చ. ఉచితసభాయితాఖిలపురోపవనాపవనాసురాసుర
ప్రచయములందు నీసవతు రాఁ డొకఁ డిష్టజనప్రసన్నతా
రుచుల నటౌ బెఱింగి గుణరూపవయోనయధన్యుఁ గన్య నీ
కచలమనీష నిచ్చెద సదాధృతిఁ గమ్ము వివాహ మీవనన్. 312

చ. నరులు సుర ల్భవాదృశులు నన్నుఁ మహాబలుఁ డండ్రు సత్కళా
పరపరమేష్ఠిశైలము లపారబలంబులు నేనెఱుంగుదుం
బరు లనకున్న నేమి కనుపట్టిన పట్టిధరాధిభర్త కా
దరమున నిత్తుఁ గాకని సదాగతి సెప్పి యథేచ్ఛ నేగినన్. 313

క. శిరములఁ దటఘటితతపయో, ధరముల సంగీతముఖరదైవతవిద్యా
ధరముల శ్రీగరుడసుధా, ధరములఁ దనరుచుటయుఁ బర్వతము లేతెంచెన్ 314

క. ముని యద్ధరణీధరములఁ, గనుఁగొని యిట్లనియె నాత్మకన్య ననన్యన్
జనలోకమాన్య నిచ్చెద, గొనకొని యొండొకఁడు పుచ్చుకొనుఁ డింపెసఁగన్.

చ. అతిశుభలగ్న మీసమయ మన్న నమస్కృతు లాచరించి ప
ర్వతములు పల్కె నేఁ డబలవంతులమందురు పాదజర్జరీ
కృతులము మమ్ము లెక్కఁగొన వెల్కలు వానికి నిమ్ము నిక్కల
ప్రతభవదీయప్రీతి కనివారణ లేకని చెప్పినపోయినన్. 316

క. ఎలుకలఁ బిలిచి మహాముని, కులవల్లభుఁ డనియె నిత్తుఁ గూఁతు న్మోదం
బొలయు పరియింపుఁ డొకఁడని, పలికిన నవి కరము వెఱఁగుపడి యిట్లనియెన్.

క. ఎలుకలకు మనుజసతులకుఁ, గలయిక లెట్లనిన మౌని కమనీయతపో
బలమునఁ గ్రమ్మఱఁ గూఁతురు, నెలుకం గాఁ జేసి యొకటికిచ్చెం బుచ్చెన్. 318

వ. అట్లగుటఁ గాకి పగునీకు ఘూకజన్మ మెట్లుగల్గునని కేరడం బాడి యధిక్షేపించు రక్తాక్షుని వారించి యరిపుర్గ మండు ప్రసాదపురస్సరదృష్టిఁ జిరజీవి నాలోకించి.

ఉ. క్రూరతరావలోకములు ఘూకము లాదృతి నీకు నీప్సితా
హారము లిచ్చు నిర్భయుఁడవై ధరణీరుహదుర్గకోటరా

గారములం జరింపుచు సుఖస్థితి నుండు కొలంతలేక యో
భూరివివేక యంచుఁ గడిపోవనిభక్తి బహూకరించినన్. 320

వ. కృతకృత్యుండనయితినని ధైర్యవిజితనీహారాచలావర్గళప్రచారంబున దుర్గబాహ్యాభ్యంతరంబులం బ్రవర్తించి యన్నియుం గనుంగొని శరీరవర్ధనపర్యంతంబు చింత దొరలకుండ ఘూకాకంబులం గలసి మెలసి పక్షంబులు వ్యవహారదక్షంబు లగుటయు నొక్కనాఁ డెడఁజూచి యుల్కాకమూలోత్పాటనంబునకుఁ బృథ్వీరుహదుర్గకోటరద్వారంబుల నీరంబులుగాఁ బూరిఁగూరి నీరసేంధనంబులు దుఱిఁగి కరీషపిండఖండంబులు గ్రుక్కి యక్కడ నిలువక మేఘవర్ణుఁ గానంబోయి యవ్వాయసపతిచేత సంభావితుండై యప్పు డుపస్థితంబైనకార్యంబు విన్నవించి చిరజీవి యిట్లను నీవును నిన్నుం గొలుచువారును నీరసతరుశాఖలను గొఱవులను బట్టుకొనిరండు వైరిసంహారసమయం బిదియని తెలుపుటయు. 321

క. ఎరవలిపట్టినకొండల, కురువడిఁ జని కాకిమూఁక లొక్కటఁ గొరవుల్
ఐరవరవలైనపిడకలు, తరిగ్గైకొనిపోయి కోటరతం దరికొల్పెన్. 322

మ. తగ నత్యుద్ధతి మించువాయువులచేత న్రాఁజితోద్ధూనక్రోం
బొగలై కీలలు పర్వి నిక్కఁ జిఱునిప్పుల్ ప్రాచి యుక్కుమ్మడిన్
గగనం బంటి ఘనస్ఫులింగములు నాల్కల్గ్రోయనచ్చిమ్మనం
బగిలెం బ్రేలిపడెం దివాంధకులము ల్భస్మంబులయ్యెం దుదిన్. 323

క. ఈపడువున నిశ్శేషము, గా వైరుల సంహరించి కౌతూహలసం
భావితుఁడై యప్పుడు చిర, జీవికి వలకాకరాజశేఖరుఁ డనియెన్. 324

క. పగవానిగృహము మృత్యువు, మొగమచ్చో నన్నిదివసములు గట్టా యే
పగిది జరించితి వీవని, యగచినఁ జిరజీవి మేఘవర్ణుని కనియెన్. 325

చ. అహితునిఁ గార్యకాంక్షి యగునాతఁడు దేజము డాఁచి దుస్థితు
ల్గుడుచుచు నీచుఁ గొల్చి తిరుగుం దివిషజ్జయులై ధరిత్రిఁ జే
ర్పడినసహోదరుల్దనకుఁ బ్రాపుగ నుండియుఁ బుణ్యగాథలం
గడపఁడె మత్స్యరాజుసముఖంబున ధర్మసుతుండు కాలమున్. 326

ఉ. పౌరుషము న్మహాబలముఁ బండితభావముఁ గల్గినట్టియా
ధీరుఁడు కార్యదాహనిరతిం బరుఁగొల్చు మహానసాగ్నిధూ
మారుణతాత్ములు న్మలినమైనపటంబు మహావిభూషితా
కారము దర్వియు న్మెఱయఁగా వలభీముఁడు మాత్స్యుఁ గొల్వఁడే. 327

ఉ. పౌరుష ముజ్జగించి నగుబాటున కోరిచి సాధుగస్థితా

కారతేఁ గాలకాంతు పొసఁగ న్నిజకార్య మొనర్చు గాంచిన
జ్వారవదేవద త్రికభసత్తుభితాష్టహరిత్కరిస్ఫురి
ద్వారుఁడు గ్రీడి కృత్స్యపురి నాఁడు బృహన్నలయై నటింపఁడే. 328

చ. ఒకదెసఁ గార్యదాహమున నుండక యేరికినైనఁ దీఱదం
తకనిశ్చసత్యుఁ డాదరణధాముకటాక్షుఁ డఖండవిక్రమా
ధికుఁడు విలాసవిభ్రమణదేశము మాద్రికిఁ దొల్తపుత్రుఁ డా
నకులుఁడు మత్స్యరాజభవనంబున సాహిణియై చరింపఁడే. 329

చ భుజబలశాలి నీతిపరిపూర్ణుఁడు రూపవిలాసవారిజ
ధ్వజుఁడు హరిజ్జయాభిముఖదర్పుఁ డతిప్రియభాషుఁ డాశ్రిత
ద్విజనిధి కార్యదాహనిరతి న్నిజవేషముఁ గప్పిపుచ్చి గో
వ్రజములఁ గాచువాఁడయి విరాటుపురి న్సహదేవుఁడుండఁడే. 330

ఉ. కాలము దాఁట నెవ్వరిలఁ గాల్గలవారలు వారిరాశికీ
లాలపరీతభూతవిపులాన్యపరాజముఖీశిరస్థ
స్థాలఘురత్నభానునికషాతిపమున్నిపదంఘ్రిపద్మపాం
చాలతనూజ తొత్తుపని సల్పదె దైవగతి న్సుధేష్ణకున్ 331

వ అనిచెప్పి బాష్పనిష్పీడితాక్షుండై వాయసాధ్యక్షుండు చిరజీవి నాలోకించి, 332

క. పరదేశముఖినముఖా, కరము మదీయోపదేశగమ్యుఁడవై కా
ర్యరథసముకోర్చి రిపుసుం, దిరమున నెబ్భంగి నుండితివి చిరజీవి. 333

క ఘూకములు దెగడ ఘూక, క్ష్మాకాంతుఁడు గౌరవంబు సలుపఁగ బ్రతిప
క్షౌకమున నుంటి విద్దళ, సాకతమున నీకుఁ గలిగెనా చిరజీవి. 334

సీ అని విన్నవయిన వాయసరాజు నీక్షించి యచ్చిరజీవి యిట్లనియె మత్ప్ర
భువున నీయాజ్ఞఁ దలమోచి యేనుండుతఱి మదాంధదివాంధతతులు వచ్చి
కెలఁకు వీక్షించి మీపాలకుప లేమన్న తెరలివచ్చినత్రోవ మరలిచనఁగ
నున్నకన్నెఱిఁగి నేనొకశబ్ద మొనరించి క్రమ్మఱించితిఁ గార్యకరణబుద్ధి

ఆ నప్పుడు వికృతమూర్తినైయున్నన న్నులూకములు గాంచియెఱుఁగుఁగానఁదొలుత
నింపుకలిమి సంహరింపక నొంపక, నాదరమున భర్త కప్పగించె. 335

వ అప్పుడు ఘూకవల్లభుండు నన్నుం జూచి నీ వెవ్వండవని యడిగిన మేఘవర్ణు
నకు ముఖ్యదండనాథుండ నగు చిరజీవి నని చెప్పితి నప్పులుకులు విని మంత్రులరా
వించి మంత్రకూటంబున నన్నుం జూపి యితని కుచితం బగు కార్యం బొకరొకరు
చెప్పుండనిన నందు రక్తాక్షుండనువాఁ డొక్కరుండు దక్కఁ దక్కి నవారందఱు
నాపక్షుంబ పలికిరి రాజును వారివాక్యంబు లంగీకరించి నీతిదక్షుం డగు రక్తాక్షుని

దెస నాదరణంబు సేయుండరయ్యెఁ గాలపక్వంబును నట్టిద. 336

క. జనియింపం గలకౌర్యము, మనమున దగ నిశ్చయించి మంత్రి సునీతిన్
వినిపించిన వినవొల్లని, చెనఁటికి ముకుబంటిగాదె చేటుంబాటున్. 337

తే. గగనమంటిన దోషాగ్ని గాఢకాంతి, నీరమున శీతలము సేయ నేర్చుమంత్రి
చిరహితారంభపరుఁడై నసేవకుండుఁ, గార్యనిర్వాహకులు సూవె కరటముఖ్యా.

క. తానెంత కార్యపారగుఁ, డైనరహస్యమున మంత్రి నడుగక ధరణీ
జానకి నేకార్యంబుం, బూనందగ దుద్ధతప్రభుత్వప్రజ్ఞన్. 339

ఉ. ముప్పదిమూఁడుగోటుల సుమూర్తులవేల్పుల నేలువజ్రియు
ప్పప్పు యవార్యశౌర్యకరుణాదులపట్టున నింమకేనియున్
జెప్పనివాఁడె యట్టినయశాలి బృహస్పతిగోపనంబునం
జెప్పినపంపుసేయక విశృంఖలవృత్తిఁ జరింప నేర్చునే. 340

క. కావున శక్తాత్ముఁడు నయ, కోవిదుఁ డమ్మంత్రిమాట గురుమంత్రముగా
భావింపలేక కీటఁడు, పావకకీలాళిఁ గాలి భస్మంబయ్యెన్. 341

చ. అరయఁగ దుష్టమంత్రినివహం బనువారను గల్గియుండ నే
పురుషు ననీతిదోషములు పొందవు రోగముతే యపథ్యబం
ధురుఁ గలఁగింప వేజనునిఁ ద్రుంపను మృత్యువు లక్ష్మియెవ్వనిన్
జిరమదగర్వదర్పితునిఁ జేయదు పైకొనవేరి నాపదల్. 342

వ. లోభికిఁ గీర్తియు ఖలునకు మైత్రియు నష్టక్రియునకుఁ గులంబును ధనార్జనతత్పరు
నకు ధర్మంబును నలసునకు విద్యయు గృపణునకు సౌఖ్యంబును బ్రమత్తసచివుం
డగు జగతీపతికి రాజ్యంబును లేదు వెండియు నీరసేంధనంబుల వహ్నియు మూర్ఖు
లందు శోకంబును జపలచిత్తులయందు గోపంబును గాంతలందు విత్తంబును
దయావంతులందు ధర్మంబును మహాత్ములయందు ధైర్యంబును వృద్ధిఁబొందు నది
యట్లుండె. 343

క. వలనగునంతకు బగతుం, దలనిడుకొని తిరుగునీతితత్త్వజ్ఞుఁడు మున్
జిలువయొకం డట్టిదయై, మలుగందినదే యనేకమండూకములన్. 344

క. అనినవిని మేఘవర్ణుం, డనురాగరసాబ్ధి నోలలాడుచు విద్యా
ఖనికా యెట్టిదికథ చెపు, మను డచ్చిరజీవి వాయసాగ్రణి కనియెన్. 345

సీ. విను పూర్వమున మందవిదుఁ డనుకాలాహి యాహారకాంక్ష నహస్తముఖమున
బఱచి యొండొకచోట బహుభేకకలకల ప్రతిభిన్నసకలదిగ్భాగమైన
హ్రదము గన్గొని లోనికరుగ నెద్దిక్కున దెరువుగానక తింథరణిశిల్పి
కుంభిని ఫణమూదికొని డిల్లచెడినట్లు పడవశుగతి దగ్గఱపగిదినుండఁ

తే. బలిసె మండూకపతి యహో ఫణివతంస, ప్రాణములు లోచనంబుల బతిలపఱచి
యొఱచి యొల్లక యిట్లుండ నేల నేల, చింతలేమిటికేని భక్షింపరాదె 346

క. తలద్రిప్పక మ్రింగుచు కే,వలము మహాబలునియంతవాని నయోనీ
కలఁతింబడ నేకార్యము, గలిగెనొకో యన్నఁ బన్నగం బిట్లనియెన్. 347

తే. ఓదయానిధి దైవోపపాదితుండ, నైననాకేల దొరకునాహార మఱక
నొరులు పెట్టినదచుక బస్తుండవలయుఁ, దనకు నావుడు మఱియు నద్దర్దురంబు. 348

క. అనిలాశనవల్లభచె,ప్ప నహో చిత్రంబు పస్తు పారణ లుండన్
వవరం గారణమున్నను, వినియెద జెప్పుమనిన మందవిదుఁ డిట్లనియెన్. 349

క. కేవల మాహారేచ్ఛం, బోవఁగ నొకనాఁటిరేయి భోగం బద్రుపం
గావడి ద్రొక్కిన నొకభూ, దేవకుమారకునిఁ గఱచితిని బడలుపడన్. 350

క. కాటుపడి భీతిఁగాయం, బూటాడంబరచి జనకునూరుద్వితయా
స్ఫోటితమస్తకుఁడై శిశు, వేటుపడినకురరివోలె నేడ్చుచునుండెన్. 351

క. అసలునలముద్దుపట్టిం, జడియకుమని వీపుజఱచి జనకుం డురమం
దిడికొని మునుగడ పుడమిం, గడునడకువ నున్ననన్ను గని కోపమునన్. 352

క. వసుధామరుఁ డిట్లను వెలి, విసరినతమినోరి విసపువిత్తానోరీ
పసనాడెఁ గటకటా యి, క్కసుగంటం గుంగులేక కరసన్ బంపన్. 353

ఆ. కుటిలగతికిఁ బుట్టుగుడ్డికి ననుదిన, శ్రుతివిహీనునకును గ్రూరమతికి
బాపజాతికేలప్రాపించుఁ బరహితా, చరణవిద్య నిన్ను నైఁపఁదగునె. 354

చ. కడుదొడుసైన యిద్దురితకర్మము నిన్నొని ముంచుగాక యొ
క్కఁడఁ జననిచ్చుఁ బుట్టపురుగా కొఱగా కెపు డస్వతంత్రతన్
మడుఁగు భజించి భేకముల మస్తమున న్భరియించి కొల్చి యొ
ప్పు డవి దయామతిం గడుపు పోయఁగనుండు పాకారిపొమ్మనన్. 355

క. ధారాళచింత నంతం, గ్రూరతచెడి మిమ్ము పూచికొని తిరుగంగా
నోరాజా వచ్చితి నా,హారము మీరిడక లేదయా నాకనుచున్. 356

క. ఆరోహణకౌతూహల, సౌరభ్యము మోసులొత్తె జలవ దుఁడు దు
ష్టోరగభాషణములు మా,యారూపము లనక నిజము లని తనలోనన్. 357

క. తలఁచి యలచిలువకిట్లను, నెలకొనిననుఁ గొలువనిలువ నీహృదయమునం
గలిగిన నాహారం బిడి, తలకుం గ్రొవ్వెక్క నడపెద న్నే ననుడున్. 358

ఉ. మందవిదుండు కప్ప డనమాయకు లోనయి చిక్కె నంచు నా
నందమునొంది భేకరమణభ్రమణాదులు నాకులేవు నీ

కందువచేరి భోగఫలకంబున నీపదము ల్వహించి యుం
దుం దుదిముట్టనందనుకఁ ద్రోవక డగ్గఱఁ జేర్చుకొ మ్మిటన్. 359

క. నను విశ్వసింపు మెప్పటి, కనుమానము మాను చచ్చునంతకు నెందుం
జననని దేవరనగరికి, దనపేరం గమ్మకట్టెదం గొనుమనుచున్. 360

ఆ. కడుపుఁజూపి చావగా నింక నెన్నఁడు, నడుపుకొనియె దనుచు వెఱుఁగుఁబురుగు
చెప్పరాని ప్రియముఁ జెప్పినహృదయంబు, గరఁగి భేకరాజు తెరువుచూపి. 361

క. ఆరోహింపఁగవలె గృష్ణోరగ యీసరియవెంట నొద్దికిఁ జనుదె
మ్మా రయమున ననుటయు నిర్వారణనది సొచ్చి కదియ వచ్చెం గప్పన్. 362

క. అప్పు డనురాగమొప్పం, గుప్పలుగొని క్రోతిగొమ్మగొన్నట్లు వడం
గుప్పించి కప్పఱేఁడ, ప్పప్పఫణిప్రవరుభోగ మారోహించెన్ 363

క. జలపాదుని బాదుకొనం, దలనిడికొని త్రాఁచు నేమనటనం దటభూ
ములకొంతసేపు ద్రిమ్మరి, యలసినగతి నూరకుండె నల్లుంజుటయున్. 364

ఉ. పన్నగభర్తఁ జూచి జలపాలుఁడు పల్కె నిదేమి వేగసం
పన్నము గాకయున్నయది మందవిషా భవదీయవిగ్రహం
బన్నభుజంగ మిట్లను దయామయ యాఁకటదీలుపడ్డ నా
కున్నదె యానశక్తి కడు షోమినమీఁదటఁ జూడు చిత్రముల్. 365

క. దొరలు తమవేడుకల జాతురుగాని వహించి తిరుగు తురగంబులఁ బ్రో
వరు మేపునీళ్ళతఱినిడి, యాపదివ్విధ మనిన దర్దురాగ్రణి మదిలోన్. 366

క. కలతెర గిట్టిద యనుచుం, దలఁచి యయో విప్రశాపదశ దనయిచ్చన్
వలసిన యాహారము గొన, గలుగమి నిచ్చలున నొచ్చెగద యకటకటా. 367

క. భారవహం బిదిలేదా, హారము నే నిడక కటికి యాఁకల నిపుడే
కారెడునిట్లుండిన నా, యారోహణ కేళి యేక్రియం గొనసాగున్. 368

చ. అని తలపోసి మందవిదు నారసి యజ్జలపాదుఁ డిట్లనున్
నవుఁ దలఁదాల్చి యాడజవనంబువలెం జఠరానలంబురాఁ
జిన యపుడెల్లగప్పల విశృంఖలవృత్తి భుజించి లావుగా
కొని విహరింపుభోగికులకుంజర నాదములన్ ప్రహ్లాదంబునన్. 369

వ. అని నిరప్పణగాఁ గప్పలఱేఁడు సెలవిచ్చిన బలవంత మగుట సేరంబున ననర్గళ ప్రచారంబునం బేరెంబులు వాఱుచు నొడిసియొడిసి బహులుపడం గ్రచ్చి కిమకు కిమకురనక కతిపయదినంబులకు జలపాదావశేషంబుగా నిఖిలభేకంబులం భక్షించి.

క. తలనంటి పట్టుకొని చిప్పలు విరిగి పడంకుచున్నవాని నహో య
జ్జలపాదు విడిచి రోషా,విష్టమానసుఁ డగుచు మందవిషుఁ డిట్లనియెన్. 371

క. తగునే భోగిశిరోమణి, నగునే నొకవేళ నలఁగి యరుదెంచినఁ దై
నెగురకొనఁ గొండయెక్కడ, దగ రెక్కడ వలదె తారతమ్యం బరయన్. 372

క. వలఁదుమ వధ యెవ్వరికిం, గలయతియ మహాబలారిగా యితఁడంచుం
దలఁపక గౌరవమింతయు, సలుపక నను నసదుసేయఁజనునే నీకున్. 373

క అతిమణిఘృణిసంభరణో, చిత మగు నాఫణము కష్టశిలా నీవు
త్సితపుటదుగులను వర్ష్మామె, తతినిక్క నలాఱ మ్రింగెద న్ని న్ననుచున్. 374

క. వడి నొడిసిపట్టుకొని దెస, వడ నొడలుం దొడలు బడలువడ నొక్కి ముదం
బడర దిగ మ్రింగి వలసిన, కడ కరిగె న్మందవిషుఁడు కాకాధ్యక్షా. 375

వ. ఏ నమ్మందవిషుచందంబున నవమానంబున కోర్చి ప్రతిపక్షక్షయం బాపాదించితి
ననిచెప్పి చిరజీవి మఱియు మేఘవర్ణున కిట్లనియె. 376

క. మూలముల జెఱుప వనవ, జ్వాలలు తెరువులనకాని చందనశైత్య
శ్రీల మగుగాడ్పుచెఱుచు, న్మూలంబులతోన వృక్షముల శీఘ్రమునన్. 377

క. ధనమున ఋణశేషము సా, ధనముల రిపుశేష మౌషధంబునఁ దనుసం
జనితగదశేష ముదకం,బున శిఖిశేషం బశేషముగఁ జేయఁదగున్. 378

చ. ముడివడియున్న దుర్వ్యసనము న్నడలించి దురంతరోషపుం
గడలి సుశాంతిసేతువునఁ గట్టి సమానమదేశకాలముల్
కడఁగనిచిత్రగుప్తి పొసఁగ న్మను జేనికి వేయునేల యి
ప్పుడమిఁ గరస్థలామలకముల్గద సంపదలు న్శుభంబులున్. 379

క. శరములఁ బడరుమనీషా, శరములఁ బడినట్లు రిపులు సమరమువలయున్
శరములకు వలను ప్రజ్ఞా, శరములసం గ్రాహ్యమెద్ది సరియా రెంటన్. 380

క. అంతులకు దైవయత్నము, బలవంతంబైన నెల్లపనులౌదగు మహా
బలుల కది లేకయుండినఁ, బలుకులు వేయేల కడమవడు సర్వంబున్. 381

వ. సుచరితఫలంబులంగాక సకలకార్యంబులు చేకూడవు త్యాగంబున హారుండును
వైదుష్యంబునం బ్రియుండును గుణంబుల లుబ్ధుండును నగుచు రాజు రాజ్యంబు
గావింపవలయు నిందొక్కటితక్కినం బురుషాకారంబు నిరర్థకం బని విందు మది
యట్టిద. 382

సీ. ఘనరూపనిధి యనంగునకా యనంగత్వ మచితమే బలి కహీనవ్యూహవసతి
పాండునందనునకా బహుకాననవాస మిభేపురాధిపునకా యేటిచౌరవ
యమకులాధ్యక్షునకా శాపదురాంబు జాహ్నవిసుతునకా శస్త్రశయ్యా
నలరాజుకా మహానసపాకజనంబు నహుషునకా ఘోరనాగమూర్తి

తే. పతిత్రిశంకునకా పచ్చిమాలతనము, ద్రుపదనందనకా రాచతొత్తుపాటు
మనుజుఁ డెవ్వఁడు కర్మస్వతంత్రుఁ డరయ, నీశ్వరుఁడుగాక సమకూర్పనిట్టిపనులు.

వ. ఇదియొట్లేఁగి ప్రజ్ఞాన్యాయంబు లేమఱక యుండవలయు దైవబలంబు గలవాఁడవ
గుట నీకు శీఘ్రకాలంబునఁ గార్యసిద్ధియయ్యె నిరమిత్రుండవయితి ప్రాప్తమి
త్రుండవయితి వింకఁ బ్రాజ్యవైభవంబున రాజ్యంబు సేయుమని చిరంజీవిచెప్పిన
మేఘవర్ణుండు సకలసంపత్పరిపూర్ణుండై రాజ్యభోగంబు లనుభవింపుచుండె 384

క. అని చెప్పిన ధరణీవర, తనయులు నిజగురునిఁ జూచి తాత్త్వికముఖ్యా
వినఁ బ్రియమయ్యెడు జెపుమా, యనువారఁ జతుర్థతంత్ర మని యడుగుటయున్.

చ. అతనుభయంకరైకవిషమాంబకసమ్యగినంతిభోగసం
గతవిగతాంతరాయగతి గాఢవినాయకవత్తచిత్తజా
దృతిబహుపద్మజాండమణిదీపితకుక్షికరంకమందరీ
కృతపరతత్త్వవిజ్జటిమృగేంద్రవికస్వరయోగపుష్కరా. 386

క. రంగత్తరజాతమహా, గాంగేయస్తవనఘటితఘనపులకాయ
త్సాంగనిచోళయుతప్రా, గ్రంగస్థమత్స్యసంచరణశైలూషా. 387

మాలిని. కలుషచుళకధూమాక్లాంతచింతామరామా
ప్రళయకరణరోషా ప్రాణిసంగుప్తితోషా
విలసదచలధర్మా విశ్రుతశ్రౌతకర్మా
సులభభజనలోలా సుస్థిరశ్రీవిలాసా. 388

గద్య. ఇది శ్రీవేంకటనాథకరుణాలబ్ధ సరససాహిత్య నిత్యకవితావిలాస సకల సుకవికృతికైవారభాషణోల్లాస రాజకులపారావార పర్వశర్వరీరమణ నీతిశాస్త్రమార్గ పరిశ్రమణ ధైర్యపర్యాయధిక్కృత నీహారపర్వత పర్వతరాజకుమార నిస్సహాయప్రబంధనిర్మాణ భోజభూదార సుధామధుర భారతీసనాథ వేంకటనాథ ప్రణీతంబైన పంచతంత్రంబున సంధివిగ్రహం బన్నది తృతీయాశ్వాసము.

శ్రీ ర స్తు.

# పంచతంత్రము.

## చతుర్థాశ్వాసము.



సత్యాలోకనజని
తాసమశరకరణసంభ్రమాధికనరక
త్రాసవిధిప్రౌఢరణా
భ్యాసభుజార్గళసనాథ హరిహరనాథా. 1

వ. దేవా లబ్ధనాశనాభిధానచతుర్థతంత్ర మాకర్ణింపు మధీతనీతిశాస్త్రమర్ముం డవ్విష్ణుశర్ముండు సుదర్శనకుమారుల కిట్లనియె. 2

క. పరకపటాలాపపరం, బరకేర్పడ భ్రమసి విడుచు ప్రాప్తార్థము గా
పురుషుఁడు విడువఁడె మును సాఁగరమునఁ గపిశింశుమారకము గుప్పణితిన్. 3

క. నావిని రాజకుమారకు, లావిప్రవతంసుఁ బలికి రదియెట్లు నయ
ప్రావీణ్యా యాకథ జెప్పుమా వినియెద మనిన వారి కతఁ డిట్లనియెన్. 4

సీ. నీరదపథికపానీయనికేతంబు మేదినీయువతికటీదుకూల
మంబరచరవరాభ్యవహారసత్రంబు సరిదలంకృతికార్యకరణశాలి
కార్పణ్యభయదవీక్షణవధూజనికర్త రాక్షసజిద్విహారస్థలంబు
మునిరోషనష్టనాకనిసర్గశుభదాయి నిస్తులరత్నపూర్ణితకరండ

తే. ముగ్రశతధారధారాసముగ్రభీతి, పరవశాగత బహుకుభృద్భరణనిపుణ
మతనుసత్త్వ మలక్షితౌర్వానలంబు, వఱలు దక్షిణశరధిసర్వజ్ఞశరధి. 5

సీ. ఇమ్మహాగాంభీర్య మెవ్వనికో దవు నీవాహినీభరణ మెవ్వనికిఁ గలుగు
నీగోత్రరక్షణ మెవ్వనికబ్బు నీయనిమిషావాప్తి యెవ్వారికి దొరకు
నిసత్యసౌభాగ్య మెవ్వనికొనఁగు నీఘనహితాచరణ మెవ్వనికి నొదగు
నీగాఢజీవన మెవ్వనికుండు నీకనకరత్నోత్కర్ష మెవ్వనికి వశము

తే. నీలలితరాజసన్మాన మెవ్వనికి లభించు నెవ్వని కిట్టియొప్పిదము నిత్య
మాతనికె కాక యని లోకు లభినుతింపఁ, గ్రాలు నిర్భరవిభుఁ డాపగావిభుండు. 6

క. అపరిమితం బుడుపతర, ణ్యుపసక్తం బఖిలజలధరోపాస్యం బా
త్మపదస్థానిమిషంబు, ద్విపులాక్షేమం బనంతవి మెఱిఁగింపన్. 7

క. ఆనీరధితటమున బహు, మానుం డనువాఁడు వృద్ధమర్కటుఁడు మహా
వానరులు ముఖరస్త్ర, స్థానరులు భజింప సుముఖుఁడై వర్తిల్లున్. 8

ఉ. వానికిఁ గంటిలో నెరసువంటివిరోధి సమీపపర్వత
స్థానమునం జయోన్ముఖుఁడు తామ్రముఖుండు చరించు నమ్మహా
వానరసార్వభౌముఁడు ప్లవజ్జనసంగబహుప్లవంగసే
నానతగోత్రుఁ డౌచు నొకనాఁడు సమిత్కరణేచ్ఛ వచ్చినన్. 9

క. కైకొనఁగలబహుమానుం, డాకంతక్రోధవివశుఁడై ప్రతివీరా
నీకినిపై బల్ధిక్కృత, నాకపుల న్గపులఁ బనిచిన న్నిశ్శంకన్. 10

క. ఆహవ మొనరించె సము, త్సాహత నిరువాఁగు దొడరి దంతాదంతిన్
బాహాబాహిముఖాముఖి, నాహావాఙ్ముఖరఖచర మై నభ మొప్పన్. 11

శా. లావు ల్పేర్కొని నొంతు రుర్విఁ బిడికిళ్ళం ద్రెళ్ళ పార్శ్వాచల
గ్రావంబు ల్పెకలించి యువ్వూగురు మ్రగ్గ న్మోగ్గ వృక్షాగ్రశా
ఖావర్గంబుల నెత్తి మొత్తుదురు స్రుక్కం జిక్కఁ గంఠచ్ఛటల్
గావుల్పెట్టుదు రొండొరు ల్మదమణంగం బ్రుంగ నవ్వానరుల్. 12

క. చఱతురు పెడచేతులనోఁ, గఱతురు తెరనోళ్ళఁ బిసితఖండంబులు రా
విఱుతురు పెళపెళ నెమ్ములు, పఱిబోవనికలిమిబలిమిఁ బ్లవగాధ్యక్షుల్. 13

క. విరసము నెఱసాహసమున్, బురిగొన నిట్లుభయసైన్యములు పోర న్ర
క్తరసతరసములు గదురఁగ, శరనిధిసత్త్వములు వెలివిసరి రాఁదొడఁగెన్. 14

వ. అప్లవంగసంగరం బావిష్కృతారుణంబు నవ్యక్తతారకంబు నగుచు నహర్ముఖం
బును లుంఠితాగమనంబు లుంఛితశ్మశ్రురోమంబు నగుచు బౌద్ధకర్మంబును నదృ
ష్టశాస్త్రంబు ననక్షతపరికరంబు నగుచు యౌవనవివాహంబును బరిభ్రంసితచరణం
బుం బ్రణష్టపళీవిలాసంబు నగుచుఁ గుకవికవిత్వంబును ననుకరించె. 15

క. అంతఁ దనఘనబలంబులు, పంతము దిగనాడి యోడి పఱచిన సంవ
ర్తాంతకుఁడన బహుమానుఁడు, తాం తేతరతామ్రముఖపతాకినిఁ దోలెన్. 16

తే. అప్పు డూర్ధ్వశిఖుం డైనయనిలసఖుఁడు, పోలె మత్తామ్రముఖుఁడుచూపుబలతిస్ఫు
లింగసంఘాత ముదయింప నింగినింగి, దాఁకుచందాన బహుమానుఁ దారసించి. 17

చ. తఱిమివధింప శత్రునకుఁ దానసమీకసమీకరంతయై
యుఱిముఱిఁ బల్కె నోరిజరతా పెఱరావునకేగు నాబలం

బెఱిఁగియుఁ జూవనేలయిపు డీవన నబ్బహుమానుఁ డోరి ద
బ్బఱలకు రాను తాఁకువెపపలుక్కల కోర్చినవాఁడఁగాఁ జుమీ. 18

క. పందకుఁ గాక పలాయన, కందళిసాహసుని యందు గలుగునె యని మి
న్నందినకోపంబున వై, చెం దామ్రముఖుండు పుల్లసిల శిలనలుకన్. 19

క. మఱియొకకుటవిటపంబునఁ, జఱచి ఘనక్రోధదృష్టి సముకొనముష్టిన్
బఱియపడ నురముఁ బొడిచిన, మఱియుం బపకపుతు తామ్రముఖుఁ డుగ్రుండై

క. బలవంతు మాల్యవంతుం, జలధికడం గడఁగి నొంప సమయింపంగాఁ
దలఁచుహనుమంతుఁడంతున, నల్పార్ధుం గ్రుద్ధుముష్టిహతి క్షితిఁగూల్చెన్. 21

తే. కూల్చి చంపక యసురుతోఁ గూడ నతఁడు, నతని కాంతాళిఁ గైకొని యాతులగతులఁ
బఱచి వారాశిరాశితత్ప్రాంతకాంత, ధరఁ జిరాధృతిశైత్యకృత్యము లొనర్ప 22

క. కొండొకకాలమునకుఁ గపి, మండలపతి మూర్ఛఁదేఱి మహిరహితోఁ గూ
ర్చుండి కనువిచ్చి రిపును, ద్దండపరాక్రముని గాంచి తలవంచుకొనెన్. 23

వ. అగణ్యదాక్షిణ్యాభిముఖుం డగుతామ్రముఖుం డబ్బహుమాను నన్వర్థనాముఁ
గావించి పంచిన 24

చ. జరఠకపీంద్రుఁ డట్లరిగి సాగరతీరమునందు మానితాం
బురుహభవాండమండపరిభూషితుఁడై వెలుఁగొందుచున్నయా
శ్వరుఁడన నుజ్జ్వలజ్జటిలసారఫలంబులఁ బూర్ణమై మహా
గరిమ వహించుదాని మధుగర్భము నాఁ జను మేడిదోఁచినన్. 25

క. పరికించి యయ్యుదుంబర, తరువెక్కి తదీయపక్వతరఫలసేవా
గరిమం బ్రాణానిలసం, భరణముఁ గావించికొనుచుఁ బ్లవఁగుం డుండెన్. 26

క. అప్లకపిచేతిపచేళిమ, ఫలము ప్రమాదమున జారి పాథోధిజలం
బులఁ బడియోఁ బడిననొండొక, బుళబుళశబ్దంబు సంప్రభూతం బయ్యెన్. 27

క. అనివదము కర్ణంబుల, కానందవిధావిధాయి యగుటయు గణనా
హీనము లగుతత్ఫలములు, వానరుఁ డక్కడలి నీటవై వఁగఁ దొడఁగెన్. 28

క. వనచరకరముక్తములై, వనధింబడు మేడిపండ్లు వారణలోలోఁ
దినుచుఁ జలింపక క్రకచుం, డను దారుణశింశుమార మచ్చోనుండన్. 29

క. అధికతమోదుంబరఫల, మధురరుచిం జొక్కి శింశుమారము మాసా
వధిగా నచ్చోటన కర, మధివసియించె న్నిజప్రియావిముఖంబై. 3

చ. క్రకచునిభార్య కూర్మిచెలిఁ గన్గొని యిట్లనుఁ బ్రాణవల్లభుం
డకట యొకేనిఁబోయి తడవయ్యె విలంబనహేతు వెద్దియో

తికమకమైతి నా నెగులుఁదీర్పుము నీవిపు డేఁగిమాది నా
యకసుఖవార్తఁ జెప్పుమని యుంచిన మాతికపోయి ముందరన్. 31

క. ఒకచో వికచోదుంబర, నికటంబున మసలి క్రోఁతి నెయ్యంబునఁ బా
యక యున్న శింశుమారం, గ్రకచాంఘ్రినిమాతి ప్రీతిఁ గని చని యొసఁగన్. 32

చ. చెలువతియున్నకూర్మి చెలిఁ జేరి వినంగన గ్రొత్తలైనచో
చెలి తెలియంగ నంతయును జెప్పెద రోయుకవిన్ను నేను నీ
యలఘునియోగమూఁది చని యక్కడ నొక్కెడఁ జూచి వచ్చితిం
దొలఁగక వానరప్రమదతోఁ గపిఁబాయనివాని నీపతిన్. 33

క. నేనెఱుక చేయుకొఁజ కిట, వెనువెనుకను వచ్చివచ్చి వెలఁదికొలందిన్
జననీపని చెప్పితిఁ బర, వనితారతి బుద్ధిఁ దేలవచ్చున్నగుచున్. 34

క నావిని కాఁపుర మెటువలె, నీవిషమునఁ బ్రాణనాథుఁ డితరస్త్రీమై
త్రీసఖుఁడయి యుండఁగ నని, పావకశిఖిపోలె మండిపడి యది మదిలోన్. 35

చ. కనుఁగవ నశ్రులోడికలు గట్టఁగఁ దైలనిషిక్తయై నిజా
నన మరవాంచియుండె సదనంబున నత్తతి శింశుమారుఁ డ
ప్పనచరనాథుపీడ్కొని యవారిగఁ దివ్యఫలమ్ము మేడిపండ్లు నొం
చు నిలువ కేఁగుదెంచి యిలు సొచ్చి కులాంగనఁ జూచెఁ జూడ్కికిన్. 36

ఉ. ఒండొకభంగిఁ దోఁచుట యిది నుల్లము ఝల్లనిపల్కె శింశుమా
రుండు ప్రియానయాతిగవిరోధిని హృత్పరిమదాప్రమాదినే
యండకు వచ్చినం బలుక వక్కట యేవిన శింశుమారిని
ష్కండవిధానమైనయలుకం దలయెత్తదు చూడ దెంతయున్. 37

క. అదియట్టిద యుప్పనికిం, బొదరగుటం దూతిప్రీతిఁ బురికొనఁ బలికెన్
జతురాలికిఁ దెవులెత్తిన, యది నీతో నెట్లుమాటలాడం గూడున్. 38

క. మందులు దెమ్మని చెప్పిన, మందులు నిచుఁ గొలుచునటులు మాతోఁ దమలో
నిందెవ్వరుఁ బలుకరు నీ, చందముగా నెట్లు సాధ్వి జాఱజ మానున్. 39

క. నావిని క్రకచుం డనుమ, జ్జీవము తౌషధము లయినఁ జేడియ కీలో
సేవింపఁజేసి నిర్గదఁ, గావించెదఁ జెపుము దాఁచఁగా నేమిటికిన్. 40

క అని కూర్మి తేటపడఁ బ, ల్కినపల్కులు శింశుమారి గెంటనివేడ్కన్
విని నీతి తంత్రమంత్రిం, గనుఁగేఁటిన నతఁడు చేరి క్రకచుని కనియెన్. 41

క. ఎలనాఁగ రోగమునకుఁ బం, గలమందులు చెప్పఁడునిన ఘనశాస్త్రకళా
బలవేద్యులు వైద్యులు నే, ర్పరితిం గ్రోఁతిగుండె వలెనని విధిపా. 42

క అది ముదిత కోసఁగకున్నన్, బ్రతుకదు చెడచెడఁగరాదు పరిణామమునన్
మఱిఁగదిరిన వెఱఁ గ్రకచుం, డిది యెవ్విధినొందు భార్య నెట్లీడేర్తున్. 43

క. బహుమానుం డొకఁడున్నాఁ, డహితుఁడు గాఁడతఁడు హితుఁడు హాహాముక్త
స్పృహగృహరక్షార్థము దు,స్సహమహనా ప్రజ్ఞ నెట్లుచంపుదు నతనిన్. 44

చ. నిరతము విశ్వసించు నతినిర్మలచిత్తున కెగ్గుసేయుకా
పురుషుఁడు దక్క భూరికులభూమిధరంబులు గావు సప్తసా
గరములు గా వరణ్యములు గావు భరంబని ధాత్రిమైత్రి నా
సిరివరుతోడ విన్నపము సేయదె వేఁడిన నట్లుగావునన్. 45

చ కడపట భార్యనిల్కడకుఁ గాఁ జెలికానికి నెగ్గుసేఁత యొ
క్కడుదురితంబు కొంపురము గూలఁగఁ జూచుటయున్మహోఘ మి
ప్పడఁతుకపట్టున న్సఖునిపట్టున నింతి విశేష మింతకై
చెడుపనియేనియుం దగిలి చేయక మానఁగరాదు గొబ్బునన్. 46

వ అని నిశ్చయించి బహుమానవధోద్యోగంబునం దిరిగి వచ్చె నప్పు డుపాంగుసమ్ము
దంబునం బ్లవంగపుంగవుండు. 47

క. క్రకచావికచాద్భుతియొ, ద్దపుఁ గ్రమ్మఱ నరుగుదెంచెదవు కులకాంతా
నికట మకటా యసహ్యం, బొకో సత్యముఁ జెప్పుమనిన నుదవచుఁ డనియెన్.

ఉ. ఏను ఘనప్రియోగమున నేగి ఫలంబులు కానుకిచ్చినన్
మానిని పల్కె నీ వరిగి మాసకుమయ్యేఁ బ్రవాస మెవ్విధిం
బోనిది నీకు నెద్దిగతమో గతిమోహభవద్వియోగంబు నా
తో నెఱిఁగింపుమున్న భయదూరసదాధృతి నంటి దానికిన్. 49

చ తనయుననూనభామతిమిధామతటంబున లెక్కకెక్కడా
ఘనఘటరాజిఁ గ్రాలు మధుగర్భమునాఁ జనుమేడి దానిపై
మను నను వాసరంబు బహుమానుఁడు తక్కఁపిచక్రవర్తిగా
పున నితరం బెఱుంగక యపూర్వసుఖస్థితి నుంటి దాలిమిన్. 50

చ. మఱునఁగ రానిసఖ్య మది మాటలు వేయును నేల పుట్టి బు
ద్ధెఱిఁగితిఁగాని యట్టిజగదేకపవిత్రునిఁ జూడ నెందు నో
తెఱవరొ యంచుఁ బౌరసుగతిం గృతి నియుపకారకృత్యముల్
గుఱిగడవం బ్రియంబుతమిఁ గొండలు కోటులుచేసి చెప్పితిన్. 51

ఉ చెప్పిన నంతరంగమున సింగఁడు బూరఁడునై ప్రియంబుసొం
పుప్పతిలంగఁ బల్కె నది యోయికృతఘ్నుఁడ వీవుగావె య

ప్పప్ప సుహృత్తముం డయిన యాయన నింటికిఁ దెచ్చి వేల్పునే
చొప్పునఁ గొల్తు రట్లు పరిశుద్ధసపర్యల దేల్చుటొప్పదే. 52

ఉ. ఎక్కటి మేడిపై నిలువ నేటికి నేఁటికిఁ గాను నిల్చుఁ గా
కిక్కడఁ బెద్దకాల మఖిలేప్సితభక్ష్యము లావహింతు నా
మ్రొక్కనిమ్రొక్కి పెక్కుప్రియము ల్నయము ల్నచరించి తోడితె
మ్మక్కపినాథునంచుఁ బ్రియయ ంచిన నిన్గొనిపోవవచ్చితిన్. 53

క. కారణవిముఖంబై యుప, కారముఁ గావింపలేరుగద లోకము కై
వారం బగు నిట్లన ని,ష్కారణవత్సలుఁడ వీవు కారణజన్మా. 54

క. కపివర నీచేనందిన, యుపకారపుటప్పుఁ దీర్పనోప న్గరుణా
నిపుణమతి స్వగృహంబున, కిపుడీ వేతెమ్ము పూజ లిచ్చెద భక్తిన్. 55

క. ఇలువాడిమ్రుగ్గలిడి కూ,రలు గూర్లమరించి యేఁలరాఁడా యొక్కో
వెలలెం బ్రొద్దని యట నీ,చెలియలు నేఁ డెదురుఁజూచు సేవించుటకున్. 56

క. రారానిచోటుగాదు కృ,పారాజితపెచ్చుకుంటు పైఁ బర్వినభా
గీరథివిధమున నస్మద, గారమునకు రమ్ము కపిశిఖామణి యనుడున్. 57

వ. ప్లవంగపుంగవుండు. 58

ఉ. రాసిరణం బొనర్చి నిజరాజ్యముఁ గైకొని నన్ను గాసి గాఁ
జేసినవైరిఁ గన్గొనుచుఁ జెంగటనుండుట కష్ట మిందునా
కోసఖ యట్లుగానఁ బదమూఁద సహింపదు వంతువెంబడిం
గాసిలియుండువారలకుఁ గానని క్రంతలు మేలుగా వొకో. 59

క. అనఘా నీనిలయమునకుఁ, జనుదెంచెద మీకుఁ గాక జలసంచారం
బనువగునే మముఁ బోలిన, వనచరులకుఁ జెప్ప మనిన వాఁ డిట్లనియెన్. 60

క. నీవాక్యము లుచితంబులు, గావె పయోవిహృతియేడఁ గపులేడ యొకే
నావీపున నిన్నిడికొని, యావాసముఁ జేర్చువాఁడ నరుదెమ్మనినన్. 61

వ. తద్భాషితంబులు మాయాదూషితంబు లగు టెఱుంగక, 62

చ. మెఱసి యుదుంబరద్రుమముమీఁద వసించినకీశరాజు చే
టెఱుఁగనికూనతెప్పవలె నేర్తుఱఁ దోఁచినశింశుమారుపై
నుఱికెఁ దదీయపృష్ఠమున నుండినవాఁడు విశృంఖలత్వరం
బఱచి హుటాహుటి న్మనికిపట్టున కేఁగెదుత్రోవ నేర్పడన్. 63

క. నీరము తెరవునఁ గొండొక, దూరము చని యలసి నిలిచి దుర్దాంతవిషా
దారూఢహృదయమై చిం,తారతి నది యీరెలుంగునం దనలోనన్. 64

ఉ. నన్నితఁ డంతరంగమున నమ్మి యయో చనుదెంచుచున్నవాఁ
డెన్నిభవంబులం దొలఁగ నిష్టులఁ జంపినఘోరపాప మెం
దు న్ననుపంటిదుష్టచరితుం బరికింపదు లోక మాక్రియల్
గన్నవిగావు విన్నయవిగా వొనరింపఁగఁ బాసె సఖ్యముల్. 65

క వసవడి పురుషుని భారం, బిడి భూరివృషంబు జాత హేమము నొఱయం
బడు శుద్ధిశక్తిరుచులకుఁ, బడఁతులహృదయంబు లొరయఁ బడ వేగతులన్. 66

మ. పరమద్రోహపురస్సరంబులు నయోపాయక్రియాదూరము
ల్దురితచ్ఛన్నము లన్యతాపకరణోద్యోగంబు లప్రత్యయా
కరము ల్సత్యపరాఙ్ముఖంబులు సమగ్రక్షాంతివల్లీశిత
క్షురము ల్దంభమయంబు లెట్లెఱుఁగవచ్చుం గామినీచిత్తముల్. 67

క ఈమనసులు గలిగినమహా, కామాయామయతరోక్తులకు లోనైయ
య్యో మదినమ్మినకీశ, గ్రామణిఁ దెగటార్పఁదలఁచెఁగా నాకనుచున్. 68

క. అక్రకచుఁ డిల్లనిల్లనఁ, బలుకఁగ విని వానరాధిపతి భూరిభయా
కులమానసుఁడై యపుడో, దళితాఘా యేమిపలికెదవు నీ వనుడున్. 69

క. ధృతిఁ గ్రకచుఁ డప్పుడదత్త, ప్రతివచనుం డగుచు నులుకపలుచుచునుండన్
వికలప్రజ్ఞం గపియు, ద్ధతు వానిం గ్రమ్మఱించెదం గాకనుచున్. 70

క. భీతిప్రవహ మతిధృతి, సేతువుచే నాఁగి పలికె చెలికాఁడా నీ
శాతోదరి నాసోదరి, కౌతుకమున నున్నె భవదగారం బమరన్. 71

క. ఇది వినవలతుం జెపుమా, మది వొదలఁగ ననిన శింశుమారుఁడు పలికెన్
గదబాధిత యయియున్నది, గద నీయనుజాత యెట్లుగా ధరియింతున్. 72

సీ భార్యలేకయొనర్చుపండువు దండువు కులకాంతపెట్టనికూడు గెడు
పత్నితోఁ బలుకనిపలుకులు చిలుకలు గృహిణిలేనికబంధకేళి జాలి
జాయవాటింపనిసరసము ల్విరసము ల్ప్రాణేశ్వరికిఁగానిపాటు చేటు
దయితకై చేయనిప్రియములు భయములు వల్లభవెలియైనయిల్లు పొల్లు
తే. ముగ్ధకులకాంతిసుద్దు లేస్రద్ధ వినని, చెవులు గవులు వృథా వేయుఁ జెప్పనేల
యకట సతిలేనిబ్రతుకేల యర్ధమేల, వాహనములేల కరులేల వసుధయేల. 73

క. నా విని బహుమానుఁడు బా, ష్పావృతముఖుఁడగుచు వాని కనుఁ గ్రకచా నీ
దేవి రుజ మాన్పుటకు లే, రె వెజ్జులు మందుఁ జెప్పరే వారనినన్. 74

క. చెప్పిరి వానరహృదయం, బప్పనికి నవశ్య మనుచు నగదంకారు
ల్తప్ప కదిహేతువుగ ని, న్నిప్పుడు గొనిచనుట యని యహితుఁ డతఁ డాడెన్.

క. నగచరుఁ డదివిని వెఱఁబం, డ్లగిలిచి పడపడ పడంకి యొదపడి చెడితిజా
దెగితిఁ గడచనితిఁ బొలిసితిఁ, బొగరున నిట్లయితి మోసపోయితి ననియెజా. 76
వ. అని. 77
క. దారుణగహనంబున నా, హారోత్తలఁ బెట్టుమదిమి నసురుసుఱై కా
మారంభం బుడుగని యల, ఘోరాఘఫలంబు గట్టి కుడిపెడునన్నుజా. 78
క. భీమాటవిలో నున్నం, గామాంధుని బొదవుపాతకంబులు రాజ
గ్రామముననున్న దూరితి, కాముని గల్మషము లంటఁగా శంకించున్. 79
క. చిరకాల మరిగె సురిగెం, దరుణిమ యికనేడ గామతంత్రం బనుచుజా
బరలోకచింతనేయని, పురుషార్థముఁ జేటుపాటు పొందదె యనుచుజా. 80
చ. క్రకమని చూచి వానరశిఖామణి యిట్లను నీవిచార మే
టికిఁ జెడిపోయె నేమిటికి డించె భవన్మతిప్రాణమైనభా
ర్యకు రుజమాన్పఁ గీశహృదయంబునకుం జనుదెంచువాఁడ వీ
వకట యెఱుంగఁ జెప్పవలదా మునుగల్గగ నాకు నింతయుజా. 81
ఉ. చెప్పిన నాయుదుంబరపుఁ జెట్టున నెప్పుడు దాచియుందు నొ
క్కప్పుడు మామకీనహృదయంబు సమర్పణఁ జేసిపుత్తు నీ
చొప్పున నింత దాచెదరె చుట్టముఁగానె విరోధినే పృథా
త్రిప్పటజేసి తింకొరులు దెత్తురె నిన్నడిపం బ్రతిక్రియల్. 82
క. హృదయము దరువున నున్నది, గద నాకాయమున లేదుగద మునుగా నా
కిదిచెప్పక పనిచెత్తెచితి, గద రిపుఁడవుగాని చెలివిగా వంగనకుజా. 83
సీ. ధర్మార్థకామచింతకులకు భూదేవధారుణీపరపధూదర్శనములఁ
జనరాదు రిక్తహస్తములను గామ్యార్థి వగునీకు మున్న పాయనములయు
హృదయంబు మేడినున్నది పోకమరలు నిర్మ్మండితారినికాయ గుండెకాయ
చేయార నీకు నిచ్చెదఁ బుచ్చుకొని చేరి జాయ నిరామయఁ జేయవయ్య
తే. యనుచుబహుమానుఁడాడుమాయామయోక్తు,లాగమోక్తులుగానప్పడాత్మఁదలఁచి
తిరిగి యాశింశుమారుఁడే తేరఁ దీర, వృక్ష మెగఁబ్రాఁకి కపి వాని వెక్కిరించె. 84
క. కసినుస నాఁకట ఫలము, ల్మెసవుచు జలివిడిచి మేడిమీఁద న్మోదం
బెసఁగ నటియించువానరు, మసలక వీక్షించుశింశుమారుం డనియెజా. 85
చ. కుజమున నున్న వానరునిగుండియ దండియశంబు నీకుఁగా
భుజబలసార యిమ్ము కొనిపోయెద నాయెదదీఱ మిట్ప్రియా
రుజ కనఁ బల్కెఁ గాననచరుండు దురాత్మ విచారమూఢ యే

కుజమున నుండు వానరుని గుండియ యొక్కఁడి జోలిపొమ్మిసీ. 86

చ. స్తుతులఁ గరంచి నాగృహము జూతువు రమ్మని తోడుకొంచుఁబో
యి తగవుమాలి నన్నుఁ బొలియింపఁగ యత్నముఁ జేసితేను నీ
గతి భవదీప్సితంబు పొసఁగుకై పడి నిన్మరలించి మేనిబ్రో
చితి జిరకాలజీవి మతిశీలుఁడ మోసము నాకుగల్గునే. 87

క. కదలుమిఁక ననినఁ గ్రకచం, బెదపడి యేఁటన మోసమెఱుఁగనినను ని
మ్మదిక్రోఁతి మోసపుచ్చెం, గదరా యని విన్ననగు మొగముతో నున్నన్. 88

వ. బహుమానుండు. 89

క. దొరకిన నను విడుచుట కబ్బురపడకుము నీకుఁ దోడు పోయిన ధరణీ
సురుఁ డొకఁడు లబ్ధమనుజే, శ్వరకన్యక విడిచి రిత్తవాఁడై చన్నఁడే 90

క. నానీరచారుఁ డాబహు, మానున కిట్లనియెఁ దెలుపుమా వినవలతున్
దానేల విడిచె నయవి, ద్యానిధి బ్రాహ్మణుఁడు భూతలాధిపకన్యన్. 91

సీ. అనిన శాఖామృగాధ్యక్షుఁ డాక్రకముని కనుఁగొని పలికె నిక్కథ వినంగ
దగుదువు నేనును దగుదు నీకెఱిఁగింప మును విశాలాపురంబున సుకీర్తి
యనురాజు రాజిలు నమ్మహీజానికి భువనమోహిని యనుపుత్త్రి గలదు
దానికి మందాభిధానుఁ డొండొకధరాత్రిదశుండు సుముఖుఁడై చదువుఁజెప్ప
ఆ. నట్లు కొంతకాల మరిగిన నపరంజి, పసిఁడి కలరుతావివలె మనోజ్ఞ
ఫలము చెఱుకునంటఁ బలె నేమిచెప్ప లేఁ, బ్రాయమయ్యె నానృపాలసుతకు. 92

మ. సితరోచిర్ముఖికప్పుగొప్పు సుమనస్స్నేహం బధిష్ఠించి కృ
ష్ణతనొందంగని యోర్వలేక వదనాబ్జాతంబు గాంచె న్విధూ
న్నతిజన్నుంగవ యచ్యుతాప్తి బొదలెన్ మధ్యంబు దాల్చెన్ హరి
స్థితిరోమావళివల్లి చక్రితభజించె న్నిష్ప్రియాసక్రియన్. 93

శా. బింబోష్ఠంబు మధూద్ధతంబు పరహృద్భేదు ల్కటాక్షంబు లా
స్యం బుద్యద్ద్విజరాజమండలపరిస్పర్ధాళు వాక్ష్ణదీ
ర్ఘుంబౌ గ్రాల్గనుదోయియుం గువలయప్రత్యర్థితారాపథా
లంబు లాప్వాల్గురుతేలొకో పొగడుబాలం జాలముల్లోకముల్. 94

శా. లీల న్రాగరసోదయస్ఫురణ దాల్చెన్ మైజగద్గీతస
ర్వాలంకారపదప్రవీణయది యాహా యట్లు గాకుండినన్
వాల్గ్రంథివరాళిమోవి ననుదీపంగూడి తోరంబులౌ
పాలిండ్లన్ ఫలమంజరీగరిమ జెప్పం జూపనౌ బెవ్విధిన్. 95

మ. అతిభాస్వత్తరకాంచనంబు చెలినాసాంగంబు కల్యాణ మా
శతపత్రేక్షణ మేను మేరుకుధరాంచత్కూటము ల్దానియు
న్నతవక్షోజము లేమిచెప్ప నదియంతా యంతబంగార మ
ప్రతిమం బానరనాథుపట్టి గణుతింప న్శక్యమే యేరికిన్. 96

క. తనపుఁ బయోధరభృతి వ్రేఁ, గని మి న్నేలనాఁగ ముఖ్యమయ్యె నదైనన్
జనకు పయోధరభారము, జననాంతరకర్మమేల చను నెంచున్నన్. 97

క. పరమాణువు పరిమపుహ, త్పరిపూర్తి న్గోచరించుపరమమహత్తున్
బరమాణువై కనంబడు, దరుణీమధ్యస్తనేక్షతత్త్వజ్ఞులకున్. 98

క. కన్నులకు మొగము చాలదు, చన్నులకు నురస్థలంబు చాలదు వెన్నుం
బెన్నెరివేణికిఁ జాలదు, కన్నియచెలువంబుఁ బొగడఁగా నాతరమే. 99

వ. ఈదృగ్విలాసధన్య యగు నారాజకన్య చకోరికాపరివృత యగుచంద్రికయుంబోలె సఖీజనసహాయయయి వన్నెమెఱసి యొక్కనాఁడాస్థానంబునకు వచ్చి నల్లెగుదెంచిన కుమారీరత్నంబు సౌహార్దభాసమానోల్లాసంబునం దిగిచి యంగపీఠంబున నునిచి సుకీర్తిబంధుజనానుతోడఁ దత్సౌందర్యసౌశీల్యాదిగుణంబు లుగ్గడించుచు గొలువిచ్చియుండె నాసమయంబున. 100

సీ. చిఱుతకెంజడలఁ గీల్చినజాతిపటికంబు గళమున రుద్రాక్షకంఠమాల
యపరంజిపసిఁడికామాక్షులుడామూఁపుపై గొండ్లిఁగావించుయోగపట్టె
చిన్నారికంబెగ్రుచ్చినశింగినాదంబు గుత్తంపుజిక్కులకుట్లబుఱ్ఱ
కరమునఁ జెనుచొఱగరిముల్లు మాయూరబర్హనిర్మితమైనబహళిసురటి
తే. భసితభస్త్రిక పులితోలుపచ్చడంబు, నాగబెత్తము దంతపుయోగవాగ
లమరఁ జెట్టునడిగినట్టు లవనినాథుఁ, జేరనేతెంచె నొకమహాసిద్ధుఁ డపుడు. 101

క. ఏతెంచినఁ గాంచి ధరి, త్రీతలనాథుఁడు హృదంకురితవినిద్ర
ప్రీతి నెదురేఁగి నతుఁడై, యాతిథ్య మొనర్చి యమ్మహాయోగీంద్రున్. 102

క. వినయమునఁ దెచ్చి కనకా, సనమున నిడి రాజుపలికె సదయా మీచా
పనిభూమములు వానం దడి, యనివారలు గలరె మిమ్ము నడిగెద నొకటిన్. 103

క. రాజకుమారులలో రతి, రాజకుమారుల సురూపవసవిక్రముల
శ్రీజయములమించినవాఁ, డోజగదారాధ్య కలఁడె యొకఁ డట్లున్నన్. 104

క. ఆసర్వజ్ఞున కపర, వ్యాసా కులగోత్రజాత యగునీసుత ను
ల్లాసగుణావసతి నిచ్చెద, నాసక్తిం దెలుపుమనిన నతఁ డిట్లనియెన్. 105

క. ఇలఁ గలరాజకుమారుల, దెలివిపడం దిరిగిచూచితిని బాటలపూ

ర్నిలయుండు జయసేనుండనం, గలండాతండు నీకుమారికనుం దగుం గూర్పన్. 106

క. ఆత్రైలోక్యశ్లోకిత, గాత్రుం బ్రశంసింపనేల కనుంగొను మనుచుం
జిత్రరస మానసోల్లం, జిత్రించి మునీంద్రుం డధిపుచేతికి నిచ్చెన్. 107

వ. ఇచ్చినం బుచ్చుకొని యచ్చిత్రరూపంబుం జూచి యచ్చెరువంది యమ్మనోహరా
కారంబు తనయనుంగుతనయకుం గానంజేసి యజ్జయసేనుండు దనకు మేనల్లుం
డు గావున సద్వంశసంబంధంబున కలరుచు 108

క. జనపతి మునిపతిం బూజా, వినుతి నతిక్రియలం బల్లవింపంజేసి ప్రియం
బున వీడుకొలిపి తానుం, జనియెం గొలువువిరిసి రత్నసదనంబునకున్. 109

ఆ. అట్లురాజపుత్రి యాచిత్రరూపంబు, గన్నుదనియంజూచి కంతదప్పు
మోహసింధుపతితయై హార మాహార, మాళిజనవిహార మరుచిపుట్టి. 110

వ. చింతించుచుండ నెచ్చెలు లారామంబునకుం గొని చని. 111

సీ. కలకంఠి కలికయోత్కలికావిలాసంబుం దార్పదే యారామధామకేళి
లీల నేతత్ప్రియాళికి నమందానందలహరిం బుట్టింపవే లతలు విరులు
వికసిల్లునీపద్మినికి సదామోదంబు జరుపదే కాసారసారవిహృతి
శిఖిబర్హాతులితకైశికకు సంతాపంబుం బాపదే ఘనకదంబకకులంబు

తే. సకలెనుగదమ్మ లావుకాంచనకలాప, పరిచయము మానెనమ్మ దెప్పరపువంత
వాడెనుగదమ్మ మాతోడ నాడదమ్మ, కొమ్మ మ్రాన్పాటు కెట్లోర్చుకొనంగవచ్చు.

వ. అని నెచ్చెలు లచ్చెలి నాలోకించి సుముఖిగాం జేయువారయి శిలీముఖప్రముఖం
బులం జూపి యిట్లనిరి 113

చ. కరటులపొంగునం గడపుం గాలము బల్లవసంగమంబున
న్దిరుగుం గుజాతమైత్రి నెడత్రెవ్వక శీధువుం గ్రోలు మాలలం
దరసినమండు ప్రోంత తఱు చాత్మభిదై కసుపుష్పపుష్పముం
గుఱుచయొనర్చు నెట్లుపొసంగుం జెలి దీని ప్రియాళిగాం గొనన్. 114

చ. కలగుణము ల్ద్యజించి పలుగాకులవంటి నవంగవచ్చునే
ఫలదళిపారణ ల్వినయపాటవము ల్మఱి ప్రాప్తకాలభా
షల సుమహత్తరు ల్చెలిమి సల్పంగనున్కి దగుం ద్వగంగదీ
ప్తులు వెలిగం దపస్వినులు పోకలకంపులు మాకుంజూపంగన్. 115

మ. మురిపంబుల్ గలమిండతేటికడియంబుల్ మాపతోక్షభ్రమిం
దిరుగం భాసురకేసరేణుకణికాధిష్ఠానకించిద్విక
స్వరపుంగ్రొవ్విరిచాలోళ్ళం జైత్రుహారనించం జంచరీకాలకా

కురిసెం బుష్పరసోత్సవంబు చిగురాకుం గొప్పెర ల్నిండఁగన్. 116

చ. సరసులలో సువర్ణపరిషత్తములై కనుపట్టుకోశముల్
గర మనురక్తిచూచి మృదులస్వర ముట్టిపడ న్సుభాషితో
త్కరము విధాత కెక్కుడగుగౌరవ మొప్పఁ బఠించుఁ జూచితే
హరిణవిలోచనా పరమహంసవతంసము లూర్జితస్థితిన్. 117

మ. గమకంపుంబసనేలకై దిగినశాఖల్ హస్తపాద్విభ్రమ
భ్రమఁ బుట్టింప లతాంతబిందుకులముల్ పైదేర నుద్యద్ద్విర
త్స్వమధూళీమదధారలూర నళిపంక్తుల్ గప్ప నుద్యానపా
నమహిం గానఁగనయ్యెఁ జూచితివె పున్నాగంబు బింబాధరా. 118

ఉ. ఉన్నతి నంబరం బొరసి యొచ్చె మొకింతయులేక కొమ్మలం
గన్నులపండువై బవరిగా నరుదెంచిన ప్రాసవాసవో
త్పన్నఝరం బగ ద్దెలుప న్గులపాలిక యొప్పె జూడు మా
సన్నబలైకపత్రకవిశాలము సాల మఖండమూలమున్. 119

చ. చదువులమేలులేదొ శుకసంతతిగావొ వినీతరీతి చా
లదొ భజియించునీచతురుల న్మఱిమాటకువచ్చునిచ్చలుం
బదివదిగా నొనర్చుఫలభంగము నెమ్మొగి మెత్తుఁజేయున
ల్లదె పరికింపుచిల్కహృదయంబున గోపముజిక్కెఁ దొయ్యలీ. 120

చ సరళగభీరశబ్దఘనసారసమృద్ధిఁ బ్రసిద్ధిగన్నయా
సరసులఁగూడి చారుగతి సద్వ్రతతుల్ భజియింప బాదవి
స్ఫురణఘటింపుచుం దొడుసుపుట్టక యుజ్జ్వలధారచే నుదా
హరణము జేయుచున్నకవి నారసిచూడు మరాళగామినీ. 121

క. నిరుపమఘనరసపుష్టీ, స్ఫురణం బాదములు మెఱయ భూభువనమునన్
సరిజెప్పఁగలదె యిందిం, దిరకుంతల యీవసంతతిలకంబునకున్. 122

క విరికొఱవులఁ బథికపసం, పర జూడుంజూడు మిట్టిపరుసపలాశో
త్కరమునకు నెట్లుగలిగెం, ధరణీసురదండవిధి సుధామధురోష్ఠీ. 123

చ. గళితఫలాశఁ బూజకలికాచ్ఛలనంబున విస్ఫులింగము
ల్చిలుకుచు మత్తకోకిలవిశృంఖలఘోషమిషంబుచేత గ
ర్జిలుచు ధరాపరాగముల రేఁచి వడి న్సుడిగొంచువచ్చెడిం
బెలుచమనోజమాంత్రికుఁడు పెంచినగాలిపిశాచిఁ జూచితే 124

ఉ. వేవెడఁగేల డీలుపడవ్రేసినఁ బైఁబడ వక్త్రశీధుని
ష్ఠీవన మాచరించినవడిం జరణంబున దన్నిన న్రహీన్
బోవనిపార్థివస్ఫురణఁ బొందియు నుత్కలికాప్తినొందుహే
లావతి యిట్టినీచతరులం బరికించితె యిమ్మహావనిన్. 125

సీ. నెలఁత నీపలుకులో నిదికర్ణికారంబు వనిత నీనగ వెలింగినది పొన్న
మెలఁత నీకనుసన్న నలరుబొట్టుగ ముగ్ధపాలఁతి నీచేసంజ్ఞఁ బొదలుమావి
ముగుద నీసమ్ముఖంబున గ్రాలుసంపెంగ రామ నీహృదయపారగము గ్రోవి
పడఁతి నీపదమాసపడు నశోకము వినఁ బ్రియపడు నీపాటఁ బ్రేంకణంబు
తే. అతివ యుష్మత్పదగ్రహాశ్రితము పొగడ, యువిద వావిలి యలరు నీయుసురు కలిమి
బంధుమధ్యము మిన్వనాభ్యంతరంబు, విద్రుమాధరకన్నిచ్చ విశ్రమింపు. 126

సీ. ఘనసుమనఃకుటుంబున నెట్లుపుట్టెనో యొరులచేరువ నున్ననుడుకుఁ జూపు
బహుపత్రభరణసౌభాగ్య మెట్లందెనో యుగ్రగంధస్ఫూర్తి నుల్లసిల్లు
నిరవధికామోదభరిత మెట్లయ్యెనో మహిబుణ్యతరులకొమ్మలఁ బెనంగు
సతతాభివృద్ధి రాజసమెట్లుగ్గెనో కఠినకంటకమైత్రిఁ గడపుఁ బ్రొద్దు
తే. ననుచు బెనుచూరపోలె జెల్లాట మెసఁగ, నసమకుసుమాపచయకౌతుకాప్తి నడరి
సంపెఁగలమల్లికాగుళుచ్ఛములఁ బొన్న, విరులమతిగేదఁగుల రెమ్మివెలఁదులంత.

ఉ. కోయిలనోరుసోఁకనిచిగుళ్లు నికాళపుఁజిల్కభిన్నము
త్సేయనిపండ్లు కాలవడి లేవడితెమ్మెరకూనరాశిగా
వ్రేయనికమ్మపుష్పాడి ప్రవృద్ధపిపాసమదాళిపుత్తుకం
బోయనితేనియ ల్గమిచి పూవిలుకానిభజింప నంగనల్. 128

సీ. కలకంఠముల నోరికడిదివ్వవలె నంచుఁ జికిలిగుబ్బెతలు గోసిరి చిగుళ్లు
చిలుకమూఁకలకూడు చెఱుతమా యని పువ్వుబోండ్లు మాఁగినపండ్లు పుచ్చుకొనిరి
యుదుటుదుమ్మెదలఁ బస్తునుతమా యని ముద్దుకొమరాండ్రు విరితేనె కొల్లఁగొనిరి
మదటగాలి వయాళి మాన్తమా యని కుమారికలు పుప్పొడు లావరించుకొనిరి
తే. అతనువిలు మూలవేయింతమని సుధార, సాధరలు తావిపూవుల నపహరించి
రంత నాక్రీడ భూక్రీడ నేసి యలసి, తాంబుజాక్షులు కంకేళిహాళి వ్రాలి. 129

సీ. మోమాటనలరుతమ్ములతావు లగలింప గనుసన్న మనుఝషకముల నలపఁ
జూడనాగవమైత్రిఁ జొక్కనయళిరేఁప నరగుత్తికగుసంకు నలటఁబెట్టఁ
గైవసం బగుబిసాగ్రముల నున్మూలింప మాటకు లోనైనమధువు లొలుకఁ
జనుమానమందినజక్కవలను రేఁప దండఁ బాయనికుముదములఁ జెండఁ
తే. జరణముల నాశ్రయించినసన్మరాళి, నీడజములపయోభూతి నేలఁగలప

నెత్తుకొని రెంతనిర్దయు లీలతొంగు, లనఁగఁ గంకేళికాంతుఁ గా లాఁగ కరిగి. 130

ఉ. చేరువగాంచి రక్కలికిచేడియ లవ్వనపాళిఁ గేళికా
సారము దుంగభృంగకులఝుంకృతిభాంకృతిసంగమంగళా
గారము గుంజపుంజబిసఖండనచండమరాళలోలవాః
పూరము దారకోరకితపుండ్రగపూగకుటీరతీరముల్.

చ. కని బిసదండపత్రపుటికాపరిపూర్ణసువర్ణకర్ణికా
కనకఘటీస్ఫుటీభవదఖండసహస్రదళాతపత్రముల్
దినపకరోష్మఁ దీర్ప నిరదిక్కులఁ బత్త్రము లాశ్రయింప ని
ల్చినయలరాజహంసపటలిం గని సమ్మదవార్ధిఁ దేలుచున్. 132

చ. పడిఁ బుటమెత్తి వ్రాలునిడువాలువచాలుపులింతనంతపై
నిడువెలిగుంచెలం దెలుప నీదరగాడ్పులఁ గ్రిందుమీఁదుగాఁ
బడుజలజచ్ఛదంబులు శుభవ్యజనక్రియఁజేయ రాజుకై
పడి గనుపట్టునంబురుహవాసముఁ జూచి ముదాప్తి నొందుచున్. 133

ఉ. చుట్టినమూఖ్యమాలికలచొక్కపుఁదావులు సోడుముట్టఁ జూ
పట్టునిరల్పకంకణవిభ ల్నయనోత్సవ మాచరింపఁగా
మట్టపుటూర్ముల స్థైఁ బయ మంజుసరోరుహరాగపూగముల్
పట్టపురాణిరీతిఁ గనుపట్టుసరోరముఁ జూచి యుబ్బుచున్. 134

ఉ. పొంగ నఖండతుండరవము ల్జనముల్ ఘనపక్షనిర్భరా
సంగమునం బహుప్రసవజాకలరేణువు లంటిరాఁ బరి
ష్వంగితసాధుశీధుమదసంపద నింపొదవించుతుంగసా
రంగములం గనుంగొని మృగాక్షులు సమ్మదవార్ధిఁ దేలుచున్. 135

చ సరసమృణాళనాళతనుసంభృతము న్వికచచ్ఛదస్ఫుటో
ద్ధరణము కేసరప్రసరదంష్ట్రిము ఝుంకృతిభాగలీవభూ
త్కరణమిషంబునై సొగసు గాడ్పులదూలుచు మాగుతుండిక
ద్విరసనభంగి నొప్పునరవిందముఁ గన్గొని సోలియాడుచున్. 136

ఉ. జాతకుతూహలాప్తిఁ దమచక్కఁదనంబులఁ గాంచి యద్భుత
ప్రీతిరసంబు లుట్టిపడ బెద్దల నౌదలయూఁచు లోకవి
ఖ్యాతసరోరమాలలనకమ్మల మించినక్రౌంచమండలీ
భీతిఁ దళుక్కున న్బెళుకుబేడసలం గని క్రేళ్లు దాఁటుచున్. 137

చ. సిరిగలచోటులన్నియును జేకొని బంధురధారసత్త్రిసం
వరణబలంబు నిత్యమయి వర్తిల దారుణమైనవిక్రమం

బురుభవనంబులంబొదల నున్నమహామధువుంగలంచి దు
స్తర మగునచ్యుతాతిశయచక్రము గన్గొని సంభ్రమింపుచున్. 138

చ. మిళితగరుత్కలాపముల మించుకుమారశిలీముఖాళిసోఁ
కుల నిజపూత్పుటు ల్విరిసి కోమలపత్రవిశాలలోచనాం
చలముల నీరుగప్ప మతిజాబిలిరాకకుఁ గాక మోహినీ
కళ దుళికించుపద్మినులఁ గన్గొని గంధగుణంబు నొందుచున్. 139

చ. తనభువనప్రశస్తబలదర్పమునం జననీక నిచ్చలుం
దనివిసనం బహుద్విజనతంసములం దినుచు న్నిరంకుశ
ధ్వనిఁ బ్రకటైకచక్రసవిధస్థలిఁ గ్రాలుబకు న్మహత్తరు
ల్ఘను శిరసావహింపఁ దగులావరిఁ గన్గొని తెల్వినొందుచున్. 140

ఉ. బారులుగొన్న నీలకణపంక్తులు క్రొచ్చవిరచ్చదెల్ప నిం
డారినకేసరంబులు శుభాక్షతరేఖఘటింప సారకా
సారవధూటిసాంగజవసంతున కీనపురించు పచ్చరా
యారతిపళ్ళెరంబుల క్రియం దగుతామరపాకుఁ జూచుచున్. 141

వ. కదియుంజని ప్రహృష్టచక్రంబుగావున రాజహంసోపలాలితంబయి సిద్ధసంతాన
వేష్టితంబుగావున మత్స్యకూర్మకుక్కుటాద్యాసనభాసమానంబయి విడంబితశంబ
రారంభంబుగావున నాక్రాంతపాఠీనాంకంబయి కుముదప్రకాశోదయంబుగావున
నావిష్కృతపుష్కరంబయి యలరుచుండుట కలరుబోండ్లు. 142

క. ఒసపరినడకలు మృదుసో, రసవిసరవిజేత లగుకరంబులు గంధో
ల్లసనము కొమ్ములు నమరఁగఁ, గుసుమాస్త్రునిమదపుటేనుఁగులగతిఁ జెలువల్. 143

వ. కాసారంబుప్రవేశించి. 144

మ. పొగడంజొచ్చినభంగి రత్నవలయంబు ల్మోయఁ జేయెత్తి కెం
జిగురుంగొమ్మనవైచె నొర్తు నొకరాజీవాస్య యవ్వాటునం
బగులం గొంచుకమబ్బి చన్నుఁగవ చూపట్టె న్సుఖాగ్రంబులం
దగ నండంబులు వచ్చి వెల్వడునరిద్వంద్వంబుచందంబునన్. 145

ఉ. పూని ఘటాత్కృతు ల్మోయ బుజ్జుటకొమ్మున నీరునించి యా
రా నెఱజాణ నా నొకగరాకటి యొండొకబోటిపైఁ నె
మ్మే నదరంటఁ దాఁకి నెటమించినఁ బయ్యెదవ్రయ్య సంత న
మ్మానిని యొప్పెఁ బేరొఱఁ దెమల్చినపూవిలుకానివా లనన్. 146

చ. మరువిరితూపురూపుపసమాపు నొయూరపుఁజూపు నూరెలం
దిరువులుగట్టి విభ్రమవతీమణియొర్తుక యన్నుగన్నులం

దొరలజలంబుఁ జల్లె నది దోయిటవక్త్రముఁ గప్పె రోహిణీ
చిరవిరహార్తి నొందినశశిం జిగురాకులఁ దార్చుచాడ్పునన్. 147

ఉ. చేనొకబోటి కెంజివురుఁ జిమ్మనఁ గ్రోవియొనర్చి తమ్మిపూఁ
దేనియఁ బీల్చి సోగవిరిదిండుగ నొండొకకొమ్మ జిమ్మనె
మ్మే వనుకైన నమ్మెలఁతి మించె జగంబులు గెల్చి శాంతి రే
ఖానియతి న్మరుండు గడుగం గడుఁ గ్రాలు మెఱుంగువాలనన్. 148

చ. పొలఁతుకయోర్తు గెంజివురు బుఱ్ఱట కొమ్మన స్రుక్క నొక్క నె
చ్చెలి చలివీడి వైవ నది చిత్తజుఁ డేడ్తెఱఁ జూచి వైచు కే
ఏలకరవాలసంహతులవై ఖరి గానఁబడంగ దానికే
ఏలకరవాలసంహతులవంచి వికావికనవ్వెఁ గ్రొవ్వునన్. 149

చ. విరహులమారుమారుఘనవీరబలం బని పాంథకంధర
ల్దఱుగురమాకుమారు నడిదాలనిరాగవియోగజాతకా
తరగుణదాత్యమన్మథపతాకని తేంట్ల నదల్చి కమ్మదా
మరలఁ గదల్చి వారిచరమండలిసొంపు వదల్చి రంగనల్. 150

చ. గతి యతివేలరాగకరిగా నెఱిఁ గాంచినవాలువాలముల్
ప్రతిరహితాంఘ్రులం బెనఁగఁ బైపస ముద్దులుగుల్క సమ్మద
స్థితి మితిమీఱఁ గొమ్ములను జేతులు పుష్కరలక్ష్మి దెల్పఁగా
హితసరసిం జయించి రలయింతులు కంతునిదంతులో యనన్. 151

ఉ. కొమ్ములతోడిహస్తములు గుత్తపుముద్దెలముద్దుగుల్క పొం
దమ్ములనంగవృత్తజఘనద్వయసొంపులనిల్వ రేఁగి పైఁ
దుమ్మెదలాడఁ జూడ నవదోహదధూమమిళల్లతావితా
నమ్ములజాడఁ గుందరదన ల్గనరైరి మనోహరాకృతిన్. 152

ఆ. ప్రసవభాగ్యమహిమఁ బ్రబలియు నెటువంటి, మునిమియో యెఱుంగ విసువులేక
తొరసించి ముద్దుతమ్ములఁ జివురాకు, బోండ్లు కొలనుసొచ్చి పుచ్చుకొనిరి. 153

క. నాళీకజైత్రనేత్రలు, హాళిం గేళీసరోవిహారశ్రీలం
దేలి కటీఘటితపటీ, జాలములు కలాపవేషసంగతు లమరన్. 154

ఉ. మందమరుత్కిశోరహతి మవ్వపుఁ దేనెలజాలువారుపూ
బందిలి క్రిందఁ గప్పురపుఁబల్కులదిద్దినగద్దె నిందిరా
నందనునిల్పి వృత్తజఘన ల్రతివర్ణితభారతిం దదా
రిందమునం ఘటించి కదళీదళగర్భలతాంతసంతతుల్. 155

క. కరములఁ గైకొని చెలువ, ల్మరుజాపగుణీకృతభ్రమరుఁ బ్రతివినతా
మరు జైత్రార్పితమణిచా, మరు నారాధించి రప్రమత్తప్రజ్ఞన్. 156

క. ఆరాధ్యద్యుమణిప్రభు, నారాధనవిధులఁ దనిపి యతిశయవర్షా
ధారాధరవేణుల మధు, ధారాధరఫణితి వినయతాయుత లగుచున్ 157

సీ. తలయేఱు పుట్టించె నెలదాల్పునకు భవత్క్రాంతనిష్క్రాంతహుంకారరవము
వికటించె త్రోటికోటికి దెచ్చె భారతీకాంత దాపకభయంకరశరంబు
ముష్కనిర్భేదనంబున సాధుజేసె నీపైరంబు మతిదివ్యవృషవతంసుఁ
గన్నచాయకుఁ బోయెఁగాని నీనెఱదాడిఁ జేరఁడు గ్రహరాజశేఖరుండు
తే. నీప్రతాపాగ్ని దపియించి నీరజారి, సంశ్రయించె సురాచార్యశరణభూమి
సదృశులెవ్వరు నీకు ముజ్జగములందు, శంబరానుతవిమతహింసారిరంస 158

సీ. వివిధాగమాంతప్రవేశచాతురి నెన్నదగుశుకాదులు వినీతతఘటింప
మహిసురాప్తిసుహృత్తమహిమ గాంచినయుత్తమాళులు హితవృత్తి ననుసరింప
ఘనదానవేగరాగముల మీఱినజగత్ప్రాణుండు నీమనోరథము గడప
నాశువాగ్గ్రహణమేధాశక్తి మాధవాదృతి భజించినమహోద్విజులు గొలువ
తే. కువలయప్రీతికాముఁడై నెవఁడు రాజు, గాఢరూఢప్రసన్నతఁ గాంచి తిరుగ
సాధుబుద్ధివి గావైతి శంబరారి, వేమునకు బోయపాలయ్యె వృద్ధసేన. 159

ఉ. పూతమరందబృందకరము ల్మరము ల్ప్రీతిపర్వసంధిసం
జాతమధూద్ధతంబు విలుసారసమీరకుమారవారణో
ద్ధూతసుజాతచూతరసతుందిల మారరమాకుమార నీ
చేతిగుణంబుమాన ఏదెచేతిగుణం బిటులయ్యె నక్కటా. 160

సీ. ఆర్తిఁబహించు నీయస్త్రపీఠమునకు నిలుపుగన్నులనెక నివ్వటిల్లె
నతిముక్తమగుతావకాయుగంబున కహో దొరకె జండాలురతోడిమైత్రి
ప్రంతఁబాయని భవద్ధ్వజవాశ్చరమునకుఁ గలిగెఁ బేరలుఁగులఁ బొలిసి పోవ
బుట్టుగ్రుడ్డైన నిబూ మెరతేజికిఁ దగిలె మహావినీతప్రతీతి
తే. యకట జాతికిఁబాసిన యనుఁగుఁజెలికి, నెసఁగె మఱి వేళవేళ మానిసితనంబు
నొడలుమాపిన నీకియ్యె నుగ్రకృత్య, మంగభవనిందితులకు మే లావహిలునె 161

మ. అమదప్రక్రియ మూఁడుగాళ్ళజశరుం డైయున్నతంద్రిం ద్రివి
క్రమునిం దమ్ములఁ జేరి తత్ప్రిబలపత్రచ్ఛాయ వర్తించునా
దిమసాధ్వి న్రమఁజేర గమ్మనకి యుద్వృత్తి న్విజృంభింతు నీ
తిమసీషాదయలాభమెట్లు జనికి ర్తృద్రోహియౌ వానికిన్. 162

ఉ. అల్లనఁగాచి మిత్రగృహ మారటఁబెట్టుసఖుండు నీతిహాం
దొల్లఁడు మంత్రిమానులకు నొప్పమిఁజేయురథంబు నీవునుం
బల్లవధర్మమూఁది రతిపైఁ దమివర్తిలు దట్టినీకు ను
త్ఫుల్లదయానయాదిగుణము ల్జనియించునె శంబరాంతకా. 163

వ. అని యనంగునంగనారత్నంబులు దూఱి తన్మాతులుండగునీరజారిం జేరుకొని 164

ఉ. నీదయ పంచబాణశరనిర్భరతాపదవాగ్ని గ్రాఁగిపో
నీదయ నీదయోదయసమృద్ధి సదావెదచల్లుచుండుఁ దా
నీదయ సేదఁ దేర దొకయింత యిదెక్కడివింత నేఁడు నీ
పాదములాన మావికచపంకజనేత్రకు సారసాంతకా. 165

ఉ. కాలగతిం ద్వదీయజనికర్తప్రతిక్షుపము న్గరాళకో
త్తాలకృపీటజన్మ పరితశ్శిఖలం గడుఁగ్రాఁగునాతనిన్
బోలి కళంకివై మొదలఁబుట్టినవానికి నీకు శైత్య మే
వేళ జనించు విత్తొకటివిత్తినఁ జెట్టొకటౌనె జాబిలీ. 166

చ. పరుషమహాకృపీటభవభావము నీయెడసత్య మత్తెఱం
గరయక నిన్ను శీతకరుఁడందు రదేని సుజాతశీతల
స్ఫురణ పయోధికిం గలదె పొంగుకళంకము పేరఁ గ్రొంబొగ
ల్గురియుదె మింటనాలికలు గ్రోయుదె లోలకళాచ్ఛలంబునన్. 167

చ. పరిధిమిషంబునం గుడుసుపడ్డశరాసముఁ బూని శైత్యవి
స్ఫురణ మెఱుంగులీను ఘృణిభూరిశరంబులవేఁడిగా రహిన్
విరహిజనాళి నొంచెదవు వేఱెమనోభవుఁడేల నీవయిన్
సరసతలే దనంతపదసంశ్రయ మేమయిపోయె జాబిలీ. 168

ఉ. గోత్రులు రాకపోక నినుఁ గోల్కొనినీరు దురంతశీతరు
క్షేత్రిదృఢాంబరాశ్రయము మానవు నిన్నవిరోయు నీకగా
మాత్రవిభూతి నిట్టియిడుమంబడితో హరిణాంక వారిరు
ట్పత్రసుగంధలం గిరణపాతనశాతనరీతి నొంతురే. 169

ఉ. కందళితానురాగములు గావు మనంబులు విన్నయంతలో
నందఱు పారవశ్యపదమందురు చల్లఁదనం బొకింతలే
దిందున శంకరాభరణ మెట్లయితీవు శశాంక నీపదం
బుం దుది నంతశూన్యమగుఁ బో వివరింపఁగ మాటలేటికిన్. 170

చ. సదనవైభవంబు పరచక్రవధోద్యతనంబు నిస్తులా
భ్యుదయ మనూనదానవిధియు న్సఖులబ్ధపటుప్రసాదసం

పటుబలసత్త్వమోదళనపాండితియుం దగురాజవైన నీ
కదయత కామినీజనులయం దుదయించుట పాడియే శశీ. 171

మ. కృతదక్షాపకృతి న్మహామయుఁ గళంకి న్సోదరీమందిర
ప్రతిపక్షు న్రజనీచరుం గురుకళత్రప్రాప్తభూయఃకళా
పతను న్ని న్నిరసావహించెఁ ద్రిపురప్రత్యర్థి సర్వజ్ఞులా
శ్రితదోషస్మృతివిస్మృతివ్రతులుగారే రోహిణీవల్లభా. 172

ఉ. మేదిని నర్జునస్ఫురణ మించి చరించుట సింధుచక్రర
క్షాదృతి నీ కనంతతిలకాంతమువో హరిణాంకకృష్ణప
క్షోదయము న్గురూపకృతియుక్ ఝషకేతువిరోధివిగ్రహా
హ్లాదములే దదేమిచెప్పుమా వెఱఁగయ్యెడు నీకు నక్కటా. 173

వ. అని హాలాహలవిరోధి శిరోధిగృహమేధి యగు నవ్వనజవిరోధిం బలికి చెలికిఁ దాపో
పశాంతిఁ గానక వరారోహలు గంధవాహు నుద్దేశించి. 174

సీ. కాండభృద్ఘనబాధ గాసినొందినమిత్రు నోమవే సుఖవృత్తి నుల్లసిల్ల
మోచివచ్చినకార్యములచోట నొసఁగవే కుసుమబాణునకు నెక్కుడుధనంబు
చెలిమిఁ బక్షీకరించినమహాశిఖికిఁ జేరుపవె లావరిసమారోహణంబు
మొదలనిన్ను సహస్రముఖములఁ గొనియాడుచక్రి కీవె నితాంతసత్త్వగరిమ
తే. నీవిహారంబు దాక్షిణ్యనిర్భరంబు, నిను సదాగతిగాఁ జూచునిఖిలలోక
మోజగత్ప్రాణ నీవంటియుత్తమునకు, నర్హమే పాంథయోషానిబర్హణంబు. 175

మ. సలిలాహారుల గణ్యపుణ్యతరులం జంద్రాస్యలం గాక నీ
బల ముత్కృష్టబలాధినాథులఁ దరల్పంజాలునే నిన్నుఁ గే
వలముం దైన్యము దెచ్చి మూలఁబడవై వ న్మించుశీలావు లం
కలవాలై చన నీభవంబు దునియల్ గా కృష్ణవర్త్మప్రియా. 176

చ. గరళగళప్రసాదమునఁ గన్నసుతుక్ హరివంటివానిఁ గే
సరిసతి కీవె తజ్జఠరజజ్వలనైకశిఖాప్రశాంతికై
పరుషగతి న్మహామునులఁ బల్లటఁ బెట్టవె యట్టినీకు నో
కరువలిమేఘవేణికల గాసియొనర్చుట ధాత్రిఁ జిత్రమే. 177

ఉ. కొమ్మలచోట నీకుఁ బ్రతికూలతపుట్టుటయెంత చొక్కపుం
దమ్ముల సాధుమత్సరమునం దలఁకింతువు నిచ్చలుం బరా
గమ్ములరేఁతు వేమఱవు కాలువదం బిటువంటినిన్నుఁ దా
నమ్మకచెల్ల సర్వభువనానువుగాఁ దలపోయఁ బోలునే 178

వ. అని సమీరదూఱు నవసరంబున నలరాత్రి. 179

క. స్మరమృగయు విశిఖబాధా, పరవశయయి యున్న దానిఁ బద్మిని గాఢ
త్వరఁ బరుషరీతి రుచిమత్త్విక్కిరణ నఖాగ్రములఁ జంద్రకేసరి నొంచెన్. 180

క. యువతికిఁ బ్రాణంబయ్యెం, బవతుగతిం బ్రోదిసేసె మలయక్షితిభృ
త్పవమానుఁడు దూరితరై, పవమానుఁడు మోహదావపావకశిఖలన్. 181

వ. ఇట్లు మారతారేశపమారసమీరబాధావిధురయై యమ్మధురభాషిణి శోషిల్లుచుల్లం
బున నొల్లంబోయి నెచ్చెలులఁ గలయ నాలోకించి. 182

సీ. కనలుచుక్కలరాజుకంటఁ బుట్టిననేమి గాడ్పువేరెము వాలుఁ గాకయేమి
కంతుఁ డాకృతిఁ బెంచుఁ గాకయేమి వజాతకలితుఁడై మధువుండుఁ గాకయేమి
హంస మాపగవారికై పోవుఁ గాకేమి గండుఁదుమ్మెద ద్రోయుఁ గాకయేమి
చిలుకవాదులకు వచ్చినవచ్చుఁ గాకేమి కలకంఠి గలహించుఁ గాకయేమి
తే. కమ్మచిగురాకుచే మించుఁ గాకయేమి, కళిక లంతంత మొనఁజూపుఁ గాకయేమి
వెఱపు నాకేల వెన్నెల వెల్లిద్రెళ్ళి, ప్రాణసఖులార వలవంతఁ బాయుదాన. 183

క. అని మోముదమ్మి వాడ, న్మనసిజశిఖిమండ సకలమర్మస్థలముల్
దనువూటాడం గన్నీయ, పెనుదెగువ న్గుబ్బతిలిన భీతిలి రతివల్. 184

క. కామాస్త్రములకు నాళీ, గ్రామణి వైషమ్య మొదవుఁ గా కెప్పటికిన్
సోమకుమారీమణి యీ, కౌముది దానెట్లసౌమ్యగా నేర్చునొకో. 185

వ. అని జననాథకన్య నాలోకించి. 186

సీ. దరహాసలేశధిక్కరణ మున్నదియె నీవంక వెన్నెల కేల వహ్నిఁ గురియఁ
గినిసిమాటలు నేరవనుచు శిక్షించితే చిలుక కేటికి వగావళి యొనర్పఁ
బ్రతిపక్షియని తిరస్కృతిఁ జేసితే సాధుపికమునకేల వాబిఱుసుఁ జూపఁ
జూడఁబోలనిచూపుఁ జూచితే చంచరీకమునకు నేల ఛిద్రములు వెదక
తే. గోచరింపక యొకమూలఁ గూలి చనక, మందతవహింప కిట్లుత్రిమ్మరఁగ నేటి
కని యుదాసీనుఁ జేసితో యభ్రవేణి, యనిలశిశు వేల వీచివాటయ్యె నిపుడు 187

సీ. మనసుగన్న రమాకుమారికాసుతునకుఁ బూర్వాశ్రితుం డైనపూర్ణశశికి
జీవమువంటి దక్షిణసమీరమునకుఁ జేరైనకుసుమాస్త్రబృందమునకుఁ
బలుకుమారనిముద్దుచిలుకకు నెయ్యంపుఁ బైకమై దీపించుఁ బరభృతాళి
కతులాళియయిన గయ్యాళి తేఁటికి బెట్టు చెట్టైనలేఁ బ్రోదిచిగురుమావి
తే. కకట భయమందవలసె హా యనఁగవలసె, బెగడుపడి యుండవలసె గంపింపవలసె
నాతురతఁ గూరవలసె బిట్టలయవలసె, జలదరింపఁగవలసె వే జడియవలసె. 188

ఉ. చేరుచమావికెంజివురుచేతికి లోనుగదమ్మ పద్మ కాం
తారమరాళిమానసము నమ్మినదింతెగదమ్మ కంతుబ

ల్వారువమైనచిల్క మిగులాతగులాయ మెఱుంగునమ్మ నీ
పైరుగదమ్మ మల్లికలు పల్లటమందఁగనేల వానికిన్. 189

ఉ. దారుణభంగిఁ బేర్చునినతాపదవజ్వలనోష్మమంటికం
తీరవమధ్యతాంతదశ నీతను వల్లసహించినం దగుం
గౌరవపోదరస్ఫురణఁ గాంచిన నీనిడువాలుగన్నులే
లారజనిం గుభృజ్జనికళానిధిరాకకుఁ దల్లడిల్లెడిన్. 190

క. అకటా యని చింతింపుమ, లికుచకుచ ల్నిలువ సంబళింపక శుకముం
బికము న్మలయానిలశా, బకము న్మదిఁ దలఁచి వినయపాటవ మమరన్. 191

ఉ. మాటకు రాదు ప్రోదిశుకమా యొకమారు జయింపరానికై
లాటముజేసె చేటికి భళాపికమా యిఁక మాను బోటి నీ
సాటియె ప్రాణముయ్యి వడచల్లుదురే యిటులైనజోటి యె
వ్వోటికిఁ బోవు నీచలువ చూపదనా పదనాఘునాద్భుతిన్. 192

క. అనిపలికి కలికిచెలువలు, మనసిజతాపాతపోష్మమందద్యుతియై
తనరువధూతనువల్లిక, ఘనశీతలరీతిఁ దేర్పఁగాఁ దగు ననుచున్. 193

చ. చెలువల కిష్టమూలములు శిరము లుజ్జ్వలదంశమత్పలా
దళములు వెన్నలంబులు సదామృదులాకృతి మంచివారిలో
మెలఁగుమృణాళముల్ గరము మెచ్చొదవించుమధూళి మాటలో
పలియువి యన్నిటం జెలికిఁ బంచశిలీముఖతాప మారదే. 194

వ. అని శీతలోపచారంబు లాచరించిన. 195

సీ. సునుమావిచిగురుపాదుపు మహాతలము శస్త్రశయ్యగాఁ దలఁచుఁ గంజాతనయన
కడిపోనివిరులకంకటి గణించు నవభూతికంటకాస్తరణంబుగా మృగాక్షి
వలపుగుంపుమపుప్పుతలిమ మంగళివాగ్నిశిఖగా విచారించుసింహమధ్య
శిరముకప్రపుఁబల్కు సెజ్జ సొక్కపుఁగాయుశరముగా నగమయోహాలలామ

తే. మంచిపడమటిపన్నీరు మకరకేతు, విషముగా బుద్ధి నూహించువిద్రుమోష్ఠి
తావిపుప్పొడి శంబరాంతకపరాగ, మని వితర్కించులలన మోహైకకలన. 196

వ. ఇట్లు మనోభవమోహదాహంబునం బొక్కి పొరలుచున్న కన్నియ నెచ్చెలులు నికేత
నంబునకు మరలఁ దోడ్కొనివచ్చిరంతఁ గొంతకాల మరిగిన నొక్క నాఁ డేకాంతం
బున విద్యామంటపంబుననుండి చదువుఁజెప్పుచు దదీయసౌందర్యవయోవిలాసంబు
లీక్షించి మన్మథాతురుండై మందుండు భువనమోహిని కిట్లనియె. 197

చ. నిరవధికత్వరం బఱచి నీచనుగొండలసంధిడెందపుం
దెరువరిమారవోరనిహతిం బడి మోహవిదాహఖేదనన్

బొంరలేదుఁ దేర్పపుణ్య మిదిహో యధరామృత మిచ్చి యిందునం
దరసినగల్గునే పరహితాచరణప్రతిమానధర్మముల్. 198

క. నవలా తావకమోహా, ర్ణవ మేమిటఁగడతు దుస్తరము వివరింపన్
భవదీయ స్తనకుంభ, ప్లవ మబ్బినఁగాక యీవిపత్సమయమునన్. 199

క. అనిద్రాసుఖితంబులు, గానేరవు లోచనములు కంఠద్వయసం
బై నీలావణ్యరసం,బో నవలా త్రేన్పు వెడలకుండుటవలనన్. 200

క. హారవిలాసము గలని, న్నారసి చీకాకుపఱుప కతనుఁడు ముక్తా
హారవిశేషము గలన, న్నీరసమున గాసిసేయు టీ వెఱుఁగవొకో. 201

క. గాఢరుచి న్రుచిరం బనఁ, గూడదు నీయధరము ధరకుచచించైకా
మ్రేడితము కానిచో నే,లా డాపునఁ జూచువారలకు నోరూరున్. 202

క. ఇన్నియును జెప్పనేటికిఁ, బన్నినమరుగాసివాసిఁ బాసితి నో రా
కన్నియ వన్నియమెఱయం, గన్నెఱికపుభిక్ష నాకుఁ గరుణింపఁగదే. 203

క. అని దీనాననుఁడై మో,డ్చినకరములతోడఁ బ్రియముఁ జేకొ మ్మనుచుం
దనుఁ బ్రార్థించుధరాసురుఁ, గనుఁగొని రాజన్యకన్యకామణి పలికెన్. 204

క. గురుఁ డనఁగఁ దండ్రి యఘసం, హరణగుణా శిష్యురాల నైనప్పుడె కూఁ
తుర మేర దప్పి కామా, తురబుద్ధిం గోర్కి సేయుదురె నావోటన్. 205

మ. నరకద్వారకవాటభేది యవమానప్రాప్తిమూలంబు దుః
ఖరుజాపథ్యము పుణ్యలోకగమనఘ్నం బస్థలత్కీర్తి సా
గరమంథాద్రి జనాపవాదహుతభుక్కాష్ఠంబు సత్కారసం
హరణోజ్జృంభము గీడుగాదె పరభామాసంగ మెవ్వానికిన్. 206

ఆ. నీతి సాధువృత్తి నీయది ధరణీసు,రుఁడవు వేదపారగుఁడవు ధర్మ
తరులతాపరశ్వథము చెల్లఁబో యిట్టి, నీచచిత్తి మెట్లు నీకుఁ గలిగె. 207

తే. ఏను రాజన్యకన్యక నితరజాతి, భామ గావ్నెల్లఁబొసఁగు నీపాపవృత్తి
భూసురుఁడవైన యిది నీకు బుద్ధిగాదు, బ్రాహ్మ్యహాని తపోహాని ప్రాణహాని. 208

వ. అని యనేకప్రకారంబుల బోధించుచున్న యన్నీలవేణికి బ్రాహ్మణుం డిట్లనియె. 209

ఆ. నీవు మాటలాడ నేర్తువు గురుఁ డేల, చెప్పుకొను విరాళి శిష్యురాలిఁ
గవయరాదు ప్రాణికల్పన నేర్చిన, పలువనలువ గూఁతుఁ బట్టికొనఁడె. 210

క. మరుబారిఁ బాటి చంద్రుఁడు, గురుభామం బ్రేమఁ బిలుముకొని విపశబుధుల్
పరిణతముని విబుధుబుధుల, గరిగమనాగమనలీలఁ గాంచుట వినవే. 211

క. గౌతమభార్య నహల్యన్, శాతోదరిఁ బదరి పన్నశాఁం గాలా
తీత మొనర్చియుఁ గూడిన, యాతని కింద్రునకు నేమియయ్యెం జెపుమా. 212

ఆ. ఇట్టివట్టిసుద్దు లేటికి నీయంగ, సంగలాభ మైన జాలుఁ దెలప
వెఱవ మెఱసి మీఁదఁ జఱతెంచు నత్యుగ్ర, పాపమునకు నరకకూపమునకు. 213

చ. కడపక నీవు నాపలుకుఁ గాదని వేదనిసర్గమార్గమం
దడిగెదవేని మేనియడియాసఁ దొఱంగి లతాంగి ప్రాణముల్
విడిచెద నీవుచూడ నలవేపడిఁ బాపములోన దీనిలో
విడిదలగాక వే కలఁచి వేచెడి దెయ్యది చూచికొ మ్మనన్. 214

శా. ఆఘోరోక్తులు వీనులం బడిన నాహా పుట్టిరాపట్టిని
గ్మోఘం బీయనమాట తుచ్ఛదురితంబు ల్ధర్మకర్మక్రియా
శ్లాఘ న్మాన్చకొనంగవచ్చుఁ దుదిఁ ద్రైళ్యంబోనియా బ్రహ్మహ
త్యాఘం బేమిటఁబాయు నాకొకయుపాయం బెద్ది యీచేఁతకున్. 215

క. కులగోత్రశీలములకు, న్వెలియైనం దగు మహోగ్రవిప్రప్రాణా
నిలవిచ్యుతి కే నొప్పం, గఁ దానసె యింతకంటెఁ గలుషము గలదే. 216

క. అనుచితకార్యము లేమే, నొనరించినయత్న మొప్ప నుత్తమజను లా
ర్తుని విప్రుని విధ్వస్తా, త్ముని నెప్పుడు సంతరింపుదురు మేలగుటన్. 217

ఉ. కావున నొండుపాయములుగావు మహీసురరక్షణంబ మే
లై విలసిల్లు నేమితెఱఁగైనను మంచిదె యంచు బుద్ధిలో
భావనఁజేసి యచ్చెలువ పల్కె ధరాసుర రెండుజాలలో
నీవది కేగుదెంతు సరణిం జలియింపకయుండు మిత్తజేన్. 218

వ. అని యతండు విశ్వసించినట్లుగా నందులకుఁ గొన్నిశపథంబులం బలికి యక్కలికి
నగరి కరుగుచు నపరాహ్ణగతుం డగుగగనమణి నాలోకించి కీర్తించి కరంబు లురో
జాగ్రంబులఁ గీలించి యిట్లనియె. 219

క. ఓలోకమిత్ర యోకరు, ణాలయ నీకులముదాన నవనీసుర దు
శ్శీలంబు మాన్చి యిట నా, యీలువు చెడకుండఁ బ్రోవవే నేఁ డనుచున్. 220

క. చెరఁ జనుదెంచి యలసర, సిరుహహితుఁ డబల యట్లచేయుదు చింతా
భావంబుఁ ద్రోఁచి కదలు మ, గారమునకు ననుచుఁ బఱచె గగనంబునకున్. 221

వ. ఆసమయంబున. 222

చ. ఇనుఁడు పసూర్ధతుం డరయ నెవ్వఁడు వానికి సతిలేదు వీఁ
డినుఁడు పసూర్ధతుండు నయమెయ్యది తద్విసినీదివారతిం
దనిసి ప్రదోషకాలమునఁ దానిదె వారుణి నానియున్నవాఁ
డని యలుకంబలె న్మరలె నా నడఁచెం దగ ఛాయప్రాచికిన్. 223

సీ. ఇవి చెందిరికచీరలవుఁగదా తిగిచికుచ్చెలఁబోసి కట్టఁ గీల్కొలుపవచ్చు
నివి కుంకుమరసంబులవుఁగదా గబ్బిగుబ్బలఁజొక్కటంబుగా నలఁదవచ్చు
నివి చెంగలువసెజ్జలవుఁగదా కౌఁగిళ్ళఁ బ్రియులుండ మెఱసి నిద్రింపవచ్చు
నివి చిగిర్చినమావులవుగదా కటికివేసవులసీమలఁ గ్రీడ సలుపవచ్చు
తే. నివి సరోజాతరాగంబులవుగదా బెడంగడరుపేటికలఁ బెట్టి డాఁపవచ్చు
ననుచు నరుణావరోధకాములు పలుక, నస్తగిరిఁ బ్రాకె జరఠారుణాతపములు. 224
మ. తనచిత్తంబునఁ బద్మినిం బవలుపొంద న్వారుణీకేళికిం
జనఁ బైకొన్నప్రదోషపీడను సహించ న్నేర్చె నింకెట్లుగా
దనువో మంగలవాఁడనంచు భృగుపాత్రప్రీతి నేతెంచెనో
యన సేవించె సరోజబాంధవుఁడు ప్రత్యగ్భూమిభృత్కూటముల్. 225
తే. అపరపర్వతశిఖరసింహాసనమున, గొంతదడవుండె గ్రహరాజు గ్రుంకుటుడిగి
సమయశమ మజ్జనంబాడి సాగరంబు, దండనుంచిన కుంకుమపిండమనఁగ. 226
చ. కళటనిషక్తఖర్జ్జ వడఁగం జిరగర్వసమగ్రమంజన
ద్విరదము పాయుతన్మదస్రుతిం బొడుకెక్కినయస్తసానువం
దరదముఁ జాఱఁ బైనడుగులానక యుర్వికి డిగ్గు నుద్ధత
త్వర ననఁ గ్రుంకె భానుఁ డవధాననికుంచితభానుహస్తుఁడై. 227
సీ. పరిపక్వబింబవిభ్రాంతి దవ్వులరాజకీరడింభములు గ్రుక్కిళ్ళు మ్రింగఁ
బ్రత్యగ్రశోణితభ్రమ నుపస్థితములై పంచాననంబుల బయలు నాక
పల్లకీపల్లవచ్ఛదనశంక సగంధకరులు రిత్తకురిత్త కరము సాఁపఁ
బుంజీకృతక్రవ్యబుద్ధి నిర్ఝరవృద్ధశార్దూలములు నోళ్ళుచప్పరింప
తే. గైరికద్రవవిచికిత్స గాన నాట, పాటలోష్ఠులు పాలిండ్లఁ బ్రామఁ దివురఁ
బ్రత్యగవనీధరంబునఁ బ్రాకుదెంచె, నపుడు దివసావసానసంధ్యామరీచి. 228
తే. చరమదశఁ గన్నవాసరస్వామిఁ దలఁచి, తమ్ములామోద మఱివెంతఁ దలఁకుచుండ
నస్తముపగోత్రమయ్యురాగాప్తిఁ బొదలె, మొదలఁ బాశ్చాత్యకృత్యమట్టిదయకాదె.
తే. సద్ద్విజశ్రేణి దివసావసానవేళ, చలువఁదేరు వనప్రదేశములఁ జేరి
కన్నులరమోడ్చి విస్పష్టగతులు మీఱ, నారవవ్యాజమున జపం బాచరించె. 230
సీ. తావుఁ గొండనెత్తము డగ్గి చెంగల్వదోనల చల్లనినీటఁ దొప్పదోఁగి
పరిగొన్నపచ్చకప్రపుదుమారము రేచి తరుణపల్లవపరంపరఁ దెరల్చి
వికసితప్రసవజాలకరేణువులవంటిగంధసంపద దేటిగములఁ బ్రోచి
బలిమి గానపరంపరల నుజ్జటలూచి తీవపందిళ్ళలోఁ జరిగి తిరిగి
తే. యొండపాడదూరక పగళ్ళనిర్లు గవయు, తియ్యమావులక్రేనీడఁ దెరువుసాగ

కల్లనల్లనఁ జనుదెంచె నతనుభద్ర, వారణంబన సాయంసమీరణంబు. 231

చ. సరసులసంగతిం గలుగుచక్కనితమ్ములఁ జేరఁబోయి క
న్నరమొగిడించి వ్రాల్చుచిగురాకులడగ్గఱి పత్త్రము ల్విశా
కరదృపదోఘముల్ గదిసి కప్పుపడం బరిము క్తవృంతకే
సరములఁ జెంది కందునొకజక్కవ దారవియోగవేదనన్. 232

సీ. నిండారుకమ్మదేనియ మజ్జనం బాడి కడిమిపుప్పొడివన్నె మడుగుఁగట్టి
రేకుగన్నుల జంచరీకాంజనముఁ జేర్చి తనువల్లి ఫేనచందనముఁ బూసి
తులలేనితూఁడుజేతుల నూర్మికలు దాల్చి జలకణముక్తికచ్ఛటలఁ బూని
మొగ్గపాలిండ్ల సొంపున హిమాంబువ్రనుంచి యామోదసంపద నతిశయిల్లి
తే. హంసకంబుల నిజపదం బలవరించి, భువనమోహన మైనవైభవముఁ గాంచి
కలువవిరిబోడి రాజురాక దలఁచి, పొలిచె వాసకసజ్జికాస్ఫురణ నపుడు. 233

తే. ఝంక్కృతివ్యాజమున హాళిసన్నుతాళి, యాఱడింపఁగఁ దనకన్నవారిలోన
ననపధిక్లాంతిమిత్రమోహార్తి ఖిన్న, తమ్మికొమరాలు పత్త్రనేత్రములు మోడ్చె.

సీ. కనలుసంధ్యార్చిఁ బేర్చినభఃకరిమేన బుటములెత్తిననీరుబొబ్బలనఁగఁ
గాలమాంత్రికుఁ డంధకారదానవబలిక్రియకు రాల్చినపేలగింజలనఁగఁ
దాండవభ్రమిఖమూర్ధజకుఁ డంజలిపుటంబున విధిర్చినకమ్మపూవులనఁగ
మైరవసింధుసంపర్కశర్కరదేవమును లొనర్చినలింగమూర్తులనఁగఁ
తే. గమెఁగర్భాండగోస్తనీకాయమాన, జటిలపరిపక్వఫలగుళుచ్ఛములనంగ
నఖిలజనలోచనోత్సవం బాచరించెఁ, దామరసవైరిపులదారతారకములు 235

ఉ. స్నేహవిరక్తిఁ గాలగతిచేఁ గని మిత్త్రుఁడు చామగక్రియా
మోహితుఁ డౌటఁ గన్గొని ప్రమోదవిధిం దనుఁజేర నీగురు
ద్రోహి శశాంకుఁ డెట్లనక దోయనిపూనినశక్రదిగ్గజ
న్మోహిని మోము విన్నఁదనమో యనఁ బాండిమదోఁచె నెయ్యెడన్. 236

సీ. బలభిద్దిశావశాప్రతిమ గామినిముద్దుగులుకుటీరికనవ్వ తెలివిచెప్పె
యుదయమస్తక్రీడ నూడికోటులు మోవఁ గూలినచాదంతికొమ్ముఁబోలి
గగనవాహినిరోఁపి గాడికొండొకదోఁచు కమలాప్తురథరథాంగంబు దొరసి
కాలకాపాలికాగ్రణికరంబున నెత్తిచూచు క్రొన్నెమలీకసురటి నొరసి
తే. యంచు గనుపట్టి మఱయించుకంతి మెఱసి, సగముసగ్యాయకిమునసాక్షాత్కరించి
బింబమంతయు వెలికి దీపింప నిలిచెఁ, జదలఁ బూర్ణకరాసీమ చందమామ. 37

సీ. అది సుధాకరబింబమా కాదు మడికొనువన్నె వేలుపుటన్నవత్తిగాని
యది చంద్రమండలంబా కాదు చదలేటఁ దేలుదంతపుటరగోలుగాని

యది నిండుచలివెలుంగా కాదు మబ్బుచేనుఁగుఁబోలు తెఱనోటి మొగముగాని
యది చకోరములవిందా కాదు దుగ్ధాబ్ధికడ జనించిన వెన్నకఱుడుగాని
తే. యది నిశామిత్రమా కాదు మదవిముక్త, యుపఘరట్టశిలావలయంబుగాని
యని జను లూఁచి కీర్తింప నతిశయిల్లెఁ, బ్రోవజాబిలికలువపూఁబోడికలిమి 238

సీ. ఇనకరాంకురముల కెడయీనిమ్రానిక్రీనీడజాడల డొంకి నిలిచెఁ గొన్ని
మధురసప్రస్నిగ్ధమాక్షికచ్ఛత్రభాగపుంగలో గప్పలో నడఁగెఁ గొన్ని
కలనైనవిఱుగెఱుంగనిపోటుపరికరాచూరుకత్తులమాటు జొచ్చెఁ గొన్ని
చేసేఁతబడి తలంచినలేవు బంతియువ్వలువకొమ్మలదాడిఁ బఱచెఁ గొన్ని
తే. త్రాసమునఁ బొంది పద్ధతి భ్రంశనముల, గూపకుహరాంతరంబులఁ గూడెఁ గొన్ని
యిరులు తప్పారు లన నప్పుడేమిచెప్ప, రాజు బరచక్రహరణసంరంభుఁ జూచి 239

సీ. ప్రాయమింకినవాలుపాలింప్ల వెఁయాండ్రు పడుపుపుట్టక మూలఁబడి కృశింప
నేపురేగినరంకులెంఁదీఁగబోఁడులు వింతకాఁగిలిలేక వెతలఁబొందఁ
కడిపోనితెరనాటకపుటూరుజంగాలు కేళికల్ గూడ కోగిరము లెత్త
తడక ద్రోపరిమ్రుచ్చుపొగువులు మఱి దొంగపనిముక్కవాలైనఁబస్తుపొరల
తే. గంటవేఁటల దిరుగాడుక ఱపలెఱుకు, మూఁక వెఱజిక్కకాళ్ళ మోములునువావఁ
బిండిచల్లినచందానఁ జేసవారి, దివియువెన్నెల సాంద్రదీధితి వహించె. 240

సీ. చేఁపుపుట్టినగభస్తికలు ముక్కలఁ గ్రుచ్చి త్రచ్చి యూరటలేక క్రోలుఁ గొన్ని
యట్టులానఁగఁ ద్రావి యసుపరుచ్చరణుఁ జోటుచాలక నేలఁ జూచుఁ గొన్ని
కడుసిగ్గుదేరుతోల్పడుపుదోమటఁ జొక్కి యానందమున జిందులాడుఁ గొన్ని
నిగరంపుమోవి తేనియలతోన దొరల్చి చెలువలిచ్చిన సంతసించుఁ గొన్ని
తే. యోలములడాఁగి తలచూపనోడి తల్లడించు నరికోటిపైఁ బుక్కిలించి యుమిసి
బయలుఁబట్టించి పేరెము లార్వరుఁగొన్ని, కైరవాప్తాతపములఁ జకోరకములు. 241

వ. ఆసమయంబున. 242

సీ. కట్టినజినుగుసిర్కావిధోవతి పింజయాపార్ష్ణిలంబియై యతిశయిల్ల
శ్వేతోత్తరీయవస్త్రములోను శుభ్రశుభ్రంబులై బ్రహ్మసూత్రములు మెఱయఁ
గనకవీరుద్గ్రంథికలు కపోవాలావాలసీమబచ్చనిడాలు చివురువెట్ట
నామోదరసపుష్టి నచ్ఛిద్రమై ఫాలతలమున గోపిచందనము గ్రాల
తే. నపటుతటఖేలనంబున నమరుబిళ్ల, సికచోకాటంబువిరులతోఁ జెలిమిసేయ
నడుమ జగజంపుదోఁపుఁబచ్చడము దనర, వైదికబ్రాహ్మణుఁడు నిండువన్నెఁ మెఱసె.

తే. క్రముకభంగపరంపరాకలితమయిన, వన్నెతికత్తిత్రిమేఖలావల్లి నిఱికి

యాకు లర్థించి యలబలం బడఁగు టరసి, యునికివెలువడి బ్రాహ్మణుం డొక్కరుండు.

ఉ. అప్పు డధిజ్యచాపధరుఁడై మరుఁడేర్పడి వెంటనంటి రాఁ
జొప్పున జాలిమాలి యఘుసూరుఁడు పాఱుఁడు వచ్చివచ్చి యా
యొప్పులకుప్పరామికి నయో విధియం చుదితాశ్రుధారలుం
గప్పఁగ మోమునిశ్వసనకంపితచారుతరాధరోష్ఠుఁడై. 245

క. చెదరెడిమేనును జెక్కున, గదిసినకెంగేలు గ్రాలఁగా విప్రుఁడు లే
నిదురెఱుఁగనికంటంబడి, పదియగుమయమంట మంటపంబున నుండెన్. 246

ఆ. చీమ చిటుకుమన్నఁ జిమ్మెట బుజ్జన్న, నెదురమూషకములు మెదలుకొనిన
నిదురలేక భూమి నిర్జరుం డాలించు, నప్పు డబలకాలిచప్పు డనుచు. 247

క. రాదాయెఁ జూచితే యను, రాదా యడ్డంకిబట్టి రాదను నిర్మ
ర్యాదలు సీమంతినులను, హా దైవము ప్రొద్దుపోయె నని తలయూఁచున్. 248

క. ఎదురుకొన నరిగి చాయకు, గదలుతలారులకు వెఱచి క్రమ్మరు నేన
మ్మదవతికి నేలదాదులు, పొదివికొన న్నిదురపోయెఁ బొమ్మని పలుకున్. 249

వ. ఇట్లు మోహానలంబున దేహంబు విదాహింప నయ్యుర్వీగీర్వాణుండు చలితవియో
గిప్రాణుం డగుపంచబాణుం దలంచి. 250

మ. ద్విజరాజుం దలదాల్చుకొన్నతెనిదృగ్ధలిప్తిప్రభూతాగ్నులన్
రజమై పోయిననిన్ను నీతిరసదూరా మార యాకేవల
ద్విజరాజల్గిన నేమిసేయునో ప్రశాంతిం గాంతి మత్స్వాయక
వ్రజముం గూర్పకు నారి నారి ననుగూర్పం దేర్పఁ బుణ్యంబగున్. 251

చ. శివ గణనాయకా యనిన శీఘ్రమె కార్యము లడ్డపాటులే
కవు యనునాథపంచవిశిఖా యన హస్తుదాస్థికాండముల్
చివికెడునట్టినొప్పు లాడిసె రసపాకుల గంట్లు బిబ్బవుం
డ్లవు నిటువంటిపుత్రుఁ దగవా కన నమ్ముకైటభారికిన్. 252

వ. అని పనివి పనివి యనంగబాణమూర్ఛితుండుంబోలె నమ్మంగుండు నిద్రాముద్రా
లోచనుం డయ్యె నయ్యవసరంబున. 253

క. అనిశ ధరణీసురునకుఁ, దా నిచ్చినమాటపట్టుదలఁచి తదీయ
స్థానీయపాలవీక్షా, ధీవాకృతి గాక వగ రతిత్వర వెడలెన్. 254

క. జలధరమాలికలోపలి, తొలుకారుమెఱుఁగనఁగ యమవిధుంతుదహాలా
హలకాచమేచకద్యుతి, గలనీలాంబరము ముసుఁగుగాఁ గైకొనుచున్. 255

క. పరివృత్తకంఠయై దిశ, లరయుచు నడ దడవడంగ నరుదెంచి ధరా
సురు నిద్రపోయెదే యని, కరసంజ్ఞం దెలుప మేలుకని వాఁ డంతన్. 256

వ. ఆదిత్యచోదితుండై క్రోధించి. 257

శా. అయ్యో నేఁడిట కేఁగుదెంతువని నీ కాశించి యిచ్చోట గ
న్మయ్యంజాలక నిద్రగాచి యిపు డేమోహార్తి న్మామజా
లయ్యె న్మాలవజాముఁజొచ్చె దడవాయ న్వచ్చి విచ్చేయునే
సయ్యాటం బిఁకఁజాలు రోసితి నను స్థానార్థినై పోయెదన్. 258

చ కడువడి రెండుజాము లసగం బరికంభణ మీఁదలంచి నీ
కడ కరుదెంతు రానిపనిగల్గిన నాఁటికిఁ దండ్రిఁ గాశిలోఁ
బొడిచిన క్రూరకర్మునఁ బోవుదు నంటివి నూనృతంబు నీ
కొడుకయిపోయె రాక కిదిగో గురులింపజరాత్రిపాపముల్. 259

క. కడుసరసములకుఁ బ్రొద్దై, క్కడిది దురంతోపగూహాగతులకుఁ బ్రొద్దే
క్కడిది యొకసెలవు సేసితె, కడజామున వచ్చి చాల్చొకాఱుకుబుద్ధిన్. 260

ఆ. కొదవలేక రతుల గోవావుఁగోడెనై, పొదలఁ బెద్దతడవు ప్రొద్దులేమ
నొరసి తెడ్డు నాఁకి యుపవాసకర్మంబు, చెఱుమకొనఁగ దీనిచేత నేమి 261

క. అని చిందరేఁగిన ట్ల, చ్చెనఁటిఫరాసురుఁడు చెంతఁ జేపడినవిధి
న్మని గాలఁ దన్ని చనుగతి, ఘనజఘనం బొసి యుబ్బగాఁడుగఁ బోయెన్. 262

క. చనఁ దనకు మనసువచ్చిన, పని యది గా కనికిఁ దీరఁ బట్టక చనుఁగా
కని యూరకుండె నట్లుం, డి నరాధిపకన్య దనకు డెందములోనన్. 263

క. సరిప్రొద్దున నరుదెంచితి, నరుణోదయసమయ మెట్టులయ్యె దురంత
స్మరమాయాంధుఁడు గావున, నరరే విప్రుండు తుర్యయామం బనియెన్. 264

క. కామాంధోపి నపశ్యతి, నా ముదు నే విన్నదానకదా వెఱఁగే
లా మందునిమాటలకని, యాముద్దుఁగుమ్మ మందహాసముఁ దాల్చెన్. 265

క. నానీరచరాగ్రణి బహు, మానుల కిట్లనియె న్లిమహీసురుఁ డన్య
స్థానస్థుఁ డయినపిమ్మట, నా నెలఁతుక యేమిసేసె ననఁ గపి పలికెన్. 266

క. మహీసురుఁ డట్లరిగిన న, మ్మహిళారత్నంబు తొడపుమాలితి నని దు
స్సహరయమున భయమున నిజ, గృహమునకుం బోవఁ దత్తరింపఁగ నంతన్. 267

చ వనదసమృద్ధి నీలికడవంబలె నంబరమొప్పఁ జంచలల్
మినమినలీన దోన సుఱిమె న్వడిగండులు వ్రాలెవ్రాలెఁ దో
ల్చినుకును దూర్పుఁటీదరొలసెం బలసెం జడివానసోనజో
రనఁ బురవిద్విషద్గళసహస్రభవాకృతిఁ బర్వెఁ జీఁకటుల్. 268

క. ఇది రాయిరప్ప పల్లం, బిది మిట్టిది మాకుమట్ట యిది పామిది గా
మిది యని వివరింపఁగఁ బె, ట్టిదమై యొప్పెఁగు నక్కటికిచీఁకటిలోన్. 269

చ. సుడిపడి యింటి త్రోవ యనుచుం బెరచోప్పునఁ బోయిపోయి య
ప్పుడఁతి దృషద్వతీసరిదుపాంత దురంతవనాంతరంబులం
బడి ముళుఁదీవలుం దవిలి భంగములై కురులుం దుకూలముం
దొడివినకంచుకం బెడలఁ దొట్టినభీతి నొడల్వడంకఁగాన్. 270

క. ఈరము లూఱట నొందక, దూఱుచు నోరలయ వలున దూఱుచు రొంపిం
జాఱుచు నెంతే వెలవెలఁ, బాఱుచు రాజన్యకన్య పఱచి యడంతన్. 271

శా. ఆ యుగ్రాటవి నొక్కచోట ఘనదంబై తోఁచు రత్నోపట
చ్ఛాయం బీనుఁగుఁ ద్రొక్కి కోమలకరాబ్జాతంబునం బట్టి య
య్యో యీ మానవుఁ డెవ్వఁడో కొ మృతికేమో హేతు వంచు న్విచా
రాయత్తం బగు నాత్మఁ బోఁ దెరవులే కవ్వోటఁ దా నున్నెడన్. 272

క. ఆవటమునఁ ద్రింశద్వ, ర్షావధిగా నున్నభూసురాసురుఁడు విశా
లావరపుత్రికి హితసం, భావన సాక్షాత్కరించి పలికెం బ్రీతిన్. 273

క. మనుజులు మిట్టాడని యీ, ఘనగహనంబున నిశీథకాలమునం జ
చ్చిననరుచక్కటి తెక్కటిఁ, దనుమధ్యా సంచరించెదవు నిశ్శంకన్. 274

తే. ముంచు కన్నీరు మంచన మోము వచ్చి, వాడియున్నది దీర్ఘనిశ్వాసనిహతిఁ
దల్లడిల్లెడునధరోష్ఠపల్లవంబు, ఇంతవలవంత నవ్వనీ వెవ్వ రనుచు. 275

క. అనుమానింపక తనుభృ, త్తను విసువ వపారసంప్రదానవిధాన
స్వనచుల్లికంబు వదనంబున ద్రిప్పపలాశి కింగుముఖి యిట్లనియెన్. 276

క. వినయవిశాల విశాలా, వనిపాలునిపుత్రి దైవవశమున నస్మ
జ్జననీజనకుల జనవుల. విడతులపా త్తెడసి యాటవికసతి యయితిన్. 277

శా. ఏ నిల్వేరుట యెట్టు లీపడినవాఁ డెవ్వాఁడు వక్షాతమః
పానఃపున్యముఁ దెల్పనల్పచకలా ప్రత్యగ్ధు లాలోకముల్
మేనభ్రంలిపా ముగ్రమృత్యుముఖగంభీకంబునో రవ్వ ర
య్యా నిష్టాఁన గుండె ఝల్లురనుఁ దధ్యం బానతీవే యనన్. 278

మ. అతఁ డత్యంతత మప్రసన్నహృదయుండై [illegible] నే నంచిత
శ్రుతిసంపన్నుఁడ బ్రహ్మరాక్షసుఁడ నివ్వీఁ గాపురం బుండుదున్
మతి భీతిల్లకు నీవు నొజ్జలితఁ డెవ్వా నీకు నేకారి యీ
క్షితిజచ్ఛాయామనోజబాణహతి నొచ్చె న్మాట లింకిటికిన్. 279

క. గురుఁడ నిది శిష్యురా, లీతరుణీమణి గనయ దుష్కృతం బని మదిలో
నరసి యెఱుంగని యీదృశ, నరకువుల మేలుపొందునా యెందైనన్. 280

క. సూరిశ్రేష్ఠునకు వరా, చారగరిష్ఠునకు నీకు సద్విప్రా యీ
ఘోరనిశాచరవేషం, బేరూపునఁ గలిగె ననిన నెఱిఁగింతుఁ జెలీ. 281

సీ. మొదల గౌశాంబి నుండుదు వేదశాస్త్రార్థచతురుండ నాపేరు చంపశర్మ
కులకాంత శాంత యచ్చెలువతమ్ముఁడు మూలఘటకాంకుఁ డతఁ డొక్క కన్యఁ బెండ్లి
గాఁబోవుటయు గోడిగములకు నేనును బనిబూని యతనివాని ననుసరించి
యతిసభ్యునట్లు పోయితిఁ బోవ నను బెండ్లిపెద్దగాఁ దలఁచి యాపెండ్లితండ్రి
తే. కదిసి యెల్లనిగుణరూపగౌరవములు, వేఁడుటయు నావివేకంబు వీటిఁబోవ
నవగుణంబులప్రోవు మూర్ధాత్ముఁ డంటి, ననిన నమ్మాట లతఁడు సత్యములఁ జేసె. 282

క. కాతాళంబున నిచ్చిన, కూఁతు నతం డీక వెడలఁగొట్టిన నపుడా
చేఁతకు నాహృదయం బుగ్రాతతఁ బ్రేంఖోళనప్రయోజన మాసెన్. 283

క. మఱఁది యని యబుసుపోకల, నెఱుఁగక యిట్లాడె లోకు లెగ్గింపం దెం
పరిసై కూడినపెండిలిఁ, జెఱచితి నాకన్నఁ గష్టశీలుఁడు గలఁడే. 284

క. ఈయుగ్రాఘం బేమిటఁ, బాయు నయో హృత్ప్రదీపపరితాపశిఖిం
గాయము వేఁగెడునని పల, చేయి కపోలమునఁ జేర్చి చింతిలుచుంటిన్. 285

చ. అగణితధర్మకర్మరతుఁ డంచటఁ ము న్నరుదెంచియున్నవాఁ
డగుట మదుగ్రకృత్య మవు డారసి ముద్గలనామతైర్థికుం
డగలక నన్నుఁజూచి కుటిలాత్మ కళత్రసహోదరు న్మహా
సుగుణధురీణుఁ గానిమనుజుండని యూరక పల్కెఁ బోలునే. 286

ఆ. వేయుబొంకి పెండ్లిసేయుదు రత్తిను, జను లతిప్రయాసమునను నోర్చి
చెనఁటిసేఁత నిట్లు మనువులఁ జెఱచిన, విసపువిత్తుఁ జెప్ప వినముగాని. 287

ఉ. మోఘము గాక నీవు తలమోచియొనర్చిన యట్టియిద్ధరం
తాఘము నేఁడు పిల్లికోలలై చరణంబులఁ బ్రాఁకుసజ్జన
శ్లాఘనయోగ్యభూమిసురజన్మము వీడ్కొని కానలోగ్రశా
ఖాఘనవృక్షవర్తివయి క్రాలునిశాచరవేష మేర్పడన్. 288

ఉ. వంకరకత్తెకింగలము వైద్యము నీకిది వోలునంచు ని
శ్శంకనవృత్తి ముద్గలుఁడు శాపము నిచ్చిన శోకబాష్పధా
రాంకితనేత్రపంకజుఁడనై చరణంబుల వ్రాలి యోదయా
లంకృతచిత్త యోబుధకళానిధి యోగుణధుర్య కావవే. 289

చ. అనుఁగుమఱంది గానఁ బరిహాసపురస్సరభాషలాడె న
పనిజనియించె నీచరణపంకరుహంబులు సాక్షిగా మదిం

గనలు వహించి యిట్టికోపగాని ప్రయోజన మాచరింప నీ
యనుపమదివ్యదృష్టి కొకఁ డడ్డమె చూడుము నేర్పునేరముల్. 290

క. అని యేను మేను వడఁక, న్వనితాజనతార్తిఁ బొగల వారించి ప్రబో
ధనిరీక్షణములసర్వముఁ, గనుఁగొని యితఁ డనపరాధిగా యని శాంతిన్. 291

వ. ముద్గలుండు న న్నాలోకించి యిట్లనియె. 292

చ. కెలసముఁ బూని పెండ్లిపనికిం బ్రతికూలుఁడ వైతి విట్లు మొ
క్కల మిదిగాదె నీమన సకల్మష మానటులైనఁ గేరడం
బుల కిది చోటె మోఘమయిపోవదు నావచనంబు గన్నచా
యల నిఁక బ్రహ్మరాక్షసుఁడవై యిల నీవు చరింపుచుండఁగన్. 293

ఉ. అల్లినవంతమూలఘటకాంకుఁడు భూమినిలింపకన్యకా
హల్లకభల్లభగ్నహృదయస్థలుఁడై తను వుజ్జగించి మ
త్పిల్లన యుద్భవించుజయసేనుఁడు నా వలవిప్రకన్య యు
త్ఫుల్లసరోజనేత్ర ప్రియపుత్రికయై పొడము న్సుకీర్తికిన్. 294

ఉ. ఆయెలనాగ దైవగతి నర్ధనిశం గతిదప్పి నీతరు
చ్ఛాయకు వచ్చు నాసరసిజచ్ఛదనేత్రకు నవ్వసుంధరా
నాయకసూతికిం దగులొనర్చును సంశయమేది యంతలోఁ
బాయుమహీసురాసురత బ్రహ్మపదంబు భజింతు పిమ్మటన్. 295

మ. అని శాపావధిఁ జెప్పి ముద్గలుఁడు పోవం బోవ నాలోన నె
ట్టని గ్రుడ్లుం గులిశంబులుం దెగడుకోఱల్ బాడబనూర్ఫర్జితా
ననముం జుంజురువెండ్రుకల్ భయదకర్ణద్వంద్వముం గల్గి మే
దినికి న్వేగిగ బ్రహ్మరాక్షసుఁడ నైతిం జంచరీకాలకా. 296

వ. అట్లుర్వీపూర్వగీర్వాణుండనై సకలప్రాణిభక్షణంబునఁ గాక్షింభర్యంబు ప్రవర్తిల్ల నివ్వటపి నాశ్రయించి యుండితి నిప్పటికి ముప్పదిసంవత్సరంబులు గడచె నమ్ముద్గలుండు చెప్పినట్లు నామఱంది జయసేనుండై పుట్టె నవ్విప్రకన్యకవు నీవు నిన్న న్నరనాథకుమారునకుం బరిణయంబు సేసి యాసురం బగు నివ్వేషం బపనయించెద ననుటయు నలరుమొగంబున రాజన్యకన్య భూసురాసురున కిట్లనియె 297

క. ఇచ్చోట నానిమిత్తము, వచ్చిన యవ్విప్రు సుప్రసన్నత్వము నేఁ
డిచ్చునెడ మనవి పరికిం, బుచ్చి జగద్వినుతకీర్తిఁ బొగడొందఁగదే. 298

క. భూసురమహాత్మ్యఘనమహా, త్రాసమునకు వెఱతునని పదంబులఁ బడి గా
ఢాసక్తిం బ్రార్థించిన, నాసురకులశాత్రవుఁడు దయాభిముఖుండై. 299

ఉ. ఆవిరితీవబోఁడికృప కద్భుతమంది భవన్నియోగ మే
లావృథయై ఫలింపక బలాయబలా యని విప్రుఁ గొంచు ర
క్షోవిభుఁ డేగి పీనుఁగున సుప్రదతీర్థమునం దొరల్చి సం
జీవితుఁ జేసి మందిరముఁ జేర్చి భజించి కుమారి కిట్లనున్. 300

క. చనిపోయిన నీయొజ్జలు, మనుగడఁ గనియె న్వసించె మందిరమున నో
తనుమధ్యా యొగిడించిన, కనుఁగవతో నిలువు రాజుకిడ నినుఁ జేర్తున్. 301

చ. వలదు విలంబ మన్నఁ బ్రతివాక్యము లాడక మోడ్పుకంటితో
నిలిచిన బ్రహ్మరాక్షసుఁడు నిర్భరవేగధురాధురీణుఁడై
పొలఁతుక నప్పు డెత్తుకొనిపోయె మనోజవుఁ డొట నిల్చెఁ బా
టలనగరోపకంఠనిబిడద్రుమకాంచనసౌధవీథికన్. 302

వ. ఆసమయంబున. 303

శా. గొందు ల్వీడ్కొని పక్కణాంతరకుటీకూటాధ్వసంధు ల్వరా
స్కంధము ల్బాడ నవక్రచక్రములు ముచ్చ ల్లాడ నిచ్ఛాంతికన్
గ్రిందు ల్మిందులుగా సతీపతులు గౌఁగిళ్ళాడ దీప్తు ల్దిశ
ల్పొందల్ గూడఁ ద్రిభంగిభంగి మొరసెం బుంస్కుక్కుటవ్రాతముల్. 304

చ. అతికృతికన్య నందినమురారివిరాజదనంతభోగసం
స్థితి ప్రతివారముం బొదల శిష్యులు పుణ్యజను ల్జయక్రియో
న్నతులు దురంతశాస్త్రకలనం బ్రతివాదుల నోర్వ సర్వతో
గతమతి కుండు నిల్చెఁ గవికాశికదిక్కటకాగ్రపీఠికన్. 305

చ. సిరవసులక్ష్మి నుల్లసిలువారికి నేమిగొఱంత యీవిభా
కరునకు సంజనిచ్చి తిరుగంబడి లక్ష్మి హరింప నెట్టివో
నెరవులసొమ్ము సత్యమగునే యని వెవ్వలనయ్యె నహ్నినాఁ
బరిగళితద్యుతి న్వెలఁబాఱె నిశాంతనిశాంతదీపముల్. 306

చ. కనుఁగొని చైత్యనిత్యరథికప్రవిబోధకరంబులై ఖగ
స్వనము లుదగ్రబాహ్యవనవాటికల న్వినవయ్యె నయ్యెడన్
ఘనమదభృత్తమఃకరటికంపితదిగ్వటపస్ఫురన్నభో
వనరుహసంకులత్కుసుమవర్షముచాడ్పున జాఱెఁ జుక్కలున్. 307

సీ. ధారాధరస్మయోదయవియచ్చికురబంధమునఁ దాఁ గాలతాంతములు రా
రోదసీతనుసమారోహాంగకార్షైణమదవిలేపనరేఖ మసలిపోయెఁ
జక్రనాకస్తనస్థాతృనీహారఘర్మాంబువు ప్రత్యక్షమై యడంగె
మధుపకజ్జలభాసమానకైరవలోచనముల నిద్రాముద్ర నసలుపెట్టె

తే. మలయనిలయసుగంధసంబంధమంద, పవననిశ్వాసవీచిక ల్బొరుదీర
సంప్రభూతకళారమ్యసౌమ్యగమ్య, గంగసంగ శ్రమాయామయామవతికి. 308
చ. తగఁ గుసుమాస్త్రకేళి దిగఁదన్నినచీరలు గౌఁగిలింతలుం
బగఁగొని యడ్డగింపఁగఁ దెమల్చినహారములు న్భరంబునన్
దిగిచినసొమ్ములు న్మదవతీతిలకంబులచేత వేఁకువ
న్మగుడ సపర్యఁ గైకొనియె మాన్యులు గారె గుణప్రదీపకుల్. 3 9
చ. కనని కవుంగిలింప నవకాశము చాలక ప్రొద్దుఁజూచి లోఁ
జివికెడువారు హస్తములఁజీవితనాథుల గ్రుచ్చిపట్టి వే
గవరుఁబమోవులాని యరగన్నిడువారును శయ్యలం బరా
భవ మొనరింపలేక వగపాల్పడువారును నైరి జవ్వనుల్. 310
శా. నానాదీపమరీచికల్ గొనియెనో నాఁ జూడ నిద్రాపరా
చీనస్త్రీనయనంబులం బ్రియదృఢాశ్లేషప్రకుబ్జీభవ
త్పీనాక్షీకుచము ల్దిగం కనికరామ్రేడీకృతోత్క్రాంతకాం
తానుష్ఠాధరము ల్జపాసుషమ చెన్నారె న్నిశాంతంబునన్. 311
మ. తులనప్రేమరసోల్లసన్మిథునచేతోజాతసంగ్రామకాం
క్షలఁ వారించె నుషఃప్రసూచకగతుల్ శాలాజరద్దీపికా
కళికల్ చైత్యదృఢస్తనస్తబకముక్తాహారము ల్వాసనల్
గలయుం జల్లెడుపూఁత లిష్టరుచికృత్కర్పూరతాంబూలముల్. 312
సీ. శ్రమవార్నిమజ్జనజటిలాలకంబులు సంధూతకుంకుమస్థాసకములు
జాగరారుణితలోచనసరోజంబులు కాంతచుంబనముక్తకజ్జలములు
కరచపేటనిరస్తకరినక్రచిత్రంబు లభినవదిగలంకృతాధరములు
సృణిననుత్కరికాభరణభృద్గళంబు లనూననిద్రాముద్రితాననములు
తే. గాఢపరిరంభసంభ్రమక్లామ్యదచల, గురుపయోధరభరహారకువలమణులు
కలితతాంబూలరసరక్తగల్లతలము, లమరఁ గోమరాండ్రు పొలిచి రహర్ముఖమున
శా. ఆశాఖడ్గమిళత్తిమోమలినహృత్ప్రత్యర్థంబు నిర్వంశ్యసం
ధ్యాశిల్పిప్రభుకల్ప్యమానకురువిందక్షోదసమ్మిశ్రలా
క్షాశాణం బనఁ బ్రాచిదోఁచె బిసినీకాంతుండు జాగ్రత్ప్రరో
చేశాంగారకరాజినాఁగ ముదలం దీండ్రించె సంధ్యాప్రభల్. 314
సీ. ప్రసవితదివ్యక్షేత్రఘుసృణసస్యంబులు హల్లకప్రియసాలపల్లవములు
తిమిరేంధనప్రవర్ధితదావశిఖలు లుషఃపవనభుగ్వరభోగఫలకమణులు

హరిపురంధ్రీకుసుంభాంబరంబులు ఘనప్రాక్పరివ్రాడ్జటారక్తిమములు
గంభోళిఖండితోదయసక్తరుధిరంబులై రావణాంగసింధూరరజము
తే. లక్ష్మిన్పృత్తిప్రమోదకృద్యామినీవి, యోగదవఘూర్ణ్యధాత్రిఖినొండుకమణి
నవ్యహల్లకతంప్రము ల్మాఁ జెఱంగె, నంబరంబున నపుడు బాలాతపములు 315
ఉ. ఇమ్ములఁ బశ్చిమాంబునిధి కేగు నెడం దగ వారక న్నయూ
ఖమ్ముల నెన్నికం దితముగా నొనరించిన వ్రేళ్ళరక్తిలోఁ
గ్రమ్మఁగఁ బ్రాక్పరిస్ఫురదరవిరశ్ములఁ బద్మినివేగుపాటునం
గ్రమ్మఱ లెక్కఁ బెట్టెనన గా వికసించె సహస్రపత్రముల్. 316
ఉ. గాసిలి రాజు మన్ననలు గాంచిన నేనొరుఁ జూడనంచు న
న్నాసినభంగిఁ గైరవిణి మోడ్చెఁ బతివ్రతవోలెఁ బద్మినీ
వాసరకృద్వియోగవవహ్నిసముత్థితధూమరాజులో
నా సరసీజగర్భసదనంబులఁ బాసి నటించె భృంగముల్. 317
తే. ఇట్లు సూర్యోదయంబైన నేకతమున, బ్రహ్మరాక్షసుఁ డద్ధరాపాలుఁ గదిసి
పూర్వవృత్తాంతమంతయుఁ బొసఁగఁ జెప్పి, యప్పుముఖిఁ జూపి పెండ్లిగమ్మనుమనిచ్చె.
వ. ఇచ్చిన. 319
క. ఆరామామణిఁ గైకొని, యారాముఁ డావరార్కతౌతిథ్యండై
యారామన్యగ్రోధధ, రారుహసౌధమున బ్రహ్మరాక్షసు నరిచెన్. 320
క. ఊనిచి ప్రణమిల్లి క్రమ్మఱి, చని యవ్విప్రాసురునను సరసాన్నరివే
దనవిధికిఁ బుణ్యభూసుర, జనుల నియోగించె జనితసౌహార్దమునన్. 321
ఉ. కూరిమి తండ్రిపాదములకుం బ్రణమిల్లి సుకీర్తికన్య నం
భోరుహలోచన భ్బనమోహినిఁ జూపి ధరామరున్నిశా
చారుచరిత్ర మేరుపడ సర్వముఁ జెప్పినఁ బుత్రు మెచ్చి యు
గ్వీరమణుండు బంధుపృథివీసురు ం బిలిపించి యిట్లనెన్. 322
సీ. ఘనులార మనవర క్తస్పర్శసంబంధ గాఁడె సుకీర్తి విఖ్యాతమూర్తి
దైవయోగమున నాతనిపుత్త్రిఁ గాంచనప్రతిమానగాత్రి చేపడియె మనకు
మనజయసేనకుమారున కాపూర్ణశీతాంశుముఖిఁ బెండ్లిసేయవలయు
లాంఛన నవ్విశాలానాథుఁ డిచటికి వచ్చినఁ జుట్టంపునరుసగాదె
తే. యతుల నయమార్గరతులు దండాధిపతులు, ననిచి రప్పింతమా యమ్మహోమహుంబు
నతఁడు వీక్షింపఁగాకన్న నాస్తమిత్రు, లుచితమిక్కార్యమొనరింప నొప్పుననిరి.
క. నావిని సుత్సిల్లుఁడు ప్రేమ, లావిక్షితనీతిశంత్రుల న్మంత్రుల సం
భావించి పనుచుటయు న,చ్చావనరుతు లరిగి వినయమాన సమరన్. 324

సీ. రోహిణీవిరహాభీరుక్షపాకరబింబ మన ఘనగ్లానదీనాస్య మమర
నొడలునిండారి వెల్వడినశోకరసంబుతీరున వేఁడికన్నీరు దొరుగ
మెఱుఁగుటద్దపుబిళ్ళమీఁదికెంపులతెరక్రియ గపోలమునఁ గెంగేలు మెఱయ
నతిమరుచ్చలమానలతభంగి నిశ్వాసధారచంద్రిక మోవి దల్లడిల్లఁ
తే. దనయ నీలోన లేదుగదా ధరిత్రి, చూపుమా యంచు బ్రార్థించుసోయగమున
దగ శిరమువంచి తనలోన దానపలుకు, మనుజపతిఁ గాంచి ప్రణమిల్లి మంత్రివరులు.
క. నతులై వినయవిచారో, న్నతులై నిలుచుటయు వదననలినములఁ దరం
గితదృష్టిచంచరీక, ప్రతతులు నటియింప ధరణిపాలుం డనియెన్ 326
క. అరుదెంచితి రెవ్వరు మీ, రరుదారం జెప్పుఁ డనిన నలికతటాంత
స్ఫురదంజలిపుటు లై య, న్నరనాథుం జూచి దండనాథవతంసుల్. 327
మ. క్షితినాథోత్తమ నేఁడు నీమఱఁది మత్సిల్లుండు పుత్త్రేర వ
చ్ఛితి మాలింపు తదీయభాషితము లస్తేయవ్రతబ్రాహ్మణ
క్రతుభుగ్వైరివంతసయోగమున నీగారాము నెచ్చ్యాలి యొం
డితరక్షోణికిఁ బోకచేరె మము నీ వీక్షించి పో రాఁ దగున్. 328
క. అని దేవరతో విన్నప, మొనరింపం బంపె విక్రమోపేతపతా
కినితో సంబంధిపురం, బున కరుదెం డనిన భూవిభుఁడు సుముఖుం డై. 329
వ. అమ్మంత్రులకుఁ బసదనంబులిచ్చి యంతఃపురంబున కరిగి యింతికి నంతయుం దెలిపి
విన్నయాదిప్రొద్దుగా సభార్యుం డై చతురంగబలంబులు గొలువ వచ్చి సుకీర్తి మ
ధ్యాహ్నకాలంబునకు బాటలీపురోపకంఠంబు గదిసె నప్పుడు. 330
ఉ. ఇంకనిరీవి బాన తనయింటికి వచ్చినఁ జంద్రసేనుఁ డ
భ్రంకషసమ్మదాభ్యుదయభాసురుఁ డై యెదురేఁగుదెంచి ప
ల్యంకిక నున్న యప్పచరణాబ్జములం బడి కాంతకాంతిసు
త్వంకజరాగపూగకృతధామకవీథికిఁ దెచ్చె దెచ్చినన్. 331
ఉ. ముందఱ నేగి యబ్బునన మోహిని వాహిని పోలె నుబ్బునం
తం దలచుట్టు కన్దొగల దట్టముగాఁ బ్రవహింపనశ్రువా
రిం దలితేతర స్తనశరీరములం దిగు పారఁ జేయుచున్
వందన మాచరించి విరివాతెరతో మొగ మెత్తి కేడ్చినన్. 333
సీ. కడుపులోఁ జేపెట్టి కలఁచిన ట్లగుటయు భక్తిఁ గూరిమిపట్టిఁ బట్టి యొత్తి
శిర మురంబునఁ జేర్చి చెఱువు ప్రస్పినరీతి నోడి కట్టి పెల్లుబుకు నశ్రు
ధారల నతితాంతిదరఁ గన్న తనువల్లి దడుపుచు గద్గదధ్వానలీల
భాషణంబుల నెంతపనియయ్యె నట్లుండె విధికృతం బనుచు నుర్వీవిభుండు

తే. గూఁతు నొండొకచందానఁ గుస్తరించి, యార్తి వారించి వలిసీట జూళ్వాట
పాటలాధరవదనదర్పణముఁ గడిగి, యుచితకాంచనపీఠిఁ గూర్చుండె నంత. 333

ఉ. చిత్తము చెంగలింప జయసేనుఁడు పాఁగిలి మ్రొక్కె వన్మథో
న్మత్తవిరోధిరోధిరుచిశుద్ధనమూర్తి సుకీర్తికీర్తిమై
నెత్తి కవుంగిలించె నపుడింపెసలారఁగఁ జంద్రసేనుఁ డు
ద్వృత్తరసత్యభాషణవిధానుఁడు బాహు మ్రొక్కి యిట్లనున్. 334

క. దళితారి నీకుమారి, స్మిళితాంగవిలాస మైన మేలల్లున కీ
వలదే యిపుడని బద్ధాం, జలి యై ప్రార్థించుటయుఁ బ్రసాదోన్ముఖుఁడై. 335

వ. బ్రహ్మరాక్షసోద్యోగంబును బాంధవ్యంబునుం దలంచి సుకీర్తి వర్తమానలగ్నంబున మిథ్యావలగ్నజయసేనులకుఁ బెండ్లిజేసెద ననియె నమ్మహోత్సవంబు వీటఁ జాటిలి ననాగతసంబంధిబాంధవంబును నాయాతశైలూషిశైలూషంబును నాగచ్ఛదఖిలావనిపనికరంబును నాహూతబ్రాహ్మణజాతంబును నాబద్ధశుద్ధమాణిక్యతోరణంబును నలంకృతవిపణిమార్గంబును నభిరచితరంగవల్లీమతల్లికంబును నారాధితనవగ్రహంబును నఖండవాద్యమాననానాతూర్యంబును నై యమ్మహామహంబు ప్రవర్తిల్లె నా సమయంబున. 336

ఉ. బంగరుపీటఁ బెట్టి దడిపంబిడి రాజకుమారి దానిమీఁ
దం గదియించి తూర్యనినదంబుల రోదసి ఘూర్ణిలంగఁ గీ
విం గడుపాటిపాట నరవేంద్రుకలం గొమరాసువాసినుల్
చెంగట నక్షతంబు లిడి చేఁడియకుం దలయంటి రాదృతిన్. 337

క. సుమతైలప్లుతి నలరా, కొమరాలికి నలరెఁ గురులు కోకనదాంత
స్సుమధూళిమగ్నమంద, భ్రమరీసమరీతి నయనపర్వము లగుచున్. 338

తే. బుగులుకొను తావినీరము కప్పురముతోడ, నడుపుదివ్యనిఘుసృణాద్రవంబుతోడఁ
బొందుగా మేళవించినచందనంబు, నాఁతికొండొకకలకంఠి నలుఁగుఁబెట్టె. 339

ఉ. అజ్జలజాక్షివస్తు సుమహన్మతిమజ్జనశాలిబాలిక
ల్మజ్జనశాలఁ జేర్చి మణిమంజులపీఠముఁ బెట్టి దువ్వి పై
గొజ్జఁగినీరుచల్లి మెఱుఁగుల్గొన పిప్పి విదిర్చి యొక్కచం
చజ్జఘనాంగ పెట్టె ఘనసారయుతామలకంబు నేర్పునన్. 340

ఉ. తోరపుజాలువాపసిఁడితొట్టిఁ నొట్టినపశ్చిమంబుప
న్నీరపవంజిబుంగలను నించి మనోహరకక్షుకాంతిబం
గారుణసంతమాడఁ గరకంకణఝుంకృతు లుల్లసిల్ల హే
లారతి నార్చె నొక్కవనలా జలకం బలకంబుకంఠికిన్. 341

సీ. జిలుఁగుపావడమీఁదఁ జికురధిక్కృతమిళిందాళియొక్కతిప మాంధాళిఁ గట్టె
తడియార్చి నేరుపేర్పడ దువ్వి యొకముద్దుకలికివాల్గంటి గీల్గంటువైచె
నిలువుటద్దము మ్రోల నిలిపి యొండొకవధూతిలకంబు తిలకంబు దిద్దె నుదుట
నెరివుట్ట నొకదిట్ట నెఱవాదితనమూఁది కనుచెలు ల్వెఱఁగంద గంధ మలఁదె
తే. నొకశుకాలాపహారవల్లికలు వైచె, నొకవిలాసిని మణులకంచుకముఁ దొడిగె
నొకలతాతన్వి పెట్టెఁ గేయూరకంబు, లొకతటిన్నేత్ర యిడియె బాలికకుసొమ్ము.
క. ఆక్కరిణీనిభగామిను, లక్కరణి నలంకరించి రాలో ధరణీ
భుమ్కలమూడారత్నము, నక్కడ గైసేసి రాపు లగువా రంతన్. 343
మ. కదియం బోయెఁ బతంగుఁ డస్తధరాగ్రక్షోణిసత్క్రించము
ల్పొదలె న్నిర్ఝరమార్గపల్వలమునన్ భూరిజ్వలజ్జ్వాలలున్
మొదలెం జాగృవియాపణాగ్రముల నెమ్మెల్సేసి దీపచ్ఛట
ల్వదలెం జోళ్ళు రథాంగదంపతులు విల్వంచెన్ మరుం డత్తఱిన్. 344
సీ. నూరెల వెలుఁగుపంజాలశరీరన్యస్తభూషామణిస్ఫూర్తి ప్రోదిసేయఁ
గైవారముఖరమార్గణవిలోచనకైరవముల నాననశశి వాడుదేర్ప
విమలబంధుస్వాంతవిధుకాంతముల గటాక్షజ్యోత్స్న విరవిర గరఁగుచుండఁ
గృతదృష్టికరణసంగతవధూటీహంసికల నీరజాకరము పిలువ
తే. గలువచెలికాఁడు పొడపుగుబ్బలి వసించు, గతి నలంకృతసామజస్కంధ మెక్కఁ
బటహనిస్సాణముఖతూర్యపటల మెసఁగ, బుధజనాశీరవము లుబ్బ భూపసుతుఁడు.
వ. తాత్స్థ్యారోహణుం డగు నారాయణునికరణి నేనుంగు నెక్కి జయసేనుండు నర్తకీ
నర్తకగాయనీగాయనమాగధీమాగధ బ్రాహ్మణీబ్రాహ్మణనాట్యగా నస్తవనాశీర్వాద
విశేషంబు లానందసంధాయకంబులుగా స్థానీయమీనలోచనమరీచికావీచికాకవ
చితరాజమార్గంబున నేఁగుదెంచుచుండ. 346
ఉ. నీరము లాడి యాడి మదినిండినసొంపుపసం గటీస్థలిం
జీరచెఱంగు వీడిపడఁ జెక్కుచుఁ దక్కినకొంగు నేలపై
జీఁగఁ దన్నుఁ దామఱచి చెచ్చెరఁ జూడఁగవచ్చె నొక్కనీ
రేరుహపత్రనేత్ర యధరీకృతకంతుని రాజనందనున్. 347
చ. కుసుమసుగంధి యోర్తు నృపకుంజరుఁ గన్గొని మోహితాత్మయై
యసురుసురన్న దాని నికటాంగన యారని నీకు నేటికి
బ్లుసురన నన్న నింటికడనుం డిటకుం బరువెత్తివచ్చెను
క్కస నుసురంటిఁ బొమ్మనుచుఁ గ్రక్కునఁ బోలఁగ బొంకె నయ్యెడన్. 348

ఉ. పొంగినకిన్కఁ దోఁచినటు పోరుచు మంచముడిగ్గి నిక చ
న్నుం గబళించుపుత్త్రునిఁ గనుంగొని యక్కట వీఁడు నాకు బ
ల్సంగడమయ్యె నేఁడనుచు శయ్యపయిం బొరలించి త్రోచి వ
చ్చెం గలకంఠి యొత్తు నృపసింహము నెంతయుఁ జూడ వేడుకన్. 349

ఉ. కేలఁగలించి పట్టి రతికిం బిఱువీఁకులు సేయువల్లభుం
జాలుఁబొకాలు నిల్చి లువు సైఁచు మొకించుకతాళు మాను మీ
వేళ నిశాననం బనుచు వీడ్వడనాడి యురోజగౌరవా
ర్తాలసమధ్య యొత్తు కదియం జనుదెంచెఁ గుమారమన్మథున్. 350

చ. అరవిరిబాగుతమ్మరస మంటిన కన్నులు డిల్లపాటు క్రొం
జెఱుచెమట ల్సను ల్మొనపుచెక్కులు చిక్కులు గొన్నహారముల్
విరిసినకొప్పు నిశ్వసనవీచికలుం దగ వేగ నొత్తురా
మఱుఁ గికనేల యీవిధము మంచిది పొమ్మని నవ్వి రంగనల్. 351

ఉ. మించి జయంబుఁ గైకొనునిమిత్తము నెత్తము లాడి యాడి యో
డించి పణంబు దెమ్మనుచుఁ డెక్కవఁ బట్టిన ప్రాణనాథుని
స్త్రాంచల మించుకేని విడనాడక నెవ్వడి నీడ్చుకొంచు శం
కించక నేగుదెంచె నొకకేసరిమధ్య గుమారుఁ జేరఁగన్. 352

*ఉ. కీలు ఘటిల్లు వేణి గతికిం బ్రతికూలత నొందఁ జంద్రజం
బాలిత మైనచన్నుఁగవ మధ్యముపై దయదప్ప ముత్తియ
త్మేలిమి రాజి రాఁడఁగను మించులు శంపల గ్రమ్మటింప మం
దాలసవృత్తి నొక్క జవరా లరుదెంచెఁ గుమారుఁ జూడఁగన్. 353

వ. ఇట్లు పురస్త్రీరత్నంబులు నిజదృష్టిమసారసారంబుల నలంకరింప నేగివచ్చి సుకీర్తి మందిరద్వారంబున నవ్వారణావతరణం బొనరించి నారీజనార్పిత నీరాజనంబు లీక్షింపుచుఁ గక్ష్యాంతరంబులు గడచి చని ముందఱ † నతిముక్తాభిరామంబై బ్రహ్మసభను పుణ్యద్రవ్యసమీచీనంబై యాజనవాటంబును బల్లవకుసుమవిలసితంబై వసంతసమయంబును ప్రసిద్ధవర్ణగౌరవంబై సంగీతంబును నాట్యకార్యంబునం

---

*ఉ. మూలకుఁ దార్చి సందుసుడిమూతులు నాకెడుగిండిదాని న
వ్వేళకు నొద్దఁబెట్టి యిదె వే విడె మిచ్చెదఁ గాని చూచెదం
గోలతనంబు పెండ్లికొడుకుం దలవాకిట నంచు వెళ్ళెఁ
జాలనిభర్తఁ దెర్చి యొకచంద్రనిభానన వచ్చె నీథికిన్.

ఇది ప్రక్షిప్తమని తోఁచెడు.

† ఈస్థలంబున నుపమానోపమావాచకంబులు సాధారణధర్మవాక్యంబులకు ముందు

దనరి భరతంబును పర్వధూర్వహంబయి భారతంబును సర్వతోరణవిహారంబయి జయశీలుని విబుధభవనసామ్యంబయి గ్రహమండలంబును రంభాలంకృతంబయి స్వర్గలోకంబును విశ్రుతావితానవితానంబయి కురుక్షేత్రంబును ప్రతిష్ఠితదధిముఖపాత్రంబయి మధువనంబును ననుకరించువివాహమంటపంబు డాయంబోయి.

ఉ. మోహనలీల నంత నొకముద్దియ గద్దియఁ దెచ్చినన్ మహో
త్సాహతభూమిపాలతనుసంభవుఁ డెక్కె ననంతరంబ దీ
నాహితనీతిసంచితగృహార్తుఁ డొసంగె సుకీర్తిభాసుర
వ్యాహృతి కుందనంపుహరిబాణమునన్ మధుపర్క మయ్యెడన్. 355

క. దానవశాత్రవుఁగా జయ, సేనుని నారాచకాంతు సిరిగా మది న
మ్మానవపతి దలపోసి య, ధానియతిని ధారఁబోసెఁ దనయన్ సనయన్. 356

క. లగ్నంబు గడిసె గగనవ, లగ్నం బెమ్మనిన బుధులు లలితగతి న్మన్
న్మగ్నలు గుచభరకించి, న్భగ్నలు నగుచెలులు సొంపుతోఁ జని కడకన్. 357

క గుద కొప్పు మెఱయ గవిసెన, గదియించినమరునివింటిగతి నతిశయిలన్
గుద కొప్పు మెఱయ నింతికి, ముదితలు చిత్రాంబరమున ముసుఁగిడి వేడ్కన్ 358

క నడపింపఁగ మడుఁగులపై, నుడురాజనిభాస్య యడుగు లొప్పెం గడున
య్యడుగులు కూర్మము ఁగునఁట, మడుగులపై బొరయుకేల మానఁగ నేర్చెన్. 359

*ఉ మోహవశమ్ముగాని తెలిము త్తెపుసొమ్ములతోడికమ్మపూఁ
దీవలవంటిబోంట్లు కవదివ్వెలతోఁ జెలిఁ దెచ్చి రధ్ధరి
త్రీవరపుత్రుఁ జేర నధరీకృతరోహిణి రోహిణిం బ్రమో
దానహజక్క నుమ్కుతు వియ ల్హారిణాంకునిఁ జేర్చుచాడ్పునన్. 360

కొన్ని ప్రతులందుఁ గానంబడియెడిని ఐన నీకవి యింతపను న్న్కగ్రంధమునసే యిట్టిఘట్టంబుల వివియించినవిపనం బట్టియుఁ గొన్ని ప్రతులయం దుండుటం బట్టియు నిట్లు సంస్కరింపంబడియె.

*శా. రాకాచంద్రనిభాస్య నెచ్చెలులు దేరం బ్రీతి నత్యాగ్రత
శ్రీకిం బట్టుగుచుఁగిళాయితినముం జేరంగి నేతెంచుచోఁ
గాకల్హారినవు త్తికోకిలలజోకి న్నూపలం డాసి ల
క్ష్మీకల్యాణముఁ బాడి రంతిఁ బురహంసీయాన లుప్పొంగుచున్.

ఈపద్యము గొన్నిప్రతులలోఁ గానఁబడదయ్యెడు.

ఉ. ఆహరిణాక్షికేలు పతిహస్తమునం బతికేలు తజ్జగ
న్మోహనికేల నుల్లసిల నూతనసాత్త్వికకంకణాంకుర
వ్యూహముతోడ రాజతనయోత్తమహస్తమునన్ మహావిరా
రోహకరంబునం దిడె గురుండు సమంత్రకకంకణాంకముల్ 361

ఉ. అంతటఁ జిత్రభాగ్యవనికాంతరితం బరితశ్చరద్ధరా
కాంతపటావకుంఠకృతకామినిఁ గన్గొనరామి వక్త్రసం
క్రాంతవిలాసలక్ష్మిఁ గనుకైవడి గడ్డముపట్టి యెత్తి ధీ
మంతుఁడు రాజనందనుఁడు మంగళసూత్రముఁ గట్టె నింతికిన్. 362

చ. అపుడు వధూకరోన్నమితమై తెలిముత్తెపుసేసఁబ్రాల్ ధరా
ధిపసుతునౌదల న్మదవతీమణి నించె విభుండు నమ్మద
ద్విపనిభయానమౌళిఁ బోదివెం దలఁబ్రాలవి జాతికెంపుల
ట్లపరిమితప్రియాప్రియకరాంబుజశోణిమ నొప్పె నెంతయున్. 363

చ సరి మెటుఁ బ్రాలపుట్టికలసందున బట్టినపట్టుపుట్టముం
దెరఁ దెరలింపఁ జూచె సుదతిం బతి యవ్విభుఁ జూచె నింతి యా
య్యిరువురజూపులం గలసి యేసెఁ బరస్పరమన్మలత్క్యము
ల్కురముల నిల్చి నెన్నడుమ సాహసబాణుఁడు సవ్యసాచియై. 364

క. విడువనితగు లిరువురకి,న్వడువున ననుకరణి నుభయవస్త్రాంచలము
ల్విడిదేరునత్తుతలతో, ముడిఁబెట్టిరి పంచశరుఁడు ముడిఁబెట్టంగన్. 365

ఉ అంబరదంశితాఖిలసమగ్రమణిస్ఫుటవేదికాంతరో
దుంబరపీఠి నుండిరి వధూవరు లయ్యెలనాఁగ యగ్నిహో
త్రంబున వ్రేల్చె లాజలు ధరావరసూనుఁడు సంభృతానురా
గంబున నేమిచెప్పఁ దనకౌఁగిటి కింతిమొగంబు వ్రేల్వఁగాన్. 366

క ఆగామిప్రణయరణో,ద్యోగం బణఁచుటకు నేఁడ దొరకొనె నితఁడం
చాగురుకుచవని నయారె, ఖూగురుఁ డడుగూఁది సన్నెకలు మెట్టించెన్ 367

సీ. అవలోక మొనరించి రసురఘుస్మరపదధ్యానసంపాదినౌత్తానపాది
నేదృవ్వరబుభులతో నీక్షించి రరుకుచక్రిజితాహార్యవసిష్ఠభార్య
గళితచేలాంచలగ్రంధులై మ్రొక్కిరి యిలువేలుపులకు బెద్దలకు భక్తి
నుర్వీసుధాశనాశీర్వాదపూతాక్షతములు మస్తకములఁ దాల్చికొనిరి

* తే. రాజకన్యక యంతఃపురమున నుండె, బెండ్లిచవికెను నేతెంచెఁ బెండ్లికొడుకు
విప్రులకు బంధుజనులకు విద్యవారి, కుభయనరనాథు లీప్సితం బొసఁగి రంత. 368

చ. నిరుపమశోభనాక్షతలు నించినపళ్ళెరము ల్ధరించి సు
స్వరమునఁ బూని యొన్నఁదగువర్ణములం బఠియింపుచుం ధరా
మరుల బహూకరింప గరిమంబున మూఁడవనాఁడు వర్తిలెం
బరమసుహృన్మనోజ్ఞమయి ప్రాఁకెనయష్మములు నాఁటివేకువన్. 369

మ. నవలం గూర్చినకొప్పుతోఁ బసపుమిన్నల్దేఱు నెమ్మోముతో
గరిమన్నాగమసానిప్రోలుదిరుగం గాఱంతులై తూర్యముల్
మొరయంగాఁ గడునొప్పె నాకబలియాలోకాటికాపేటికల్
సరసాప్తిం జదివించి రాప్తులగురాజన్యుల్గుమల్మీఱఁగన్. 370

చ అతికృతులై నృపోపకృతులై హితులై తనరారుధారిణీ
పతు లతులప్రభం బురముఁ బాసి గృహంబుల కేఁగి రంత రు
ద్వృత్తిపరిపంథి రాజసమవర్తి సుకీర్తితనూజ కిచ్చె నూ
ర్జితగుణరత్నపేటికలఁ జేటికలం బదివేల ప్రేల్మిడిన్. 371

క. ధాటీఘోటీఘటితవ, రాటీబోటీహృదార్తరవుఁ డజ్జగతీ
తాటంకవతీపతిపట, పేటీకోటీశతంబు బిడ్డకు నిచ్చెన్. 372

శా. సౌరభ్యాహృతివిశ్వభూజనమనస్సంతాపము ల్విస్తృతాం
భోరుడ్రాగకరంకహృద్విహరణంబు ల్సారకర్పూరక
స్తూరీసాంకవగంధసారఘుసృణస్తోమంబుతో నిచ్చె సు
భూరిత్నంబున కేడువారముఁ సొమ్ము ల్రాజాదేశంబునన్. 373

ఉ. ఆహతగంధవాహముల నద్భుతహేషణదంభదూషణ
వ్యాహృతిభర్జితద్యుమణివాహములం గతిభిన్నమానస
వ్యూహములం గులీనమహిమోజ్జ్వలవాహములం గఠోరవీ
రాహితచిత్తభల్లుఁ డగునల్లుని కిచ్చె సుకీర్తికీర్తికిన్. 374

మ. కలకస్థాత్మమతంగజప్రభుమదౌత్కంఠ్యంబు వారించి యు
క్కటన క్షోణిపుచేతఁ బ్రాభృతముగాఁ గైకొన్నవైంహ్యద్విప
చ్ఛటలం భిన్నదిశావశాప్రియలఁ జంచజ్జంగమగ్రావధ
ఘటనస్ఫూర్తుల నిచ్చె నల్లునకు భూకాంతుం డుదాత్తస్పృహన్. 375

క. అరదంబులఁ గుటిలాహిత, దరదంబులఁ గేతుపవనదళితప్రావృ
ట్చరదంబుల భరనతది, గ్ద్విరదంబుల నిచ్చె భూమివిభుఁ డల్లునికిన్. 376

వ. వెండియుం బేరుగలవస్తువు లిచ్చి జామాత నాదరించి తాను నుపకృతుండై సుకీర్తి
యాఁడుబిడ్డ నాలోకించి యుష్ణాశ్రుమిశ్రితాక్షుండై యిట్లనియె. 377

క. జనియించినయింటికిఁ జో, చ్చినయింటికిఁ గ్రొత్తకీర్తిసిరిగా సరిగా
ననబోండ్లు మేలుమే లన, మనుమీ మనుమీతుల మైనమా కిం పొలయున్. 378

చ. మలసి ఋణానుబంధమహిమన్ హృదయేశ్వరుఁ డత్త నత్తమా
మలతలగాకయుండఁ బతిమాన్తురు కాంతలు వారికెన్నఁడున్
గలుగవు వన్నెవాసు లటుగావునఁ బుట్టినచోటు బుద్ధిలోఁ
దలఁచి తదంఘ్రిభక్తి పరతంత్రవు గమ్ము కుమారికామణీ. 379

చ. కృతనుతశీలయైనసతికిం బతివంటిగురుండు లేఁడు ని
శ్చిత మిది యమ్మనీషికి విశిష్టగురు ల్దలిదండ్రు లమ్మహో
మతు లుసురన్న విప్రుఁ బరిమార్చినపాపము వచ్చుఁ గాన నీ
మతముఁ దలంచి యత్తవను మామను సేవయొనర్పు మోర్పునన్. 380

సీ. అత్తమామలచిత్త మలర వర్తిలవమ్మ ధవుని దైవంబుగఁ దలఁపవమ్మ
తోడికోడండ్రపొత్తును బాయనీకమ్మ మఱఁదులఁ గని మని తిరుగవమ్మ
యనుఁగుఁజుట్టములపట్టున వెట్టగాకమ్మ వఱపుళ్ళపై భక్తి వదలకమ్మ
కాఁగానిచెలుల డగ్గఱి చరింపకుమమ్మ యుత్తమస్త్రీలపొం దుడుగకమ్మ
తే. తోడుతోనైన నందనుతోడనైన, నొంటిపాటున భాషించు టుడుగవమ్మ
పనులఁగొనకమ్మ భూసురాంగనలచేత, వ్రేలఁ జూపించుకొనక జీవింపవమ్మ. 381

ఉ. శ్రీవరవర్ణినీదనుజశిక్షణదీక్షులయట్లు దేవియున్
దేవరబోలి నీవు భవదీయవిభుండు నఖండసౌఖ్యసం
భావితులై మహాతనుకుమారు నఖర్వసుపర్వఖర్వ నా
శావినుతైకశక్తిధను జంపతు లూర్జితలీలఁ గాంచుఁడీ. 382

శా. తల్లీ నిన్నొదఁబాసి యుండొకముహూర్తంబైన నైదింక నా
యుల్లం బోర్చునె పుత్రులేక నిను నయ్యోదైన మిట్టిచ్చె నే
వెల్లింబోయిననంతఁ గుందవలసె న్వైయ్యంబుఁ బ్రార్థించి వి
ద్యుల్లేఖానిభదేహ నిచ్చలుఁ బత్తున్ శీఘ్రకాలంబునన్. 383

వ. అని సుకీర్తియార్తిం దలపంచుకొనియె నంతఁ దదీయసతి కాంతిమతి పుత్రిం గవుం గిలించుకొనుచుఁ గన్నీరుకరతలంబునం దుడిచి డగ్గుత్తికఁ బెట్టి యెట్టకేలకు ధైర్యంబు చిక్కంబట్టి యిట్లనియె. 384

క. నాయనుజుఁడు మత్పిల్లుం. డీయిలు నా యిలు సుసేనుఁడీజయసేనుం
డోయబలా నీపెనిమిటి, పాయసనున నేయిదొరుఁగుబా గేర్పడియెన్ 385

చ. ఇరువుర మేను లారయఁగ నెక్కడ నుండిన నేమి యిక్కడం
దరలదు గాదె మాయనువితానము నిన్నదె వర్తమానవ

త్సరమునఁ బిల్వఁబంచెద విశాలకు నెమ్మదినుండు పోయి క్ర
మ్మతియొద నంచుఁ బుత్త్రిఁ దగుమాటలఁ దేర్చి సగౌరవంబునన్. 396

వ. వివిధాభరణంబులు చిత్రవస్త్రంబులు పరిమళప్రముఖంబు లగుసర్వవస్తువు లిచ్చి బంధుజనుల నియోగంబు పనిసి చతురంతయానాధిరూఢ యగుచుఁ జతురంగసేనాపరివృతుం డగుసుకీర్తితోన మరలి పురంబున కరిగి సుఖం బుండె. 387

ఉ. ఆజయసేనుఁ డంతఁ బరమాదరణంబున బ్రహ్మరాక్షసుం
బూజలఁ దన్పి కేల్మోగిచి పొండిఁక మీరన నుత్సహించి గో
త్రాజరదైత్యుఁ డానరవరాత్మజు మన్నన సేసిపోయె నం
భోజభవాలయంబునకుఁ బుష్పకమెక్కి సుర ల్భజింపఁగన్. 388

వ. ఆరాత్రి మజ్జనభోజనాదికార్యంబు లాచరించి. 389

సీ. చంద్రికపూవన్నెజిలుఁగుదువ్వలువమేల్కట్టుదంతపుఁగోళ్ళపట్టెమంచ
మొలుగుబిల్లలపట్టుపఱుపుకప్రపుఁబల్కుసురటి క్రొవ్విరులు కస్తూరిరాయి
పూపుగట్టినగందపొడికదంబముపెట్టె కలపంబుచికిలిబాగాలబరణి
పండుటాకులు వానవాల్పానకములును గండచక్కెర తెల్లపిండివంట

తే సంజసరిపట్టుబకదారిజాతిపారు, వములు గుజరాతికెంపుదీపములు బూతు
చిత్రపటములు కుడిసిరుచెంబుగలిగి, తనరుసదనంబు రాజనందనుఁడు సొచ్చె 390

సీ. మంచికప్రము మేళవించినపన్నీట సరసాళిజనము మజ్జనముఁజేసి
జిలుగుమాంధాళి కుచ్చెలఁబోసి కట్టి దేహమునఁ గుంకుమరసం బప్పళించి
చికిలిపైఠాణికంచుకము గీలించి చొక్కము లైనమణులహారములువైచి
సొగసుగా నుదుటఁ గస్తూరిరేఖ యమర్చి కళుకులు ముద్దుచెక్కుల ఘటించి

తే. గోరజవ్వాదిపదనిచ్చి గూడదువ్వి, కుసుమగర్భంబుగా జాలుకొప్పుఁబెట్టి
చవులచేర్చుక్క సీమంతసరణిఁగూర్చి, కన్య నిష్టాన్నసంతుష్టఁగా నొనర్చి. 391

ఉ. కూరిమి బుజ్జగించి యనుఁగుంజెలువ ల్దనుఁదేర సమ్మదాం
కూరమహావిలంబమునకుం బనిలే దనఁ బోవపోవమం
చూఱటలేక సిగ్గుతెరువుండగ ముందఱఁబోయి పిమ్మటం
గ్రూరవిషాణమేషమయి కొమ్మ చనుం జనలేక క్రమ్మఱున్. 392

ఆ వనిత నిలిచి నిలిచి వచ్చుమ చుంజీర, నుండనములు మాని మాని మొరయ
లజ్జ విడువరాదు లావణ్యవతులకుఁ, బ్రాణనాథునెడలఁ బాయరాదు. 393

వ. ఇట్లు కేళిమందిరంబు చేరందెచ్చి 394

ఆ చెలులు బలిమిఁజేసి పిలిచినఁ దల్పంబు, చేరరాక సిగ్గు చేర్లుకొనఁగఁ
గ్రొమ్ముడియును మోము కొండొకచూపట్టఁ, దలుపు దండగొనుచు నిలిచియుండె.

క. రతిబోటులంత మంద, స్మితచంద్రికవదనపర్వశీతద్యుతులం
దతులగతి మెఱయఁ దేజో, న్నతునకు నృపసూతి కిట్లనిరి నేర్పొలయన్. 396

క. ఈపాఁపపూఁప వయసుది, నీపాదములాన మెత్తనిది పేర్కొనరా
దేపనిపాటలనేనియుఁ, గాపాడుదుగాని గాసిఁ గావింపకుమీ. 397

తే. ఎంతతమకంబు గలిగిన నిగురుబోండ్లు, చేర నొల్లరు మగవారు చిరుదనుక
నది యథార్థీకరించి నీయలరుబోఁడిఁ,గదిసి పలుతువుగాని కొంకెదవుసుమ్మి. 398

క. అని నగుచు మగువలందఱు, పనినెపమున నొక్కరొకరె పఱచిన లజ్జా
వనతాస్య యగుచు నంగన, మనమున ననుసిగ్గుదేరి మారాకృత్తన్. 399

ఉ. ఉవ్విళులూఱుచు న్నికసితోత్పలలోచన చూచు వల్లభున్
దవ్వులజూచుమభర్త దను నర్మిలిఁ జూచినఁ జూచె దంతలో
బువ్విలు వంచిఁబాణ మరి బోసి రయంబున డాసి శింజినిం
జివ్వునఁ బాపి యేసె నలచిత్తజుఁ డిద్ధఱ సవ్యసాచియై. 400

క. అత్తఱి రాజకుమారుం, డెత్తినతమకమున ననునయోక్తుల సరసా
యత్తవిచేష్టలఁ గన్నియ, చిత్తము గరఁగించి సజ్జఁజేరఁగఁదెచ్చెన్. 401

సీ. మగువ నీకంకణమణుల నర్ఘ్యము లని పరికించునెపమునఁ గరముఁబట్టె
నెత్తమ్మితావు లీనెడునీమొగం బని మూర్కొనువిధమున ముద్దుఁబెట్టె
లేమ నీకంఠమాలిక దొడ్డసొమ్మని తడవులాగున ఘనస్తనములంటె
బిఱుచుట్టుబిగువున విఱుగదే నడు మని సడలించుగతి జీరముడి వదల్చె

తే. నాఁతినీబొమ్మునాబొమ్మునకు సమాన,మయ్యెడినొ కాదొ యరాఁగాముల రయానలయు
నని మహాకైతవంబున నధిపపుత్త్రుఁ, డంబుజాననపరిరంభ మాచరించె. 402

ఉ. వేడుక లంకురింపఁ బృథివీవరుఁగాఁగిలి మందుసోఁకి సి
గ్గూడనిబాడిన న్మగుఁ బ్రియుండు హసించినఁ బిల్వ మాఱుమా
టాడుమొగంబునం దెలివి యచ్చుపడం దఱితోడ నిమ్మనన్
వీడియ మిచ్చుఁ గన్నులకు విందగుచుం గలకంఠి వేమఱున్. 403

ఉ. జీనువముక్కు తోడఁ బ్రతిసేయఁగవచ్చిన గోరఁదీరుగా
సీనియ లొల్చి చుట్టి తనకిచ్చిననాగరఖండ ముర్వరా
జానిసగంబు వోఁ గొఱికి చానరదంబుల కందియియ్య నా
లో నవినొప్పె వజ్రములలోఁ దళుకొత్తెశుకుందనం బనన్. 404

ఉ. చాతురిమీఱ మస్తకము సందిట బిగ్గరఁ గ్రుచ్చిపట్టి యా
నాఁతిసుధాధరంబు రదనంబున నొక్కినఁ దాళలేక

రాతిశయత్వ మేది బోసలార్చుచు కన్నరమూసి వల్లభుం
జేతుఁ ద్రోచి రాజముఖి సీత్కరణం బొనరించెఁ బల్మఱున్. 405

ఉ. అంగజసాంపరాయము సమాప్తివహించిన నిర్భరత్రపా
లింగితచిత్తయై యబల లేచి కటిన్మృదులాంబరాచలం
బుం గదియించి హేమమణిపుత్త్రిక చాటున కేగుచోఁ బున
స్సంగమవాంఛ పుట్టె నృపజన్ముని కిష్టవిలోకనాయతిన్. 406

వ. ఇట్లిచ్ఛానురూపవిలాసంబులం బొదలి సుఖించి దంపతులు మఱియును. 407

సీ. సురభిపుష్పామోదఁ జొక్కించె నారామసీమ నారాజన్యచిత్తజుండు
కలహంసగమనఁ దెప్పలఁదేల్చెఁ గాసారతటముల నాన్నృపోత్తమసుతుండు
కంఠీరవవలగ్నఁ గరఁగించెఁ గృతకాద్రిగుహల నద్ధాత్రీశకుంజరుండు
కలకంఠి ననురాగ మొలయించెఁ జివురుఁజప్పరముల నవ్వైరిభంజనుండు

తే. గారుడాశ్మచ్ఛటాచ్ఛన్నకనకసౌధ, పాళికల నావితీర్ణవిభ్రాజితుండు
రతులఁ బొలయించె నాశరద్రాజవదన, నతిశయప్రీతిలతిక మాఱాకులిడఁగ. 403

క. మహిళారత్నంబును న, మ్మహిరమణసుతుండు భోగమహనీయకళా
విహారలీల నుండి రని యల, బహుమానుఁడు క్రకచుఁ జూచి పలికె న్మఱియున్.

క. దొరికినవిశ్వంభరిత్రి, వరకన్యక విడిచె వెఱ్ఱివాఁడై యడవిన్
మరణమయి మనినమందుఁడు, పురుడింపఁగ నీకు దోడుఁ బోవఁడె క్రకచా. 410

ఆ. తనకుఁ దెవులు మూఁడె నని భార్య సెప్పిన, నీవు దానిమాట నిజముసేసి
నెయ్యుఁ డనక నన్ను నిర్జింపఁజూచితి, చెడుఁగ నిన్ను విశ్వసింప నగునె. 411

క. వెడమాయలపుట్టినిల్లగు, చెడుగుం గళ్యాలు పాపశేషంబునఁ జే
పడినకతంబునఁ గాఁపుర, గొడుకొక్కఁడు రాజబాధ గుందఁడె తొల్లిన్. 412

క. నావిని జలచరపతియుం, డావానరవిభుని కనియె నదియెట్లు సరా
దేవస్తుతి యాకథఁ జెప్పు, మా వినియెద ననిన నతని కతఁ డిట్లనియెన్. 413

సీ. అరపాతలగభీరాపాతజలఖేయ మానాకరమ్యసాలాభిరామ
మాచంద్రమండలవ్యాయామమణిసౌధ మాబ్రహ్మశుద్ధవిప్రాన్వవాయ
మాప్రాణపవనశౌర్యభూషితక్షత్త్రి మాఘోద్యమసముద్యమకిరాట
మాదార్ఢ్యభర్మకార్యారంభచరణజంబాచక్రవాళశైలాశుతురగ

తే. మాంబరప్రాంశుదానధారాఢ్యనాగ, మాభ్రుభఙ్స్థానపథశతాంగాతిశయము
బ్రహ్మకైనను బ్రస్తుతింపఁగఁ దరంబె, భూమహనుమనూపురంబు కాంచీపురంబు 414

క. అలకాంచితమయి తనరిన, యలకాంచివిహారవసమ్రఁడను పేర మహా

హాలికుఁ డొకఁ డుండు నలంది, కృషీబలాయం గలిమిచట్టుకోడు కితఁ డనఁగన్.
సీ. ఆలగుంపులు గొఱియలదొడ్లు లేఁబూరిదొనుములమునిమంద లెడ్లకదుప్ర
లులుగరంబులు వాఱుపాలమువాకిటఁ బదికట్టుబండ్లింటికిఁ జుట్టుమగులు
తలుపుదూలము కొట్టములు సోగరాగాడిమచ్చు ముంగిట రెండు రచ్చమాకు
లీనుగోడిగె వేగురింటిబిడ్డలు మాళ్లతార్పులు నూఁటపాఁతిఅలఁ గొలుచు
తే. కలుపుకలి లేరుదండయుఁ గమ్మతీగ, పాగడము పూసె నాచెట్టె బవిరెపడిగె
చుక్కబొట్టును జిటిపొటిసొమ్ము గలిగి, కాఁపురము సేయుసవ్వీటఁ గాఁపుకొడుకు.
క. వానికి నిచ్చావతి యనఁ, గా నొకయిల్లాలు గలదు కమనీయవయో
నూనవనంబున నది జా, రానందలతాలవాలమై వర్తిల్లున్. 417
వ. అది యొక్కనాఁడు. 418
చ. తలఁ బెనుగుండఁ దాల్చి వితత స్తనభారమున న్వలగ్న మా
కులత వహింపఁ గాఁప వలిగుబ్బెత పట్టుపగ ట్జలార ని
ల్వోలువడి మన్మథాస్త్ర పటలీనిశితోత్సుకటాక్షమాలికల్
గెలఁకులఁ బర్వ వేగవతికిం జని తత్తటిసీతటంబునన్. 419
ఉ. కోమలధూళిధూసరితకుంతలు నాతపరక్తరక్తదృ
క్తామరసుం గటీరపరిధాననిబద్ధకరాసిఁ బాదత
క్షామిళదంఘ్రిముద్విముఖసంస్తరణేతరచిత్తు గాఢచిం
తామయుఁ సాంద్రనద్వజనితశ్రమపీడితుఁ గాంచె నొక్కనిన్. 420
క. కాంచి దృగంచలశోభా, చంచచ్చంద్రాతపమున శాంతశ్రముఁ గా
వించి యలవిందునకు మదిఁ, గొంచించక హాలికలికుచకుచ యిట్లనియెన్. 421
మ నిలువం జోటులు లేవె నీకుఁ జెపుమా నీరాటి కీవేల హా
తెలిసెం బాంథగతాగతైతదిదపృథ్వీభృత్పురస్త్రీకరా
కలితాస్యద్విజరాజబింబకృతసాక్షాత్కారసంభావనా
. కలనన్ దూరపథప్రయాణజనితగ్లానిం ద్యజింపం జుమీ. 422
క. కలదుగదా యని మోపిన్, బలుమింమలు సందడింపఁ బలికినఁ జింతా
కులహృదయుఁ డగుట వాఁ డ, చ్చెలిమాటలు వినక సరకుసేయకయుండెన్. 423
వ. అట్లద త్తప్రతివచనుండై యుండ నమ్మిండతె వెండియుఁ చెరుఁగరి నీక్షించి. 424
శా. అంపంజాలము చింత నీమనసు చీకాకౌట నామాట లా
లింపం గూడదు నేఁడు క్రొమ్మెఱుఁగుదూలె న్నేను వీక్షించినన్
సాంపొక్కింతయు గానగా దెఱుఁగవచ్చుం జెల్లఁబో చుట్టమా
కొంపం బో రుదయించి రావుగద నాకుం జెప్పుమా నీకథల్. 425

క. అని సరిదాఁకంబలికిన, విని కొండొకమనసు పల్లవించిన దానిం
గనుఁగొని యతఁ డనుచా, ద్బునఁ దెలిసితి వింటఁబోరు పుట్టుట తరుణీ. 426

ఉ. నేర మొకింతలేమియును నిర్దయ యైనను గన్నతల్లి దు
ష్కార్యరత కోర్చి రాయఁ దనకోడలి రేలు పగళ్లు కంట న
గ్గోరము జూడలేక మదిఁ గుందుచు నిద్దిగనాడి పోయితిన్
వారణలేక రాజుఁ గొలువం జిరకాలము దండుఁజేసితిన్. 427

ఉ. నా కవనీశుఁ డిచ్చె నదనం గదనంబున నస్మదీయబా
హాకరవాలధారభయదారులు గూలినఁ జూచి మెచ్చి కో
రాకృతకృత్యయందు సవరాలు వరాలు సరాలు రూకలుం
గోకలు మానికంపుఁదళుకుల్ మృగనాభిజవాదికప్రముల్. 428

ఉ. ఆకమనీయవస్తుతతు లన్నియుఁ దెచ్చి నమస్కరించి యు
త్సేకరసం బెలర్పఁ దనచేతికి నిచ్చిన వాని నన్నియున్
గైకొని జల్లి బాష్పకలికాతరళీకృతలోచనాంతయై
కాకుతనంబు సేసె గొడుకా యిఁక నేమన నేర్తుఁ గోడలిన్. 429

ఉ. తిట్టినఁ దిట్టు బెట్టుఁ జిటిదిండికిఁ గొల్చిన కొల్చు సాగ ది
చ్చిట్టకమన్న మాతులకుఁ జేతులు సాఁచు నొకప్పుడేని యి
ల్పట్టదు సంతకూటములఁ బాయదు చేయదు చెప్పినట్టు నీ
జట్టడిజంత యిట్సెటిచె రాతనయా యనయానుషంగతిన్. 430

క. కాపరమున వెండియు నది, గావించినపనులు పెక్కుగల వవి నాకే
లా వినుపింపఁగఁ బిమ్మట, నీవె యెఱింగెదవు డాఁగునే యపకీర్తుల్. 431

క. నీవఁట యదియాఁట వలసిన, త్రోవం జనుఁ డింక మమ్ము దూరఁగఁబనితే
దీవఱదను కారోఁతల, దేవుల్లంబడితి వినివితిం గోడలిచేన్. 432

చ. కొలపగ గాక యత్తకును గోడలికిం బరికింప నెయ్యముల్
గలవె వలానిమచ్చరముఁ గైకొని యీముదిముంప చెప్పెదున్
బలుమఱు నంద్రు దానిగుఱింగు లెఱుంగనివారు సర్వమున్
దెలిసెదుఁ గాద చేయగలితే మఱిదాఁగునె పుణ్యపాపముల్. 433

క పూవకపూచెం గిడెంటు, కావకయు న్గాచె ననుమఁ గిడగన్నులఁ గెం
పావహిలఁ దల్లిసెప్పిన, యావాక్యము లనృతమయములని యవ్వేళన్ 441

తే. తల్లి పలుకులు గాదనఁ దాల్మిలేక, యుత్తమాంగనఁ గులకాంత నొందునవక
బ్రతుకుభాగ్యము విడిచి నిర్భరవిరక్తి, నరుగుదెంచితి ననిన నయ్యంబుజాక్షి. 435

ఉ. ఆతనిఁ జూచి యిట్లనియె నట్టిద తప్పదు నాఁతి నీతితో
జాతి దలంచి సిగ్గులకుఁ జచ్చుచునుండిన నుండెగాక కా
మాతురతాతిరేకమున నాఱడిపోకలఁ బోవఁజూచినన్
వేతరవుండి పట్టుకొన నీరజగర్భునకైన శక్యమే. 436

క. కులసతి యుత్తమురాలని, దెలిసియు నీతల్లి మనసు దెలిసియు దగదీ
యాలుక మతికెక్కి దెలిసెన్, దల యోకలి చుట్టు మనువిసం బిదిగాదే. 437

క. నావిని యతఁ డిట్లనుఁ జెడు, త్రోవనుఁ బోకుండ మదనతుల నెప్పటికిన్
గావఁగరాదా పతులకు, నీవనియెదొ యెల్లవారనిరొ యిబ్భంగిన్. 438

క. మిన్నులపైఁ బోవదుగద, యిన్నేలనెకద మృగాక్షి యిటు లెవ్వరికిన్
గన్నాఁదన్నన్నె చెపు మన, నన్నేలఁతుక నవ్వి వాని కపు డిట్లనియెన్. 439

క. పరసతి నని చని యనుఁగుం, బురుషునితోఁగూడి నిలయమున నాఁడోసఁగన్
సురతసుఖంబుల్కుయును గొని, యిరవందగ నీకు విత్తమిత్తుం బుత్తున్. 440

క. ననుఁ జూడఁగలవె తొల్లిటి, ఘనజఘనలకైతవంబు కతలుం గితలున్
వినిపింప నేటి కన్నియుఁ, గనుఁగొనియెదుగాక నేఁ డఖండప్రీతిన్. 441

ఉ. ఇచ్చట నుండనేల తొలియిర్లుపడం బసిబిడ్డతల్లితో
నచ్చితి నేఁ బ్రవాసి నిలువన్వలెఁ బ్రొద్దుదయించుదాఁకనం
చచ్చుపడంగఁ బల్కి తమయాతనితోఁ దలసాఁచనిల్చి యో
ముచ్చటకాఁపయేనయట ముందటికార్యము లాచరించెదన్. 442

క. అని వేగవతీజలముఁ, గొని యామణిమంతుఁ దోడుకొని మృగగతులన్
జనియె నొరు లెఱుఁగకుండం, దనయిలు రెడిసాని యపు డతని కెఱఁగించెన్. 443

ఉ. అంతట వేఁడివేలు పపరాద్రిఁ దిరోహితుఁ డయ్యె వాసరాం
తాంతరుచు ల్నెలంగెఁ గలయం దొలిచీకటిపర్వె సీరసీ
మంతినిమాటమీఁద మణిమంతుఁడు చీరముసుం గొనర్చి యొ
క్కింతభయంబులేక పడి నేగెఁ గృషీవలునిల్లుచేరఁగన్ 444

వ. ఏగి యఖండోత్కలికం దగుహాలికునకిట్లనియె. 445

ఉ. నాపడుబాటు కేపగవ నాకనుకూలగతిం జరించుచుని
పాపనితల్లి కీవికచపంకజలోచనకై దురంతసం
తాపముఁ బొందెదం దగినతావిది గావున వచ్చినాఁడ నేఁ
డీపసిగాడిదండ వసియించి ప్రభాతమునందుఁ బోయెదన్. 446

క. ఉండుదునా యన నాయన, మండుచు నిట్లనియె మంచిమాటే యిది మా

యిండులు విడుదులె పురి గుడి, గుంపంబులు లేవె పండుకొను మచ్చోటన్. 447

క. పోసఁగ దని ముక్కుదుస్సిన, పసరముగతి రేఁగి రెడ్డి పలికిన నాలోఁ
బసిబిడ్డ నెత్తుకొని సం, తసమున రెడిసాని వచ్చి తనపతి కనియెన్. 448

ఉ. చెప్పు మదేమి యేలరొద సేసెదు వాకిటివార లెవ్వ సం
చప్పలుగాకి తా నెఱుఁగన ట్లడుగం బ్రియఁ జూచి వాఁ డనున్
గప్పినమబ్బులో నితఁ డొకం డిదె వాకిట నిల్చి చోటుకై
ఱొప్పెడు నెన్నఁడేనియు నెఱుంగుదునో ననుఁ దా నెఱుంగునో 449

ఉ. ఆలఁట చంటిపాఁపడఁట యంగడిలేదె పచారముల్ గృహం
బేల ప్రవాసి గాఁడె తన కెక్కడనైనఁ బరుండరాదె యీ
నేలయె గాని నిల్వఁ బెఱనేల మనోజ్ఞము గాదె యంకచం
డాలము గాదె యిట్లునికి నా నది రెడ్డినిఁ జూచి యిట్లనున్ 450

ఉ. ఆలఁట చంటిపాఁపడఁట యాయన యెంతటివాఁడొ యేరికిన్
జాలిది గాదె యిల్వెడలఁ జాలనివారు బయళ్ళనుందురే
వేలుపులైనఁ దక్కరుల వేఁడరె యక్క అపాటునం జలం
బేల పరుండనిమ్ము మన కిప్పని పుణ్యము గాదె వల్లభా. 451

క. పసిబిడ్డతల్లితోఁ గ్రక్కస మొండొకదెసకు నరుగఁగా నితనికి ని
వ్వసుధఁ దలఁ గట్టుకొనియెదె, కసరకు నేఁడెల్ల నుండుఁ గా కిచ్చోటన్. 452

క. చాలుఁ బిసాళింపకు మని, యాలరి రెడిసాని మగని నదలించి సుతుం
డాలును నీవును నిచ్చోఁ, దాలిమి వసియింపు మని యతని లాలించెన్. 453

వ. ఇట్లుపలాలితుండై మణిమంతుం డయ్యింటిపసులకొట్టంబున నుండె నంత. 454

సీ. కలదండి పసిఁబిండి కాఁచి చేమిరిఁ బెట్టి యొఱగకుండఁగఁ బట్టి యుట్టినొట్టి
కోళ్ళసంకటితోడఁ గూడు నిళ్ళిడి జాగు సెపక బంటుబానిసలఁ బనిచి
తనివెచ్చకలిసీటఁ దా నమర్చి యనుంగునిసువు జోపలఁ బాడి నిద్రఁబుచ్చి
యోతువు గొనిపోనకుండఁ గూయిపెదెచ్చి కోడితింపంబులఁ గూండ్లగమ్మి

తే. దాలిఁ గాఁగిన నీరాడి సలికమ్మి, పడుఁగుఁ బైఁగప్పుకొని కాళ్ళు ముడిచిపట్టి
మంచమునఁ గూలి నిదురించుమగని లేపి, కూరయును వెన్నఁ బడవైచి కూడొసంగి

తే. సన్నజాదపు నేఁతమంచంబుమీఁద, దగ్గుగంబడిఁ బఱచి నిద్దురకుఁ దూలు
మగనిఁ గూర్కపు మనచు నమ్మాయలాఁడి, వెడదగంగాళమునఁ గూడుగుడిచిలేచి.

క. గుడుసుంబోఁకలు బ్రద్దలుపడ ఱోఁకటఁ గుమ్మి తెచ్చి పతికిడి నున్నం
బిడక యొకకొన్ని సున్నం, బిడి యొండొకకొన్ని మడుపు లిచ్చుచుఁ బలికెన్. 457

క. మగవాఁ డనఁగాఁ గుమ్మిద, పొగరుం బ్రాయమునఁ గన్నపూవుల నెల్లన్
దగిలి రమియించుఁ గలదే, మగవానికి నెందు సరిసమానము జగతిన్. 458

ఉ. వారణలేక హస్తిగిరివల్లభు సేవకు వచ్చిపోవుచు
న్నారిమిటారు లీపురమునం గల రచ్చపురాకుబోంట్లతోఁ
దారసమైనతీరుగలదాని నొకానొకబోటి నెన్నఁడై
నా రతిఁ దేల్పవే కనువినం బ్రియమయ్యెను నాకు నింతనున్. 459

చ. పలుచనిమేను నిబ్బరపుఁ బ్రాయము వాఁడవు కంచి కెప్పుడుం
గలిగినరెడ్డివిం గొనఁగఁ గర్తవు కాఁపుర మెచ్చునిన్ను నే
వెలయొలనాగ పిల్వ దది వేడుకఁ బోలిన నీకుఁ జిత్తమే
పొలఁతుకమీఁద నుండు నిది బొంకక నాకెఱుఁగంగఁ జెప్పవా. 460

క. తపవులనుండియు నిది ని, న్నడిగెద నని యుండు మఱియు ననుటయుఁ గాఁపుం
గొడుకు విడియంపుసొంపుం, జనుపుం బెనఁగొనఁగ నప్పిసాళికి ననియెన్ 461

ఉ. ధీరత మంచిదానిపగిదిన్ మృదురీతుల వేఁడిమాట లే
తీరున నైనఁ బీల్చుకొని తిట్టుదుఁ గొట్టుదు నంచుఁ జూచెదే
యూరకయున్న జాల్వెఱతు నుండు మెఱుంగుదు నిన్నుఁ బోలు ది
క్కేరద మిట్టిగోల కెజెఁగింపక యెవ్వరితోడఁ జెప్పదున్. 462

క నావిని వెండియు నలయి, చ్చాఛవతి పతిఁ జూచి పలికె సరసత నేనై
కావలెనని వేఁడుదురఁట, నావలనం గనలుపుట్టునా యింతైనన్. 463

క వేడుకపుట్టెడు విన నా, తోడుసుమీ చెప్పకున్న దోసము లేదే
చేఁడియఁ బోయితి వినఁ జలి, వీడి కృషీవలుఁడు నవ్వి వెలఁదికి ననియెన్. 464

ఉ. ఒట్టవు సత్య మే నెఱుఁగ నొండొకబోగముదానిఁ గాంచికా
పట్టణమందుఁ గూడి గడపై మనవాకట నాడి పద్యముం
గట్టినవీటి వంజగుతి గాఁ దిరుగాడ నెఱుంగవేమొ నా
చుట్టఱికంబునం బ్రియము సుమ్మిఁక మాటలు వేయు నేటికిన్. 465

ఉ నావిని గోరగింప నయనంబులు విస్ఫురితాధరోష్ఠయై
యావెడమాయలాఁడి యను నాతని కోరి మెఱుంగబోఁడు లే
కైవడి నైన వేఁడుటరుగాదె మొఱుంగు లెఱుంగఁ గోరవా
రై వినరానిమాట లకటా మగవానికిఁ జెప్పవచ్చునే. 466

క దాప్రరము లేక యీ క్రియ, గాపురములు సేయుచున్న గరితలతో నీ
తిపురములు వాక్రుత్తురె, కాఁపుల నినువంటివారిఁ గానవె తులువా. 467

క. అని కెలసి పులుకపులుకనఁ, దను జూడం జూడఁబట్టి తన్నుం గొట్టెన్
దని విసనఁ దిట్టె ననలుం, గొనబుగ రోద మగని డెగనికొండాటమునన్. 468

ఉ. కావర మెత్తి యిట్లు తనుఁ గాఁతియఁ బెట్టుచు నున్నదాని ని
చ్చావతిఁ జూచి లేచి రభసంబున రెడ్డనపల్కె నోసి నీ
చేవ యెఱింగి కాదె మును జెప్పక గుంజిలిపెట్టియుండ్కి నీ
వే వలదన్న వేఁడుకొనవే మఱియేనయి చెప్పినాఁడనే. 469

క. నాతోడని నన్నుడుగుట, యీ తెగు దెంపునకు ముగిసె నిఁక నేమనుచున్
రాతికొడు కతఁడు హలసం, జాతకిణాశ్లాతికఠినశయమునఁ జఱిచెన్. 470

వ. ఇట్లువ్రేటుపడి దండతాడితభుజంగియుంబోలె నమ్మోహనాంగి నింగిముట్టినయలుకం బట్టిన సికవీడి నిలువంబడి యిలువెలువడి. 471

క. ఆడికలం బడితినొ అం, కాడితినో యిల్లు ముంగిలననో తత్రితోఁ
గూడననొ నీళ్లననో, కూడు నె యిల్లాలి నన్నుఁ గొట్టం దిట్టన్. 472

క. విరసమునఁ గొట్టుపడి నా, సరిగరితలలోన బ్రతుక సైఁతునె మఱి నే
నురిఁ బోదు త్రాటఁబోదున్, ధరియింతునె సైఁపు మింతదడ విన్వోటన్.

క. ననుఁ గన్నతల్లి ప్రజలకు, వినిపించినపిదప నుచు వెసఁ బుట్టిల్లం
దునికి యటకేగు కైతవ, మున నుపవల్లభునినికటమున కదిపోయెన్. 474

క. ఏతెంచి నిర్ణిరుద్ధ, ప్రీతి న్మణిమంతుఁ గ్రుచ్చి బిగికౌఁగిటవ్రా
జ్జాతపృథుప్రథనంబున, శాతోదరి పెనఁగె రెండుజా లవ్వేళన్. 675

క. విసుఁక చను వెనుకెడున, ప్పసిపాఁపఁడు తల్లి దాఁపుఁ బాయుటఁ గడువె
(క్కసమున నాఁకలి గొని తా,) నసురుసురై చెవులు గిండ్రమున వాపోయెన్.

వ. అయ్యేడ్పు విని యుపపతికి నయ్యువతి యిట్లనియె. 477

చ. అడలెడుఁ జంటిపాఁపఁ డదె యాకొని వానికి నేను జన్నుబా
లిడి చనుదెంతు నింటిమగఁ డింతయె ఱుంగక యుండ నీవు నా
యొడన వసించి యేమినిసు వేడ్చెడు రెడ్డిన నాకుఁ దెల్పుమం
చడుగు మతండు వంటికొఱకై యని నిప్పన మొప్పఁ జెప్పెడున్. 478

ఉ. చెప్పినఁ దల్లి యొందరగెఁ జిన్నికుమారుని డించి సర్వముం
జెప్పఁగదయ్య యివ్విధము చిత్రము నాకని వేఁడ మాతఁ డి
ట్లొప్పని మోముతో నను గుఱుకుఁ బలుకుచు మంకుబుద్ధి యే
తప్పనులేమి నివ్వోడలి తల్లిగృహంబున కేగె నంతగన్. 479

క. నావిని మాయాతనితో, నీనను నుతు విడిచిపోయెనే యకటా నీ
దేవియుఁ బుట్టింటికి న,య్యో వలదని మాన్ప కెట్టులుండితి విచటన్. 480

ఉ. ఐన నిఁకేమిసేయఁగల మాకట నేఁడుకుమారుఁబట్టి కై
ట్లీనిశి యోసరించి నిలు మోపు మదీయపుఘూటి వచ్చి నీ
కానకకన్నపట్టి కిడుఁగాని ఘన స్తనగుగ్ధ మంచు స
న్మాన మెలర్ప నాడు మనుమానములే కతఁ డోసరించినన్. 481

వ. పంతంబు చెల్లించుకొనుదాన నని చెప్పిన మణికుంతుం డమ్మాటలు గాఁపుకొడుకున కెఱింగించె నెఱింగించిన. 482

ఉ. ఉండెదఁ జెప్పినట్లు నిలుపోపనియాఁకట నేడ్చి యేడ్చి య
క్కొండినచంటిపాఁపఁ డిపుడేమగునో మఱిలేరు బిడ్డ లా
క్కొం డిదె వీఁడు నాకొడుకు గాఁడు ఘన స్తనయుండు సత్కృపా
మండన వీనిఁ బ్రోచికొనుమా యని హాలికుఁ డోసరించినన్. 483

క. అప్పలుపచెలువ జారుని, దుప్పటిముసు కలవరించి తోరపుమురిపం
బుప్పతిలఁ గులుకునడలం, జొప్పెప్పెడకుండ దనశిశువుకడ కరిగెన్. 484

తే. అరిగిపెరిగినయాఁకట నఱచి యఱచి, యేడ్చి విడుపనితనపట్టి నెత్తి పట్టి
కలికి చన్నిచ్చి పొత్తిపొత్తుల నమర్చి, మగనికెంగేలఁ జెనకి యమ్మగువ వెడలె.

క. ఆలరితనమున లీలం, గేలం దనుఁ జెనకి చనినగిరిపచ తనయి
ల్లాలని తెలియక పరుని, ల్లాలని యారెడ్డిబిడ్డఁ డపరు విరాళిన్. 486

శా. రావే నల్లనిగుమ్మ ఏవనుచు నారాటంబునన్ రెడ్డి నా
నావిభ్రాంతులఁ గుబ్బతిల్లునెడ చోన స్త్రీనకేతుండు కీ
ళ్ళాపైచెం గొఱకచ్చులం బొడిచెఁ గాలం గేల మర్దించె నా
పోప న్నమ్మెటఁ గొట్టెఁ దిట్టెఁ జిఱునిప్పు ల్రాల్చె నేత్రంబులన్. 487

క. చేసెడువలరాయనికై, కాసములకుఁ గాక జడిసెఁ గాపుంగొడు కా
లో సుదతిఁ దెచ్చుటకు ని, ద్రాసక్తుని మీఁటెఁ జన్నుద్రావెడుకొడుకున్. 488

క. మీటుటయు మిట్టిపడి య, ప్పోటు ప్రుధిరంబు గ్రమ్మ స్రుక్కుచు నొడ లా
రాటపడఁ జంటిపాపఁడు, కాటుకకన్నీరుదొరుగఁ గావున నేడ్చెన్. 489

వ. అయ్యేడ్పు విని యుచ్ఛావతి యుపపతి కిట్లనియె. 490

క. కొడుకుంగుఱ్ఱకుఁ జనుబా, లిడి నీతో రతులఁ బెనఁగ నేతెంచుచు నా
కడకేలం దాఁకించితి, గడుదెర్లికపుట్టి పొఱలఁగా మారెడ్డన్. 491

చ. తమకమువుట్టి నేఁ దదికతంబున రెడ్డన నిద్రఁబోవులేఁ
గొమరుని నేడిపించె నదిగో తిరుగంబడి చన్నొసంగి ర
మ్ము మరల నంచు నన్నటకుఁ బొమ్మని నీవనుపం దృఢానురా
గమునఁ బ్రియంబుఁ జెప్పి నను గౌఁగిటఁ జేర్చి సుఖించుదానికిన్. 492

శా. ఘోరం బోచ్చెఁ గదయ్య యీఁకటికి నీపుత్రుం డయో యింటి కిం
కారాదా రెడిపోని యిట్లలుకుచుం గాఁబట్టఁగా వచ్చునే
దూరస్థోణి వసింపుచన్నొసఁగఁ బుత్తుం గూర్చి నిల్లాల నీ
తూరిజ్ఞ లోపలికంచుఁ బల్కు మతఁడుండుం గొంది నంచాడినన్. 493

క. కలితనమునఁ జని యలనా, పలుకుం బంతంబు చెల్లుబడిగా రెడ్డిన్
గలసి యొకముదుపుఁ గైకొని, పిలిచిన నీకిత్తు నేరపెట్టుదు మగనిన్. 494

వ. అని యప్పు డప్పిసాళి మణిసుంతుం దతిమిన నతం డది పలుకుమన్నట్లు పలికె
నమ్మాటలు విని కర్షకుం డుత్కర్షింపుచు నిట్లనియె. 495

క. ఎడగలుగ నుండెఁ ధనమే, న్వడకెడు మతిపసులనంటివారము చనుబా
లిడుఁగాని పుణ్యమయ్యెడు, విడనాడక యిటుకుఁ బనుపవే యిల్లాలిన్. 496

క. నావానిమాటలకు లో,లో వెడవెడ నగుచు నింటిలోపలి కలయి
చ్చాపతి పోయెం బోయినఁ, గోవరపుంబ్రేమఁ గాఁపుకొడు కవ్వేళన్. 497

ఉ. కేలగలించిపట్టి రతికిం బిఱుబీకులు సేయ లోనుగా
కాలరిజంత నేఁ జెడితి నమ్మక సిగ్గులవాఁడవౌదు నీ
యాలనె వింతదాన మగనాల నయో తెకతేఱ నన్నుఁ బ్రా
ల్మాలుపఁ జూచెదో తెగరె మామగవార లెఱింగిరేనియున్. 498

ఉ. మేనికిఁ జేటుగాదె పులిమీసల నుయ్యేలలూఁగ మాను నేఁ
గానటువంటిదానఁ గొఱగానిపను ల్దలమీఁదవచ్చునే
రానిఁకఁ జాలుఁ జే విడువరా యని సూత్మరవంబున న్సరో
జానన పల్కినన్ హాలికుఁ డాజగఱాఁగకుఁ బ్రీతి నిట్లనెన్. 499

క. ఇటువంటిదాన వేలా, చిటిపొటికేంగేల నన్నుఁ జెనకితి నినుబా
యుట ప్రాణంబులఁ బాయుట, కుటిలాలక కరుణలేదకో యిట్లాడన్. 500

క. అని బాఁతిఁబాఁతిపెట్టిన, పెనుబ్రాతివరాలపోలెఁ బెకలించె ఘన
స్తన కిచ్చి త్రుచ్చి కౌఁగిట, నెనయించెం బంచబాణుఁ డెసకొల్పంగన్. 501

క. అది యాత్తెఱఁగున నతనిన్, గదియంబడనిచ్చి హెచ్చుగలదానిగతిన్
గుగులుకొను నేలబుసకొ, న్నైద ఎను నేనెట్లు చేపడితి నను నపలున్. 502

క. పోవలె వడిగా వడిగా, లేవయ్యా ప్రక్కలోన లేకుంటే నేఁ
గానఁడా మగఁడని యలయు, చ్ఛాపతి కర్షకునిఁ ద్రోచెఁ జదికిలబడఁగన్. 503

వ. కరాపాతంబుకంటె మున్నుగా లేచి యప్పలువచెలువ కన్నులసాం పామతింపఁ
జని విత్తమిచ్చి పంతంబు చెల్లెఁగదా యని జారుని నిజకరంబునం జఱచి చక్కిలి

గింతపెట్టె నప్పుడు చతుర్ఘటికావశేషంబుగా రాత్రి చనియె దిక్కులు ప్రకాశ ప్రతతిం బొందెఁ బిచ్చుకలు పిచపిచ మనియెఁ గాకంబులు గూకలిడియె దధిమథనఘుమఘుమధ్వానంబులు సెలసె గోవత్సకోలాహలంబులు వినవచ్చె నయ్యెడ గృహంబు వెడలి పెరడు చొచ్చి వచ్చుటకు విహారభ్రాంతను బోయినఁ గనుపేచు కునియుండె. 504

క. అపు డిచ్ఛావతి యచ్చో, నుపవల్లభు నిలువఁబనిచి యోహక యిలుపొ
చ్చి పొడవుగల మచ్చుపయిం, గపటవ్యాపార మమరఁగాఁ గూర్చుండెన్. 505

క. హాలికుం డాలోపల లో,పలికిం జనుదెంచి మచ్చుపైఁ దనయిల్లాల్
నిలిచిన తెఱఁ గెఱుఁగక యపు, డిలువెడలినబుద్ధి నిశ్చయించి కనలుతోన్. 506

ఉ. ఈలువు వంగడంబు గల దీజవరాలని యేలి రొక్కరో
క్కాలిడి యెట్టిజంకు తడక వ్వరియించితి దీని నక్కటా
చాలు సహింప దీచెనఁటిసంగతి యొండొకమాయపన్నియో
యాలరిజంతఁ జంపి సుఖినై యొకదిక్కునఁ బెండ్లియాడెదన్. 507

వ. అని హుమ్మని యాడుగడిచి మీసంబులు దీటుచుండ నయ్యంబుజయాన మచ్చు డిగ్గ నుఱికి యెదుర నిలువంబడి యిట్లనియె. 508

ఉ. ఈలువు వంగడంబు గలదే మనుబోంట్లకు నీకుఁగాక రో
క్కాలిడి యిట్టిజంకుతడక వ్వరియించుట రోఁతగాదె నీ
కెలసహింతు నన్ను మడియింపు మొకానొకపోటఁ బెండ్లిఁ గ
మ్మాలనె నీకు నేఁ దగుదునా చను నీ కిటులాడ నిచ్చలున్. 509

ఉ. నిక్కము రెడ్డిబిడ్డవని నిన్ను ని నమ్మి గృహంబుఁ జేరి యీ
దిక్కున నున్నఁ జాద్రసుదతి న్మఱుపిచ్చి రమించినాఁడ వి
త్తైక్కలిజంకు నాకుఁ గలదే యారి ముందలఁ బట్టి యీడ్చి యా
రెక్కస దన్నె ముక్కు చెదరం జరణంబున వాని నెవ్వడిన్. 510

ఉ. తిన్నని వాఁడు తచ్చరణతామరసంబుల వ్రాలి నిన్ను నే
మన్నది లేదు నావలన నన్నియు నేరము లోర్చుకొమ్ము నా
పిన్నతనం బొకళ్లచెవిఁ బెట్టకు పెట్టిన సిగ్గుపోవు నా
యన్నియ సన్నమా నగరివారికి దండుగఁ బెట్టనిమ్మనున్. 511

క. చెఱుపకుము కాఁపురంబని, పఱిపరి యగుతాల్మి నట్లు ప్రార్థింపంగాఁ
గుఱఁగట నేగుచుఁ దలవరు, లరిమురికర్షకునిమాట లాలించి తగన్. 512

క. గిలుకలువైచిన గుదియలు, ఘుఱుఘుల్లున నూఁదికొనుచుఁ గదియం జని యా
హాలికునిఁ గొని చని కరణీ, తలవల్లభు మ్రోల నిలుపఁ దప్పేర్పడఁగన్. 513

క. నరపతి దండుగఁ గొని యు,ప్పరి వెడలం గొట్టి నపుడు భువనచరాదు
శ్చరియాలగు నీవు నుదా, హరణం బిది యనుచు వానరాగ్రణి చెప్పెన్. 514

వ. చెప్పి వెండియు బహూమానుండు. 515

క తులువా నీయిల్లా ల,య్యాలివేణికిఁ దోడుబోయినది దానిమ్రుపో
క్షుంబుఁ దెగఁజూచితివి నీ,తలద్రెవ్వను బొలిసిపోయెదవు తరువాతన్. 516

క. చేపడినసొమ్ము దూరం,బై పోయె న్మోసమయ్యె నని యంతస్సం
తాపమునఁ బొక్కి పొలలుకు, మీపాటిం బొమ్ము చాలు నింటికిఁ గ్రకచా. 517

క క్రించామూర్ఖుని నిను ద,క్కించుట యన నెంత సింధుకీలాలమునన్
వంచింపఁబడదె మున్నొక,వంచక మభిజాతకమఠవల్లభుచేతన్. 518

క. నావిని కాననచరగో, త్రావరు నీక్షించి పలికెఁ గ్రకచుఁడు నయవి
ద్యావై భవగుణసుభగం, భావుక వివరింపు మాయుపాఖ్యానంబున్. 519

ఆ. కుటిలుఁ డప్రయోజకుఁడు వీఁడు వీనితో, నేటిజోలి నన్ను బోఁటి కనక
వివరపుట్టఁజెప్పవే నిష్క-లంకస్వ,భావ నావుఁ డలరి ప్లవగవిభుఁడు. 520

వ క్రకచునకు నక్కథఁ జెప్పందొణంగె. 521

సీ. కలిగొట్టు మోఁదుగు కానుఁగు గలుగువావిలి మేడి నేరేడు సెలసు బలుసు
మజ్జి మంకెన మద్ది మారేడు బూరుగు గోరంట లొద్దుగు క్రోవి రావి
జువ్వి మామిడి జీడి సురుగుడు మొలుగుపాపట చంద్ర పసిరిక పాల రేల
పొన్న బొట్టుగు పోఁక పొగడ దాడిమ మిప్ప గుముడందు గురువింద గోను రేను
తే. చిల్ల చింత మొగలి చీకిరే ణూడుగ, నిమ్మ తమ్మ తుమికి నెమ్మి జమ్మి
వేగి వేము మొదలుగాఁ గలమ్రాకుల,కాన నగుచు నొక్క-కాన మెఱయు 522

చ. కరపుటికాంతరాళచుళుకక్రమణాయితసింధుసర్వతః
పరిస్రుతకృత్స్నయోదములు వాసిన దర్షుటజాన్యపాణిజ
ఝరితములై నభోగతికిఁ జాలక పల్వలము ల్భజించె నాఁ
గర మఱరు న్సమగ్రబలకాయము లవ్వనికాలులాయసుల్. 523

ఉ. ఆహ్వాతజంతుభీషణబలాభ్యుదయాస్థగుహాసురస్థగో
త్రాహితహస్తి వజ్రకరినాతిశయాకృతి శౌర్యగర్వరే
ఖాభామికం బ్రసిద్ధరుచిరామృతపారణజం ఖ దానవో
త్సాహవిఘాతిచండమునఁ దద్గహనంబునఁ గ్రాలుబెబ్బులుల్. 524

మ చరణప్రాంతచరిష్ణువు ల్నిరుపమోచ్చస్థానసంక్రీడన
స్ఫురణం జన్నఘనత్వమంద నరుదెంచుం గీడు మీ కంచు ప

త్సరబుద్ధిం బలెఁ జించుమేఘముల దంతత్రోటికోటిం జలా
హరణారంభణజృంభణంబులు దదీయవ్యాళశుండాలముల్. 525

మ. తనరస్సుల్కవిసంభవాండభువనధ్వాంతచ్ఛిదాచంచువు
ల్వినఁ జెప్ప న్వెలిఁగె మహాతిమిరపాళి న్విచ్ఛిపోఁ ద్రోఁచె
ఘని రక్షోత్థరజోదర స్తిమితదీక్షాభోగుఁడై హేళిగ
న్గొన నఘోరతరాటవి న్మను నెలుంగు ల్గుంపులై వేసవిన్. 526

శా. పైపైఁ బ్రాణివిఘప్రధానగుణ మొప్పం గౌరగౌరద్యుతుల్
దీపింప న్విపమాంబకభ్రమిఁ బ్రభీతిం జేయు నత్యుత్కటా
టోపం బుగ్రగజాహృతివ్యసనకండూలంబుగా నుండుగుం
పై పంచాస్యము లయ్యరణ్యమునఁ బంచాస్యప్రకారంబునన్. 527

శా. క్రందై వెల్వడు ఘుర్ఘురధ్వనిమృదంగస్థాయి గాఁ దాలుని
ష్యందస్థూలవిశాలలాలసపరంబై యొప్పు శృంగోద్ధతిం
జిందుల్ ద్రొక్కఁ గడుంగరంగముల నిస్సీమత్వరాతిభ్రమిం
బందుల్ దిక్కులగయుచ్ఛిదాగుణపరిస్పందుల్ దదుగ్రాటవిన్. 528

క. అలఘుతిరవారిధారా, దళితప్రతికూల సకలధరణీభృత్సం
కులమై యొక సెలయే ఱ, ప్పొలమున జగదేకవీరుపోలిక నమరున్. 529

వ. అది రామలక్ష్మణాలంకృతంబై పంచవటస్థానంబును సత్వసంపన్నంబై సమీర
ణంబును గజగవయవిహారయోగ్యంబై కిష్కింధానగరంబును సుపానీతపరమ
హంసంబై వేదాంతశాస్త్రంబును నఖండశబ్దక్రియానిరూపణంబై వ్యాకరణం
బును బ్రబోధితనిగమజాలంబై ధర్మంబును ఘనరసప్రధానంబై విద్వత్ప్ర
బంధంబు ననుకరించిన యమ్మహాప్రవాహంబున. 530

క. నీతికళానిధిగలఁ డభీ,జాతుం డనుకమఠవిభుఁడు సంతతపంక
స్థాత్మ్యత నొందియు నద్భుత, మాతం డేపంకఁ బంక మంటక తిరుగున్. 531

శా. ఆతాఁ బే లోకనాఁటిరేయి ధరణీవ్యాపారలిప్సాపరం
బై తానంబులఁ బాసి తీరశరత్పృణ్యావీథుల న్నిల్వ భూ
జాతచ్ఛాయలశీతలానిలకృతాంచద్వాలుకాలేఖికా
వ్రాతాక్ష్యగ్రముల న్విశృంఖలగతి న్వర్తించె వర్తింపఁగన్. 532

చ అటిముటి చిచ్చు నాఁ బొగులు నాఁకట బ్రుంగుడునంగుడై యొడల్
సుఱసుఱ స్రుక్క నయ్యడవిలో నొకనక్క తలస్ఫుటంబులన్
బొటియలఁ దోఁకఁ జొన్పి పెలిభూమికిఁ దార్చన యొండ్రి తంపెముల్
గొఱుకుచు నచ్చి పచ్చి యాఁకూస్మముఁ గాంచి ప్రహృష్టచిత్తమై. 533

క. ఘనరథసంబునఁ గదియం, జనునపు డక్కమఠవిభుఁడు స్వగతంబున ని
ట్లని తలఁచె నిప్ప్రియ దుఁడ, ననియుండుదు నేఁటితుదకు నది బొంకయ్యెన్. 534
ఆ. సకలదుష్టజంతుసంక్రాంతజలదుర్గ, సీమనుందు వెట్టచెట్టలేక
చెడుగుఁబాము గాముచేఁ బెద్దమీనుచే. నీరుకుక్కచేత నెగడుచేత. 535
ఆ. వొయ్యపుర్వు గ్రొవ్వి రోధోవసుంధర, కెగసి తెగినపగిది నిట్టులేల
జలతలంబు విడిచి చనుదెంచి నా బుద్ధి,పుర్వుమేయఁ జెట్ట బొందఁ గంటి 536
క. కాలంబు దాఁట నెవ్వరు, చాలుదు రని వగచి నిరవసాదవిషాద
జ్వాలం దూలి కబంధచ, రాలంకరణంబు వపుసహితకంబై. 537
క. రాతింబలె నతినిశ్చల,రీతి న్నిలుచుటయుఁ గని గరీయఃక్షుద్బా
ధాతురకృశంబు జంబుక, మాతతదంష్ట్రికలఁ గచ్ఛపాగ్రణిఁ బట్టెన్. 538
క. పాదివి తెకతేఱఁ గలిగెం, గద నాకీకష్మతేనెకరుఁడని దానిన్
దుదకోఱలు కోరలుపోఁ, గొదలే కటునిటుఁ బొరల్చి కొఱుకుచు నుండెన్. 5:9
క. విఱుగుట గానక నెరయం, దఱతఱకలువాఱఁ గొంతదడ వది గొఱికెన్
గొఱికిన నొగులదు పగులదు, చిఱుమొఱకలుపోయెఁ బుల్ల సిలె దంతంబుల్. 540
వ. ఇట్లు మృగధూర్తదశనదంశననిర్వ్రశకలితమర్త్యంబై యకూర్మంబు తనలో
నిట్లని వితర్కించె. 541
చ. జరుగదు రోసి పో విడువఁజాలదు వేసటలేక కోఱలం
గొఱికెడు దీనికేమితుద గోరము వాఁటిలె నాయుపాయ మం
దఱుఁ గొనియాడ నిచ్చనఁటినక్క దటాలునఁ డక్కఁబెట్టి యే
మఱక ననశ్వరం బయినమన్గడఁ గాంచెద నీరుసొచ్చెదన్ 542
క. అని నిశ్చయించి ధీర,త్వనిరూఢుం డగుచుఁ గమఠవరుఁ డానక్కన్
గనుఁగొని యిట్లను నేలా,తను వలయన్ మల్లిపోయెదవు పిసవెట్టిన్. 543
క. మఱవక యేఁడులుపూఁడులు, గొఱికిన నాయొడలు మృదువగునె నీకేలా
వెరవిడిచందము పుట్టెన్, దరిదీనికి వెరవుఁ జెప్పెద న్వినుమర్థిన్. 544
క. నానకమృదుమార్గమునకు, రానేరదు మేన నీచరణ మనఘా నా
పై నునిచి యేతదంబు, స్థానములోఁ బెట్టు కొంతదడ పట్లయినన్. 545
క. చెన్నార నపుడు చేసిన, వెన్నవలె స్మెత్తనగుసు విపులవపాసం
పన్నము సుమ్మీ తను వాఁ, కొన్నమహాత్మునకు నీవు గుడువఁగవచ్చున్. 546
క. తనివిసనఁ దినకపోవని, మనమునఁ దలపోసి రోసి మనుగడపై నీ
కనువైనవెరవుఁ జెప్పితి, నని కూర్మప్రవరుఁ డాడె నట్లాడుటయున్. 547

వ అప్పలుకులు సిద్ధాంతీకరించి యవ్వంచకం బట్లచేసెం జేసి ముహూర్తమాత్ర మూ
కుఱిచ యయ్యభిజాతుని కిట్లనియె. 548

క తడవయ్యె నీటిలో ని, న్నిడి మే నేమైన నానెనే తనివిసనక్
గుడువవలె నిజముఁ జెప్పుమా, జడియక నీ వనిన వారిసత్త్వము తనలోన్ 549

క. ఈవంచకంబు నామా, యావాగురఁ జిక్కి దిక్కి నసుపంచకమం
చావిర్భూతోత్కలికా, ప్రావృతమై యపుడు కచ్ఛపం బిట్లనియెన్. 550

క. అసమోదక మంటఁగ నా, నె సమృద్ధము లంగకములు నీపాదము క్రిం
దిసుమంతనాన దెవ్విధి, మెసవెదు నీపంటి కెట్లుమృదువై యుండున్. 551

క. మెత్తనగుఁగాని ప్రాఁతిము, గుత్తముగా వెన్ను ద్రొక్కి కొనియున్నపదం
బెత్తుము నీకంటఁగవలెఁ, జిత్తము సుఖపారణావశీకరమైనన్. 552

క. పోఁగుఁగిఁబో యీ వాఁకట, జాగేమిటికంచుఁ బలుక సంతుద్బాధా
జాగరణబుద్ధి జంబుక, మాగోచరుమాట నిశ్చయము పొమ్మనుచున్. 553

క పై దారుణముగ నూఁదిన, పాదము దివియుటయు గచ్ఛపము సంతోష
ప్రాదుర్భావప్రాప్తము, హ్లాదంచద్వేగ మగుచు నుఱవడిఁ బఱచెన్. 554

క. క్రకచా యీచాడ్పునన, క్కుకు మోసము గల్గియుండఁగా మఱి నినుబోఁ
టికిఁ దగులెంత యని కీశకులాగ్రణి చెప్పి మఱియుఁ జలచరుఁ బలికెన్.

క. వెడమాయనక్క మాటల, కడవికిఁ జని తిరిగి వచ్చి యప్పటియుంచ దా
నడవిఁ బడి బడుగుమారిచేఁ, గడతేఱెనగర్దభిమ్ము గాఁ జూమ్ము శరా. 556

క. అనినవిని శింశుమారుఁడు, వనచరు నీక్షించి యింత వాఁడెవ్వ గాకుం
డిన ముదిసి ముప్పదనుకా, మనుదే యిది తెలియఁబలుకుమా విననలతున్. 557

వ. అని యడిగిన బహుమానుండు. 558

సీ. కల దొకదుర్దాంతకాంతార మరవిందబంధుఘృణ్యంతర్ధిపాదపంబు
దీర్ఘదంష్ట్రాభిఖ్యఁ గేజరిల్లు మహోగ్రసింహ మచ్చో నివసించియుండు
దానికి ఘటకాభిధానజంబుక మొకం డహరహం బాప్తకృత్యము లొనర్చు
నట్లు కొండొకకాల మరిగినఁ గర్మానుకూలత నసదృక్షుమక్షిరోగ

తే మసృణతరవేదనాకంపమాన మగుచు, వెగ్గలంబైనధృతి జారి యగ్గజారి
పాఱలు వాపోవు నలమురఁ బొక్కు స్రుక్కు, బోరగిలఁబడు నిట్టూరుపులు నిగుడ్చు.

క. ఈరీతిఁ గడుపునొప్పిం, గూరాకై యుడికి గోఁడు గుడుచుచు నుండా
లారి యొకనాఁడు నిజర, క్షారసనంఘుటకుఘుటకుఁ గనుఁగొని పలికెన్. 560

చ. తనదెసఁ జూచినాఁడవకదా ఘుటకా కటకాంతభూమికిం
జని యుతిగోవనం బమరఁ జంపి శరీరము వ్రచ్చి లోపలం

గనుఁగొనసైన గర్దభముకందనగాయ గ్రహించి తెచ్చి యి
చ్చి నిలువుపాసిపోఁ జలిదిఁ జేకొని యుండెడు జీవితంబులన్. 561
చ. తడసినఁ జత్తుఁ బొమ్మనినఁ దచ్చరణంబుల సమ్మదంబునం
బడివడి లేచి యప్పనికిఁ బొల్పడి జంబుక మేగి యొక్కచోఁ
గడుకృశమైనదాని నొకగర్దభముం గని చేరి యిట్లనున్
బడలితి వేల రాసభ శుభంబగు నాకెఱిఁగింపవే యనన్. 562
వ. గర్దభంబు జంబుకంబున కిట్లనియె. 563
క. చాకలవాని కధీనమ,నై కోకలు మోసి తెత్తు నాపణవీథి
వ్యాకీర్ణప్రీహితుష,స్వీకృతి మేన్ బ్రోతు నెట్లు చిక్కకయుందున్. 564
క. కొనఁ గననిపాపకర్ముఁడు, తను నాహారాదివిధులఁ దనుపఁడు మేయన్
జననీఁడు కాలుగట్టు, న్ననుటయుఁ జమ్పటయుఁ గాదు మద్విధి ననఘా. 565
ఉత్సాహ. మేను పొందుగాదు లేదు మేను సౌఖ్య మక్కటా
జైనవాని చేతి పేనుచందమైతి నంచు న
మ్రానసంబుతోడనున్న నాత్మ లేని నెయ్యమున్
గానరాఁ జెనంటి జంబుకంబు దాని కిట్లనెన్. 566
మత్తకోకిల. కాదు గుంటివి గావు బీఁకువు గావు గర్దభముఖ్య ని
కేలయి విధి నెన్వచేఁ గృశియింపఁబోదము రమ్ము మ
త్కేళికానన శాద్వలంబులఁ గ్రీడసల్పఁగ మర్త్యసే
వాలఘుత్వము చాలు నీకు నవారివారితృణావళుల్. 567
క. అని చెలువు గులుకుపలుకుల, మనమూఱించుటయుఁ దేఱి మనుజాధీనం
బున నున్కి కష్ట మని ఖర, మనసొంపై నక్కబడి మహాటవి కరిగెన్. 568
క. అరిగినఁ బరిచితపటుసం, భరమున్ ఖరము న్విమత్తబలగర్దభశ్రే
ఖరముం గురవము ఖరమున్, హరిపాలం బెట్టె నక్క యక్కటికమునన్. 569
క. నెఱిసరిగ దానిపైఁ బడి, కఱవన్ లాఘవము లేమి గాల్కొడ్చుచు న
ద్వేఱుపం గదిసిన నత్తెఱఁ, గెఱిఁగి ఖరం బదరి తిరిగి యేగుచు నుండెన్. 570
క. గునుకెత్తుచున్నగాడిదె, గనుఁగొని సింహంబు పలికె ఘటకునితో నీ
చనుఖరము దరిమికొన నా, తనువున వడిలేదు తెమ్ము దగ్గఱఁజేరన్. 571
చ. చనుమన నట్లకాక యని జంబుక మప్పుడు గర్దభంబుఁ జే
ర నరిగి యేలపోయెద కటా రసనంబులమోవ బస్తుఁగన్
వనరఁగ వేడ్క యయ్యెడినొ నద్దిటువంటికుబుద్ధు లివ్వనం
బునఁ గొన మేఁపు నీళ్లు గఱవో పతిమన్నన నీకుఁ జాఁదొ. 572
వ. రమ్మనిన గర్దభంబు జంబుకంబున కిట్లనియె. 573

క. కేసరినఖ కుద్యోగముఁ, జేసిన నగ్గమక మెఱిఁగి చెలికాఁడా సం
త్రాసమునఁ దలఁగి వచ్చితి, గాసిలి ప్రాణములు తీఁపుగా యొవ్వరికిన్. 574

క. నావిని ఘుటకుం డనుఁ దగ,వా వెరవుఁగ నధిపుఁ బట్టివాఁడా నిను సం
భావించుట కిట్లోరయుం,గా వచ్చుట యింతకేల గళిపళిమందన్. 575

చ. తనతన ప్రోత్తక్రొత్తి యగుటం జనియించెను కోప నేఁడు రే
పవుటయు మమ్ము మీరఁ జనుచుంతయు నీయది కొంకనేల త
మ్మవసర మిప్పు డించుఁ జను నాఖును న్మరలించి తెచ్చి గా
రవగుణ మెక్క నక్క మృగరాణ్ణికటంబున బెట్టెఁబెట్టినన్. 576

తే కలుషకలుకునఁ గుత్తుకఁ గఱచి విఱిచి, నక్క నక్కఁ జీరి ఘుండాలవైరి
గర్దభము కుక్షి భేదించి కర్ణహృదయ, ముదయ దాహ్లాదమున దివ్వ మోపననక.

వ. ఏను సెలయేటిజలంబు లానివచ్చెద నని చెప్పి యాడు గామడగా నరిగిన. 578

సీ. ఖరశరీరము విప్పగా గొప్పలగుదంతపంతసంఘంబులఁ గ్రుచ్చి గ్రుచ్చి
మృగధూర్త మాకర్ణహృదయంబు భేదించి యది యనర్ఘ్యం బగు టెఱిఁగి కాదె
యతుంరంహము సింహ మాశించె భక్షింప నత్యాజ్య మివ్వస్తు వనుచుఁ దాన
భక్షించి పరిశుద్ధపగిది నూరకయుండె నపుడు కంఠీరవ మరుగుదెంచి
తే. కొననలయు నౌషధంబు దెమ్మనినఁ గొంకు, కొసరుతే కది పలికె నోకుంభివైరి
గర్దభాకారమున లేదు కర్ణహృదయ, మదియ కలిగిన నిన్నేల కదియువచ్చు. 579

సీ. అని నక్క తక్క కిట్లాడుమాటలు యథార్థీకరించి యాదల్పఁ దెరువులేమి
నడిగెఁ గేసరి యూరకుండె నట్లావంచకము మహాకపటవాక్యములు నమ్మి
గహనమండలి సొచ్చి క్రమ్మఱ మఱియు నేతెంచి దుర్వ్యాధితద్విరదవైరిఁ
జేరి తద్దంష్ట్రికదోరినఖరముగాఁ దళఁపకు నన్నని బలిముఖుండు
తే. పలుక నేమియు ననక యజ్ఞలచరుండు, లబ్ధనాశవ్యథాజాతలఘుగుణేతి
రావిలపిపాస దీఱ నీ రానిచనియె, నద్భుతత్వరతోడ నిల్లాలిఁ జూడ. 580

క. అని విష్ణుశర్మఁ డాదర,మునఁ జెప్పినరాజసుతులు ముదమున గురునిన్
గనుఁగొని పంచమతంత్రం, బనఘా మాతోడఁ జెప్పుమని యడుగుటయున్. 581

మ అతి హృద్బోద్ధ్రిపమోహ భక్తినతదివ్యవ్యూహ విఘ్యార్జిత
క్రతుపుంజార్చితపాద వర్ధితపటుప్రహ్లాద పుణ్యవ్రతా
యాతనాధ్వన్య జగత్త్రయీకరణవిద్యాధన్య త్రయ్యంతకీ
ర్తితపీతాంబర కృత్తిధారణకుగాధివ్యాధినిర్వాపణా. 582

క. ఆదృతశుకముక్తిమహా, పాదపకిసలాయమానపదయుగ నానా
వేదశిరఃప్రసవప్రా, సాదవ్యాపారదీనజనమందారా. 583

మాలిని. హరిముఖసురమాళిన్యస్తపాదాంబుజాతా
పరహితరతధామప్రాంతయుక్పారిజాతా
పరుషతరవిలోకప్రాంశుధూతారిజాతా
చరణశరణరక్షాజాగరూకైకచేతా. 584

గద్య. ఇది శ్రీవేంకటనాథ కరుణాలబ్ధసరససాహిత్యనిత్యకవితావిలాస సకలసుకవిస్తుతిభాషణోల్లాస రాజకులపారావారపర్వశర్వరీరమణ నీతిశాస్త్రమార్గపరిశ్రమణ ధైర్యపర్యాయధిక్కృతనీహారపర్వతరాజకుమార నిస్స్పృహాయప్రబంధనిర్మాణ భోజభూదార సుధామధుర భారతీసనాథ వేంకటనాథప్రణీతంబైన పంచతంత్రంబున లబ్ధనాశం బన్నది చతుర్థాశ్వాసము.

శ్రీ ర స్తు.

# పంచతంత్రము

## పంచమాశ్వాసము.



హిమగుప్రియతనయా
మోహాస్నేహావలోకముగ్ధభ్రమర
వ్యూహాసముపాస్యసిద్ధ
వ్యాహృతిమధుముఖసరోజ హరిహరనాథా. 1

వ. దేవా యసమీక్ష్యకారిత్వాభిధానం బగుపంచమతంత్ర మాకర్ణింపు మఖిలనీతిశాస్త్రమర్మజ్ఞుం డగువిష్ణుశర్మండు సుదర్శనకుమారుల కిట్లనియె. 2

క. అపరీక్షితం బకార్యము, సుపరీక్షిత మభిమతంబు సురి మ్యోరి క
య్యపరీక్షితవిధిఁ గాదా, యపలాపము పుట్టె విప్రయువతికిఁ బతికిన్. 3

క. నావిని రాజకుమారకు, లావిప్రునిఁ జూచి పలికి రది వీనులవిం
దై వెలయఁగ నీకథఁ జెప్పు,మా వినియెద మనిన వారి కతఁ డిట్లనియెన్. 4

సీ. గౌడదేశంబునఁ గలఁ డాగమాభ్యాసజడుఁడు విప్రుఁడు దేవశర్మ యనఁగ
నతఁడు సోమసుధాత్మసుత యాజ్ఞసేని నాఁ బెంపొందుసుకన్యఁ బెండ్లియయ్యె
సంతులే కలశరజ్జలజలోచన యాయి గన్నజాతికిఁగుందు గన్నగుంటి
కెఱఁగుచు మఱుగుచు నెవ్వరే వ్రతములఁ జెప్పి రా వ్రతములఁ జేకొనుచును
తే. సుతులఁ గనిపెంచుగరితలఁ జూచి యేచి,యిచ్చ ముచ్చట నొందుచు నిట్టులుండఁ
గొంతగాలంబు పోయిన గొడ్డువీగి, కాంతిజితహేమసుమగర్భగర్భమయ్యె. 5

సీ. ఓఁకర బలిసె జిట్టుములసందడి మించెఁ గలకవాలెఁగపోలఫలకయుగళి
బుద్ధిమృద్భక్షణంబునకు నువ్విళులూరె రశ్మిచామన మేన నచ్చజేసెఁ
గాళిమ గుఱకుచాగ్రములఁ బాళెము డిగ్గె గార్శ్యంబునకు బొమ్మగట్టె నడుము
నిద్రారతిప్రీతి నేత్రంబులకుఁ గల్గె మురిపంబు ముంగర మోసులెత్తె
తే. నరుచి యాహారసుఖముల నడ్డగించె, మధురరుచులకు నెదుగెచ్చు మానసంబు
నిశ్భరశ్రాంతి నడకల సేవగొనియె, నక్కటం గేక్షణాకిఁ జీరి చిక్కుటయును. 6

క. ఈలక్షణములలీలన్, చూలాలై యున్నజాయ సుగుణనికాయన్
వేలాతీతప్రీతిం, బాలితనిజగోత్ర సమితిపతి యిట్లనియెన్. 7

క. దైవముకృప గలదానవు,గా వంధ్యాత్వంబు వీడెఁగా నీతికళా
కోవిదుఁ డగుసుతుఁ గనియెదు,గా వంశము వృద్ధిఁబొందఁగా నా కనుచున్. 8

వ. మనోరథంబునం బొట్టుపొఁ జలగుమగనిం గని నగుమొగంబున ఘటప్రతిభట స్తని
యిట్లనియె. 9

క. బహుళమనోరథభీషణ, గహనంబునఁ జిక్కి వెడలఁ గానని నీచో
త్సాహనుఁడు చనుస్తురజః, పిహితుం డగుసోమశర్మపితచందమునన్. 10

క. నావిని దేవికి విపులా, దేవుం డిట్లనియె గుణవతీ యెట్టెట్టూ
నీవీకథ నాతోఁ జెపు,మా వినియెద ననినఁ బతికి మానిని పలికెన్.  11

సీ. కలఁడు దాశార్ణభూతలమున నత్యర్థసారశర్మఁడు సోమశర్మ యనఁగ
నతనికి నెనమండ్రుసుతు లందులో నగ్రపుత్రుండు పిత్రన్నభోక్త వాఁడు
కడుపారఁ గృష్ణపక్షశ్రాద్ధమున నొక్క భూమినిర్జరుగృహంబున భుజించి
యొకసక్తుఘటము పైతృకకర్తచేఁ గొని చని విజనప్రదేశమున నిలిచి

తే. ఘటము గలయంపిగా నీరుగా విపంచెఁ,బఱచి శయనించియొఱుగుగాఁ బాణి నిలిపి
యాత్తు లరమోడ్చి ధనవృద్ధనై చరింతు, నని దురంతోద్యమంబుననతఁడు దలఁచె.

సీ. అవన నీసక్తు వమ్మెద నమ్మి యొకమేఁక గొనియెదఁ గొనకొని కొనిన మంద
నేఁటేట నొకరెంటి నీనెడునవియును నవియు వానికిఁ బుట్టినవియు నీన
బహువత్సరములకు బహుసహస్రంబులై నెగడెడువాని నన్నింటి విలిచి
సంతరించెద ధేనుశత మది పెట్టినకోడెలచే ధారఁ గొనిన చేల

తే. విరవిగాశైరు వి త్తింతు వేళ్ళుగొలుచు, గాఁగ మామకసస్యము ల్గడుఫలించు
పంటకొలుచమ్మి కూర్తు నపారధనము, ధనికుఁ డనినాకు నొకఁడిచ్చుఁ దనకుమారి.

క. దొడ్డతన మరసి యీాక్రియ, గడ్డాయం బనిన విప్రకన్యకవలనన్
గొడ్డ కొకసుతునిఁ గని యా,బిడ్డని మాసోమశర్మ పేరే యిడుదున్. 14

క. ఆయర్భకుఁ డూర్జితగతి, హాయనపరిమితవయస్కుఁ డగుఁ బోషింపన్
సాయంతనమున గృహకా, ర్యాయత్తమనస్కభామ యర్భాలకునిన్. 15

క. కరుణఁ దనచంక నిడుకొని, యరుగక యాటువైచి పోవు ననునాలో భూ
సురుఁ డీపన్నిద్రాసం, భ్రమముద్రితనయనుఁ డగుచు మఱియాలోనన్. 16

క. ధేనువు లేతెంచిన నటు, లైన న్వడిఁ ద్రొక్కు నాత్మజునిఁ దేహోసీ
వీని నిటువైచి పోఁదగు. నే సచంకము గదంబె నిసువానుకొనన్. 17

క. అని కలవరించి లగుడముఁ, గొని త్రిప్పుచు నిక్కనంబు కులసతి యనుచున్
తెనఁటిధరాసురుఁ డాగ్రహ, మున సక్తుఘటంబు భిన్నములుగా వైచెన్. 18

ఉ. నావిని బ్రాహ్మణుండనియె నన్నుఁ బ్రయత్నమెలర్పఁ బట్టికిన్
గావలిఁబెట్టి పుట్టినిలు గాల్వఁగ నీవటుబోవ నేను నా
లో వివరంబు మాలి మృగలోచన ముంగిసనే కిశోరర
క్షావిధి కొప్ప నేర్పఱచి జాఱితి మందిరబాహ్యభూమికిన్. 31

క. ముంగియును మన్నియోగము, నం గదలక కాచియుండ నందును నాలో
నం గాలసర్ప మరుదే, రం గని భవదీయపుత్రరక్షాబుద్ధిన్. 32

క. తలఁ గొఱికి నఱికి భుజగ, జ్వలదస్రరసార్తిరక్తవదనముతో ద
వ్వుల కెదురువచ్చి నకులము, కలకంఠీ పెనఁగఁదొణఁగెఁ గాళ్ళన్ వ్రేళ్ళన్. 33

తే. అపుడు పన్నగరక్తసిక్తాననంబు, బభ్రునేత్రంబుఁ గని గుండె పగిలి నొగిలి
తనయు నిర్జించెనిఁక నేటితాళి మనుచు, నవిదలగు డాభిహతి దీనియుసురుఁ గొంటి.

క. ఈయుగ్రాఘం బేమిటఁ, బాయు నిశాచరుఁడఁ గాక బ్రాహ్మణుఁడనె న్యాయం
బాయన యేడ్చుచుఁ జెప్పిన, నాయిభనిభయాన ఖిన్నయై మూర్ఛిల్లెన్. 35

వ. మూర్ఛిల్లి యెట్టకేలకుం దేఱి కన్నీరు కరతలంబునం దుడిచికొనుచు సతి పతికి
గద్గదస్వరయై యిట్లనియె. 36

క. కుపరీక్షితము కుదృష్టము, కుపరామృష్టంబు మఱియుఁ గుశ్రుతముం గో
రుపురుషుఁడు నాపితుని క్రియ, నపరిమితాపత్పరీతుఁడై చెడిపోవున్. 37

క. అనిన విని భూసురుఁడు సతిఁ, గనుగొని యోవంశపాలికా! మంగలి యే
పనిఁజేసి చచ్చె నీకథ, విననిష్టం బయ్యెఁ జెప్పవే నాకనుడున్. 38

వ. యాజ్ఞసేని యిట్లని చెప్పందొణంగె. 39

చ. జడమతిభార్య యొక్క సెటిసాని విదర్భనివీటనుండి సొం
పడరఁగఁ గర్మలబ్ధిఁ గడుపై కడుఁబైకొనుదండి నొప్పలం
బడి యది పుత్రుఁగాంచి పిదపం బరలోకముఁ జేరె నంతలో
నడల దొడంగె నాకటికి నారసి చన్నిడలేమి బాలుఁడున్. 40

క. చుట్టంబులు పక్కంబులు, కట్టడియై వీఁడు తల్లిగండమున తలగా
బుట్టె ననలక్షణుం డిఁక, గట్టా యెవ్వారిజెఱుపఁగా నున్నాఁడో. 41

తే. ఇంట నుండఁగూడదిప్పుడ గొని చని, గుంటనైనఁ బెద్దగుంటనైనఁ
బెంటనైన వైచి యింటికి వరుదెం డ,నంగ నద్దురుక్తు లాలకించి. 42

క. ఆయిండ్లఁ గూలి కుప్పల, లాయముగా నిరసనయై మనునొకవ
ర్షీయసి వేఁగినపుదిలో, బాయునితమి మ్రొక్కి నిలువఁబడి యిట్లనియెన్. 43

ఉత్సాహ కన్నవారివంకవారిఁ గానఁ బ్రాణనాథుఁడున్
మున్నెచచ్చె యేను గుంకముంచ నెట్టు లేగుదున్
మున్ను వెన్క లేదు నేఁడు మూఁడుగాళ్ళవృద్ధనా
యన్నలార వీని నీర యుంచు వేఁడి మ్రొక్కినన్. 44

మ. అరసాన్నగ్రహణాప్తిశేషనతకేహాఙ్ సౌఖ్యకృత్తైలసం
స్ఫురణాభావజటీకృతాలకన వైవద్దైన్యతాస్యమ్ముఖం
బరుష ప్రాక్పరిధానసంవృతవితంబ న్నిష్ఠతాలంబనా
జరఠం గన్గొని యొండు నాక నగరస్వామల్ ప్రసాదించినన్. 45
క. వనిత పనిఁబూని వానిఙ్, దవయఁగ మెఱుమకొనిన దత్సుకృతం జే
మని చెప్పవచ్చు విద్యా, ఘనుఁడు గుణాకరుఁడు ధీరతరుఁ డతఁ డయ్యెన్. 46
క. ఆతఁ డొకనాఁడు దారి, ద్ర్యాతురుఁడై ధాత నొంపి యూపి మహాశ
య్యాతలమున నిదురించి య, హో తేజోలాభమూల మొకఁడు గనియెఙ్. 47
ఉ. చేరి తృతీయయామమున సెట్టి గలంగి సముల్లసన్మరు
ద్భూరుహభంగిఁ గెంజడలు భూతిపళక్షిత మైన మేన నిం
డారఁగ గావికావు మసినంటిన మోము సుతీక్ష్ణ విస్ఫురో
చ్చీరుచి సేవగింప నొకసిద్ధుఁడు వచ్చి సదాదరాయతిన్. 48
చ. అనియె నహో కిరాటతనయా వినయాదిగుణంబులందు నే
మనుజుఁడు నీకు సాటి యలమాట లటుండెఁ బ్రభాతమైననీ
కనుఁగవకు న్ఘనక్షపణకత్రయము న్గనుపట్టు ముంగిటం
బనివడి దానిఁ జంపు మది భస్మనిధిత్రయమూర్తి సుండెడున్. 49
క ఆనిధులఁ బుచ్చుకొని ధని, వై నీతిఖ్యాతిరీతు లమరఁగ మనుమం
చానిత్యసత్యుఁ డరిగిన, మానస మలరం గిరాటమణి మేల్కనియెన్.
తే. మేలుకని భక్తిఁ బ్రణమిల్లి మేరనిలచి, తల్లి యూరుజకులోపాత్తల్లిక నియె
నమ్మ యిమ్మందిరంబున నలికి మ్రుగ్గుఁ, బెట్టు మిపుడు శుభంబు లభించు మనకు.
క. వలదు విలంబన మన న, ప్పలితగృహం బలికి పూసి పసపూసఁగం గు
గ్గులుమ్రుగ్గులు నిడి యక్కథ, నలఘుమతిం దెలిపె సనయుఁ దగుతనయునకున్. 52
క. క్షౌరమునకు సమయంబగు, టారసి నాపితుఁడు వచ్చె నాలోఁ దైవ
ప్రారంభమున నపూర్వవి, భారాడ క్షపణకత్రయంబును వచ్చెఙ్. 53
వ వచ్చిన. 54
క. మే నుప్పొంగఁగఁ బెంజెర, కూన న్నగు లగుడ మెత్తికొని ప్రాణంబుల్
పోనడఁచె సెట్టి యాలో, గీనత్రితయంబు బహో నిధిత్రయ మయ్యెఙ్. 55
వ. ఆయిన 56
క. ఆనిధులఁ బుచ్చుకొని ధని, యై నాపితుఁ జూచి వణిజుఁ డాదృతి మెఱయఙ్
దీనారశతక మిడి మదిఁ, బూనకతూహలమునఁ బొమ్మని పల్కెఙ్. 57
చ వెఱగు జనింప నత్తెఱఁగు వెంగలిమంగలి చూచి కన్నుమి
న్నెఱుఁగక యింటి కేగి యాకులేనుచు భూరనిధు ల్గడించు నం
చటిముటి గొంకులేక లగుడాగ్రముఁ దైకొని యత్నమేమియుఙ్
గరిపడకుండ నాక్షపణకత్రితయాగమనంబుఁ గోరఁగఙ్. 58